శ్రీరస్తు.

శ్రీమదాంధ్రమాఘపురాణమునందలి

# విషయసూచిక.



## ప్రథమాశ్వాసము.

## చతుర్థాశ్వాసము.

| సంఖ్య. | విషయములు. | పుటసంఖ్య. |
|---|---|---|

## పంచమాశ్వాసము.



## షష్ఠాశ్వాసము.

## సప్తమాశ్వాసము.

విషయసూచిక సంపూర్ణము.



శ్రీరస్తు.

శ్రీ హయగ్రీవాయనమః.

# ప్రీఠిక.

---

చ. సదమలమానసుల్ వివిధశాస్త్రరహస్యవిదుల్ నితాంతసం
మదు లనసూయులుం బరసమంచితకీర్తిలసత్ప్రతిష్ఠులన్
సదయులు శాంతు లాప్తజనజాలశుభప్రదు లైన ధీవిశా
రదులుగదా సుధీవరులు రాజితకీర్తియుతుల్ ధరాస్థలిన్.

సుధీవరుల కేనొనర్చు విన్నపమింతకలదు తారకనామపరబ్రహ్మంబగు శ్రీరామమూర్తి కారుణ్యమునాయందొకించుకగలుగుటచేతన నాకొదవినకవితాధారం జేసి పిన్నతనంబుననుండియు గ్రంధరచనాకుతూహలంబుననున్న నే నొకసమయంబున బంధుదర్శనార్థినై కడపమండలములోని కమలాపురమునకు నైఋతిభాగమునందుండు కొమ్మద్దిగ్రామసమీపస్థమగు సర్వరాజుపేటయను నూరికింబోయితిని. అందు తద్గ్రామాధికారియు సుజనగ్రామణియు నధ్యాత్మవిద్యావిదుడును గొంత జ్యోతిషగ్రంథపరిచితిగలవాడును నగు, మ-రా-రా-శ్రీ, గజ్జల. చెన్నారెడ్డిగారు నాతోబురాణప్రశంసజేయుచుండిమాఘమాహాత్మ్యంబుపురాణాభిఖ్యజగద్విఖ్యాతంబై యుండియు ప్రత్యేకమాంధ్రపద్యగద్యాత్మకంబుగా లేక నలువదేడధ్యాయములలో రామగిరి సింగనచే నిరువదధ్యాయములుమాత్రమే పద్మపురాణోత్తరఖండారంభమున విరచింపబడియుండజూచితిమి. మఱియునది పిల్లలమఱ్ఱి. పినవీరభద్రకవిగారు సంపూర్ణముగా నాంధ్రభాష నొనరించినట్లొకచోబలికిరేకాని యది యెందునుంగానబడకున్నది దానిమీరు మీశక్తికొలంది విరచింపగలిగిన లోకహితంబుగాదాయని వాక్రుచ్చిరి. అంతట నాగ్రామంబునం బాఠశాలోపాధ్యాయులుగానుండి యందుండిన మదగ్రజనకతనూజుండును మత్సహోదరుండు నగు పశుపర్తి. సుబ్బరాజుగారిది చెప్పి యిట్లుచేయుమనిరి. అంతనేను మిత్రబంధు వాక్యంబులనానందంబువహించి యువిరామవాక్యంబులుగాదలంచి వల్లెయని మరలి కొన్నిదినంబులకు ప్రకృతమే యుండిన కర్నూలుమండలములోని పత్తికొండమార్గముననుండురాతనగ్రామముం జేరి తద్గ్రంథముం దెప్పించి ద్విత్రివారములుబఠించి హూణశకము 1917 అగు నళసంవత్సర మాఘమాసమున నుదయస్నానమునకారంభించి తచ్ఛుక్లపక్ష తృతీయదిన గురువారబుధహోరయందు గ్రంథవిరచనమునకుం గృతారంభుండనై యెడనెడ గన్ని యోవిఘ్నంబులాపాదించినను భయంపడక సంవత్సరద్వితయంబునకు సంస్కృత

మూల గ్రంథానుసారంబుగా విరచించితిని. ఇందు వక్తృశ్రోతలు వశిష్ఠదిలీపులై యుండియుం గొన్నికథలు దిలీపునకు పరకాలంపువారివిగాఁ గాన్పింప వానిం ద్వితీయ వక్తృశ్రోతలగు సూతశౌనకాదులంగూర్చి మార్చితిని. ఇవన్నియు సంస్కృతప్రతిం జూచిన వేద్యంబులగు మఱియు వర్ణనాదులఁ గొంతఁ బెంపఁబడియున్నది యిట్లు గ్రంథ విరచనాపరిసమాప్తిఁ గావించిన మఱికొన్ని దినంబులకు మరలఁ గార్యాంతరాసక్తుండనై నర్సరాజుపేట పురంబునకు రానందు నేఁ జూచినప్పటికే వృద్ధులై యుండిన శ్రీ చెన్నా రెడ్డిగారు విగతస్థూలశరీరులై స్వర్గావాసమలంకరించియుండిరి వారికుమారులగు మ-రా-రా-శ్రీ, గజ్జల. వీరారెడ్డిగారును వెనుక పద్యరూపంబులం బ్రశంసించియున్న పుణ్యాత్ములందఱు నొకశుభదినంబున నాచే భగవత్కథాకాలక్షేపంబొనర్పించి తద నంతరమున ననుంజూచి మీతో కీర్తిశేషులైన చెన్నారెడ్డిగారు ప్రస్తాపించియున్న మాఘపురాణం బాంద్ర బాషాపద్యవిరచనంబునం బరిసమాప్తినందినదని వింటి మది విననభిలాషమట్లు సేయుదురే యనిన నేసంతసించి దాని హూణశకము 1923 అగు రుధిరోద్గారి సంవత్సరమున నాషాఢశుక్లైకాదశీ శుభతిథియందుఁ బ్రారంభించి మాస ద్వయంబునకు సమగ్రంబుగా వినిపించితిని అంతనప్పరమపుణ్యాత్ములు సంతసించి గ్రంథ ప్రకటనంబునకుఁగా నొకరొకరు నూఱును నేబదిరూప్యంబులచొప్పున భరించి వేయి రూప్యంబులొసంగిరి. అవలనేను చెన్నపట్టణముంజేరి ముద్రణంబున కారంభింపించి తిని ఇందు ముద్రణావసరమునంబడు తప్పులకుమితిలేకుండి కూర్పులన్నియు నొకరి సహాయంబులేకనే నొక్కండనే చూచుచుంట నెన్నిమారులుచూచినను కనుదాకక పోయినవానికన్నింటికి తప్పొప్పులపట్టిక నొకదాని సమకూర్పనెంచి మఱియు నప్పు డును కంటంబడక నిలిచినవన్నియుం దప్పులుగాకుండినవిగను కనంబడి పట్టికలోఁ జేర్చి నవి తప్పులుగను నెన్నబడునను భీతిచే నట్లుచేయమానితిని ఇవన్నియు శ్రీరామాను గ్రహంబున శీఘ్రకాలంబునన పునర్ముద్రణ భాగ్యములభించిన సావకాశముగా సవ రించుకొఁగలవాఁడనిప్పటికిందుఁగలయావల్లోపములసహించి సుధీవరులు నన్ను మన్నిం తురని పలుమారుఁ గైవారంబులొనర్చుచు నింతట నీపీఠిక విరమించుచున్నాను.

ఇట్లు సుజనవిధేయుడు.

వసుపర్తి. సుబ్బరాజు

గ్రంథకర్త.

శ్రీరామచంద్రాయనమః.

# పంచరత్నములు.



క. శ్రీసర్వ రాజుపేటపు, రీసదమల ధామరామఽశ్రీమన్నామా
వాసవ వైరివిరామా, భాసురగుణ భూమపుషితఽభక్తస్తోమా. 1
క. బలభిన్మణి భాసురతను, విలసిత శ్రీ సర్వరాజుఽపేటపురీని
ర్మలమందిరస్థ శీతా, లలనాధిప కీర్తిసాంద్రఽరామనరేంద్రా. 2
క. ఆదిత్య స్తవనార్హా, వేదమయుం సర్వరాజుఽపేటపురీర
ఖా దీనజనోత్కరసుర, పాదప దళితోగ్రచాపఽపావనరూపా. 3
క. నిరవధి కానందమతీ, పరిపాలిత రవిసుతాదిఽవనచరవితతీ
పరమాదర నైకగుణా, భిరతీ శ్రీ సర్వరాజుఽపేటపురిపతీ. 4
క. రామా సన్నుతవిబుధ, స్తోమా సుగుణాభిరామఽమురితవిరామా
రామాజనకామా రణఽభీమా శ్రీ సర్వరాజుఽపేటసుధామా. 5

శ్రీమదాంజనేయాయనమోనమః.

## పంచరత్నములు.

క. శ్రీయాంజనేయ నతజన, గేయ సురానీకవినుతఽకీర్తినికాయా
శ్రేయఃఫలదాయాకా, పేయా శ్రీ సర్వరాజుఽపేటనికాయ్యా. 1
క. దారుణ వాలానల దు, ర్వారజ్వాలాసమూహఽభస్మీకృతలం
కారాజ గృహవారా, వీరా శ్రీ సర్వరాజుఽపేటవిహారా. 2
క. ఆశర వంశవినాశా, ధాశరథీ ప్రవిమలాంఘ్రిఽతామరసాంచ
ద్భాశ స్త నివేశా స, ర్వేశా శ్రీ సర్వరాజుఽపేటపురీశా. 3
క. అంగీకృత కవికవనా, భంగితమఘ వారిసవనఽభాస్కరకులరా
డ్రంగ త్పాదాబ్జమనో, భృంగ ఘనా సర్వరాజుఽపేటసుభవనా. 4
క. సారాచారవిచారా, చారుకృపా గుణవిహారఽసత్యోదారా
వారిధి గంభీరా కపి, వీరా శ్రీసర్వరాజుఽపేటపురివరా. 5

ఏతద్గ్రంథముద్రణ ద్రవ్యసహాయులగు
సర్వరాజుపేట పురస్థుల వంశాదిక ప్రశంస.

సీ. ఏపురంబునఁగల్గుఽకాపులశ్రాంతంబు, వినఁబురాణావళుల్ఽదనరుచుండు
నేపురంబునఁగల్గుఽకాపులేకాదశీ, వ్రతసమంచన్నిష్ఠఽవరలుచుందు
రేపురంబునఁగల్గుఽకాపులుకృష్ణ చి, దానందగురుశిష్యుఽలై భజింతు
రేపురంబునఁగల్గుఽకాపులత్యురుదాన, ధర్మకార్యప్రవృఽత్తనతఁబొల్తు

రేపురస్త్రీలు సతతమింపెనయఁదులశి, నధికభక్తినిఁ బూజింతురట్టిసర్వ
రాజవేటపురస్థులరమణఁగొడిదె, కులజులగువారి సత్కీర్తివలదెయెన్న. 1

వ. ఇట్టి సత్పూరుషులయందు. 2

సీ. సద్బంధు వితతినశ్రాంతంబు గారవ, ఖ్యాతులఁ గ్రామాధికార మమర
నలరు నధ్యాత్మ విద్యాజ్యోతిష గ్రంథ, పరిచితులోక కొంతఁబరిఢ విల్ల
బ్రాహ్మణామర భక్తిపరత సౌశీల్యంబు, లవిరతంబునుఁ దనయందు నిలువ
గజ్జల వంశదుగ్ధాబ్ధికి రాకాశ, శాంకుఁడంచని జనంబభినుతింప
వెలసితనకీర్తి సకలదిగ్వీధులందు, బెఱయ శ్రీ చెన్న కేశవాభిఖ్య రెడ్డి
కాత్మజుం డగ్రజుండు నారాయణాఖ్య, రెడ్డి కౌ చెన్న రెడ్డీంద్రురీతిసనదె. 3

శా. భూరి ప్రాభవశాలి యీఘనుని సత్పుత్రుండు నారాయణాం
బా రాజచ్ఛుభగర్భసంభవుఁడు భాస్వత్కీర్తి విస్తారుఁడం
భోరుణ్నేత్ర పదాబ్జ చింతనుఁడు సంపూర్ణాను కంపాబ్ధి వీ
రారెడ్డీంద్రుఁ డశేష భూజననుతప్రాంచద్గుణుం డుర్వరన్. 4

సీ. లలిత గుణాఢ్యులెల్లారెడ్డి పుత్రులౌ, చెన్న కేశవ రెడ్డిమున్న గాఁగ
నొనరు నేపురఁ దృతీయుండగు చిన్న చె, న్నారెడ్డికిం బ్రీతినాగమాంబ
యందుదయించినయట్టి పుణ్యుఁడు, సత్య శీలుండుకరుణాలవాలుఁడార్య
జన సమ్మత ప్రవర్తనుఁడంబుజాక్షుపా, దార విందధ్యానతత్పరుండు
గజ్జలాన్వయ పాథోధికైరవాప్తుఁ, డాశ్రితామర భూజుఁ డత్యమల తేజుఁ
డతిదయాగుణ భూషణుఁడనఘభావ, నుండు మునిరెడ్డికీర్తి యుతుండుధరణి. 5

సీ. కూరిమి మఱియు నెల్లారెడ్డి కైదవ, పుత్రకుండైన సంపూర్ణ యశుఁడు
ప్రాంచద్గుణుండునారాయణ రెడ్డియు, న్నతిఁగన్న చిన్న చెన్నాంబయందు
చప్పిడి వంశసంజాతుఁడైనట్టి చె, న్నారెడ్డికిం బ్రియనందనుండు
గాఁజననంబందికలిగిన దౌహిత్ర, బాధ్యత కంతయుఁబరగి సర్వ
జననుతంబగు వర్తనంబునను దాన, ధర్మగుణముల నెసఁగిమాధవపదార
విందచింతన మాత్మఁ బెంపొందియున్న, వీరరెడ్డీంద్రు డలరు పృథ్వీతలమున. 6

సీ. కట్టించె నేమహాఘనపుణ్యుఁ డూరి ద, క్షిణ భూమిఁగోనేరుకీర్తి వెలయ
త్రవ్వించెనే సుకృతాధికుం డటులుత్త, రోర్విని బావి మహాపాప కృతిఁగ
కల్పించెనే యశోఘనుఁడు కొమ్మద్దియన్, గ్రామంబునను నిందిరాల యంబు
పుత్రు వీరారెడ్డిపాలఁతిమెల్లాంబయే, సరసుకృత్యముల కుత్సాహయయ్యె
నట్టి కొడదల వంశదుగ్ధాబ్ధిశశధ, రుండు పర్దేశిరెడ్డి పౌత్రుండు నెరమ
రెడ్డి చెన్నాంబయందుఁ సంప్రీతిఁగాంచి, యున్నయశ్వర్థ రెడ్డీంద్రుఁడెన్నఁబడఁడె.

సీ. ఎలమినామెరమ రెడ్డీంద్రు జ్యేష్ఠాత్మజ, యైన చెన్నాంబ ధరార్థ మఁగను
గట్టించె సత్ర మొక్కండూరి వెలుపలఁ, బ్రీతినాయమ గుమ్మిరెడ్డి వంశ్యుఁ

జిన్నవీరారెడ్డిసున్నతిఁ బరిణయ, మయ్యెరోశమ్మ నాఁగనలరుఁ బుణ్య
వతిఁగాంచి చిన్నయశ్వత్థ రెడ్డికిఁ దమ్ము, నకు వివాహము సేయనామె గనియె
నెలమి లక్ష్మాంబ నాయమకిల్లడమున, భర్తయైనట్టి గుమిరెడ్డివంశ్యుఁ జిన్న
వేమరెడ్డీంద్ర సుతుమహోద్దామ గుణువ, సంతరెడ్డీంద్రు కీర్తి యత్యంత మొనరు.

సీ. ఆకొద్దలాన్వ వాయప్రభూతుండగు, పద్దేశి రెడ్డికిఁబరగ పెద్ద
భార్యయం దుదయింపఁబడిన గొల్లారెడ్డి, కరయఁ బుట్టిన నల్వురాత్మజాతు
లందుఁ దృతీయుఁడౌలక్ష్మిరెడ్డికి బాల, మాంబయం దచ్చమ్మయలరుఁగంచ
మాంబ చెన్నారెడ్డియలగొల్లరెడ్డి జ, నించి రచ్చమ వరియించెదాను
బ్రీతి గుమిరెడ్డి కులుఁ బసిరెడ్డియెఱుక, [illegible]ంబచే గన్న నారాయణాఖ్యరెడ్డి
నట్టియచ్చమ్మ గుణములనామెతమ్ము, గొల్లరెడ్డీంద్రు యశము వాకొనఁగవలదె. 9

ఉ. ఆరయ లక్ష్మిరెడ్డి కటులగ్రసుతుఁడగు చెన్నరెడ్డి కిం
పారఁగ నంకమాంబకుదయంబయి యున్న మహాత్తముం గుణో
దారుఁ గృపాలవాలు జనతాంచిత కీర్తివిశాలు భూమిభృ
ద్ధీరునిఁ జెన్నరెడ్డిని నుతింపరె ధర్మరతుం గవీశ్వరుల్. 10

చ. అరయఁగ లక్ష్మిరెడ్డికిఁ బ్రియాత్మజయచ్చమకన్నఁ జిన్నయై
పరగిన కంచ మాంబకుఁ గృపానిధి కా[illegible] రెడ్డి వంశ భా
సురునకుఁ జెన్నరెడ్డికిని సూనుఁడుఁగా నుదయించి యున్న య
య్యొరుగుణుఁ జెన్నరెడ్డినిఁ బ్రియోక్తిఁ బ్రశంసకుఁ దేదనర్పదే. 11

సీ. రహిలక్ష్మి రెడ్డికగ్రజుఁడైన కేశవరెడ్డి, పుత్రులు సుకీర్తి ప్రకాశు
లెలమిఁ జెన్నారెడ్డియెరఁ జెన్నరెడ్డి చె, న్నారెడ్డి గుమిరెడ్డిచారియి ట
బాల వీరారెడ్డిభార్యనా రమ్మయం, దంచిత ప్రీతి జనించియున్న
యెఱుకలమ్మను వరియించియాయమ, యందుఁబడసెఁ గుమారు దుర్వారవైరి
వర్గకానన చటుల దవానలుం బు, ణాతత్పరుఁ బద్మనేత్రాంఘ్రియుగ్మ
భక్తుఁగేశవరెడ్డి నాబడసు పుణ్యు, సతని సద్గుణములఁ గొనియాడవలదె. 12

ఉ. శ్రీయుతుఁడైతనర్చి గుమిరెడ్డివరాన్వయ వార్ధిసోముఁడై
పాయక బాలరెడ్డి యనుభవ్యునకున్ సుతుఁడైన సత్కృపా
తోయధి చెన్నరెడ్డికి విధుస్థితి నాగమ కుద్భవించి నా
రాయణరెడ్డి నావెలయు రాజిత కీర్తియుతుండు పాల్పెడున్. 13

ఉ. ఆగుమిరెడ్డి వంశవరుఁడై తగు నాపరదేశిరెడ్డికిన్
ద్యాగియఁ బాపిరెడ్డిసుతుఁడయ్యెను తత్తనుజుండు బాల మాం
బా గజయానగర్భజుఁడు బంధు జనాదరణుండు శత్రుచ
క్రీ గరుడుండు చిన్న మునిరెడ్డి తనర్చెను సద్గుణోన్నతిన్. 14

సీ. వసుధ నాగుమిరెడ్డివంశజుండైన చె, న్నారెడ్డి వరునకునందనుండు
సదమలగుణుఁడు కృష్ణారెడ్డి పెద్దచ్చ, మాంబగర్భమునఁ బ్రియంబుతోడ

గనియెఁ జిన్నాగమాంబను వెండి నారాయ, ణాఖ్యరెడ్డీంద్రుఁ జిన్నాగమాంబ
చప్పిడి వంశసంజాతునిఁ బెద్దరె, డ్డీంద్రు నివరియించి యెలమిఁ గనియె
శ్రీరమాధవ పాదసంసేవనాత్ము, ననఘు వెంకటరెడ్డీంద్రు నతికృపార్ద్ర
చిత్తు నీతని సత్కీర్తిఁ జెన్ను మీఱ, సభలఁ గొనియాడఁదగదె యీ క్ష్మాతలమున. 15

సీ. జంబులవంశదుగ్ధాంబుధికిం బ్రీతి, నలరారు రాకాశశాంకమూర్తి
యైన వెంకటరెడ్డి కాత్మజుండై దాన, ధర్మతత్పరత నత్యంత మొనరి
నట్టియప్పణ్ణాత్మునకు రామరెడ్డికి, నెఱుకలమ్మ యనంగ నెసగు పుణ్య
వతియందు జన్మించి సతతంబు దేవ వి, ప్రార్చనాసక్తుఁడై యలరువాని
ననఘు వెంకటరెడ్డీంద్రు నాశ్రితావ, నాఢ్యు దళితారివర్గు దయార్ద్రచిత్తు
నంబురుహనాభ పాదపద్మైక చింత, నునిలసత్కీర్తి నెన్నఁగాఁ జనదె పుడమి. 16

సీ. చప్పిడివంశసంజాతుఁడౌ సుబ్బిరె, డ్డికి నేవురైరి పుత్రకులు ఘనులు
ప్రీతి పెదపద్రేశి రెడ్డి చినపద్రేశి, రెడ్డివారైరి పెండ్లిం గ్రమమున
ననఘుల నా వెంకటాంబ చెన్నాంబల, నా వెంకటాంబయం దలరఁ గలిగె
మునిరెడ్డి చెన్నాంబకును సుబ్బిరెడ్డి సం, జననమందెను నిందుజంద్రజూటు
పూజనాసక్తచిత్తుఁడు పుణ్యుఁడమరు, పెద్దపద్రేశి రెడ్డికిఁ బ్రియసుతుండు
గాగ వెలసిన మునిరెడ్డి క్ష్మాతలమున, నితని సత్కీర్తి సభలలో నెంచఁదగదె. 17

క. వీరందఱు సుకృతగుణో, దారులు కాశీప్రయాగ ద్వారకముఖ్యా
భూరి క్షేత్రములన్నియుఁ, గోరిక సేవించినట్టి గురుపుణ్యయుతుల్. 18

చ. సతతము ధర్మకార్యములు సల్పెడు వార లనారతంబు స
న్మతినిఁ బురాణముల్ వినుచు మానుగ దీనజనాళిఁ బ్రాహ్మణ
ప్రతతి నభీష్టవస్తు నికరంబులఁ దన్పెడు వారు సత్ప్రశో
న్నతులగు వారు వీరొక దినంబున నన్ను మహాదరంబునన్. 19

ఆ. పిలువబంచి భక్తి యలరంగఁ జిన్నదం, డ్లూరివంది రాట్సముత్కరమునఁ
బేరుఁగన్నవాఁడ వారయ సుబ్బరా, ట్కవివరేణ్య యంచు గారవించి. 20

మ. నయమారంగ బురాధికారియగు చెన్నారెడ్డి నీతో బహు
ప్రియమౌ మాఘపురాణముం జదువ ధాత్రింగాన మాంధ్రీకృతం
బయియుండంగను దాని నీవయినఁ జేయంజాలుదే నాఁ గృపో
దయు రాముం దలఁపోసి చేసితటులం దానిం వినం జేయవే. 21

తే. అనిన ప్రముదితహృదయుఁడ నగుచు సాంత, ముగను వినఁ జేయ వినియు సంపూర్ణభక్తి
గబ్బ ముర్విని వెలయించఁ గనిరి వీరి, కీర్తి రవిచంద్రతారకాస్ఫూర్తిఁ గాగ. 22

క. అనయంబుఁ బ్రోవుఁడో సుర, మునినివహస్తుత్యులార పురదైవములై
చను రామ హనుమలారా, ఘనకరుణాకలితహృదయకమలజులారా. 23





శ్రీరస్తు.

# శ్రీమదాంధ్ర మాఘ పురాణము.

## ప్రథమాశ్వాసము.

శ్లోకము.



శ్రీరామం జనకాత్మజా కుచతటీ శ్రీగంధ పంకాంకితో
ద్యత్కాంతి ప్రవిశాల వక్షమమలం శ్రీకంఠసంసేవితం
రాకాపూర్ణ సుధాంశు బింబవదనం రాజత్కృపాంభోనిధిం
ఆకర్ణాయతలోచనం రఘుపతేస్త్వాం సర్వదాహం భజే.

శా. శ్రీమద్దివ్య సుఖాప్తికై కొలుతునీ రేజాప్త వంశోద్భవున్
రామున్ సన్నుతిమాత్ర భక్తజనవార ప్రావనోద్దాము సు
శ్యాముం ఘోర నిశాటపాటనమహాద్యద్భీమ సంగ్రాముఁ జే
తో మోదంబునఁ గీర్తికాము సుగుణస్తోముం గృపాధామునిన్. 1

ఉ. ఆతతభక్తి మ్రొక్కెదన హర్నిశమున్ సురమాని వంద్యవి
ఖ్యాతగుణ ప్రపూతకుని జాధిప రామనరేంద్ర చిత్తసం
ప్రీతకు లోకమాతకఘ బృందవిఘాతకుఁ బాలితాశ్రిత
వ్రాతకు రావణాద్యసుర భంజన కారణమైన సీతకున్. 2

క. భరతునకు లక్ష్మణునకుం, గురుమతి శత్రుఘ్నునకునుఁ గుటిలాసురసం
హరణోద్యద్విక్రమబలం, ధురునకు వాయుజునకేన తుల్ ఘటియింతున్. 3

ఉ. అంజలిమోడ్చి దేనుతుహినాద్రిసుతా హృదయాను మోదికిన్
గుంజరదైత్యభేదికిన కుంఠితవేగ మహోక్ష సాదికిన్
మంజుల సత్యవాదికిన మంచిత వేదరహస్య వేదికిన్
సంజనిత ప్రమోదవిల సన్నతినై యలసుప్రసాదికిన్. 4

ఉ. పాయని భక్తిఁ జిత్తమునఁ ఽ బ్రస్తుతులేను ఘటింతు సంతతం
బాయమరాద్రి కార్ముకుఁ బ్రి ఽ యాంగనయైన నతేప్సితార్థసం
ధాయినికిన్ నిశుంభ ృత ఽ నాచయ సంహనన ప్రచండికా
త్యాయనికి న్ముదంబున ని ఽ తాంతశుభం బొడఁగూర్చి ప్రోవఁగన్. 5

చ. నిరతము సన్నుతింతునలి ఽ నీవరపీఠము నస్వసించివా
క్తరుణిని తాంతసంభ్రమమె ఽ దంబొదలందనుఁ గొల్వనున్నశం
బరరుహ జాతునింబృథుకృ ఽ పాసము పేతుని నేనొనర్చునీ
గురుతరకావ్యరత్నమున ఽ కుం గృపతోడఁ జిరాయు వీయఁగన్. 6

క. వాణికివీణాపుస్తక, పాణికిసిజ వేణిరుచివి ఽ భంజితమధుప
శ్రేణికిసంతతనుత గీ, ర్వాణికి వందనమొనర్తు ఽ వాక్సిద్ధికినై. 7

క. సంతత మభివర్ణింతు ని, తాంతదయా స్వాంతు నేక ఽ దంతు మదినిర
భ్యంతరముఁగ మత్కృతిఁదా, సాంతం బొనరించుటకును ఽ సదమలఫణితిన్. 8

క. ఉదయంబున ద్రుహిణుండై, పదఁపడి మధ్యాహ్నమునను ఽ ఫాలాక్షుండై
వదలకసాయంవేళను, విదితంబుఁగ విష్ణుడౌన ఽ విత్రుని భజింతున్. 9

ఉ. వ్యాసుఁబరాశరాన్వయవి ఽ భాసుశ్రుతి వ్రజభాగకారకా
భ్యాసుఁదపోవిలాసునిర ఽ తాంబురుహేక్షణ పాదభక్తివి
శ్వాసుఁగృపా నివాసునని ఽ శంబుభజింతు మదీయకావ్యవి
న్యాసమునందనూనలలి ఽ తార్థపద ప్రతిపాదిఁగా మదిన్. 10

క. నిరతము సన్నుతిఁజేసెదఁ, బరమకృపా కరునివ్యాస ఽ వరసూనునవాం
బురుహదళాక్షునిభక్తి, స్ఫురణం భజియించుశుకుని ఽ మునిత్ర్యంబకునిన్. 11

చ. వెలయను తింతుసంస్కృతి క ఽ వీంద్రులఁగాళి కరప్రసాదుని
ర్మలు భవభూతిమల్హణుని ఽ మాఘుమయూరునిఁ జోరుభారవిం
దలఁకొని హీరుబిల్హణుని ఽ దండిని బాణుమురారి సద్యశో
జ్వలుజయ దేవునాదికవి ఽ సత్తము రామకథా ప్రకల్పనున్. 12

తే. ఆంధ్ర కవిధూర్జటులనన్న ఽ పార్యుశంభు, దాసుఁ దిక్కన శ్రీనాథుఁ ఽ దలఁతుఁబోత
నార్యుఁ బెద్దన రామ భ ఽ ద్రయ్యరామ, భూషణాదుల విద్యావి♦భూతియుతుల. 13

ఉ. ఒప్పులఁ గప్పిపుచ్చి వికఽటోక్తులవాకొని సభ్యులందఱన్
గుప్పున నవ్వఁజేయుచు నఽగుందగు నంచన కొండుతప్పు నే
చొప్పుననైనఁ బట్టి సరఽసుల్ విరసంబుఁగఁ జూడఁచూడకే
యొప్పుటకించు దుర్మతులఽకుర్వరనౌనె సుధీసమాఖ్యయున్. 14

మ. ననుఁబాల్యంబునఁ బెంచి విద్యల ననూఽనప్రీతితోఁ జెప్పి చ
య్యనఛందో విదుఁ జేసినట్టి నిజవిఽద్యామోదితాస్థానధీ
జనసన్మాను మదీయమాతృ భగినీఽస్వామిన్ నుతింతుంగురున్
మనమారం గను రామరాజసుకవిన్ ఽమద్వంశ విఖ్యాతునిన్. 15

సీ. గురుతరగౌతమగోత్ర ప్రభూతుండు పశుపర్తి వంశ సంభవుండు ఘనుండు
పినసుబ్బరాజునకును తనూజుండాత్మ విద్యావిదుండయి వెలయుపెద్ద
శేషమరాజ మనీషికి ననుజుండ గ్రజుండు ధీనిధి రామరాజవరున
కైమమ్మునల్వురనమ్మంగమాంబయుం దమరంగసుబ్బరాజాహ్వయులనుం
గాంచి మోదించె నెవండా యుదంచితాతి, శాంతిశీలుని సద్గుణజాలునమలు
సంస్మరించెద నాత్మ మజ్జనకుభక్తిం, బిన్న శేషమ రాజాఖ్యుం బృథులయశుని. 16

క. అనియిష్ట దేవతాస్తుతి, యునుగీర్వాణాంధ్ర కవిజనోత్కరవినుతిం
గొనకొని కుకవినిరాకృతిం, దనరంగ మద్గురువినుతి ముదంబున నేసున్. 17

వ. కావించి వెండియు. 18

తే. కాళిదాస మయూరాదికవుల కైన,
గలవు తప్పులనంగ నన్యులకులేవె
యనుచుం బల్కెన కాకునూర్యప్పసుకవి,
పలుకుం దలంపోసి మదిదయాపరతం జేసి. 19

శా. నానాగ్రంథ విమర్శకుల్ కవులనస్యప్రాప్త మేధావిధుల్
జానై యూభరతోర్విలోం బ్రకృత కాలంబున్న వారాయభి
జ్ఞానుల్ భావి కవీంద్రులుం గృతినిదోషంబున్నచో దిద్ది స
న్మానింపందగ దిద్దరాసి యెడలన్ మన్నింపం బ్రార్థించెదన్. 20

—(*) కృత్యాశయము. (*)—

వ. అని యిట్లాధునిక భావికవుల బహూకరించి యెద్దేని కబ్బంబొండు గావింపనున్న యెడ మత్పూర్వ సుకృతంబున శ్రీరామ భద్రానుగ్రహంబు కలిమి మాఘ మాహాత్మ్యంబు లభింప నప్పుడేను. 21

ఉ. ఇమ్ముగం జెప్పి రామునకునిచ్చి కృతార్థత నందనెద్దియే
నిమ్మహి నొక్కపుణ్యకథనే నెమకంగ మకించుచున్న నా
కిమ్మెయి నిద్దిచేకుఱుటకెంతయు శ్రీరఘురాము సత్ప్రసా
దమ్మగు నివ్విధింగృతి ముదంబునం దానెఱ వేఱుగాపుతన్. 22

వ. అని నిశ్చయించి సప్తచత్వారింశాధ్యాయంబులు గల యక్కథ రామగిరి సింగన పద్మపురాణోత్తర ఖండంబున వింశత్యధ్యాయంబులుమాత్రం దెనుంగించి కడమ యువి తెనుగింపఁడేను సమగ్రంబుంగా నాంధ్ర పద్యగద్యాత్మకంబుంగావించి. 23

క. లోక ప్రఖ్యాతంబగు, నీకథమాఘమునభక్తి నెల్లరుం జదువం
గైకొన మాఘపురాణా, ఖ్యాకంబై యొప్పంగాక యవనీస్థలిలోన్. 24

వ. అని. 25

తే. సరవిసర్గాది పంచలక్షణములిందు, లేక యుండిన సతతంబులోకమిట్లు
వలుకు కతమునవిఖ్యాతి వెలయునామ, మేజగత్పావనగు దీనికిడెదనేను. 26

. ఇవ్విధంబున.

—(*) ష ష్ఠ్యం త ము లు. (*)—

క. సారసమిత్రకులాంబుధి, కైరవమిత్రునకు కలుషఘనకాననదు
ర్వారాగ్ని హోత్రునకు సుర, చారణ గంధర్వవినుతచారిత్రునకున్. 28

క. దళితాసుర సంహతికిం, జలజాత ప్రభవవినుతసదమలమతికిన్
గలితానర్ఘ్యమణీని, ర్మలభూషాన్వితతనూసముంచద్ద్యుతికిన్. 29

క. ధీరునకు నవ్యతులసీ, హారునకు ఖరామరాహితాటోపబృహ
ద్వారిధర కాండచండస, మీరునకు విదారితారిమృధవీరునకున్. 30

క. గోత్రాహితావనునకును, మిత్రాన్వయ పావనునకు మిహికోర్వీభృ
త్పుత్రీ సంభావిత లో, కత్రయ పూతాభిధానకసుభావునకున్. 31

క. కరుణాగుణ ధామునకుం, బరివీక్షిత సకలలోకపరిణామునకున్
వరరూప కామునకు సు, స్థిరకీర్త్యుద్దామునకును శ్రీరామునకున్. 32

వ. సమర్పితంబుగా నే నాంధ్రంబున రచింపంబూనిన శ్రీమన్మాఘపురాణంబునకుం
గథాక్రమం బెట్టిదనిన. 33

ఉ. శ్రీరఘువీరదుష్టజనసింధురసింహకిశోరసత్యసం
చార భవాంబుభృన్నిచయచండసమీర విరాధదైత్య సం
హార యశోవిచార మణిమండిత నూత్నవిభూషణప్రభా
స్ఫారధరాత్మజాహృదయసారససద్మ విహార రాఘవా. 34

—(*) క థా ప్రా రం భ ము. (*)—

క. అవధారు నైమిశము నాఁ, బ్రవిమల మగు పుణ్యభూమిపదపఁడిమౌనుల్
భువనప్రపూతమగునొక, సవనము సత్రాఖ్యద్వాదశాబ్దావధియున్. 35

వ. కావింపఁ బ్రయత్నించి రమ్మఖంబునకు. 36

చ. ఘనుఁడసితుండు దేవలుఁడు కాశ్యపుఁడుం భృగుఁ డత్రి పైలుఁ డ
త్యనఘుఁడు వామదేవుఁడు మహాత్మ కులార్త సుమంతగౌతముల్
శనిశర భంగపర్వత పిశంగహారీత సుతీక్ష్ణశక్తికం
కణసుమతి ద్విపాదవసుకణ్వరథీతర రైభ్యముద్గలుల్. 37

సీ. జాబాలికాణాదశౌనకాపస్తంబ మాండవ్యసత్యధూమ్రసలిలాద
కాత్యాయనాగస్త్యకపిలకాణేకపాదులుపరాశరశంకుధూమపులును [రుండు
పృథుఁడు మంకుఁడుబభ్రుబుధుఁడు పంకుఁడుసంకృతియు విధ్రువాక్యయతీశ్వ
కౌండిన్యకౌశికగర్గకండువ్యాస జమదగ్నిపక్వపాశధరఋషులు
విష్ణువర్ధనపారగశ్వేతబాహు, పటులు శాండిల్యుఁడును భరద్వాజుఁడు గ్ర
శీలుఁడు ద్దాలకుఁడు మహాశీలుఁడా వి, భాండకుండును బోధాయనుండుమఱియు.

వ. ఆమలక ప్రియశతాతపమంత్ర విదూర్ధ్వ బాహు నారద జరత్కారపార కలా
ధర కరుణగాలవకటు శతానంద విశాలాక్ష మహాకాయ మహాగ్రీవ మహా

బాహు మహాసేన కైవల్య కల్పాంత కాలాగ్ని రుద్ర శ్వేతాశ్వతరు మహోదరాదులు మఱియుఁ బెక్కండ్రు బ్రహ్మతేజోధనులు వేదవిదులు జపయజ్ఞాది ప్రవర్తనులు లోకసంరక్షణానురక్తులు నగు మునీంద్రులు గోమతీతీరస్థ సవన శాలకు శిష్య ప్రశిష్యయుతంబుగాఁ జేరి రయ్యవసరంబున. 39

## శౌనకాదులకడకు సూతుండు వచ్చుట.

శా. ఆయజ్ఞంబునుఁ జూడఁగా నటకును ద్యల్లీలవిచ్చేసె సు
శ్రేయుండాత్మవిదుండు శాంతినిధి నిశ్చింతుండు మానివ్రజ
ధ్యేయుం డందఱుఁజూచి తన్మతుల మోదింపంగ నెంతేనినా
పాయోద్యచ్ఛభదాభిలాషి సుగుణవ్రాతుండు సూతుండు తాన్. 40

వ. మఱియు నతండు జటావల్కలాంబరధరుండును సర్వాంగలిప్త భస్ముండునుఁ ద్రిపుండ్రాంకిత మస్తకుండు రుద్రాక్షమాలికాధరుండు సదానందుండు సర్వభూత హితుండు జితేంద్రియ జితక్రోధుండు జీవన్ముక్తుండు వ్యాసప్రసాదావగత సర్వశాస్త్ర పురాణేతిహాస స్మృతియుతుండునై వ్యాసోపమానుండు నగు నమ్మహాత్ముండు చనుదెంచిన. 41

చ. మునివరులెల్ల విస్మయము మోదము చిత్తములం దలిర్పన
య్యనఘున నూనభక్తివిన యంబులతోడుత సత్కరించి చ
య్యనను చి తాసనంబిడిన నమ్మునినాథుఁడు వారికెల్లవం
దనమొనరించి యాజ్ఞగొని తావసియించెఁద దాసనంబునన్. 42

వ. అట్లు సుఖాసీనుండై యున్న సూతు నవలోకించి శౌనకాదిముని వ్రాతంబు పరమ హర్ష సమేతంబై యిట్లనియె. 43

క. మునినాథ మీ కృపారస, మునఁ బదునెనిమిది పురాణ ములు తుదిముట్టన్
వినియుంటి మిప్పుడే దై, ననువినఁదగు దానిచెల్పు నాగనతండున్. 44

క. మునివరులఁ జూచియిట్లను, వినుతాత్మకు లారమీరు విద్వాంసులుమీ
యనుపమ కారుణ్యంబున, మునుదెలిసిన యాడ్కిఁదెలుప మునుకొనువాఁడన్.

వ. అనిన మునీంద్రు లిట్లనిరి. 46

సీ. బ్రాహ్మ్యంబుపాద్మము వైష్ణవమును శైవ, భాగవతంబులు పరమనియతి
వెలయంగమున్నుభ విష్యత్పురాణంబు, నారదీయమును విన్నను వెలర్ప
ననఘమార్కండేయ మాగ్నేయ బ్రహ్మకై, వర్తలైంగవరాహ వరపురాణ
రాజముల్ స్కాందము రమణవామన కౌర్మ, మాత్స్యములు గారుడ బ్రహ్మాండములన
మొనయునష్టాదశపురాణ ములనుచాల, వింటిమందుద్వితీయమై వెలయుపాద్మ
మదియునేబదియైదు వేలైన గ్రంథ, సంఖ్యగలయది యానినీవు చక్కనుడువ. 47

వ. అట్టి పాద్మంబునందుఁ గల మాఘ మాహాత్మ్యంబు. 48

క. వినియుండి యిపుడు వెండియు, మనమున వినఁగాంక్షవొడమె మాఘంబునుస
జ్జనసుతరాఁ దొడఁగెనుమా, కనువారఁగ దానిఁదెలియ నానతినిమ్మా. 49

చ. అనవిని రోమహర్షణి ప్రియంబున మౌనులఁ జూచి పల్కె నో
యనఘమునీశ్వరులార భవదాత్మలఁ గోరిన దానినే నిటన్
మునువచియింపవచ్చితి సమున్నతి మీరును నాతలంపుచొ
ప్పునవినఁ గాంక్షఁ జేసితిరి పోయిక నేమివినుండు పేర్మితోన్. 50

ఆ. మౌనివర్యులార మాతండ్రి యగురోమ, హర్షణాఖ్యమౌని యంతవాని
కనుఁగు శిష్యవరుఁడనై యధోక్షజునంశ, జనితుఁడైన వ్యాసమునివతంసు. 51

క. పరమానుగ్రహమునకును, ధరఁ బాత్రుఁడనైననాకు తాపసవర్యుల్
గురుమతులు మీరుకోరిన, వరకథ లెంతయును తెలుపభాగ్యము కాదే. 52

తే. అనుచు కథకు ప్రారంభమాచరించి, మొదల నోంకారమునకు ద్రిమూర్తులకును
బ్రాహ్మికిని విఘ్నపతికిఁ బరాశరాత్మ, జనకు వందన మొనరించి మునులఁ గాంచి.

క. మునులార మీరునన్నడి, గినయట్లుం గురువశిష్ఠుఁ గేవలభక్తిం
దనరిదిలీపుఁ డడిగిన, వినిపించె నతండుదాని వినిపింతుఁదగన్. 54

క. ఏమాసంబున ప్రజకు ను, హా మోదమునం బ్రభాత మందగుస్నానం
బేమఱక మోక్షమొసఁగెడు, నామాఘమహత్వమొనరు నాకర్ణింపన్. 55

—(*) సూతుండు శౌనకాదులకు మాఘమహత్వముం జెప్పుట. (*)—

సీ. సంతతాంచంద్రమా సత్పూరుషోత్తమ భూయిష్ఠమై విష్ణుపురమనంగ
మహితశంకరసర్వమంగళావస్థ్యమై పరిఢవిల్లుచు యశోవతియనంగ
కమనీయవాక్సమాకలితైకచతురాస్య వాసమై ద్రుహిణపూర్వరమనంగ
వలనొప్పవిబుధసంవాసమైనరతంబు నగవైరిపుటభేదనంబనంగ
పుణ్యజన సుస్థిరంబర్థపూర్ణమై కు, బేరనగరంబు నాగన వితరముం భు
జంగసంచార మగుచుఁజెలంగి భోగ, వతియునాఁబొల్చు సాకేతపత్తనంబు.

మ. నగరీగోపుర పంక్తియార్ష్యదివిజేంద్రస్వర్ణ సౌధాధికా
ధ్వగతిం బూనఁగఁబోవఁ దత్పరిఘు పాతాళంబు భేదింపమున్
నిగమింపన్ నముత్రోవలందుడు ఫణుల్ నిష్పన్నముల్ గాగఁబోఁ
దగదం చంతకునిల్పునైకొనెని తాం తానూన శాంతస్థితిన్. 57

సీ. బహుముఖంబులవచో ప్రౌఢిగైకొనియున్న యఁజుమెచ్చరచ్చటి ద్విజవతంసు
లగిశేతనిడిధను వజలుఁడైనట్టిభా, గ్యవు నెన్నరచ్చటి క్షత్రకులులు
నెఱిమూఁడుమూళ్ల పాతలలున్న శ్రీదుఁబే, ర్కొనరచ్చటంగల కోమటీడు
లోకహాలం బున్న హాలికుఁడౌనెయనిచూడ, రచటిశూద్రులు ప్రలంబాసురారి
నల్లకరులభ్రగజమును వెల్లవరచు, వారువములందును చైత్రవమ్మునొంచు
నురురథంబులు తిరుణాళ్లఁ బరిహసించు, నచటియువతులు నవ్వుదు రమరసతుల.

సీ. తనప్రతాపస్ఫూర్తి కినుఁడాత్మ శంకించి, ప్రతిదినంబపరది గ్వర్తిఁగాగ
తనసముద్యద్ధీర తకు మేరుమందరా, గములజస్రమునిశ్చలములుగాగ

తనభీమవిక్రమం బునకుల్కి గహనాంత, రానువర్తనములా హరులుగాఁగ
తనదువిశ్రాణనం బునగాఁగఁగా లేమి, పర్జన్యుఁడద్రుల పాలుఁగాఁగ
తనజగద్వంద్యమా నైక ఘనవృషప్ర, వర్తనంబునక సదయి భానుజుండు
తలఁగి యొకదిక్కునంబడి దాఁగతనదు, సద్యశోరుచిఁగందఁగాఁ జందురుండు.

ఉ. రూపితవిశ్వదీపుఁడు విరోధినరేంద్ర విఖండనక్రమా
టోపుఁడు మారరూపుఁడుఁ బటుప్రధనక్షయ కాలభూమి భృ
చ్చాపుఁడు సూర్యవంశకలశాబ్ధినిశాపుఁడు వొల్చునుర్విని
ర్లేపుఁడు రుప్రతాపుఁడు దిలీపుఁడుకీర్తి కలాపుఁడెంతయున్. 60

ఆ. ఆదిలీపభూమి పాగ్రణిదేవతా, వినుతముఁగనుజన్న మొనరఁజేసి
యవభృథాపరమున నయ్యయోధ్యాపుర, మొప్ప నేలుచుండి యొక్కనాడు.

తే. పొలముకాఁపులెల్ల దన్నెలమిఁజేరి, దుష్టమృగబాధసస్యసం దోహమణగ
త్వరిత మాఖేటముంబూని వానినుఱుము, సేయకుండినఁగలుగదు సేమమనుడు.

సీ. మురువైనయపరంజి సరిగంచు తెలిపట్టు, పావశిరోవీధి కివిఁజుట్టి
తళుకారు కెంపుఠా లులనిగ్గుఁదులకించు, మురువులజతఁగర్ణ ములనమర్చి
గరుడపచ్చలకీలు కడియముల్ మణిముద్రి, కలుఁగరంబుల వ్రేళ్ల నలవరించి
పసపువన్నియదట్టి పలుమారుమెల్కులుఁ, వడగానబిగ్గఱ వలయుపరచి
శరశరాసనకుంతప్రా సక్షురికము, లాదిసాధనచయముధ రాధిపుండు
రమణనమ్మృగయా ప్రయాణమునఁబూని, నగరి మొనవిల్వఁజూచివిన్నను వెలర్ప.

చ. నిగనిగ మించుకృత్రిమ మణీముఖపట్టము పక్కిఁతేనిఠాల్
దెగడు పసంబొసంగిన ఖలీనముఁ పక్కెర పీలికుంచపుం
జిగిలి తురాయిపారసిక జీనునమర్చిన వేగనిర్జితా
శుగమొక సైంధవంబధిపు చోటికిసాహిణి తెచ్చినిల్పినన్. 64

తే. జయజయేతిని నాధముల్ చటులతూర్య,
రవములంబోజగర్భాండ మవియసేయ
శుభముహూర్తము నందుభూ విభుఁడుఘోట,
కోత్తమారూఢుఁడైముద మొత్తలింప. 65

వ. కిరాత సైన్యంబులతో వనంబునకుంజని యందు. 66

—దిలీపుఁడు వేటకై వనంబునకేఁగుట.—

క. ఉరువనకుంజంబుల భూ, ధరకందరములనుఁదటులఁ దతనిర్ఝరిణీ
వరతీరోన్నతనిమ్న, స్థిరలన్ వెండియును వివిధ సీమలఁగలయన్. 67

వ. నానావిధ వాద్యంబులతోఁ బోటరులగు వేటరులుఁ జోపువట్టు నట్లొనరించిన.

ఉ. ఘోరతరక్షు ఖడ్గహరి కుంజరభల్లుక భూరి మాయుభూ
దారకురంగ శల్యశశ తండములుం ద్వీపికోక సైరిభో

దారమృగావలుల్ మిగులఁ ద్రాసమునన్ వడిఁబాఱఁ జొచ్చెదు
ర్వారబలంబుమై భషక వారము వేటరు లోలినంటఁగన్. 69

క. అప్పుడు గుణటాంకృతిదివిఁ, గప్పంగా వించికూర్చి కాండములహరిన్
రొప్పచుఁ బార్థివుఁ డుగుఱిం, దప్పక పరిమార్పఁదొడఁగి తన్మృగసమితిన్. 70

క. ఉరుతిగ్మాశుగవితతిన్, హరిదశ్వాన్వయవిభుండు హరిసదృశుండై
హరిదంతరములఁబాఱెడు, హరిసర్గము నణచె వ్యాధు లౌనౌననఁగన్. 71

క. పెల్లుఁగఁదును మాడెనుసితి, భల్లములం భల్లములను వడిభూదారుం
డల్లనభూదారంబుల, దుల్లన్ శల్యములమహిఁగ దున్ శల్యములన్. 72

క. కొంజక భంజించెన్ నృప, కుంజరుఁడా కుంజరములఁ గోనిఖడ్గమువే
గంజనిఖడ్గప్రతతుల, సంజనితామోదమగుచు సైన్యముఁ బొగడన్. 73

క. విశసన మొనరించెన్ బహు, శశములఁ దూలించెఁ బెలుచ శార్దూలములన్
నశియింపఁజేసె మృగతతి, నశనిఖరోద్యత్పరశ్వధాదులచేతన్. 74

వ. మఱియు నఖండ బలోపేతుల క్కిరాతులసి పరశుపట్టసభిండివాలకుంత తోమ
రముసల ముద్గరక్షురికాది సాధనంబులంగొని జవామేయంబులగు సారమేయం
బులతోఁ దఱిమి పెక్కుమృగంబుల నుక్కణంచిరప్పు డయ్యాఖేటంబు వధిత
పశుప్రకరంబై యజ్ఞవాటంబును నికుంచిత వంచకంబై రాజద్వారంబును విదా
రిత భూదారంబై పరశురామ సంగ్రామంబును శల్యప్రభేదనంబై యుధిష్ఠిరా
యోధనంబునుం బురుడించుచుండె నట్టియెడ. 75

చ. ఒకమృగమానరాధిపు మహోగ్ర శరంబున నొచ్చిపాఱఁ ద
ప్పక వెను వెంటనే పఱచి పార్థివుఁ డంతట మత్తబంభర
ప్రకరవిరావ భీతవన బర్హికులాకులితంబుఁ గోటర
స్థకరటశాత్రవోత్కరని తాంతరవ స్వనితంబు వెండియున్. 76

మ. చకితైణౌఘవిలంఘు యానముగు దంష్ట్రాభీల దంష్ట్రేతర
ఋక్షశార్దూల వృకాదిదుష్ట మృగసంక్షోభంబు ఘోరేభద
స్యుకఠోరోరు నఖప్రభిన్న మదవచ్ఛుండాల ముక్తామణి
ప్రకరప్రాకటము గ్రసర్పనికర ప్రాప్తావనీగర్తమున్. 77

మ. వరవిద్యాధర సిద్ధకిన్నరవధూ వారైక సంగీతన
వ్యరసానందచలీకృతాత్మఫణద్రు శ్వభ్రాహిరాడ్వారమున్
ఖరశార్దూల నఖాగ్రభిన్నమృగ రక్తార్ద్రస్థలాధార మ
త్యురుకాంతారము ఘోరమొక్కటియు వ్యాధోపేతుఁడై సొచ్చియున్. 78

క. కుందేళ్లపైని కుక్కలఁ, బొందుపడన్ విడిచి వేట బోయలు మిగులం
గ్రందుఁగొని యార్వనపుడా, సందడిమృగ సమితిసరభసంబున లేవన్. 79

వ. మున్నుఁ బఱచిన మృగంబు వెంట నృపుండుఁ దగుల్పడియెఁ బదంపడి మృగయు
లును మృగంబులం ద్రుంచి యధిపు వెంబడించిరట్లువా గురుల శరంబులం బడక

చిత్రసంచారంబుఁ సేయు హరిణంబుఁ వెనుకొని బహుదూరముంజని యొక్కజల విహీన మహాగహనంబున మిక్కుటంబగు డప్పిఁ డస్సి నీరారయుచు సూర్యుఁ డాకాశమధ్యగతుండగు నంతలోఁ దిరిగి తిరిగి యొక్కయెడ. 80

చ. గురుకవి రాజసంగతినిఁ ఽ గోరి గ్రహాధిప మండలంబుఁగా
నురుతర శంఖపద్మమక ఽ రోత్కటకచ్ఛప యుక్తమై ధనే
శ్వరుసదనంబుఁగాన నిమి ఽ షాస్పదమై త్రిదివంబుఁ గాని రం
తరమున గాధపూర్ణభువ ఽ నస్థితమై మహితార్ణవంబుఁగాఁ. 81

చ. అమరిన దానినొక్క కమ ఽ లాకరముంగని సమ్మదంపుఁ జి
త్తమున ధరావరోత్తముఁడు ఽ దారతగాల విధుల్ దదీయనీ
రముల నొనర్చి వ్యాధనిక ఽ రంబునుఁ దాను సమంచితాంబువుల్
గ్రమమునఁ ద్రావియవ్వన ఫ ఽ లంబులఁ దృప్తి వహించినంతటన్. 82

క. నీరేరుహాకరాంచ, త్తీరంబున భూవిభుండు ఽ ధృతిఁ దనవారల్
భూరి ధరాజచ్ఛాయలఁ, గోరికఁ గూర్చుండి విహిత ఽ గోష్ఠులనుండన్. 83

క. రవియేగె నపరదిశకుం, గవిసికొనెం దిశల నంధ ఽ కారంబపుడ,
య్యవనీశుఁడు ధనువెక్కిడి, తపురీతిం గాచె గోలనుఁ ఽ దామృగములకున్. 44

వ. మృగయులును మృగంబులు వచ్చు మార్గంబులఁ గాచుకొనియుండి రిట్లు గొంత ప్రొద్దరుగ నాపవలు వేటలం జిక్కక తక్కిన వరాహంబులా సరస్తటంబునం గల తుంగముస్తల శృంగమ్ములంజిమ్మి క్రమ్మి చప్పరింపన మందయానంబున మందలుఁ గొని రానందు మృగయులబ్భూపురందరుఁ డెచ్చరింప నచ్చలంబునం బెచ్చుకో లలఁ గ్రుచ్చివైచె నప్పుడు. 85

క. ఒక్కటియుఁ దక్కిపోవక, యక్కజమగు పందులన్ని ఽ యటఁబడిచావన్
జక్కనడించెం జాపం, బక్కుతలాధీశుఁ జేరి ఽ యందఱు మృగయుల్. 86

వ. బహుప్రకారంబులం బ్రశంసించిరంతఁ గొంతవడికిఁ బ్రభాతంబగుటయు. 87

ఉ. పూనిక నవ్వరాహముల ఽ బొందులు బోయలుఁ దేసరస్తటం
బౌన్నపు డంతవీడి నిల ఽ యంబున కేగుచుఁ ద్రోవఁగాంచె వై
ఖానస సన్నతప్రథిత ఽ కర్మసమేతుఁ బ్రపూతుఁ శ్రీపతి
ధ్యాన పరాయణాత్మకబృ ఽ హద్గుణజాతు హరీతునంతటన్. 88

—(*) దిలీపుఁడు హారీతమహర్షిం జూచుట. (*)—

తే. కాంచి యరుదెంచుమునికి మా ఽ ర్గంబునిచ్చి,
పాదపద్మములకు మ్రొక్కి ఽ భక్తినిలువ
నమ్మహామహు డతనిని ఽ జాత్మనెఱిఁగి,
మేలుసేయంగ నని యెభూ ఽ పాలునకును. 89

మ. ఇనవంశోత్తమ యేటికిట్లు సనెదీ ఽ వే తేర నానాఘసం
హననోగ్రంబు మహాశుభంకరము ది ఽ వ్యంబైన మాఘంబున

జనసంస్తవ్యము నా ప్రభాతసమయ స్నానంబుఁ గావింపకే
ఘనకాసారముఁ జేరి చేకొనవె మా ఘస్నాన సత్పుణ్యముల్. 90

తే. అరుణుఁ డుదయాద్రిభర్తసిం హాసనమునఁ,
గొలువుఁదీరంగ దివ్యాంబు వులమాఘ
మునము నింగినపుణ్యుని మొనసిసురలుఁ,
గాని వినుతింపఁజాల రె క్కాలమునను. 91

చ. అనుడు దిలీపుఁడమ్ముని వ రాగ్రణికిట్లను మాఘమజ్జనం
బానరఁగఁ జేయవచ్చుఫల మోమునివర్య ముదంబుమీరనా
కునువిని పింపుమీవలనఁ గోరివినంగల వాఁడనాగన
య్యనఘుఁడు మౌనిభూవిభుఁ బ్రియంబునఁ జూచి వచించెఁ గ్రమ్మఱన్. 92

క. నరవరభగవంతుండగు, హరిసర్వ జగంబుఁ బ్రాఁమి నట్టితమంబుల్
విరియించి యిప్డుఁ బ్రాద్గిశ, నరుదెంచెడుఁ గథకుసమయ మగునేయిదియున్. 93

క. మునుమజ్జన మొనరింపుము, వెనుకంగడు వడినిఁబొమ్ము వీటికినందున్
జనియవ్వ శిష్టునడుగుము, ఘనుఁడాతఁడుఁ జెప్పనీకు గల తెఱఁగెల్లన్. 94

చ. అనిపన జాకిరంబునకు నయ్యతిపోవుచు నుండఁజూచి య
మ్మనుజ విభుండుఁ తోడ నస మంచితబుద్ధి సరంబుఁ జేరియున్
మునివరు నట్లుఁదోయముల ముగ్గి నిజాహ్నిక కృత్యమంతయున్
బనిఁగొని తీర్చిమానిఁబను పంగనువేటరు లెల్లఁ గొల్వఁగన్. 95

వ. పురాభిముఖుండై భేరీ పణవ కాహళాది రవమ్ములు భోరుకొన నగరోపకంఠ భూగతుండగుడు నిజప్రధాన పురోహితాదు లొక్క పట్టంపుదంతి నలంకరించుకొని సపరివారులై మంగళతూర్యంబుల నెదుర్కొని నీరాజనంబులిచ్చి దంతావళాధిరూఢుఁగా మహావైభవంబున రాజమార్గంబునందు భవనంబు సేరఁ దెచ్చునప్పుడు.

మ. పురనారుల్ మణిహర్మ్య సౌధముల నమ్మోదంబుతో నెక్కి వి
స్ఫురదుద్యత్కర కంకణ ప్రకరరోచుల్ నింగిఁ బర్వంగ భా
స్వరలాజాక్షతలున్ సుగంధ సుమముల్ వర్షించి రెంతేనభ
శ్చరకాంతాళి కరోజ్ఝిత ప్రసవ వర్షప్రక్రియం బొల్పఁగన్. 97

చ. ఒకకరముల్ నిజోదరత లోపరినుంచి తదీయహస్తమున్
దొకచెయి మోఁజెయిన్ నిలిపి యుంచుకఁ దర్జని నాసికాగ్రమం
దొకజల జాయతాక్షినృపు నూఱుకచూడఁగ మందదృష్టినొం
డొకహరి ణాక్షినవ్వొఁదన మొద్ధిసఖీమణిఁ జూచిమాపుచున్. 98

మ. గురువృత్తస్తనియోర్తుఁ గౌనులియ వక్షోజస్థ హారావళుల్
తరళింపన్ దురునూడనంఘ్రికటక ధ్వానంబుతో వచ్చిచె
చ్చెరనడ్డంబుఁగ నున్నబోంట్లఁ దొలఁగం జేఁద్రొబ్బి వీక్షించె న
ద్ధరణీకాంతుని చూచిరంతికఁ పుఁగాం తల్ తద్వ ధూసంతమున్. 99

మ. నృపకందర్పునిఁ జూచి మన్మథశరానీక వ్యథాఖిన్నయై
చపలాక్షీమణి యొర్తుపు స్సురసఁ బార్శ్వక్షోణి బింబోష్ఠియే
మిపుడస్నం జఠరంబుపై నునిచెఁ జేయిన్ బాధకా నేమొయం
చపుడూహింపఁగఁ గారెకామినులు మాయావర్తన ప్రౌఢలున్. 100
శా. పౌరంధ్రీ తిలకంబొకర్తు పసిపాపం జంక నెక్కించి భూ
దారుం జూచుచు నుండి బాల తనుబాధం బెట్ట వీక్షింపదా
తీరుం జూచినఁ గొందఱుందనకు బోధింపంగ నాలింపదం
భోరుడ్గోధర రూపునా నృపల లాముం జెందియుం జిత్తమున్. 101
వ. ఇత్తెఱంగున పురకుత్త గారిసీ వీక్షణోత్తమ పర్వాఖర్వ ప్రకాశ విలాస భాసురుండును వందిజవ బృంద కీర్తనా సందితుండును వారనారీలాస్య గీతావినోద వీక్షణాకర్ణనుండును నగుచు రాజమార్గంబునం బోయి నిజభవనంబు సొచ్చునెడ నవరోధవ రూధినులు వివిధ నీరాజనంబు లిడ నన్నియుఁ గైకొని యంతఃపురంబు జేరి యందు. 102
క. ఆరాతిరి సుఖనిద్రితుఁ, డై రాజవరుండు లేచి యటుఁ గల్యమునం
దాఋషి వచనములాత్మం, గోరినిజాచార్యుఁ జేరఁ గొబ్బుననపుడున్. 103
క. వరమణి భూషాంబరములు, ధరియించి సితాశ్వబంధితంబగు రథమా
తురమునఁ దే సారథి భా, స్కరవంశజుఁ డెక్కి ఛత్రచామరములతోన్. 104
వ. ఇరుఁగెలంకులఁ బరివారమ్మునడువ హితబంధుయుతుండై పురంబు వెడలి మహాత్ముండగు వశిష్ఠు నాశ్రమంబు చేరి. 105

—(*) దిలీపుఁడు వశిష్ఠాశ్రమంబున కరుగుట. (*)—

ఉ. కాంచె నృపాలుఁ డంబురుహగర్భ సమానుఁ దదీయసూనున
భ్యంచిత యోగనిష్ఠు సతతాగమమంత్ర పటిష్ఠు నానిరా
ట్సంచయ వంద్యమాన ప్రకటాప్రతిమ ప్రతి భావరిష్ఠుఁ బ్రా
పంచిక ధర్మదూరగత భావగరిష్ఠు వశిష్ఠు నయ్యెడన్. 106
వ. అట్లుఁ గనుంగొని. 107
ఆ. సరగ రథముడిగ్గి సాష్టాంగ మెఱగిన, సముచితముఁగ వాని సత్కరించె
నంత సంతసమున నాహరీతుని వాక్య, మునుఁ దలంచి గురుని కనియె నిట్లు. 108
క. మునినాథ మీకృపారస, మునఁ జాతుర్వర్ణ్యధర్మములు దానవిధుల్
వినుతాధ్వ రాశ్రమాదులఁ, బనిపడి వర్తించు విధులు పాయకవింటిన్. 109
మ. ఘునభక్తిన్ వినఁగోరివచ్చితిని మాఘుస్నాన సత్కృత్య వ
ర్తనముం దన్మహిమంబు మీవలన సత్యంబింతయై ఖానసుం
డనఘుండీ వెఱిగింతునాగ గురువర్యా ప్రతిమై చెప్పి ధ
న్యునిఁ జేయం గదెయిమ్మహా సుకృతమేనుం బొందఁ గాంక్షించెదన్. 110

చ. అనవిని సంతసించి ద్రుహిణాత్మజుఁ డిట్లను పార్థివేంద్ర పా
వనము మహాత్మ్యమంబిదిశ వంకర మిమ్మహిలోన దీనినే
మనుజులుపూని సల్పినను మానకవారలు దేవకామినీ
జనములఁ గూడి స్వర్గమున సౌఖ్యములందుచు నుందురెప్పుడున్. 111

సీ. అనిశమ్ముగార్హపత్యాగ్నులర్చింపక, యతిథులకన్నవస్త్రములిడక
యజ్ఞముల్ సేయకె య్యాదనగోభూహిర, ణ్యాదిదానంబులీ య్యకయవరదు
వైకుంఠుఁ దలఁచుచె వ్వాలన నేనియు లేక, పరహితాచరణమె ప్పటికిఁగనక
వనతటాకాదులే ర్పడఁ బ్రతిష్ఠింపక, సత్కథావలినైనఁ జక్కవినక
పుడమిఁగలతీర్థ సుక్షేత్రములకునడువ, కమితమూఢాత్ములై యుండు నట్టివారు
గంద్రుస్వర్గసుఖంబుమాఘంబునందు, మొగినుషఃకాలమునదోయములమునింగి.

క. వింతగ నేనరు లేనియు, సాంతపనాదులఁగడంగి సలుపక వ్రతముల్
స్వాంతమున స్వర్గసుఖమ, త్యంతముఁ గోరినను మాఘ మమరించు నృపా. 113

సీ. చైత్రవైశాఖమాసములజలాన్నదాన, ము లర్చనములు జ్యేష్ఠమునశుచిని
జపహోమవితతులూర్జమునమాఘమునందు, స్నానదానంబులే నరులొనర్తు
రవ్వారుబంధు పుత్రాప్త వర్గములతో, జనిస్వర్గ సుఖముల ననుభవించి
ననుకభూమండలం బునకధీశ్వరులుఁగాఁ, బుట్టుదురీమాఘ మునను మఱియు
మొనరునుపవాసమజ్జనం బులకునుత్త, మోత్తమంబులు నౌత్రిరా త్రోపవాస
వ్రతములకుఁదక్కి పిదపస్వర్గంబుఁగోర, వారుషస్నాతలైదివిఁ జేరువారు. 114

వ. మఱియు నీమాఘస్నాన సుకృతమ్ము జన్మరాహిత్యంబైన మోక్షంబొసంగు నీస్నాతసుజ్ఞానియు నగ్నిపూజాపరుండై యుండునని పలుక నేల వెండియు వినుము. 115

ఆ. మనుజనాథమాఘ మునసేయుదానమ్ము, చెడనితపముఁబోలి కడుఁదనర్చి
భావిజన్మమునను బహుభాగ్యవంతునిఁ, బ్రియసతీసమేతుఁ బ్రీతిఁజేయు. 116

చ. మునుసుర మాత మాఘమున మోదముతోఁ బరివర్జితాన్నయై
దినదినమాగ మోక్తినిన దీకృత మజ్జనయై యతంద్రిలో
కనుతులఁ బుత్రులన్ సురలఁ గాంచెఁ బురందర భాస్కరాదులన్
గనదురు కాంతియుక్తులన కల్మషులం బ్రకటప్రభావులన్. 117

సీ. ధరణీశమఱియునిం ద్రాణిరోహిణియరుం, ధతిమున్నుఁగాఁబుణ్య వతులుమాఘ
మజ్జనంబొనరించి మహిమఁగైకొనికాదె, ఘనకాంతియుక్తంబు లునుగజేంద్ర
తతికర్ణతాలవృం తప్రభూతాశుగ, వ్యాప్తోన్నతద్వార వాటికలును
రంభాదిదివిజచం ద్రాననాలాస్య, గీతాంచితోద్యద్విశా లాంగణములు
సతతసద్బ్రాహ్మణాతిథి సంగతములు, నైనమణిమందిరంబుల నవిరతంబు
విభవమేపారఁబ్రాణవ ల్లభులఁగూడి, సమధికానందలీలలఁ జరుగుచెల్ల. 118

వ. మఱియు మాఘంబున దానంబులిడి వర్జితేష్ట వస్తుండై నీలగళు నర్చించినఁ దన్నివాసంబగు కైలాసంబుసిద్ధించు నిట్లు సర్వశ్రేయోమూలంబును మోక్ష

ప్రదం బభీష్టదంబ నఘంబునైన మాఘమజ్జనం బుత్తమోత్తమంబుఁగాదె
వెండియు. 119

క. ఏపుణ్యమైననిద్దఁ, బాపురె స్వర్గంబునిచ్చి పదఁపడి భవమున్
బ్రాపింపఁ జేయుచుండెడు, నీపరమంబైనపుణ్య మేఁగునట్లున్. 120

క. భావుక గేహము మునిసంఘ, సేవిత మోక్షాంగ నాప్త సిద్ధస్నేహం
బావిఖ్యాతో త్సాహము, క్ష్మావర మాఘోదయావగాహము పృథ్విన్. 121

చ. ఇదియతపంబు దానములు నెన్నియొఁజేసిన సత్ఫలంబ భీ
ష్టదముఁజ పాథ్వరాదులుఁగ డంకనొనర్చినఁ జెందు శ్రేయమీ
యదిమదిఁ గోరినంతనెడ హాఘము లెల్లఁదొలంగు మర్త్యుఁడిం
పొదవఁగ దీనిఁగాదెమది నూనినభక్తి నొనర్ప గాఁవలెన్. 122

తే. మున్ను మణికూటపర్వతంబునభృగుండు, ఒక్క విద్యాధరునకెంతయున్విపనంగఁ
జెప్పెనీయది నాగవశిష్ఠుఁజూచి, వినయమున మ్రొక్కి యిట్లను మనుజవిభుఁడు.

ఉ. ఏమని చెప్పెనాభృగుము నీశ్వరుఁడామణి కూటశైలమం
దామహితాత్ముచే వినియె నాతఁడెవండతఁ డెట్టియున్నతిన్
బ్రేమ వహించెనింతయునుఁ బేరిమినాకెఱుఁ గంగఁజేయుమీ,
యోముని నాథ హావుడు నృపోత్తముతోడ వశిష్ఠుఁడిట్లనున్. 124

సీ. భూమీశవినవయ్య పూర్వయుగంబునం, దొండొకసమయమీ యుర్విపైని
వర్షంబు ద్వాదశాబ్దములు పర్షింపమి, ప్రజకు క్షామంబు సంప్రాప్తమైన
నందుసహ్యాద్రిహిమాద్రిమధ్యోర్విలో, వర్తించుచుండెడు ప్రజకుచాల
నన్నవస్త్రాదుల కలజడియయ్యె, వనంబులఫలమూల నాశమయ్యె
జలములిమిరెను చెఱువులఁగొలకులందు, సర్వజంతూత్కరమునకు సంకటంబుఁ
దోచె దాక్షిణ్యధర్మముల్ దొలగినదువ, సాగిరధికబు భుక్తార్తి సజ్జనులును.

—(*) భృగుండు మణికూట పర్వతంబున కరుగుట. (*)—

వ. దానంజేసి పితృదేవతా కార్యంబులకు నిత్యహోమంబులకుఁ దగు పదార్థంబులు దుర్లభంబులైన రేవానదీతీరస్థ నిజాశ్రమంబువిడిచి శిష్యసహితుండై భృగుండు హిమవత్పర్వతంబున కరిగి తత్పశ్చిమభాగంబునఁ గైలాసగిరి చంగట.

సీ. కటకేంద్రనీలసంఘూతమంతస్థలీ, క్ష్ణుక్ష్వేళదీప్తకంధరముఁగాగ
ఘనకనత్కనకరుక్కమనీయగైరికా, కాండముత్కటజటోత్కరముఁగాగ
తతతమాలద్రుమోద్యన్నీలరుచినవ్య, నాగేంద్రత్వగ్వసనంబుఁగాగ
స్ఫటికాశ్మబంధుర ప్రభసమంచద్భసి, తావలిప్తసువిగ్రహంబుఁగాఁగ
దనరి తన్నాశ్రయించిన జనములకు న,
భీష్టఫలములనొసగిగి రీశుమాడ్కి
మొనరు మణికూటపర్వతంబును భృగుండుఁ,
గాంచిహర్షించి శిష్యసంఘమునకనియె. 127

చ. కనుఁగొనుఁ డింద్రనీలరుచిఁ గార్కొనిసద్రుచి రోరుగైరికల్
దనరుతటిల్లతావలి వి ధంబునుసూపఁగ వార్షికాభ్రమై
చనెడుఁ దదింద్రనీలరుచి సర్వర్ణపురేఖన మధ్యభాగముల్
గనతప నీయచేలమునుఁ గట్టిన శ్రీహరిఁ బోలిశైలముల్. 128

తే. ఘనతఁగన్పట్టునీలమే ఖలలయందు, తలతలనిమించునాసితో పలములరుచి
ననురి నక్షత్రసంశోభి తాంబరంబు, చాప్పనందోచుశైలరా జంబుచూడ.

తే. అమరె దివ్యౌషధోపేత మగుచు రేయిఁ, బవలు నొకబాతివెల్గుదీ పాలితోడ
దీపితంబైన దివ్యమం దిరమునట్లు, కలమె చూడంగభూమిని క్కరణినగము.

చ. అనిమణికూటముల్ భృగు మ హామునిశిష్య జనంబుతోడ వ
ర్ణన మొనరించియగ్గిరివ రంబును సేరి తదీయసాను వ
ర్తనలగు సౌరకామినుల రాగరసైకన పీనగానముల్
మనమున కింపుఁగానటు సమస్తముఁ జూచెడు వేడ్కలుబ్బఁగన్. 131

వ. అప్పర్వతంబుం గలయఁ దిరుగుచు రానందు. 132

సీ. ఒకచోటగంధర్వ నికరసంగీతంబు, లొకక్రేవకలకంఠ సుకలగాన
మొకచంతసుమకదం బకవరామోదంబు, లొకయోరశారికా శుకరుతంబు.
లొకతేవబ్రహ్మమహా నికలాపదళశాల, లొకభాగమమితకీ చకనికాయ
మొకమూలజలమువా రక పాటుసిర్ఝరు, లొకదండనానామృ గోత్కరంబు
లొకదెసంబద్మకల్హార ముకుళపుష్ప, కోరకాంచితసారకా సారములునుఁ
గలిగి విద్యాధరాప్సరో గణములాడి, దేవయోనుల కలిమిసాం పావహించె.

తే. అనినమునిఁ జూచియినకులుఁ డనియెనిట్లు, నద్రియున్నతమాయామ మమరదాని
దైన విస్తీర్ణమంతయు వానినాథ, తెలియఁగోరెదననముని పలికెమఱియు.

ఆ. వినుదిలీపభూప విశ్రుతోద్యత్కీర్తి, గుణకలాపతరణి కులసుదీప,
మొనరుయోజనములుముప్పదియాఱునౌ, పొడవువెండివినుముకడుముదమున.

వ. అగ్గిరివిశాలంబు పదునాఱుయోజనంబులు కలిగియుండు. 136

క. శృంగము పదియోజనముల, కుంగలదం దుండుగనులు గొప్పలుతరువుల్
తుంగములు చందనార్జున, లుంగలవం గామ్లసరళు లుంజంపకముల్. 137

వ. మందార చూత కేతకీ దేవదారు కాలాగరు పున్నాగాదులు గలిగియుండున విని
రంతర ఫలకుసుమ కిసలయోపేతంబులైయుండు మఱియు వివిధలతాని కుంజం
బులు సమిత్తోయాదులు సమృద్ధంబులై యుండు నిట్లుండుటంజేసి భృగుండు
దుర్భిక్షభయంబువాసి యొక్కచోఁ బర్ణశాల నిర్మించుకొని శిష్యులుం దాను
సుఖంబుఁగాఁ దపంబుసేయుచుండె నట నొక్కనాఁడు. 138

మ. ఒకవిద్యాధరుఁ డంగనాయుతుఁడుఁగా నొప్పారు తత్పర్వతాం,
తికభూమిం జరియించుచుండి యటకున్ దీనాస్యుఁడై వచ్చిపా

యకయమ్మౌని పదాంబుజంబులకు సాష్టాంగంబుఁ గావించియా
రకకేల్మోడ్పున నిల్చియున్న మునిగారాబంబునం జూచియున్. 139

—(*) భృగువిద్యాధర సమాగమము. (*)—

శా. ఏమయ్యా బహుదుఃఖితాత్ముఁడవునై యిట్లుండఁగాఁ గారణం
బేమో మా కెఱిఁగింపరాదె వినమే యాధారిణిన్ నీవకా
కేమాత్రంబునుఁ బొందకుండుజను తే రీపూర్వ కర్మంబులీ
వీ మేరన్ దిఁ గొంకుపీడితగునీ వృత్తాంతమున్ దెల్పఁగన్. 140
తే. అనినభృగుతోడననియెవిద్యాధరవరు, డిదిమదంగనరూపసంపదలనృత్త
గీతవిద్యలనసమానకీర్తిదీని, సాటిదేవాంగనలనేవ ఘూటిలేదు. 141
ఉ. పిన్నతనంబు నందెకడుఁ బ్రేముడిఁ దల్లియుఁ దండ్రి వెంపఁద
త్సన్నిధి నేర్చియుండి స్వర సప్తకయుక్తవి పంచి కేలఁదా
విన్నను వారనొక్కచిఱు వీణియమీటెడు నట్లుమీటి వి
ద్వన్నుతు నారదుంగడుము దంబలరించె నువాద్యనైపుణిన్. 142
తే. ఆహతానాహతములఁ బొలైనమూర్ఛ,
నముల గమకాదు లందువిన్నాణమెసఁగఁ
బాడుచోఁ బంచమస్వర పాటవమున
చొక్కి తలయూచు నాపుర సూదనుండు. 143
చ. అవగతరూప యవ్వనస మంచిత భావములం బొసంగునీ
ప్రవిమలగాత్రి నాకునిటు భామినిగా ముదమారఁ జిత్తసం
భవునదలించుచున్ రతుల మానినిఁగూడి సుధాంశు బింబసా
ష్ఠవమడఁగించు మోమునువె సంగొననో చనుచుం బనాదులన్. 144
క. ఇదిదివ్యమా ముఖంబునఁ, బొదలఁగనే నిట్లువ్యాఘ్ర ముఃఖముననిత్యం
బొదవిన దుఃఖార్ణవమున, సదయాత్మా మున్గుచుండుఁ జావును లేమిన్. 145
తే. కలిగెనిర్జరతనువులే ఖాలయంబుఁ, బూర్వకృతపుణ్యపరిపాక మునముఖంబి
దిట్లుఁగాఁగారణంబేమొ యెఱుఁగరాదు, మునివరాగ్రణివికటమైపులివిధమున.
క. దీనావన యీకతమున, మానిని కెడఁ బాటుఁగలిగి మదిలోనిరతం
బూనిన చింతాభరమున, నేనొకవిధిఁ గడపుచుండు నిక్కాలంబున్. 147
క. అనితన కథవిద్యాధరుఁ, డనఘాత్ముఁడైనభృగుమహర్షికిఁదెలుపన్
వినిసర్వవేత్తఁగావున, మనమున నంతయునెఱింగి మందస్మితుఁడై. 148
వ. అతని కిట్లనియె. 149
చ. సుమహిత చిత్తనిస్పరి శుద్ధులుసూనృతు లంచితవ్రతుల్
నెములమ రేంద్రవందితులు శాంతులుఁగాని పురాకృతాఘసం
ఘములఁ గ్రమంబునంగుడువఁ గల్గునురుర్విఁ దదీయకర్మమ
ల్పమయినఁ దాభుజించునెడ లన్ బెలుబాధల నందఁజేసెడున్. 150

ఆ. కడఁగి విషముమఱి కా పాదమంతైన, కుక్షిఁబడినతనువుఁ గుందఁజేయు
నటులసూవెదిరితి యత్యల్పమైనత దనుభవమునఁ బాధ నధికమొసఁగు. 151
క. ఇదియెంత దుష్కృతంబని, మదిఁదోఁచెడుఁ జేయుపట్ల మానకదుఃఖం
బొదవించు ననుభవంబునఁ, గుదురుఁగదిన దినముఁ బెరిగి కొండై యుంటన్. 152
వ. మున్ను నీవు హరివాసరంబునం దుపవసించి ద్వాదశిం దైలాభ్యంజనంబుఁ గావించితి గాన నీవ్యాఘ్రముఖంబుఁగలిగె తొల్లి నీయట్లు పురూరవుండను రాజు ద్వాదశిం దైలాభ్యంజనంబుఁ గావించి. 153
చ. తనువు వికారమైనఁగని తద్దయుభూమి విభుండుమానసం
బున బెగడంది చింతతల ముస్కులుఁగా నిటు లీకురూపమే
నెనయుట కేమిహేతువిది యేగతిఁ బాయు నటంచుఁబల్కరున్
వనరుచు రోసిపత్తనము వాసి హిమాద్రికిఁ బోయియచ్చటన్. 154

—(*) పురూరవశ్చరిత్రము. (*)—

ఉ. దివ్యనదీజలంబుల త్రి తీనుఁడు మజ్జన మాడి శౌచియై
భవ్యమతిం గుశాసనము పైనివసించి ముకుందుభక్తసం
భావ్యు సరోజనేత్రు దర పద్మ సుదర్శన సద్గదాధరున్
నవ్యవిభూషణాంబరు ననంతునతావను నప్రమేయునిన్. 155
మ. వరకేయూరకిరీటహార మణిశోభాయుక్త శ్రీవత్సభా
స్వరవక్షున్ వనమాలికాధరుఁ గృపావాసున్ హరింగూర్చి సు
స్థిరుఁడై మాసమొకండుఁగాఁ దపము భక్తిన్ వర్జితాన్నోదకుం
డురునిష్ఠుండయి సేయ శ్రీరమణుఁ డాద్యుం డాత్మ మోదించియున్. 156
క. అదియేమ జన్మములుఁదను, వదలక పూజించినట్లు భావించిమహా
ముదమందఁ జేయఁగోరుచు, నదయుఁడు ప్రత్యక్షమయ్యె జననాథునకున్. 157
సీ. హరినీలములకాంతి నిరసించు నెమ్మేన, రహిఁగుల్కు పీతాంబరంబుతనర
ముకురోపమాన స్నిగ్ధకపోలములమణి, కుండలంబులరుచుల్ నిండుకొనఁగ
ఘనగదా శంఖచక్రాదిసాధనసము, త్కరదీప్తిభుజ చతుష్కంబునమర
సమధికానందసంభ్రమసమేతాననాం, భోజంబుపూర్ణాబ్జు మురువుడింప
కమ్రమణికింకిణీసమాక్రాంతలసిత, సింహసంహననంబురాజిలఁగఁదార్క్ష్య
వాహనారూఢుఁడై సురవరులుగొలువ, ఘనుఁడుహరియవ్విధమునసాక్షాత్కరింప.
వ. భయవిస్మయాకలిత స్వాంతుండై దేహమ్మునఁ బులకాంకురమ్ము లెగయ మైమఱచి కొంతఁదడవుండి మగుడఁ గన్నువిచ్చి దిగ్గనలేచి సంతోషాతిశయోదిత కంఠగద్గద్యమ్ముఁ జక్కవఱచుచు నిటలఘటితాంజలిపుటుండై యిట్లనిస్తుతించె. 159
దండకము. శ్రీమద్రమా మానసాంభోజ సూరాహతా ఘోత్కరా మేరు ధీరాల సద్రూప మారామహోదార సారాకరాంభోజ యుగ్మమ్ము ఫాలంబునం భక్తి గీలించి సద్యుక్తి నోలిన్నముంజేయుఁగాఁ బూనితిన్ సన్నుతుల్ నిత్యసత్యాను

కూలాకనత్స్వర్ణచేలా ప్రమోదైకలీలా బలారాతి ముఖ్యైన దిక్పాలకుల్
యక్షగంధర్వసిద్ధాప్సరోగుహ్యకుల్ కిన్నరానీకముల్ ద్వాదశాదిత్యు లేకా
దశవ్యోమకేశుల్ సురల్ తార్క్ష్యులాయష్టవసువుల్ నరవ్యాళపైశాచమన్వా
దులున్ మానులాయత్రి సానంద శాండిల్య జాబాలి భృగ్వామదేవా సితోద్దాల
కాంగీరస వ్యాసబోధాయ నాగ్రేక పాదోగ్ర శీలోగ్ర జాతాదులున్ నాల్గు
వేదంబు లాశాస్త్రషట్కంబు నష్టాదశోద్యత్పురాణాలి మృత్యుంజయాంభోజ
సంజాతులున్ నేరరీశా మిమున్ సన్నుతుల్ సేయ నేనెంతవాఁడన్ బతంగంబు
దామింటికై యేగునేగాని యద్దానిపారంబుఁ దీరంగఁ జూడంగఁ దారింగునం
దారు నేయట్లుమచిత్తమందెంతఁదాఁ దోచునంతే నుతింతున్ గనద్రూప చిద్రూ
ప సంశాశ్వత బ్రహ్మరూపా సరూపా విరూపా మహాదివ్యరూపా నిరాలంబ
నిత్యాత్మనిర్లేప నిర్ధూతపాపా స్ఫురచ్ఛార్ఙ్గచాపా భవత్పాద పంకేరుహ ద్వంద్వ
మున్ మన్మతిన్ సిల్పి ధ్యానించినన్ దల్లివాపోవు నాపాపనింజేరు వందీయు
మర్యాదనాయంతి కోర్వ్యస్థలిం గోచరంబైతియేగానకం బాపముం జేసితిన్ మూఢ
చేతస్కుఁడన్ దావకీనాంఘ్రిపద్మంబులేనమ్మితిన్ గావవె భక్తమందార కారు
ణ్య సంచార దీనావనోదార శౌరీ నమస్తే నమస్తే నమః. 160

క. అనిసన్నుతించు రాసుతుఁ, గనుఁగొని సంతోషవార్ధి కడలుకొనంగన్
వనజాక్షుఁడా స్తవంబును, వినివారణ మాచరించి వేయిట్లనియెన్. 161

చ. అనఘమదీయ చింతనము హార్నిశమాత్మనుఁ గోఁ సేయు స
జ్జనునకు నాపదల్ బొడమ జాలవు పూర్వకృతాతి దోషసం
జనితములై కడంగినవె సంజను మద్విహితాంత రంగవ
ర్తనుఁడగు దానవోన్నృపవ రాగ్రణియింతఁ దలంపుమాత్మలోన్. 162

మ. మకరాంతర్గతుఁడై వికర్తనుఁడుశుం భల్లీలవర్తింపఁగా
సకలాఘంబులు వాపు నీతపమునన్ సంతోష మందించితీ
వకలంకంబగు భక్తితోఁ దపము భవ్యస్ఫూర్తిఁ గావించియే
నికనీకిచ్చెద నీప్సితార్థముల ను ర్వీశాక్రమం బొప్పఁగన్. 163

వ. అని యిష్టార్థంబులనిడి చక్రవర్తి పదవిం బ్రసాదించి యమ్మాఘ శుక్లద్వాదశి
నతనిదేహమ్ము శంఖోదకమ్ముల సమ్మార్జనంబుఁ గావించి తైలాభ్యంజన దోషాప
గత దివ్యశరీరుఁ గావించి సరోజనయనుండు తిరోహితుఁడగు డమ్మహీపతి యిలా
తలంబున కవతరించిన సూర్యుండు నా వెలుంగుచు. 164

సీ. మందారమాకంద సిందువారాదిద్రు, బృందాతిరమ్యకృ న్నందనముల
కుసుమాదిసౌరభ ప్రసరణాలసశిశు, శ్వసనప్రచారకుం జాంతరముల
దరఫుల్లపరిమళో ద్ధురపల్లకాంబుజో, త్కరసూల్లసత్సర స్తటచయముల
బలభిన్మణీసము జ్జ్వలపద్మరాగాది, కలితసద్రుచిరాగ కందరముల

నెలసియుందందుఁగలసార ǂ జలజముఖుల, యాటపాటలనానంద ǂ మతిశయిల్లఁ
గనుచువినుచునుఁబలుచుచుఁ ǂ గడకఁబోవ, నెంచుచునునిట్లుఁదాఁజరి ǂ యించువేళ.
క. అసమాన మూర్తిఁదనరిన, వసుదేవునిఁ జూచిమోహ ǂ పరవశయగుచున్
బిసరుహాలోచన యూర్వసి, కుసుమాయుధ కేళినతనిఁ ǂ గోరనుంచెన్. 166
ఆ. కడఁకనతఁడుజాయఁ ǂ గాదానిఁగైకొని, నిజపురమ్ముసేరి ǂ నిత్యసుఖము
లందుచుండెశ్రితజ ǂ నావనతత్పరుఁ, డైసుకీర్తిగాంచి ǂ యవనియందు. 167
వ. కావున. 168
ఉ. నీవునుభక్తిఁజేసి కమ ǂ నీయముఖుండగు దేమిఁగాకనే
డీవసుధా ధరోర్విఁగను ǂ నింపగుశైవలి నీజలంబులన్
బావనబుద్ధిమై తపము ǂ నందొనరింపుము మజ్జనంబొగిన్
బోవుపురా కృతాఘములు ǂ పొందెదు సర్వసుఖంబు లెప్పుడున్. 169
ఆ. అనఘదేవమాని ǂ జనములచేనిరం, తరమువినుతిఁగాంచు ǂ వరతపః ప్ర
భాతమజ్జనంపు ǂ రీతినివివరింతు, సలుపుమట్లుమేలు ǂ సంఘటిల్ల. 170
క. ఆపుణ్యతమము మాఘము, నీపుణ్యము కతననింక ǂ నేటికి మొదలున్
బ్రాపించు నేనుదినముల, లోపలనది బహుశుభావ ǂ ళుల్ పొసఁగించున్. 171
సీ. కడుప్రీతిఁబుష్యశు ǂ క్లమున నేకాదశీ, తిథిమొదల్గానెల ǂ దివసములును
వదలకమజ్జన ǂ మ్ముదయకాలంబునఁ, గావించుచునుమహా ǂ త్కుంఠుఁడగుచు
జలజాక్షుమాధవే ǂ శులఁబూజసేయుచు, మొనరంగఁదానసర్వ ǂ భోగములను
నెడఁబాసిభోజన ǂ ముడిగిజితేంద్రియుఁ, డగుచుసంతసమున ǂ జాత్మఁదనర
నెపుడుఁబఱతెంచునమ్మాఘ ǂ మెలమిశుక్ల, పక్షహరిదినముననిర ǂ త్యంతరముగ
నెప్పుడుపవాసమొంతేని ǂ యుంపుఁబోడ, సలిపియేఁబొందువాఁడఁగో ǂ ర్కులఫలంబు.
క. అని నెమ్మనమునఁ గోరుచు, జనుఁడెవ్వం డేనిభక్తి ǂ సలుపుందాని
మ్మునఁగాంచు నీప్సితంబులు, మునుపడ నీవట్లుసేయు ǂ మొనరఁగనేనున్. 173
క. పావన మంత్రోదకముల, నావాసర మందుస్నాన ǂ మతిముదమారన్
గావించి నిన్ను స్మరముఖుఁ, గావించెద నఖిలపాత ǂ కంబులువాయన్. 174
వ. అని విద్యాధరునకుఁ బోధించి యఖిల ధర్మవిదుండు మహాత్ముండునగు భృగుండు విశేషించి మాఘప్రభావం బెఱింగింపఁ గోరి యిట్లనియె. 175

—(*) భృగుండు విద్యాధరునకు మాఘప్రభావముం జెప్పుట. (*)—

క. కలుషములఁ బాపునాపద, లలముక యుండంగఁబ్రోచు ǂ నఖిలేప్సితముల్
బొలుపార నిచ్చుసద్వ్రత, ములనుత్తమ మీవ్రతంబు ǂ మునుకొనిసేయన్. 176
క. ఈయుత్తమ మాసంబునఁ, బాయక జన్నములుసత్త ǂ పంబులు వ్రతముల్
సేయుఁగ యోగాభ్యాము, లాయువి సఫలంబులౌ వి ǂ యచ్చరవర్యా. 177
వ. మఱియుఁ బుష్కరిణీ కురుక్షేత్ర పృథూదక బ్రహ్మావర్తంబులను గంగాయము
నా సంగమం బగు ప్రయాగంబు నందును గంగాసాగర సంగమాఖ్యంబైన

పుణ్యతీర్థంబునందును నిమజ్జనంబుఁ గావించి జితేంద్రియుండై దశవత్సరంబులు
తపంబుఁగావించిన ఫలంబు నిస్సందేహంబుఁగా నీ మాఘోదయంబునఁ బుర
బహిర్జలంబుల దినత్రయంబు స్నాన మాచరించి పడయనగు నిదియునుంగాక.

ఉ. భాగ్య మొసంగు స్వర్గమిడు భవ్యములం బొసగించు నాయురా
రోగ్యములం జితస్థితిను రూపమునిచ్చు దరిద్రతార్తిఁ బో
భోగ్యము లందఁ జేయు నఘముల్ దొలఁగించును సద్గుణాలివై
రాగ్యముఁ గూర్చు నిమ్ములధరాస్థలి మాఘుని మజ్జనంబొగిన్. 179

తే. ప్రీతి దుర్భాగ్యకలుష దారిద్ర్యపంక, మెలమిఁ గడుగంగ నిర్జరకులవరేణ్య
మాఘమజ్జనసుకృతమి మ్మహిఁ బొసంగుఁ, గాని లేదింక వేరు నిక్కంబు వినుము.

చ. ఇతరము లెవ్వియైనను మహా సుకృతంబుల నాచరించుచో
నతులిత భక్తిసంయుతము నాత్మ నొనర్చినఁ గాని యింతఁ ద
త్కృతులు ఫలంబుసెందవు సుధీవర మాఘుని మజ్జనంబున
మ్మతియగుఁ గాదుగాక గరిమంబగు స్వర్గ సుఖంబొసంగెడున్. 181

తే. చంద్రునకు వృద్ధి శుక్లపక్షమునఁ గృష్ణ,
పక్షమునఁ గార్శ్యముం గూరు పగిది మాఘ
మజ్జునకును సుకృతంపు మహితవృద్ధి,
యఘకృశత్వంబుఁ జేకూరు నవనియందు. 182

తే. అబ్ధిసన్మణులుదయించు నటుల మాఘ, మజ్జనంబున మహితకామ్యంబు లెల్లఁ
బడయనుదయించు నీప్సిత ప్రాప్తికిదియ, కామధేనువుఁ గల్పవృక్షంబుఁ జువ్వె.

సీ. అనఘాత్మ కృతయుగంబున సత్తపంబుల, ధ్వరసుకర్మములఁ ద్రేతాయుగమున
విష్ణుపూజనములే వేళ ద్వాపరయుగ, మ్మునదానముల్ గలి ముఖ్యములగు
నొగనివ్విధంబుఁగా నొండొండు యుగమున, నొనరుఁగర్మములొండొకొండుఁగాగ
జనుఁగాని మాఘమజ్జనఘనపుణ్యమే, సమయంబునందైన జనములకును
ముఖ్యమగుచును సతతంబు మోదమొనయఁ,
గురియు నిష్టార్థములను మేఘుండు వానఁ
గురియు పగిది వియచ్చర కోరిచూడ
మాఘ మజ్జనమునకన్న మఱియుఁ గలదె. 184

—(*) భృగుండు విద్యాధరు వ్యాఘ్రముఖ విముక్తుం జేయుట. (*)—

క. అనివిద్యాధరునకు భృగు, మునివరుఁ డెఱిఁగింప మోదమునన మ్మునిచెం
తనె యుండి తద్గిరీంద్రము, ననుబ్రవహించెడు నదీవనంబుల భక్తిన్. 185

క. విధిపూర్వకంబుఁగా తన, విధుముఖితో మజ్జనంబు విద్వజ్జనతా
ప్రధముండగు భృగు ననుమతి, నిధరావర చేసిచేకొనెన్ సుముఖుంబున్. 186

వ. ఇట్లు భృగుండు వియచ్చరు సుముఖునిం గావించి యమ్మణికూటమునం గొన్ని
వత్సరంబులుండి జగంబు సుభిక్షంబుఁగా మరలి వింధ్యాద్రిం జేరి నర్మదా తటం

బునంగల నిజాశ్రమంబున నధివసించి శిష్యులుం దాను తపంబు సేయుచుండెనని చెప్పి వెండియుఁ దపోధనుండగు భృగుండు విద్యాధరునకుం జెప్పిన నీ యనఘం బగు మాఘమాహాత్మ్యంబు సర్వదా వినువారుం బఠించువారు దేవసములగుదు రనుడు మునీశ్వరున కవనీశ్వరుం డిట్లనియె. 187

తే. అనఘ యీమాఘమాహాత్మ్య మాత్మయందుఁ,
బాయకింకను వినువాంఛ పరిఢవిల్లు
చున్న దెంతయువినిపింపు సొంపుదనర,
ననఁగనిట్లను వినుమని యతఁడతనికి. 183

—(*) వశిష్ఠుండు దిలీపునకుఁ గుత్సమహర్షి వృత్తాంతముం జెప్పుట. (*)—

సీ. అవనీశపూర్వక ల్పాంతమునందిట్టి, కృతయుగంబునను వి శ్రుతగుణాఢ్యుఁ
డనఘుండుకుత్సుఁడు వనజాతభవకులుం, డొకరుండుఁగలఁడతఁ డకలుషాత్ముఁ
గర్దమదుహితనొ కర్తుకఁబరిణయ, మై తదీయాంభోరు హాయతాక్షి
యందుఁగౌత్సుఁడునామ హాత్మునొక్కనిఁగాంచె, నాసుపుత్త్రుఁడు మహా ద్యన్మనీష
నైదుసంవత్సరములలో నయ్యెతోడ, నుపనయనకృత్యముంబొంది యుచితభంగి
బ్రహ్మచర్యవ్రతంబునఁ బరిఢవిల్లి, గురువరుంజేరితత్సమా దరణవడసి. 189

క. కనువడి సంధ్యావేళల, నుడుఁగకశుచి కార్యవిధము లొగిమజ్జనము
ల్వడుగుఁ ద్రికాలములందే, ర్పడఁజేయుచు నుండియుంది రంబగుభక్తిన్. 190

వ. భిక్షాశియు జితేంద్రియుండునుఁ గృష్ణాజినధరుండు శిరాంతోన్నత పలాశ దండ ధరుండు నంగీకృతమౌంజీ కమండలుండు ధవళ యజ్ఞోపవీత కౌపీనుండు సమి ద్భస్మనిటలుండు నగుచు సర్వజన నయనప్రియుండై యొప్పె నంగుచు. 191

క. గురుమతిఁ గల్యమున నిరం, తరమాతఁడు నిదురలేచి తగశుచియై వా
సరకర్మ లెల్లఁదీరిచి, గురుజనవం దనముసేయుఁ గొనకొనిభక్తిన్. 192

ఉ. ముట్టఁడు గంధముంగుసుమ ముల్ జనఁడుప్పునుఁ గారముల్ మతె
ప్పట్టునఁ బిష్టమద్యముల పాకములెంమను నిక్కులాడఁడ
ట్టిట్టు భుజించువేళనతిఁ డెన్నఁడుఁజూడఁడు దర్పణమ్ము కా
ల్వెట్టఁడు పానహాదులల లిందలఁదాల్పఁడు వేష్టనంబులన్. 193

ఆ. దంతధావనమ్ము తాంబూలమసితపీ, తారుణాంబరములఁ దాల్చుటయునుఁ
దొఱగిభూషణములఁ దోత్తోడనుచు బ్రహ్మ, చారివృత్తివెలయ సలుపుచుండు.

వ. వెండియు నిట్లతండు నియమవ్రతుండై చాంద్రాయణాది సువ్రతంబులుఁ బుణ్య తీర్థావ గాహనంబులుఁ గావించి కృతార్థుండై మాఘమాసం బురానం బుధింజొ చ్చు నదులనన్నిటం గొంతదవ్వు పశ్చిమంబుఁగను మఱికొంతదవ్వు నుత్తర ముఖం బుఁగనుం బ్రవహించి ప్రయాగ కన్నమిన్నయని బుధాలులెన్నఁ బశ్చిమ వాహిని నాఁబ్రసిద్ధియైన కావేరిం జేరి యిప్పరమపుణ్యప్రదంబైన తీర్థంబునం దపంబునందు స్నానంబు సేయఁ గలిగెఁ గదా యని యుబ్బుచు మూఁడు మాఘంబులందుంజ

త్రికాలస్నాతయై హరినర్చించి యంత మరల నింటికిం జనుదెంచి జననీజనకాజ్ఞ
వడసి పునఃప్రయాణుండై. 195

క. ఆకుత్సఋషికుమారుఁడు, వైకుంఠునిఁ గూర్చితపముఁ బరువడి సేయన్
లోకైక సన్నుతంబగు, నాకావేరికినుదగ్గి శావనియందున్ 196

వ. యోజన దూరంబున. 197

సీ. ఆకాశమంటిన ట్లధికోన్నతంబులై, వెలయుశృంగములచేఁ బొలుపుమీరి
వివిధద్రుమమ్ముల వివిధమృగమ్ముల, నమరినగురునితం బములఁజెలఁగి
జరులఁ గ్రీడించుయ క్షాప్సరోగంధర్వ, సంచయగానప్ర శస్తినొప్పి
పికశారికామయూ రకదంబపారావ, తాదివిహంగరు తములఁదనరి
యవనిఁగలధారిణీధ్రంబులందుమిగుల, రమణనమరారియున్న నారాయణాద్రిఁ
జేరియందొకవిమలకా సారనీర, ములనుసుస్నాతయైతీర మునవసించి. 198

క. హృదయమునఁ బద్మలోచను, వదలకఁగది యించివిషయ వర్గములోలో
నదిమియొక మూలఁదాచియుఁ, గదలనిదీపంబుఁబోలెఁ గమునిష్ఠమెయిన్. 199

వ. కూర్చుండి తపంబున కారంభించి ముకుళీకృత నయన కమలుండై యఖండ
భావంబున. 200

క. వెలిలోను మీదుఁగ్రిందునుఁ గలవస్తువితానమెల్లఁ గన్గొనతానై
వెలుఁగొందుచు నతులసమా, ధిలలితుఁడై యుండెనతఁడు దివ్యులుమెచ్చన్. 201

ఉ. అవ్విధినాతఁ డోర్పువెల యంగమహా తపమాచరింపఁగా
నవ్వన జాకరంబునక హర్నిశముంజల మానవచ్చితాఁ
దవ్వులనుండి యిట్టిగమి తన్గని మ్రోడవి చేరికొమ్ములన్
నెవ్వడిఁ దీటవాసి చన సిత్యము హాయుచుఁ బోవుచుండెడున్. 202

ఉ. పాయక యట్లు కౌత్సముని వర్యుఁడు ఘోరతపంబుపద్మ ప
త్త్రాయత లోచనున్ నతజ నావనుఁగూర్చి వినిశ్చలాత్ముఁడై
సేయుడు దత్తపంబునకుఁ జిత్తములోఁగడు సంతసించి శో
భాయుత మూర్తివిష్ణుఁడు కృపం బొడసూపెని జాగ్రవర్తనన్. 203

ఉ. శ్రీపతి యట్లుఁ గౌత్సముని శేఖరుముంగలఁ దోచిదీనర
క్షాపర తంత్ర మానసుఁడు కాననహ్వాముని పుత్ర చాలు లె
మ్మోపిక నీవొనర్చుతప మొప్పెఁ గృతార్థుఁడ వైతివింకనం
చాపఁగ రాని ప్రీతి నపు డాత్మ కరమ్మున మూర్ధమంటినన్. 204

చ. పరమశుభ ప్రశస్తమగు పద్మదళాక్షుని హస్తమవ్విధిన్
శిరమున సోఁకఁగుత్సజుఁడు చెచ్చెరఁగన్నులు విచ్చికోటిభా
స్కరరుచితోడఁ గట్టెదురఁ గన్పడువానిఁ గిరీటకుండలా
ద్యురుతర భూషణాన్వితుఁ బ యోరుహ నాభునిఁ జూచియంతటన్. 205

వ. సాష్టాంగంబులిడి ఫాలంబునం గేలు గీలించి యిట్లని నుతించె. 206

—(*) కౌస్తుభుండు విష్ణుదేవుని నుతించుట. (*)—

ఉ. మానుగ లోకసంహతి సమస్తముఁ బ్రోచెడు మిన్నయై జగ
త్ప్రాణుఁడుఁ దానుగా నఖిల ప్రాణిని కాయములో వసించి త
త్ప్రాణిని కాయమంతటికిఁ బ్రాపగు చోటును దానయైయశేః
శ్రీ నెఱయంగఁ బొల్చు సురశేఖరు నాత్మ భజింతు నిచ్చలున్. 207

చ. తలఁచిన యంతలోకములు తద్దయు నా నభివృద్ధిఁ జెందు ని
మ్ములనగు నాశ మెవ్వనికి ముంజగముల్ విలయంబునందనే
యులఘుఁడు శాశ్వతస్థితిఁ బ్రియంబున నుండెడు షడ్గుణంబులన్
జెలఁగు నెవండు ధర్మమవ నీస్థలిఁ బాదు నెవండు వెండియున్. 208

ఉ. శాంతగుణప్రధానుఁడును శాశ్వతుఁ డాగమసత్స్వరూపుఁడ
శ్రాంతము మోక్షసంగతిఁ దిరంబుగఁ గోరినవారి కిచ్చి య
త్యంతముఁ బ్రోచువాఁడు తెలియం దనకన్న విభుండు లేనివాఁ
డంతట నుండువాఁడు తన యంతనవర్తిలు వాఁడు బ్రోవుతన్. 209

క. ఆనందమే స్వరూపం, బై నెగడిన వాని జ్ఞాని ననఘాత్మకులౌ
మానీంద్రుల మానసముల, మానుగ వర్తించువాని మదిలో నెంతున్. 210

ఉ. స్థావరజంగమాదుల భృశంబుగ నాత్మసుతేజ ముంచి సాం
పావహలంగఁ జేసెడు మహాత్ముఁడు పెద్దలలోనఁ బెద్దయున్
గేవలులందుఁ దా మిగులఁ గేవలుఁడున్ నిగమాంత వాక్యసం
భావిత పాదపంకజుఁడు భవ్యుఁడు నా నతఁ డాత్మ నిల్చుతన్. 211

ఉ. పారములేనిదై విషయపంక్తి దురూర్మి నిరోధమై మహా
ఘోరమునై తరింపఁగఁడు గొట్టగునట్టిదియై యొసంగు సం
సారపయోధి దాఁటుటకుఁ జానకు సాధనమైన వాఁడుఁ దా
వారక సర్వలోకముల వారణ నేలునతండు బ్రోవుతన్. 212

క. లోకంబులకును మిగిలియు, లోకంబులు తానెయయ్యు లోకింపంగా
లోకేశులతో సన్నుతి, నాకల్పముఁ గాఁగొను మహాత్ము నుతింతున్. 213

క. సకలశుభంబుల కాస్పద, మకలంకము నాశమనఘ మతులమహేయం
బకుటిల మవేద్యమై తత్, ప్రకభాసిలు వస్తువైన వాని నుతింతున్. 214

ఆ. వేయితలలఁ గలిగి వెలయుచుండెడువాఁడు, నసురవితతి నెల్ల నణఁచువాఁడు
మఱియుఁ దలఁప నాదిమధ్యాంతశూన్యుఁడై, యొసఁగువాఁడు విజయుఁ డేలుగాత.

చ. అలరసజుండు విష్ణుఁడన లాత్ముఁడు నాగఁ ద్రిమూర్తులన్ విని
ర్మలతఁ దనర్చువాఁడుఁ బరమాత్మ జగజ్జన రక్షకుండుని
శ్చలుఁ డఖిలాత్మకుండు దర చక్ర గదాంబుజ ధారి శ్రీవిభుం
డలఘుఁ డనంతుఁ డాశ్రిత జనావనుఁ డేలుత నన్ను జస్రమున్. 216

తే. మణిమయానేక దివ్యభూ । షణవిభూషి, తుండు సుమకోమలావయ । వుండహార్ద్ర
ఖప్ఫుటాంభోజనేత్రుఁడ । కల్మషుఁడు జ, గద్భరణుఁడప్రమేయుఁడుఁ । గాఁచునన్ను.

క. లోకములు నీట మున్గియు, నేకార్ణవమైనవేళ । నెక్కటి వటప
త్త్రైకశయానుండౌ సు, శ్రీకుఁజకుర్భజునే ను । సేవింతుమదిన్. 218

తే. కడఁకఁగాళీయఫణిఫణా । గ్రమున నిల్చి, నర్తనమొనర్చునట్టియు । నంతశయను
ఘనఘనాఘనదీప్తి । ప్రకాశకాయు, నఖిలభూతాశ్రయున్ హరి । నాత్మఁదలఁతు.

వ. మఱియు సాదరదృష్టి నన్నవలోకించి రక్షింప మత్పురోభాగంబున సమకట్టిన వాఁడును షడ్భావవికారశూన్యుండును శరణాగతరక్షాతత్పరుండును దేవదేవుండు నన్నేలినవాడునగు నారాయణునకే నమస్కరించెద. 220

క. అనిబహుభంగుల సన్నుతు, లనుమోదము తోడ సేయు । నాకౌత్సునకి
ట్లనుభక్తవత్సలుండా, వనజాక్షుం డమృతమధుర । వాక్కులతోడన్. 221

ఉ. ఓనలి నాసనాన్వయప । యోనిధిపూర్ణశశాంకచాలు మే
లౌనిక సంతసించితి ప్రి । యంబగుభక్తి మదీయసన్నుతిన్
బూని యొనర్చితీప్సితముఁ । బొందెదు గాక తపస్సు మంచిత
స్నాన మహాద్భుపుణ్యము వ । శంబె మదిం గణుతింప నేరికిన్. 222

క. వరమగు మాఘమునందు, త్యురుభక్తిని మజ్జనముఁ బ । యోజారకమం
దిరవుఁగఁ జేయుచుఁ దపము. బ్బురముఁగఁగా వించితీవు । పోలదె యిదియున్. 223

మ. అనువారంగను మాఘమజ్జనసు పు । ణ్యాంచత్ప్రభా వుండెగా
కనఘా త్మానముఁ బూర్ణదక్షిణలయ । జ్ఞాలిన్ వ్రతానూనదా
ననికాయంబులఁ బేర్మిమెగనిన ధ । న్యాత్ముండు తానైన వ
య్యానసంతోషిని సేయలేడిది ప్రియం । బై యుండు నాకెంతయున్. 224

క. కావున నీవొనరించిన, యీవరతప మునకు మెచ్చి । యిష్టార్థము లే
నీవచ్చితి మద్రూపము, భూవిబుధోత్తంస చూపి । ముదమున నివుడున్. 225

—(*) మృగశృంగునకు నారాయణుండు వరంబులిచ్చుట. (*)—

క. అనిపలికి మఱియునిట్లను, వనజాక్షుఁడు నీవుమోక్ష । వాంఛనిజాత్మన్
గనినన్ను నిట్లుఁ ధ్యానిం, చినవాఁడవుఁ గాననదియు । సిద్ధింబొందున్. 226

వ. అయిన నేనొక్కవిధంబు నానతిచ్చెద నీవద్దాని నడుపవలయునది యేమంటివేని.

ఉ. మానులు బ్రహ్మచర్యమున । మానుఁగ దేవత లధ్వరంబునన్
మానక సమ్మతింగనెదు । మాడ్కిఁబితృల్ సుగుణాఢ్యసంతతిన్
గాని నిజంబుగాఁ మదినిఁ । గాంచరు సమ్మతి నీవుఁ బెండ్లిఁగై
కో నుచితంబు మత్ప్రియము । గోరుము కోరుము శీఘ్రమీఁగతిన్. 228

వ. వదలక సేయనిప్పగిది । వచ్చుభవంబున బ్రాహ్మణుండవై
మొదలని దాఘనామకుని । భూవిబుధున్ నిగ మాంతవేద్యమె

ప్పాదవ నొనర్చికీర్తిఁ గని యుర్విబుధుండను సంజ్ఞనంతమ
త్పదమునుఁ బొందఁగాఁగలవ వశ్యముసంశయ మింక నేటికిన్. 22

క. అని యానతియ్య సమ్మద, మునఁ గైకొని దేవదేవు ముదితాత్ముహరిన్
గని మ్రొక్కి పలికెఁ గ్రమ్మఱ, మునిసూనుఁడు భక్తివినయములుఁ బెనఁగొనఁగన్

ఆ. భక్తవరద సత్కృపామతినాకు సా, క్షాత్కరించినట్లు సమ్మదమున
నిందునిలిచిభక్త సందోహమేలినా, యశమునిలుపఁగోరు దవనియందు. 231

వ. అని వేడిన నారాయణుండు. 232

ఉ. ఓమృగ శృంగ తావకని యుక్తుడనై యిట నుండిభక్తిన
న్నే మఱి కింతయేనినుతి యింపుచునీకమ లాకరంబునన్
నేమమునన్ నిమజ్జనము నిత్యమొనర్చుచు నున్నవారికేఁ
బ్రేమన భీష్టసిద్ధినొన రించిముదంబునఁ బ్రోచుచుండెదన్. 233

చ. అనవుడు సంతసించి విన యంబునఁ గ్రమ్మఱఁ బన్కె నిట్టుల
వ్వనజదళాక్షుతోడ బుధ వత్సలకుత్స సుతుండఁ గాత్సుఁడన్
గనమృగ శృంగనాముకుఁడఁ గాఁగతమెద్ది యనుగ్రహించినా
కు నెఱుఁగఁ జెప్పుమన్నను వి కుంఠపురావస థుండు క్రమ్మఱన్. 234

చ. పలికె హిరణ్యగర్భకుల పావననీవతి నిష్ఠమైతపం
బలరఁగ సల్పువేళనిక టాంబురుహాకర తోయమానద
వ్వులఁ బఱతెంచుచున్న మృగ పుంజమునిశ్చలు మ్రోడుఁగాఁగనున్
దలఁపున నెన్నిచేరిసత తంబునుఁ గొమ్ముల ఱాయుచుండెడున్. 235

వ. అట్లాత్మ శృంగమూలగత కండూతి వాయఁ జేయుచుండుటయు. 236

చ. అదిఁగని మౌనిసంహతి మ హాద్భుతమంది యితం డిటెంక నె
మ్మదిమృగ శృంగనామకస మంచితకీర్తి నెసంగుఁ బొమ్మటం
చొదవిన ప్రీతినాడిరది యొప్పెసమాఖ్యఁగ నీకునీయశో
విదిత మహాభిదానమె భు విందగియుండఁగ నేనుఁ బల్కితిన్. 237

ఆ. అని యెఱుఁగఁ బల్కి యా యిందిరేశ్వరుఁ,
డదియ మొదలుఁగా మ హాముదమున
గిరివసించిభక్త వరులకివ్వేళకు,
గోర్కు లొసఁగుచుండుఁ గొదువలేక. 238

వ. అని వశిష్ఠుండు దిలీపునకుం బలికి మఱియు నిట్లనియె. 239

ఉ. అవ్విధి నారమేశ్వరుని యానతిఁ గైకొని యందుఁ బాసితా
నెవ్వడిఁ బూర్వభంగినివి నిర్మలముంజి మృగాజి నాదులన్
నివ్వెఱఁ గారఁ దాల్చిజన నీజనకావ సథమ్ముసేరగా
నవ్వటుఁ డేగుదెంచిముద మారఁ దదంఘ్రుల వ్రాలినిల్చినన్. 240

ఆ. వారుసంతసించి వలనొప్పదీవించి, తనదువార్తలెల్లఁ దద్దయునుగ
నఖిలమెఱుఁగఁజెప్పి యానతిఁగైకొని, గురువరాంతికమున కరిగియుండు. 241
వ. అతిభక్తి శుశ్రూషసేయుచు నఖిలవేదమ్ములఁ బఠించి. 242
క. గురునను మతి నుత్సర్గముఁ, బరువడిస్నాతకము శాస్త్ర పద్ధతితోడన్
బరమానురక్తిసలిపియు, వరమగుగార్హస్థ్యమునకు వలసియతండున్. 243
చ. కడఁపడి తండ్రిఁజేరిపద పద్మములం బ్రణమిల్లి నీతికో
విదుఁడగు నందనుండను వివేకసమంచిత వాక్యపద్ధతిన్
వదలక తల్లిఁదండ్రులను భక్తిమెయింగురు నిమ్మదంబునన్
బొదలఁగ సేయునాతఁడు ప్రబుద్ధుఁడువానికగున్ శుభంబులున్. 214
ఉ వారలు సంతసించిన శుభంబులుసర్వతపఃఫలంబుల
వ్వారికిఁ బొందువారలశివంకరులంబరితృప్తిపూజలన్
వారక సేయుటేతపము వారియనుజ్ఞనుఁ గాకపొందుటె
ట్లారయ నీప్సితమ్ములన యమ్ముచతుర్విధ పూరుషార్థముల్. 245
తే. కాననెట్లుఁ బ్రవర్తింపఁ గలుగుముదము, జనకజనయిత్రిగురులకు ననుదినమ్ము
నట్లు వర్తించుటదిముఖ్యమైనధర్మ, మయ్యె వటునకునట్లుండియతఁడుమఱియు.
వ. ఋగ్యజుస్సామంబులను మూఁడామ్నాయంబుల నొండె రెండొండేనిఁ గ్రమం
బునం గురుచెంగటఁ బఠించి యనల గృహస్థధర్మం బవలంబింపవలయు. 247
చ. అవని గృహస్థుతానగుట కన్నవిశేషమి కెద్దియుత్తమం
బవిరత దివ్యభోగముల నాత్మఁదలంపడు జాయయెంతయున్
సువినయ యయ్యెనేని సర సుండునిజాంగన చండియైనరా
రవమన నెద్దిదానికినిఁ గ్రమ్మఱనాత్మఁ దలంచిచూచినన్. 248
క. తెలియక కొందఱుసతులం, జలగలకుం బోల్తురవియు సరగునరక్తం
బిలనొండుఁ గొనెదునికలల, నలుఁగొందురు తనుమనోధనంబులనెల్లన్. 249
వ. అట్లగుటంజేసి. 250

—(*) మృగశృంగుడు పరిణయోచితానుచిత కన్యల నిరూపించుట. (*)—

క. పరిణయముఁ గోరువారి, ద్ధరసాధ్వి ప్రజావతియును దక్షయుఁ బ్రియవా
క్యరుచిర సుగుణాంచితశ్రీ, తరుణీసమ రూపఁగొనఁగఁ దగు వెదకియుదా. 251
క. జనకస గోత్రజయైయొ, ప్పినదానిన్ జననికిన్ సపిండకయైయు
ర్వినిఁబఱగు దానినింగొనఁ, జనదనిపలుకుదురుధర్మ శాస్త్రవిధిజ్ఞుల్. 252
క. అన్నలుఁ దమ్ములుఁగలదై, వన్నెకునెక్కినది చిఱుత వయసుదితనకున్
దిన్నని పలుకులుఁగలయది, కన్నియతగుఁ దావివాహ కార్యంబునకున్. 253
సీ. తలఁపనేవంశజా తలకపస్మారక్షు, యాదులురోగంబు లమరియుండు
నావంశజాతక న్యకలనెక్కుడుకూతు, లనుఁగాంచువంశంబు ననుజనించి

నట్టివారిని బ్రహ్మ ǂ హత్యాదిపాతకో, పేతులయింటినా ǂ రీతిలకము
లన వెండివృక్షస ǂ ర్పనగనక్షత్రాక్షిన, దనదీపుష్పాది ǂ నామములను
వెలయు వారినివృద్ధికిఁ ǂ దొలఁగియున్న; వంశమునఁబుట్టి యున్నట్టి ǂ వారినవయ
వాదిభేద వికారలై ǂ యమరునట్టిఁ, వారిఁగన్యలవర్జింప ǂ వలయుమఱియు. 254

క. అతిరోమయు తలరోమ, ప్రతతియు లేకుండినిష్ఠు ǂ రంబగు దేహ
స్థితిఁగల వారిఁగృశాంగల, సతులున్నత విగ్రహాలనుఁ ǂ జనువిడువంగన్. 255

వ. వెండియు బిరుసగు తలవెంట్రుకలుఁ గలవారిని శిరము విపులముఁగ నుండువారిని
హీనకులజలనుఁ బరిణయానుచిత కన్యలని యెఱింగి విడువవలయు. 256

క. ఈయువ లక్షణములయం, దేయదియైనను పొలంతి ǂ కేర్పడెఁబోన
ట్లాయింతిఁ బెండ్లియైనను, పాయకయున పత్యతయునుఁ ǂ బ్రాపించు వెసన్. 257

ఆ. సాధులక్షణములఁ ǂ జానగుపొలఁతులఁ, బెండ్లియైనవారు ǂ బృధివినాయు
రధికులై యభీప్సి ǂ తార్థముల్ వడయుదు, రనిరి మనువుఁగుంభ ǂ జాదిమునులు. 258

క. కావున శ్రీహరియనుమతి, చేవిబుధులు మెచ్చఁబెండ్లిఁ ǂ జేకొనునాకే
సీవివ రించినకన్యల, లోవరమగు దానినావి ǂ లోకింపంగన్. 259

వ. అనినఁ బ్రియనందను వాక్యంబులకలరి తండ్రి యిట్లనియె. 260

చ. అవగుణులై యశీలురన ǂ యానుహితాత్మకులైనవారలున్
దవిలి శుభంబులందరు బు ǂ ధస్తుత సచ్చరితుల్ ముదంబుఁదా
మవిరత మాత్మలంగని ని ǂ జాభిమతార్థము లెట్లుఁగాంచరీ
యవనిఁ గృతార్థులయ్యుఁదన ǂ యావినుమిప్పని కింతచింతయే. 261

ఉ. నీవు మహానుభావుఁడవ ǂ నింద్యచరిత్రుఁడ వార్యగోవితా
నావన తత్పరుండవన ǂ యంబునుమాఘుని మజ్జనంబున
ద్భావము తోడసల్పెదుని ǂ తాంతనియామక ముంగలాడవ
జ్ఞావన ధావరాంచిత కృ ǂ పారసపాత్రుఁడ వింతయొప్పదే. 262

వ. అనిన జనకు పాదములకు నమస్కరించి శ్రితరక్షాపరుండగు నారాయణు నాత్మఁ
జింతింపుచు నింటఁ గృతనిత్య కృత్యుండుగా నుండెనని చెప్పి వశిష్ఠుండు మగుడ
రాజున కిట్లనియె. 263

—(*) సువృత్తాదులగు విప్రకన్యల వృత్తాంతము. (*)—

సీ. అవనీశవినవయ్య ǂ యాభోజపురమున, నుండు బ్రాహ్మణుఁడుచ ǂ ధ్యుండునాఁగ
నతనికజ్ఞాతీమె ǂ క్కతెసువృత్తాభిఖ్యఁ, జెలువారుతనయని ǂ ర్మలగుణాఢ్య
యకన్యకారత్న ǂ మహారహమ్మునుఁబ్రభా, తమున నెవ్వడిలేచి ǂ తనదుకూర్పు
చెలులతో నేగి ప ǂ శ్చిమవాహినియనంగఁ, బరిఢవిల్లుచుఁదన ǂ వారిగ్రుంకు
వారిననఘులఁజేయుకా ǂ వేరిమునిఁగి, వివిధభంగులఁదన్నది ǂ వినుతిసేయు [చు.
రమణుఁడనఘుఁడుఁ బ్రియసుతుకలమలచిత్తు, లైరహింపఁగఁగూర్చుకా ǂ వేరియను

చ. అదిజన కుండెఱింగితన యాసుగుణంబున కాత్మ నెంతయున్
ముదము వహించియాయలరుఁ బోణికిఁగూర్చు మగండుఁగాగనే
విదితగుణుం దలంతును వి వేకమునన్ సరిఁబోల్చియుండ సం
మదమగుఁ గానికానియెడ మానికమిత్తడిఁ గూర్చినట్లగున్. 265

తే. అనివితర్కించుచుండు న య్యవసరమున,
ననఘు మృగశృంగుఁడోడ్కాని యతనియింటి
కరుగుదెంచె తదీయవృ త్తాంతమెల్ల
నాత్మ నెఱిఁగియుఁ దండ్రిక న్యార్థియగుచు, 266

వ. అంతనుచథ్యుండు వారి నుచితప్రకారంబుల సత్కరించి యఖిల జనవిదితుండగు కుత్సుఁ దాత్మజు నెఱింగినవాఁడు గావున సంతసించి కుత్సువలన నిజాత్మజ నడుగంబడి సమ్మతించెఁ గుమారుండును సర్వలక్షణోపేత నత్తనూజాతం బరిణయంబుఁగాఁ గోరె నట్లుఁ గన్యాగురుండు వారొసంగిన మంగళద్రవ్యములం గొనిస బంధుఁడగు కుత్సునిష్టమృష్టాన్న సంతుష్టుఁ గావించి తాంబూల గంధమాల్యాదుల నభ్యర్చించె నతండును బంధుకుమారయుతుండై నిజమందిరంబు సేరె నంత.

మ. ఒకనాడా లలనాశిరోమణివయ స్యోపేతయై కల్యమం
దకలంకాత్మత మాఘమజ్జనముసే యంగోరి కావేరిఁబో
నొకవన్యేభము మార్గమధ్యమునమా దోద్రేకమై ఘీంకృతుల్
ప్రకటస్ఫూర్తి నొనర్చుచుంగదియ సం త్రాసాత్మయై వారితోన్. 268

క. పఱచిన విడువక వెనుకొని యఱిముఱికరిఁ బఱవసంభ్ర మాకులలైవా
రుఱుకుచుఁ గాననమునఁనొక, గఱికంగఱి గొన్నసూతఁ గానకపడియున్. 269

క. అదిజల విరహితమగుటనుఁ, బ్రిదిలినిజాంగకములొకఁట విడిచిరసువులన్
ముదితలిల నేరికిం ద, ప్పదుగద విధికృతము ననుభవము సేయకయున్. 270

క. అవ్విధివారలు పంచత, నవ్వనకూపముననంద నటనిండ్లందా
రవ్వలఁ దాశలుపుత్రిక, లివ్వేళకు రారుహాహాతు వేమోయనుచున్. 271

క. మదులుదుటు వాయబెగడిలి, కదలిని జాలయములప్డు కావేరికినే
గుదమని యటచనికానక, వెదకుచునద్దెసలఁబోయి విపినమునందున్. 272

తే. వదలి పడియున్నభూషణాం బరలతాంత,
వితతిఁ గనిశోకభయసమా వృతతఁదరువు
తరువు శిలశిలపథపథ మరయుచొగిని,
బోయిపోయియు మఱిఁకొంతఁ బోయియందు. 273

చ. వలగొని వాతిపైనిశత పర్వకమాపఱ కడ్డుఁగాగబి
ట్టలమి మహాగ్రకంటకచ యంబనివార్యత లోఁదనర్చిదో
యిలిజల మేనిలేమినడు గింకఁగనుండిన పాడునూయివా
రలుఁగని దానిమున్నుకుధ రద్రునికుంజము లట్లుజూచియున్. 274

క. వికలములై సకలాంగము, లొకటనరుధిరమ్ముఁ గ్రమ్మ నొగిమూఁగినమ
క్షికములచే నమరిన క, న్యకలనచేత నలఁగాంచి రాత్మలుగలఁగన్. 275
క. అటుఁగాంచి కన్నవారలు, కటకటపడి శోకవహ్నిఁ గ్రాగుచు మఱియు
త్కటముఁగ విలపిరిచుచునూ, అటఁగానక పల్కిరిట్లు అంపిలి భ్రాంతిన్. 276
చ. అకటకటా సువృత్తసుర సాకమలా విమలానుశీలలై
యకుటిల వృత్తిశైవలిని యందునుమాఘ నిమజ్జనమ్మువా
రకము చు సల్పియుండ్లకుఁ ది రంబుఁగవత్తురు నేడునట్లుఁ జే
యకవిపి నోర్విలోనతిభ యాంధువుసొచ్చి పరుండఁబాడియే. 277
మ. ధనధాన్యాది సమృద్ధిఁగై కొనినస్వ స్థానంబు లందేమువం
డినపక్వాన్నములం భుజించి కుసుమా నీకమ్ముభూషామణీ
ఘనచీనాంబర వర్గమాత్మలకు వే డ్కల్ బుట్టఁ గైసేసి ప్రీ
తినిఁ గ్రీడింపక సింధ్లనిట్లుచితమే దీనంగనున్ గూర్కఁగన్. 278
క. కావేరీ సుస్నాతల, కేవలనం బాపములును విమమలురోగ
వ్యావర్త నములు లేవం, డ్రా విధిమీ యంచసత్య మైపోయెఁగదా. 279
క. మానైన మాఘమజ్జన, మూనికఁగావించిపెంపు నొందిన తెలివిన్
బోనిడితిరొ దేహమ్ముల, మానక దేవత్వమునకు మదివాంఛింపన్. 280
ఉ. అయ్యయొ యేమియేమిటుమ హార్తినెలుంగుడి పల్కరింపఁగా
నెయ్యము మీరఁబల్కరువ నీగతకూపము నంబరుండిమీ
యయ్యలు మిమ్ముఁజీరెదరె యమ్మకయోయన శేలమాకుఁగా
నీయ్యెడఁ గోపగింపగత మేమియెఱుంగఁగ నైనజెప్పరే. 281
క. అనిపెక్కు భంగులందము, తనయలకై మిగులశోక తప్తస్వాంతల్
జనులు విలపింపఁగనం, దునుచధ్యుం డనియెతనదు దుహితకుఁగాఁగన్. 282
క. తనయా నినుమృగశృంగున, కునువిహితవి ధానమునను గూరిమిఁ బెండ్లే
నొనరింప నుంటినమ్మని, జనకునితో వచ్చిమరలఁ, జనువునవుగన్. 283
ఉ. ఏమని తెల్పువాఁడవిధి యీగతినిన్నతి ఘోరకాననో
ర్వీమహితోగ్రకూపమునఁ ద్రెళ్లఁగఁజేసెన యోకొ అంతలా
నోములునోచినట్టికు జ నున్ ననుఁబొందునెకీర్తిభవ్యముల్
నామదినెట్లునిన్ మఱతు నాపెనుప్రాణమనా ప్రియాత్మజా. 284
తే. అనుచువాపోవునవసరమున మహాత్ముఁ, డైనమృగశృంగుఁడచ్చోటి కరుగుదెంచి
యఁతయునెఱింగియొక్కింత యాత్మవగచి, శిరముపంకించిదిటమూని వెరవెఱింగి.

—(*) మృగశృంగుఁడు యముంగూర్చి తపంబు సేయఁబూనుట. (*)—

వ. వారినూరడించికొన్ని వాసరంబులనిక్కన్యలుఁ బ్రాణయుక్తలై యికూపంబున
నుండి బహిర్గమనంబు సేయునట్లుఁ గావింతు నంతకు నికాయంబులఁ బరా
మర్శింపుచుండుడని నియోగించి యాక్షణంబ కావేరికిం జనియెందు. 286

క. కుత్తుకబంటిజలంబుల, నత్తఱినతఁడూర్ధ్వబాహుఁ ऽ డైనిల్చిరవిన్
హత్తించిదృగ్వితానము, మిత్తినెదన్ నిల్పితపము ऽ మేకొనిచేసెన్. 287

వ. ఇట్లతినిష్ఠఁదపంబు సేయుచుండునప్పుడు. 288

క. మన్యూద్రేకంబునమునుఁ, గన్యామణులందొలంగఁ ऽ గాఁదీసిమహా
రణ్యాంధువునంగూల్చిన, వన్యేభమువచ్చెనటక ऽ వారితగతితోన్. 289

క. చనుదెంచితనదురాద్రం, బునకునొకింతేనియులుకుఁ ऽ బొందకనిష్ఠం
గనియున్నతనివెఱఁగా, రనుఁగనిక్రుధమానికరివ ऽ రంబతిశాంతిన్. 290

క. వదలకతుండాగ్రమ్మునఁ, బదిలముఁగానెత్తియతని ऽ భక్తిందలపై
గదియింపనపుడుతద్విధి, నెదనెఱిఁగితపంబుమాని ऽ యింపుఁదలిర్పన్. 291

క. ఏనుంగుపైవసించిన, మానవులకు శుభమటంచు ऽ మహితాత్ములనం
గాననిశమువినుదునుగద, దీనను మేలగునటంచుఁ ऽ దీరవసించెన్. 292

వ. అట్లధివసించి. 293

ఆ. దానిఁగావమదినిఁ ऽ దలపోసియొనిమిది, నాళ్లమాఘమజ్జ ऽ నంపుఫలము
నీకునిచ్చితనుచు ऽ నీరములను స్వహా, స్తమునఁగరటిమస్త ऽ కమునఁబోసె. 294

క. అంతటనదితత్ఫలమ, త్యంతామోదమునఁ బొంది ऽ యతిఘీంకృతుల
భ్యంతరమునిండఁజేయుడు, సంతసముననమఱియునతఁడు ऽ స్తంబెరమమున్. 295

క. దక్షిణహస్తస్పర్శన, మాక్షణమున సేయనదివి ऽ యచ్చరులెల్లన్
వీక్షింపనతనిఁడింపుచు, నక్షత్రాధ్వమునన్నిల్చె ऽ నమరాకృతితోన్. 296

వ. అట్లు భాస్వంతంబగు మండలంబున వెలుంగు వెలుంగుఱేని ననుకరించుచు నిల్చి తనవిధంబున కాశ్చర్యమంది చూచెడు మృగశృంగునకు నమస్కరించి యాదివ్యుం డిట్లనియె. 297

ఉ. ఓమునిరాజమౌళిసుగు ऽ ణోత్తమనీదగు సత్కృపానిలం
బేమనమత్కృతోగ్రసుకృ ऽ తేతరతూలములందెరల్చిసు
క్షేమమునిచ్చెనిట్లుసవి ऽ శేషతనీకరినౌటమున్న నే
నీమహిలోనెవండగుట ऽ నింతయొఱుంగుము తెల్పుదిప్పుడున్. 298

—(*) మృగశృంగునకుదివ్యుండుతన పూర్వజన్మస్థితిం జెప్పుట. (*)—

సీ. తాపసోత్తమవిష ऽ ధాపురిఁదొల్లిఁగాపురముండు విశ్వగు ऽ ప్తుండునాగ
నూరప్యుఁడతనికు ऽ మారుండధర్మగుప్తాభిఖ్యవెలసిన ऽ వాఁడనేను
మత్కులోచితసుధ ऽ ర్మమునవామ్నాయముల్ జదివియజ్ఞమ్ములు ऽ సలిపిమఱియు
దానమ్ములొసఁగియు ऽ ధనముఁజేకూర్పంగనాలఁ బెంచియునుసే ऽ ద్యమ్మునమర
సేయుచుంబేరమాడుచుఁ ऽ జెన్నుమెరసి, కాముకుఁడఁగాక సత్యమ్ముఁ ऽ గడువకొరులఁ
గాంచివిసుకందకయుఁద్రివర్గములఁదగిన, యట్లుఁగడపుచువర్తింతు ऽ ననుదినంబు.

వ. మఱియుఁ బితృదేవతా భక్తియుగో బ్రాహ్మణహితంబును నేకపత్నీవ్రతంబును బుధజనా రాధనంబునుంగలిగి క్రయవిక్రయంబుల సత్యంబు విడువక పదార్థంబుల

యందు శ్రేష్ఠంబులగువాని నకానియ శ్రేష్ఠంబులం గొనకయు నుండుదు నేను
వెండియు. 300

క. రసవస్తువులనుం బరిమళ, మసదృశముం గలుగువస్తు లహరహమును మె
ప్పొసగించు ధాతువస్తువు, లసదనిపింపకయు విక్రయంబొనరింతున్. 301

క. నానావిధాంబరములున, నూనముం గాంగొలుచు వ్రేళ్లు నుందుం పలునే
జానగుకూరలు గాయలు, లోనుంగ మఱికట్టెలుంబలు పిడుకలు మొగిన్. 302

క. పాలుం బెరుగును మజ్జిగ, జాలంగా విక్రయింతు షడ్రసవస్తుల్
వాలాయ మస్మదాలయ, మోలింబరిపూర్తినునిచి యున్ గొను ప్రజకున్. 303

క. ఇన్నియు నేటికి నేనటం, బన్నుగ విక్రయము సేయ వడినుంపనివే
మున్నవి యస్నియు విల్చుచుం, గొన్నాళ్లకుం గూర్చితేను కోటిధనంబున్. 304

వ. అట్లు నిష్కాపట్యమున ధనోపార్జనంబు సేయునంత నొక్క కుమారుండయ్యె నప్పుడే
ను మద్ధనంబు రెండు భాగంబులుంగా విభజించి యందొకండు తనూజునకు నిచ్చి మిగిలిన
దాని నేజేకొని. 305

క. ఉగువుంగ బావులు గుంటలు, వరుసం దోపులును మంటపంబులు గుడిగో
పురములు జావడి చలిపం, దిరులనుం జెఱువులనుం గట్టి తేరక మఱియున్. 306

వ. గోభూహిరణ్యవస్త్రాన్నగ జాశ్వతిలతండుల గోధూమ ముద్గ మాష వ్రీహిల వణాజ్య
కన్యాది షోడశ మహాదానంబు లొసంగితిసీధరాతలంబున నేనిడని దానంబులుండ
వట్లొనరించియుం బూర్వకృత మనుభవింపక త్రిమూర్తులకైనం బోదు ధనాగ
మమ్ము నారికేళ సలిలవిధమ్మునం దన్నాశంబిభ భుక్తంబైన కపిత్థఫల సారవిధం
బును నగుంగదా నేనట్లుండునంత. 307

క. వెసనా యింటికి నొకనా, డసురుసురని యాకటన్ మహార్తిన్ బడు చ
య్యసమాంబకు నాకృతితో, రససిద్ధుం డొకండు తీవరంబున వచ్చెన్. 309

క. వచ్చిన వానికి నేంగడు, మచ్చిక నాతిథ్యమిచ్చి ముదినలరింపన్
బుచ్చికొను మనుచుం గూరిమి, యచ్చుంగనిడెం గొంతపుటము లందినపసిడిన్.

వ. అప్పుడేను విస్మితుండనై. 310

క. ఇది యెట్లుం గలిగె జాంబూ, నదమఖిలుర కరయజీవనంబై యిది లే
నిది లేమి యునికి కలిమై, యొదవించుం గష్టసుఖము లుర్వి నరులకున్. 311

తే. ఇట్టిచామీకరమ్ము మాకిష్టలక్ష్మి, భావమున నియ్యంగాంజేసి బహువిచిత్ర
మయ్యె మన్మతికి నినాగకనతండు మంద, హాససంశోభితాస్యుండై యని యొమఱెయు.

ఉ. ఎక్కినవానికిం గుఱుచ యేనుంగు పెద్దగు తక్కువారికిన్
మిక్కిలి నెందుంగాని యెల మిన్ మనుం బూజలం దృప్తుంజేసితీ
విక్కడ నిట్లుంగాగనిది యేకడుం బెద్దగుంగాక మాకుమ
న్నిక్కనకమ్ము నెన్నుదుమె యేమొనరింపగం నౌను నిత్యమున్. 312

తే. అనిన సిద్ధుని వచనము | లాత్మ కధిక,
విస్మయా మోదములుసేయ | వినయ మొసఁగఁ
దత్పదమ్ముల పైవ్రాలి | తగినయట్లుఁ,
గొలిచి యట్లుంటినేను ని | మ్ములనతనికి. 314

క. ననుమీ శిష్యునిఁగాఁగై, కొనితద్విధి నెఱుఁగఁజేసి | కొన్నాళ్లకులో
ననువార మీదుచంగటఁ, గనకముఁ గావించువానిఁ | గాఁజేయఁగదే. 315

వ. అనిన వెండియు నతండు. 316

క. అగుఁగాక శిష్యులగుటే, తగుఁగురువులఁ గొలిచితనువు | ధనమున్ మనమున్
మొగివారి సొమ్ముఁగాఁగని | జగతిన భీష్టాప్తికై వి | చారించుజనుల్. 317

క. అనిపలికి సర్వధనమునుఁ, గనికని నావలనవ్యయముఁ | గావించిపెనన్
జనెనేను నిర్ధనునిఁగాఁ, గనియంతట నేమదాత్మఁ | గళవళపడుచున్. 318

క. విపరీత బుద్ధిఁ బొడముడు, కపటాత్ముని విశ్వసించి | కలధనమెల్లన్
జపలత పీడ్కొంటింగద, యపకీర్తి యసంగదైవ | మాయికనెల్లా. 319

ఆ. అనిదుఃంతచింత | నలమటనొందఁగాఁ, గొన్ని వాసరముల | కన్నవస్త్ర
ములకుఁ గష్టమయ్యె | మునిమియుఁ బదఁపడి, వచ్చెదార్థ్యమఁడిగె | హెచ్చురుజలు.

వ. అట్టి సమయంబునందు. 321

క. పదిదినములు మాఘమ్మున, వదలక హర్మ్ఖమునన్ బ్ర | భాకరునాత్మన్
గదియించి సంస్తుతింపుచు, నదిమజ్జన మాడితిన్ ఘ | నంబగుభక్తిన్. 322

చ. నెలకొనిసేయఁ జాలమిము | నీంద్రముగించితి స్నానమాత్మజుం
డెలమికిఁ బాసిదేశముల | నేగహాయంబులుఁ జచ్చెసేద్యమున్
నిలిచెఁబసు వ్రజంబునువ | నింబ్రతిరోధులు నాచిరాలుఁ గో
డలుఁ దిలకింప రైరికప | టాత్మకుఁడై మనుమండుదూఱెనన్. 323

క. వెలయాలి నెపముఁగైకొని, తొలగించెని జైక రాజ్య దూరగులుఁగమ
మ్ములరాజు నిట్టిబెట్టిద, ములగు విపద్దశలమునిఁగి | మునుఁగుచునుండన్. 324

క. ననుమున్నెఱిఁగినకొందఱు, ఘనపుణ్యుఁ డితండువార్ధ | కంబునజిక్కెన్
గనుఁడంచుఁ బిలిచియన్నం, బునువస్త్రముఁ గొంతధాన్య | మున్దయనిడుచున్.

క. కాపాడఁ దొడఁగిరిట్టుల, నాపుణ్య శతమ్ములన్ని | నాశముఁగానే
నోపి కుటుంబముఁ బ్రోచితి, రూపఱెఁ బున్నెములుమున్నె | రోసిరిచుట్టల్. 326

వ. అంత. 327

తే. దివసదశకముభక్తిన | దీజలముల, మాఘమజ్జనమాడిన | మహితపుణ్య
మొండుఁదక్కఁగఁబుణ్యము | లొగినినేనొ, నర్చియున్నవియన్ని య | నాశమయ్యె.

ఆ. అట్లుధర్మవిక్ర | యమునజీవింపుచు, నుండియొక్కనాడు | నిండుభక్తి
నొకరుఁగుడువఁబెట్ట | నోడకకుత్తుక, బంటిఁదింటిరుచికి | భక్తమేను. 329

క. అదియరుగుఁ బాటుఁగామిని, వదిఁగొనుచున జీర్ణగదము ప్రాప్తంబైయం
దుదయించెను నతిసారం బదిమృతికిం గారణంబు నైయేనపుడున్. 330

క. సుకృతాత్ముల కతిసారం, బొకటం బ్రాపించు మృతికి నుర్వీస్థలినం
డ్రికనేల చింతియనయ్యా, దకయుఁడుఁగఁ గొన్నివాసరమ్ములు సనినన్. 331

క. నాపూర్వపుణ్యవశమున, నాపద్మదళాక్షుఁడొదవె నాత్మకు నేన
ట్లోపితలంచుచుఁ బ్రాణము, లోపరమమునీంద్ర వీడి యుత్తమగతికిన్. 332

వ. పోయి పదిదినంబుల మాఘమజ్జనఫలంబున దేవేంద్రసన్నిధి నొక్క మనుకాలం
బుండి యవల మత్పుణ్యంబున శివుండు పుణ్య విక్రయం బొనరించినవారి భంబు
లై పుట్టంగలవారగుట నట్లు జన్మించి చరింపుచుండి భవదీయానుగ్రహంబున
మరల దివిం బోఁగంటినని పలికి వెండియు నతండు. 333

క. భూరిదయాకర మీపద, వారిజముల కధికభక్తి వలఁగొనుచునమ
స్కారములిదె కావింతును, దారత మన్నింపుపోయె దందివమునకున్. 334

క. అనిమృగశృంగునివీడ్కొని, చనియె దివంబునకు వైశ్య సత్తముఁడనుచున్
జననాథునకు వశిష్ఠుఁడు, వినిపించెనటంచు మౌని విపులావరులన్. 335

—(*) ఆశ్వాసాంతము. (*)—

ఉ. సారసమిత్రవంశకలశాంబుధిపూర్ణశశాంకకీర్తివి
స్తారసురారిసంచయవిదారవిఖండితశర్వచాపపం
కేరుహపత్రనేత్రకృతకృత్యమహాఘవిదూరభక్తమం
దారదయాభిహారజననాథశిఖామణిరామభూవరా. 336

క. కాండధిగర్వనిబర్హణ, కాండాసురనుతగుణప్రకాండారక్షః
కాండాహవకాండోద్య, త్కాండధరాటోపహారితకాండకులన్నృపా. 337

తోదకవృత్తము. శారదనీరదచారుసుకీర్తీ, భూరికృపారసపూరితమూర్తీ
ధీరజనస్తుతదివ్యచరిత్రా, కారణపూరుషకర్బురజైత్రా. 338

తోటకవృత్తము. ధరణీజమనోహరధర్మధృతా, సరసీజభవామరజాలనుతా
శరణాగతరక్షకసత్యరతా, పరిపూర్ణదయాదృతభానుసుతా.

గద్యము.

ఇది శ్రీరామచంద్రకృపాకటాక్షవీక్షణావాప్తకవిత్వవిద్యాప్రాభవ పశు
పర్తి పినశేషమరాజాగ్రతనూభవ సుధీజనవిధేయ సుబ్బరాజాభి
ధేయ ప్రణీతంబైన శ్రీమన్మాఘపురాణంబునందు
ప్రథమాశ్వాసము సంపూర్ణము.





# శ్రీమదాంధ్రమాఘపురాణము.

## ద్వితీయాశ్వాసము.

---

కందపద్యము.



శ్రీకల్యాణగుణాత్మక,
లోకారాధ్యాసుధర్మ। లోలయశోద్య
త్తాకృత్స్న వంశపావన,
ప్రాకటగుణ ధామరామ। రాజలలామా. 1

తే. అవధరింపుముసూతమ। హర్షిచంద్రుఁ, డాదరమ్మునశౌనకా। ద్యఖిలమౌని
శేఖరులఁజూచిపలికెవ। శిష్ఠుఁడట్టు, లద్దిలీపావనీసతి। కనియెనిట్లు. 2

మ. అవనీపాలక చంద్రవైశ్యుఁడటులు, ద్యత్కాంతితో దేవతా
భువసంబందిన తోడ వెండియుఁదపః। పూర్ణప్రభావుండుత
ద్భువనంబుల్ మెడబంటిఁజొచ్చి శమనుం। బుణ్యోదయున్ శాంతిసం
స్తవముంజేయఁ దొడంగెనివ్విధి విని। ష్ఠంబూని యిష్టాప్తికిన్. 3

### —(*) మృగశృంగుడు యముని సంస్తుతించుట. (*)—

క. ధర్మేతరులనుదండన, మర్మిలిఁబూనకయొనర్చు। నట్టిఘనుండున్
ధర్మస్వరూపుఁడనిశము, ధార్మికులం బ్రోచువాఁడు। తగననుఁబ్రోచున్. 4

సీ. ఒగిజీవతతికిమృ। త్యువుఁగూర్చువాఁడునౌ, దుంబరుండనఁగద। ధ్నుఁడనంగ
లలినొప్పువాఁడు న। ల్లనివాఁడువైవస్వ, తుండుఁగాలుండుఁజ। తుర్ముఖస్వ
రూపుండుఁజిత్రవ। ర్ణుఁడువృకోదరుఁ, డుగ్రదంష్ట్రాకరాళవ। క్త్రాధికుండు
క్రూరచక్షుర్భ్రుకు। టీరాజితుండూర్ధ్వ, లోమలంబోష్ఠప్ర। లోమకలితుఁ
డధికుఁడగువాఁడుఁ జిత్రగు। ప్తాఖ్యనెసఁగు,
వాఁడు బహుహస్తములబొల్చు। వాఁడుపాపి
జనులఁ గారించువాఁడజ। స్రమ్మునాదు
హృదయమునసిల్చికోర్కుల। నిచ్చుఁగాత. 5

తే. అతులవివిధాయుధంబులు హస్తసమితి, దాల్చి యరుణప్రసూనగంధాంశుకంబు
లొనరఁ గైసేసి కార్కొని యున్న మేని, పొలుపు దీపింప సైరిభంబున వసించి.

చ. గనగన మండునిప్పుకల కాంతినెసంగెడు గ్రుడ్లుఁద్రిప్పి చె
క్కునఁ బ్రళయాంబుదధ్వనిని కోయనియార్చిల యోదయప్రకం
పనగతిఁ బాపసంహతులపై బడికుయ్యిడఁ జేతిదండముఁ
గొనివెస మోదువాఁడొగినిఁ గూర్చుత నాకఖిలేప్సితంబులన్. 7

క. లోకోదక మెల్లనుర, త్నాకరమా కర్షణమ్ము తగసేయుగతిన్
జోకను భువనములన్నియు, నాకల్పము నందుమ్రింగు నట్టిఘనుండున్. 8

చ. కలయ నిజాస్యవహ్నిగిరి కాననసంచయ మేర్చుగావునన్
జ్వలనుఁడవంగనొప్పెసఁగు వాఁడవసానపు వేళఁబాపచి
త్తుల మొగి మృత్యురోగవిత తుల్ గొలువంగడు ఘోరరూపియై
యలమెడువాఁడు పుణ్యులన యమ్మునఁబ్రోచెడు వాఁడుబ్రోవుతన్. 9

వ. మఱియునుఁ బితృపతియుఁ బుణ్యాత్ములకు సుకేశ సుభ్రూసు చక్షుసు శ్మశ్రుసు వక్త్రిసోష్ఠుండును సుమకోమ లాజానుబాహుండును సుప్రసన్న వదనుండును వివిధరత్న స్థగిత హారకుండల కేయూర మకుట గ్రైవేయకాది భూషణ విభూషితుండును జాంబూనదాభ శరీరుండును సింహ సంహననుండునై పొలుపు దీపింప మణిమయ సింహాసనంబునం గూర్చుండి కరుణారస పూరితంబులైన ధవళాంబకంబులయు నిజాంగధృత శుభ్రాంశుకంబుల యుధాళధళ్యమ్ము దిగ్వితానమ్ము నాచ్ఛాదింప సభ్యుల నవలోకించి ధర్మాధర్మములఁ జర్చించునప్పు డిరుగెలంకుల ధర్మ సత్య శమదమ వర్ణాశ్రమ శీలంబులు నిరుపమాంచ ద్రుచిరాంగంబులఁ దన్నుఁగొలిచి వివరింప సత్పూరుషుల నధిక ప్రియవాక్యంబుల ననునయించువాఁడునై కాన్పించువాఁడును నగు యముండు నాయందు దయసేయుఁ గావుతమని వెండియు. 10

క. నారసము శక్తిముసలము, వారక ఖడ్గమ్ముగదయుఁ బాశముశూలం
బేరుపడ నంకుశముకర వారిజముల నెసిమిదింటఁ బట్టికడంకన్. 11

చ. ఘనఘన ఘంటికాస్వనము గాఢముఁగానలు దిక్కులందు బ,
ర్వనలఘు శృంగముల్ గలిగి వారకభూత్కృతు లిచ్చుచున్ మదం
బునఁబఱ తెంచుసైరిభము మూపునఁగొల్వయి వచ్చువాఁడు స
న్మునిహితుఁ డధ్వరప్రియుఁడు మోదముతోననుఁ గాచుగావుతన్. 12

క. వరుసఁగఁ బదునలువురు స, త్పురుషుల సాక్షులుఁగఁ జేసి పుణ్యాఘములన్
బరిపూర్తి నరసి శిక్షా, పరులం గావించువాఁడు పాపుల నెల్లన్. 13

క. శాంతుండు హితుఁడు నలినీ, కాంతప్రియనందనుఁడుఁ గలుషవిదూరుం
డంతకుఁడు సజ్జనావను, డెంతయునా కొసఁగుఁగాక యిష్టార్థంబుల్. 14

క. సంసారఘోరదుఃఖ, ధ్వంసకుఁడు శుభప్రదుండు ǂ తలఁపఁగ రాజో
త్తంసుండు దక్షిణమునకు, హింసాపర హింసకుండ ǂ హీనబలుండున్. 15

సీ. నియమశీలురకహ ǂ ర్నిశముఁ బ్రీతినొనర్చు, వాఁడు భవ్యుఁడు సా ǂ వర్ణమంద
నాములకును సప ǂ త్నీమాతృకాత్మజుఁ, డగువాఁడు విమలాత్ము ǂ లైనవారి
కోర్కు లొసంగియె ǂ కుక్కుఁ బ్రేమఁగనువాఁడు, పాపులదండించు ǂ పట్టులందు
కాల్పుఁడు కోయుఁడు ǂ ఖండింపుఁ డెండింపు, డోరుగువారఁగనంచు ǂ నుగ్రఫణితి
భటులకనువాఁడు రవిజకు ǂ భ్రాతయైన, వాఁడు సంజ్ఞాత్మజుఁడు నత ǂ వత్సలుండు
నిర్మలుఁడు విశ్వభరణుండు ǂ నిఖిలభర్త, బ్రోచు సర్వాధికుఁడు నన్ను ǂ భూరికరుణ.

క. పరమేష్ఠికి దామోదర, హరులకు హితుఁ డఖిలవినుతుఁ ǂ డఖిలంబునకున్
గురుసాక్షి సుప్రసన్నుఁడు, వరకృపననుఁ బ్రోచుఁగాక ǂ వైవస్వతుఁడున్. 17

క. అని యిట్లు సన్నుతించెను, మునివరుమృగశృంగు నెడల ǂ మోదించి విక
ర్తననందనుండు మణికాం, చనభూషాంబరవితాన ǂ సంశోభితుఁడున్. 18

తే. దివ్యమాల్యానులేప సం ǂ దీప్తుఁ డఖిల ǂ సాధనోత్కర హస్తుండు ǂ చారువిగ్ర
హుండు సదమల మతివివి ǂ ధోగ్రరూప, కలితనిసితాయుధస్వకింǂకరయుతుండు.

క. క్రతుదానధర్మజపస, ద్వ్రతనియమంబులును సత్య ǂ దమశమశాస్త్ర
ప్రతతియు వర్ణాశ్రమములు, హితమతిమూర్తులు ధరించి ǂ యేర్పడఁ గొలువన్.

క. పరమతి సభ్యులు పదునలు, పురుమనువులు మొగిసిఁ గొలువఁ ǂ బొల్చెడువాఁడున్
గురువైభవుండునై భా, స్వరతం బ్రత్యక్షమగుచు ǂ సంశమివర్యున్. 21

ఆ. అక్కజంపుఁ బ్రీతి ǂ నక్కునఁ జేర్చి త్వ, దీయసన్నుతికిమ ǂ దిన్ముదంబుఁ
బొందియుండు వచ్చి ǂ తిందగ సందేహ, ముడిగి యీప్సితముల ǂ నడుగుమనుడు. 22

—(*) మృగశృంగునకు యముండు వరంబు లొసంగుట. (*)—

వ. మృగశృంగుండ మందానందకందళిత హృదయారవిందుండై శమను పదమ్ములకు
నమస్కరించి ముకుళితకరుండై యిట్లనియె. 23

క. వన్యేభ వ్యాజంబునఁ, గన్యకలం జేర్చె నీదు ǂ కడమృత్యువు సా
జన్యం బేర్పడ నార్తశ, రణ్యాసుర లింపువారిఁ ǂ గ్రమ్మఱ మహికిన్. 24

చ. ఇదియగు నమ్మమామకహృ ǂ దీప్సితమెంతయు దీనిసమ్మదం
బొదవ నొనర్పు నావుడు మ ǂ హాత్ముకనాత్మ భటాలిఁ జూచి మీ
రిదె వెస నేగి సల్వురమ ǂ హీసురకన్యలఁ దెండు పొండనాఁ
గదలి వనాంతరస్థలన ǂ కల్మషలన్ గొని వారు తెచ్చిరన్. 25

ఉ. వారిన దృశ్యరూపలవి ǂ వస్వదపత్య మనుగ్రహించి సొం
పారఁగఁ గూర్చె దత్తనువు ǂ లాదటనిద్రల నుండి లేచిన
ట్లారమణీలలామ లుర ǂ యమ్మున లేచి గతం బెఱింగిత
ద్భూరితరాంధువున్ వెడలి ǂ పొల్పుఁగనిల్చిరి తీరభూస్థలిన్. 26

వ. అట్లు వారిఁ బ్రదికించి యముండు మరల మృగశృంగున కిట్లనియె. 27

క. మునివర నీవాఁకరించిన, యనుపమసన్నుతికి నాత్మ । నలరితినిత్తుఁ
బనివడి కోరుమొకొండుఁ, ఘనమగువర మనసతనికిఁ । గాత్స్యుండనియెఁ. 28

తే. అనఘుయేనిమఁ జేసిన । యట్టిసంస్త, వమ్ముఁ బఠియించువారును । భక్తివిన్న
వారుఁ నపమృతిదుఃఖవి । దూరులగుచుఁ, బ్రదుకఁగోరుదు పెక్కేండ్లు । ముదముతోడ.

చ. అనఁటుల స్వరంబడి ప్రి । యంబున వెండి కృతాంతుడిట్లువ
ల్కెనువిన వయ్యయింత పరి । కింపఁగదీనికిఁ బోలదెందుదు
ర్జనుఁడవి నీతినాస్తికుఁడు । సంశయుఁడంచిత పుణ్యవర్తనుం
డనఘుఁడు శీలిపీరలకు । నాస్థఁదనర్చుఁ బఠించి రేనియుఁ. 30

తే. మాఘపక్షజ వారయుక్తమై । మొనరునట్టి, కృష్ణపక్షచతుర్దశి । నెలమిఁదర్ప
ణమ్ముతిలలనుఁ జేసి క్ర । మమ్ముతోడఁ, దాఁబఠించిననఖిలేప్సి । తాప్తియగును. 31

ఆ. అనియెఋంగఁబలికి । చనెనా కృతాంతుఁడు, సపరివారుఁడగుచు । సకలబంధు
జనులతోడ జనక । జనయిత్రులా కన్య, కలనుఁ జూచి మోద । ములనుఁ గనిరి. 32

తే. అరిగె మృగశృంగుఁడంతని । జాలయమున. కట్లు స్వావసథమ్ముల । కరిగి రాత్మ
జాతలం గూడి బంధుస । మేతులగుచు, తగనుచ ధ్యాదులటమీద । తల్లులెల్ల. 33

వ. కుమారికల నడుగ శమనలోకస్థితి నంతయుఁ జెప్పిరనుడు వశిష్ఠునకు దిలీపుం
డిట్లనియె. 34

క. వినవలతు సమ్మదంబున, వినిపింపుము పాపపుణ్య । విశదంబగుదీ
ననునాగ నవ్వశిష్ఠుం, డినకులజు దిలీపుఁ జూచి । యిట్లనిపలికెఁ. 35

క. జనవల్లభ తల్లులకును, దనయలువా క్రుచ్చినట్లు । తగనీకును నే
వినిపింతు వినుము భక్తిం, గనిపుణ్యా వహాముకన్య । కామణులట్లుఁ. 36

—(*) విప్రకన్యలు తల్లులకు యమలోకస్థితు లెఱింగించుట. (*)—

వ. జనయిత్రుల కిట్లనిరి. 37

చ. కడువడి నేగికాంచితిమి । కంజహితాత్మజు పత్తనమ్మున
క్కడవిధు లిట్టివట్టివని । గైకొని చెప్పఁగ నేరికైన నె
క్కుడులగు తోచినంతయును । కోరికనుండెఱిఁ గించువార మే
ర్పడజగ తీస్థలింగలుగు । ప్రాణిచయమ్మటు సేరునంతయుఁ. 38

తే. అటులనవసానమునఁ జేరి । నట్టిపాపు, లకును నానావిధమ్ముల । లంపటలునుఁ
గలిగియుండును చూడంగఁ । గష్టమవియు, నందుఁ బుణ్యాఘముల నెన్నఁ । నగును గాని.

క. ఉత్తమవర్ణజుఁడనియునుఁ, బొత్తిఁగనధమాన్వయుండు । పోయాతఁడటం
చత్తపనజాత్మజుసిపురి, హత్తపుమజివర్ణనిర్ణ । యంబుల వెందుఁ. 40

తే. చిత్రగుప్తాదులచ్చటఁ । జేరియున్న, ప్రాణిసంహతిపాపపు । ణ్యముల నెన్ని
తత్తదుచితములైనవి । ధానములవి, ధించియొప్పింత్రు భటులకా । తీరుసేయ. 41

క. చేసినకర్మములన్నియు, నీసరిఁ బోకుండఁ బ్రాణి । నెనయు భుజింపం
గానరనట్లుఁగావున, భాసిల్లం జనును పుణ్య । పరతజనంబుల్. 42

చ. పరమశుభంకరంబనివి భావరినేబదియేడునాడికల్
వరుసనసంగ లేచిప్రతి వారముమాఘనిమజ్జనంబు శ్రీ
హరిగరుడాంకమాధవుము రాంతకయంచొనరించియంతబా
దరకదళీవయస్థఫల దానములిమ్ములనిచ్చువారలుర్. 43

క. తిలదానమ్మొనరించిన, లలితవృషాత్మకులునిర్వి లంబముగానా
జలజాప్తసదృశతేజో, జ్వాలులై సుఖయూనులగుచు చనియెదరందుర్. 44

క. పాదుకలుఁపాదరక్షలు, మోదమ్మున ద్విజులకిడిన పుణ్యాత్మకులి
మ్మేదినినెవరోవారలు, నాదండధరాంతికమున నైశ్వర్యయుతుల్. 45

వ. మఱియుపీరుత్తమాశ్వారూఢులై సుఖపథంబుననందుఁ జేరఁగలవారు వెండియు. 46

సీ. గొడుగుదానంబొసం గుడుసీడలంబోవు, వస్త్రాదులీయ్యది వ్యాంబరముల
నలవరించియటేగు నందలమ్ములువారు, నమ్ములొసంగుడు వాడునట్టి
యాపాయ్యయనాదుల నధివసించియుఁజను, నెలమిశయ్యాసనా దులనొసంగ
నతఁడుసౌఖ్యాస్పదుఁ డై యేగునుపవన, మమర వేయించిన యతఁడుపుష్ప
శోభితద్రుమసుచ్ఛాయ సొలయకేగు, నేగుఁబుష్పమ్ములనుదాన మిచ్చినతఁడు
పుష్పకము నెక్కియతులవి భూతిఁదనర, నినజుపురిఁ జేరిసౌఖ్యము లనుభవింప.

క. దేవాలయములుమఠములు, బావులుమఱిదిక్కులేక పడిపోయినయా
తావలములుఁగట్టించిన, యావరమతులందఱుసౌఖ్య మందెడివారల్. 48

క. గురుదేవద్విజవైశ్వా, నరజనసీజనకులనుది నమ్మునుపూజా
పరితృప్తులఁగావించిన, వరమతులందధికసౌఖ్య వంతులువినుఁడీ. 49

క. ఇరుఁగడలదివ్వటీలుం, బరువడిఁదనరంగయమని వాసముఁజేర్చుర్
సురభవనంబులదీపము, లరయంగానెవ్వఁడుంచు నట్టిఘనుండుర్. 50

క. గోగృహనీరాన్నప్రదు, లాగురుశుశ్రూషకులును వ్యాధిగ్రస్తుర్
బాగొనరించినవెజ్జులు, భోగములందందుచుండు పుణ్యులుఁగానర్. 51

క. పాదప్రక్షాళనమున, కాదరమునసుదకమిడినయ వ్వారలుఁదా
మోదమునసతులసౌఖ్యము, లాదండధరాంతికమున నందుదురెపుడుర్. 52

తే. మాఘమాసమునసువిప్ర మహితశీలు, నధికసంతోషమమరనభ్యంజనమ్ము
కడఁగిసేయించినట్టియాఘనుఁడుదివ్య, వాహనారూఢుఁడై యమావసతిఁ జేరు. 53

చ. అమరఁబసిండిరత్నములనాలనురూప్యములర్ విధిప్రకా
రమునసుదానముల్ సలిపిబ్రాహ్మణసంతతిఁదన్పువారుదా
గ్రమముననవ్యోమయానరథరాజములెక్కిప రేతరాట్పురిర్
సుమహితసౌఖ్యసంతతులఁ జొక్కుచుఁబోయెదు వారుత్రోవలర్. 54

తే. మాఘమాసోదయమునందుమజ్జనమ్మొ, నర్చిద్విజునకునాజ్యదానమ్ముసలిపి
నట్టినరులేగుదురుప్రాద్దుపట్టిపురికి, నెలమిజ్యోతిస్వరూపాశ్వమెక్కివేగ. 55

తే. అరయ తాంబూలదానము నాచరింప,
సౌఖ్యముఁగని నజువీటికిఁ జరగునట్లు
నేగుఁ గూశ్మాండదాతయు హేమమయవి,
మానమునఁగూరు చుండియు మహితభూతి. 56

క. తండులము లాఢకంబులు, పండినయంతన నశింపఁ బడునోషధులన్
బండిన వస్తువులే పు, ణ్యుండిము మాఘమునదాన మొప్పఁగనతఁడున్. 57

వ. గోదాన మొసఁగిన యతండును నిష్టమృష్టాన్న సంతుష్టులగుచు సుఖయాన మున యమపురంబు సేరువా రివ్విధంబున. 58

తే. వివిధదానము లొనరించి వేడ్క మీర, గజతురంగరథాంధోళి కాదులెక్కి
వచ్చువారలు మున్నడ వచ్చి సౌఖ్య, ములనుఁబొందెడివారలి మ్ములఁదనర్చి. 59

క. లెక్కకు మిక్కుటమైతా, రెక్కడఁజూచినను నిండి యినజునిపురిలోఁ
గ్రిక్కిఱియు చుందురటఁగడు, మక్కువఁ బూజ్యతయు మాఘ మజ్జనులకగున్.

ఉ. శ్రీయుత మూర్తులన్ సుకృత శీలురనంచిత దివ్యపుష్పకా
ద్యాయత వాహనాన్వితుల నంతటరాఁగని లేచిపేర్మిమై
డాయఁగఁ బోయివారలఁగ డంకను జేతులఁ గ్రుచ్చి కౌఁగిటన్
గాయము లంటఁజేర్చికడు గౌరవయుక్తినిఁ దెచ్చియందఱన్. 61

తే. అర్ఘ్యపాద్యాదివిధులస మార్చనములు, చేసిమీరలు సంతోష చిత్తులార్య
వినుతశీలురు పుణ్యాత్ములనుచు మిగులఁ, బొగడి పూర్ణానురక్తిమై మిగిలి యముఁడు.

చ. వరుస విమానసంయుతుల వారినిఁ జేయుమ పుణ్యులార మీ
రరుగుఁడు స్వర్గభోగముల నందిసుఖింపఁగ నంచుఁబంపఁ ద
న్నిరుపమ సత్కృపన్ సురధు నీచటులోర్మి విధూతజాతశీ
కరయుత శీతలానిలమ ఖండముదంబొన రింపుచుండఁగన్. 63

వ. త్రిదివంబునకేగుదురు మఱియు మాఘస్నానముం గావించినవారల కొక్క విశేషంబుఁగలదు వినుండు. 64

క. ఒకమాఘుం బవగాహన, మకలంకత నాప్రయాగ యందొనరింపన్
దుకతుక లేకింతయుఁ ద, ప్పకపొందుదు రజపదంబు పరమప్రీతిన్. 65

శా. ఏపుణ్యాత్ముకు లేనిమాధవు వృషీ కేశున్ గృపావాసుని
ష్పాపున్ భక్తఫల ప్రదాయకునజ స్రంబాత్మలోనిల్పిదా
మాపై మాఘుని మజ్జనంబచటఁ గ ల్యంబాదుఁ గావించిరే
యాపుణ్యాత్ముకు లేగు వారతనిది వ్యాహాసముం బ్రీతితోన్. 66

ఉ. శ్రీరమణీయమై విబుధ సేవితమై యతిరమ్యవస్తు వి
స్ఫారమునై మునీంద్రజన సంస్తుతమై యసమానమైను హ్వా
దారతఁగన్న విష్టపవ తంసయుగంబునుఁ బొందువారలి
ట్లేరికిఁగాదు సంయమని నించుకయుం దిలకింపకొక్కటన్. 67

తే. ఇతరపుణ్యాత్మకులుపితృ । పతిపురమ్ము, సేరిమునుతన్ని యోగముఁ । గోరి త్రిదివ
మాదిలోకంబులకుఁ జేర । నొదురిట్టి, కారణమ్మునఁ జేసియ । క్కడకుఁ జేరి. 68
తే. అటన వసియించు పుణ్యజ । నాలి నెన్న, పవనభుక్ప్రతి గీష్పతి । భారతీప
తులకు సాధ్యముఁ గాదనఁ । బలుకమాధ్వ, శులకునయ్యెడి నొక్క మా । తలువినుండు.
తే. అట్టిసంయమనీపురి । నధికసంత, సముననీఘ్ర ప్రయాణము । లనురఁ జేరి
యందుకదళీవనస్థర । మ్యోందుకాంత, వేదిసుఖముండితిమియన్ని । వేళలందు. 70
వ. అట్లు మాఘస్నాన ప్రభావమున సుకృతాత్ములఁ గలసి యుంటిమనుడు పుత్రికల
కు మగుడ జనయిత్రు లిట్లనిరి. 71
క. కలుషాత్ములైనవారల, నలయింతురు పెక్కువిధము । లగుబాధలనం
చిలనార్యు లనఁగవిందుము । బలువిడి తద్విధములెల్లఁ బలుకుఁడు తెలియన్. 72
క. వినవలతు మనుడు వారలఁ, గనికన్యక లనిరి కౌతు । కంబునవినుఁడో
జనయిత్రులార యేమా, యినజునిపురిఁ జూచియున్న । వృజినులబాధల్. 73

—(*) విప్రకన్యలు యమపురిం బాపుల బాధలు తల్లుల కెఱింగించుట. (*)—

చ. ఎనుబదియాఱువేలిటకు । నెన్నికయోజన సంఖ్యదూరమా
యినజుని పత్తనంబుదురి । తేతరులేగుడు వారికింబ్రియం
బెనయ సమీపమైతనరు । నెంతయుఁ బాపుల కట్లు ఘోరమై
చనఁగడు దూరమైపథము । సాధ్యశిలోచ్చయమై కనంబడున్. 74
వ. అది యెట్లంటేని నంతయు వినుండు. 75
సీ. తీవ్రకంటకసము । త్కీర్ణముగ్రక్షురో, పమశిలావృతముక । ర్దమమయంబు
సూచీనిభోపల । ప్రాచుర్యమత్యురు, పర్వతద్రుతటప్ర । పాతనిచయ
మతితప్తసైకతా । న్వితమగమ్యావనీ, గర్తసందోహసం । గతముక్షుద్ర
కంటకక్ష్మాజప్ర । కాండమశ్రాంతసం, త్రాసకారకమృగో । త్కరపరీత
మగుచుననిశముఁ బాపుల । కమితభీతి, మొనయఁ జేయుచు దక్షిణం । బున నెసంగు
నప్పథంబునఁ గలుషాత్ము । లైనవార, లధిక బాధలఁ గుడుచుచు । నరుగువారు. 76
ఉ. ఆవిధినున్న త్రోవఁజన । నంతకుఁ నంతకుఁ బాయుచొండొకం
డావలనీవలై యరుగు । నట్టిపథమ్ములు పెక్కుఁదోచునా
త్రోవల నన్నిటం బెలుచ । ధూమముతోడిద వాగ్నియుండునా
తావులనంఘ్రులూదినఁ జె । డంగమలున్ సిమిమంబులోపలన్. 77
. కటకట వడుచటులంబో, విటపద్రుమ సాంద్రమై ప్రవేశింపఁగరా
కటుఁజీకటులెసఁగెడుమి, క్కుటపుం గహనములుఁ దోచుఁ గొనకొనిమఱియున్.
. అవిదాటి చనుఁడు ముంగల, నివమేర్పడి యుండుఁదాని । నెంతయుఁ గడువన్
దివ్రుచుకొన రామిఁ గుత్తుక, లవరకుఁదిగ వడుచు నిసుము, లంపటపెట్టున్. 79
. కడఁగిదానిఁగడువఁ । గ్రాగుచుండెడుజలా, శయములుండువాని । సరవిదాటు
ఢవలవహ్నిభరిత । మైనమార్గోత్కర, మమరియుండుదాని । ననుగమింప. 80

మ. ఉరుశార్దూల మదేభ కాసరతరక్షుగ్రాహి భల్లూకసూ
కరకంకేరవశల్య గండక మహాహిశ్వాన మార్జాలవా
నరఫేరోష్ట్ర ఖరోందురు ప్రముఖనానాజంతు సంతానముల్
గరముం బాధలఁగొల్పు త్రో లటు చక్కన్ వచ్చునా మార్గముల్. 81

వ. బాధింప తద్బాధలం బడుచు. 82

చ. కడచియ ఱేఁగ ధూళిమెయిఁ గ్రమ్ముకొనం బెను గాలివీచు వెం
బడినశిలోగ్ర వృష్టియదిఁ బాయకమున్ నిసితాసి వృష్టిదా
నెడయుక మృణ్మయంబయిన వృష్టిపదం బడి మీఁదఁ బర్వన
య్యొడళులు చిమ్ము నెత్తురుల నొప్పు మహావ్రణబాధ నందఁగన్. 83

క. అంతనె మఱియునుఁ గురియుచు, రంతతుషారాంబువృష్టి యటు పైశీతా
త్యంతశ్వసనము వీచు ని, రంతరమతి బాధలొసఁగ నత్తనువులకున్. 84

ఆ. అట్లుఁ గొంతదూర మరిగినఁ జండాంశు, తాపమధికమగుచుఁ దల్లడిల్లఁ
జేయుఁ గంఠములనుఁ జెమ్మయులేమిఁగా, వించితుత్రుషలన లంచిమిగుల. 85

ఆ. అధికయాతనలకు నావిధినాలయు, మగుచునడుచుచుండు నట్టిపాపి
సమితి వెంబడించి చండాంశజనిభటు, లమితకోపులగుచు నలమిపట్టి. 86

వ. మీరు మమత్వాహంకారంబుల నాలుబిడ్డలు బంధులు పరులు వారువీరని భేదం
బులనెన్ని యెన్ని యో యకృత్యంబు లాచరించితిరి గదా వారిప్పు డిందువచ్చి
మిముం గాపాడఁగలిగిరే యని హుంకరించుచు. 87

ఉ. కొందఱ సంకెలల్ వయిచి కొందఱ బోరలఁ గ్రుచ్చి మూర్ధముల్
కొందఱ నంకుశమ్ములనుఁ గ్రుచ్చి లలాటములందుఁ గొందఱన్
సందిళు లేడ్తెఱుం బిరిదిఁ జక్కన జేర్చి పెనంచి కట్టియున్
గొందఱఁ గ్రూరపాశములఁ గుత్తుకలం బిగియించి నెట్టనన్. 88

ఉ. కొందఱ నాలుకల్ దోఱలఁ గ్రుచ్చియుఁ గత్తెఱలుం బిఱుందులన్
బొందువడంగఁ జేర్చి బిగి పుచ్చియుఁ గొందఱ ముష్కముల్ దదా
క్రందననిస్వనంబులెసఁగన్ నిజలింగము లీడ్చి కట్టియున్
గొందఱ నోష్ఠఘోణములఁ గ్రుచ్చి నటారక జాలముంచియున్. 89

సీ. కొందఱఁ బాపాత్మ కులఁ బట్టి చెవులుగ, డ్డంబులునలుఁగఁగ డంకమొత్తి
కొందఱఁ గడుపులఁ గోపించి తప్తము, లైనశలాకల నమరఁ గ్రుచ్చి
కొందఱ నలినలిఁ గొట్టి కాళ్లేతులుఁ, గొందఱ వృషణముల్ జిందుపరచి
కొందఱ నసితాసి కుంతాదులను వైచి కొందఱఁ బరిఘల గుదెలఁ జదిమి
కొందఱ నురంపములఁ గోసి క్రందుఁగాఁగ, నార్చిపేర్చుచు నలమట లందసీడ్వ
నయ్యయో యేముఁ బాపకృత్యములనేల, సొచ్చి చేసితిమోయటం చుంగలంగి. 90

తే. అధిక క్షుత్తృష్ణ లకునన్న మంబువులను,
నాతపశ్రాంతి కవనీరుహములనీడ

వడఁకుఁ జెందుచుఁ జలికిఁ బావకసమీప,
మాత్రఁ గోరుచు భటులతో నగుచుండ్రు. 91

తే. పుణ్యులగువారు తమదైన పుణ్యసమితి, తమ్ముఁ బోషింప నెట్టిచో సమ్మదంబుఁ
గంద్రు పాపాత్ములట్లుఁ గాక యువిశేష, దుఃఖములఁ బొందుచుందురు తొలఁగ కెందు.

వ. అట్లుఁ బాపాత్ములు కింకరులచే బాధింపంబడుచుఁ బోయిపోయి. 93

సీ. కడుఘోరముఖమున ముడిఁగొన్న కన్బొమ, లమరఁ గ్రూరాలోకనములు నిగుడ
నిక్కిన వెంట్రుకల్ నెఱినున్న మీసలు, నొనరఁగాఁ గదలుపీ నోష్ఠములును
ధగధగద్ద్యుతినాయు ధముల చేఁ బోలుపార, పదునెనిమిది హస్త పంకజములు
నరుణపుష్పాంబరో ద్యన్మహోరుచు లొప్ప, నంజనాద్రి ప్రదీ ప్తాంగ మమరఁ
బ్రళయజలధరగర్జావి రావసదృశ, కంఠనిస్స్వనమతిభయం కరముగాఁగ
నల్పి యతిరోషమునఁ బాప జనులనెల్ల, దండనము సేయు నాదండధరునిఁ జేరి.

తే. అతని ఘోరాకృతిం దదీ యప్రచండి, మమును తత్పరివేష్టిత మహితవిగ్ర
హాత్మ కామయవివిధక ష్టాధిదేవ, తలనుమూరి మహామారి కలను మఱియు. 95

వ. అగ్నికల్పుండై వెలుంగు కాలపురుషుని మృత్యువునుం గాళరాత్రి మున్నగు శక్తులను బ్రాణుల వేధించు శూలాంకుశ పాశ చక్ర ఖడ్గ ప్రాసాది సాధనంబుల ధనుర్బాణంబుల వజ్రదండంబుల ధరించియున్న పార్శ్వచర కింకరవరుల నంజనాద్రి సదృశులై యాయుధోపేతులై కొలిచియున్న పరిజనంబులఁ జిత్రగుప్తునిం జూచి. 69

తే. భయము దోడ్తోడఁ గలుగ విభ్రాంతులగుచు, నిలువఁగా నప్డు పాపుల విలయకాల
రుద్రునిం బోలికను పట్టి రోషపటిమ, మమర నదలింపుచుండ న యంబుమీర.

తే. షడ్గుణైశ్వర్యకలితుఁడౌ శమనగణక, వర్యుఁ డౌ చిత్రగుప్తుఁడు పాపజనుల
తోడఁ గడు ధర్మ వాక్యము లాడునిట్లు, లవియు వినుపింతుమమ్మలారా వినుండు.

ఉ. ఓకలుషాత్ములారవినుఁ డోపమటంచుఁ దలంగ నెట్టులో
నీకడఁ బాపి సంహతుల కేర్పడియున్న మహోగ్రయాతనా
నీకము నంతయుం గుడిచి నిష్కలుషాత్మకు లౌదురిందుసు
శ్లోకులుఁ బుణ్యవర్తులు వసుంధరమీరలుఁ గామినింతయుక్. 99

కం. కలుషమునకు వెఱువక యిత, రులసొత్తుల నపహరించి రోయక మఱియ
న్యులబోంట్ల రూపసంపద, లలరంగవ యుంగనెట్టు లణగునఘంబుల్. 100

తే. అల్ప సౌఖ్యమ్ములకు ముద మందిమీర. లధికకలుషములైన కృ త్యముల నాచ
రించి తత్ఫల భారధు రీణులగుచు, ననుభవింపఁగ నిచ్చటి కరుగుదెంచి. 101

ఉ. చాలమటన్నుఁ దప్పునెవె సంభుజియింపక పాపసంఘముల్
పోలఁగ నుండువీరు భువి భూభుజులయ్యు ప్రభుత్వగర్వము
ద్వేలముఁ గాగ మైమఱచి వేర్మినొనర్చిన దుష్కృతంబుని
వ్వేళ ఫలప్రదంబయిన వేగమె చేరిరి యిందుఁ బొందఁగన్. 102

క. అనిపలికి వెండియిట్లను. జనపాలురఁజూచిమీర శాశ్వతసంప
జ్జనితమ దాంధులరై యి, ట్లనయముఁకడుఁ బాపచిత్తులై తిరిభూమిన్. 103

ఉ. వీరలు మాకుబంధువులు వీరుహితుల్ గొనరాద వద్దనుం
చూరక పుచ్చువారునన యోద్ధతినెవ్వరి నేనినిందలన్
బోరన వెట్టువారిపయిఁ బూనికదండన వెట్టివంతఁగల్
వారక తీసియావిధిన వారణధర్మముఁ ద్రోచిపాపమున్. 104

తే. ద్రవ్యరూపమ్మునంగూర్చి తనుజసచివ, బంధుదారాదులం బాసివచ్చితికిట
బహుళ దుఃఖములీగతిఁ బడఁగవార, లిందువచ్చిరె మీబాధ లెల్లనుడుప. 105

మ. తనరం బ్రాణిని జాయురంతమునగా త్రెంబున్ విసర్జించిమ
ద్వినియుక్తోగ్రభటాలిఁదేనిటకునే తేరంగఁ దామున్నుఁజే
సినపుణ్యాఘములేర్పడంగ డిసిర శిక్షింపంగ శిక్షింపనీ
యినసూతిన్ నియమించుఁగాకి తరమే మేదినీభువిన్ వచ్చునే. 106

ఆ. అనుచుఁ జిత్రగుప్తుఁ డనునయవాక్యము, లనువచింపదురిత జనులుఁదలలు
వాంచియుందురప్డు వైవస్వతుండుగ్ర, ఫణితభటులఁజూచి పలుకునిట్లు. 107

ఉ. ఓరి ప్రచండచండవిమ తోగ్రమదోత్కట తీవ్రకోపమో
రోరి కరాళవక్త్రి వినుఁ డొక్కటమీరలు వీరిఁగొంచువే
ర్వేరఁ దొలంగితప్తఘట విణ్మయవాయస గృధ్రహోరకాం
గారకరాళతీక్ష్ణనర కాదులఁద్రోయుఁడు వ్రేయుఁడుద్ధతిన్. 108

మ. అసినం జంతనునుంచుదూతలు మహోగ్రాకారులై యార్చివా
రినిఁగై కొంచటుఁ బోయికొందఱబలో ద్రేకంబునం బాదముల్
గొనిపైఁజిమ్ముచు శాఖలంజనుపుచున్ ఘోరంబుఁగాఁగొందఱున్
సునిశాతాసి గదాప్రహారములచే స్రుక్కించుచుం గ్రూరతన్. 109

వ. వెండియుఁ బెక్కువిధంబులగు శ్రమలనందింప శోషిలి నేలంబడతోడన మలయా
నిలంబు వీవంబడునంతఁ దెప్పిరి లేచుటయుఁ బదంపడి బాధింపుదు రిట్లుఁ బాపా
త్ముల బాధించి శుద్ధాత్ములం జేయుఁ జతుర్ముఖుం డొనరించిన నరకభేదంబు లెన్ని
యోగల వవ్వానినెల్ల నెఱింగింతుము వినుండు. 110

—(*) విక్రకన్యలు తల్లులకు నరకభేదంబు లెఱింగించుట. (*)—

తే. తనరవిధి చేసెసుప్రసి ద్ధములుఁగాఁగ, నిరువదెనిమిదికోటుల నరకములను
నందు నేడవకోటికి నంత్యమగుచు, ఘోరయనుపేరఁ దగునంధ కారకోటి. 111

క. వారకదానిం గడువను, ఘోరయునతి ఘోరదాని కొననొప్పమహా
ఘోరయును దానికవ్వలఁ, దీరువడెం ఘోరరూప ధృతిదానికొనన్. 112

ఆ. తరళతారదాని దాఁటుడవ్వలభయా, నకముకాళరాత్రి నారకాలి
వానిఁగడువనందుఁ బరిఘవిల్లెడుభయో, త్కటముచండదాని కటునెసంగు. 113

తే. లలి మహాచండ దండకో లాహల ప్ర,
చండ వజ్రక రాశులు సరవి తోడ
మఱియు వికరాళ యనునటి ముఱియుఁగాఁగఁ,
బాధఁ గొలుపఁగ నటులుండుఁ బాపజనుల. 114

వ. మఱియు నివియుంగాక త్రికోణ పంచకోణ సుదీర్ఘ పరివర్తుల సప్తభౌమాష్ట భౌమ దీప్తంబులును మాయయనునదియు నెనిమిది నరకకోటులుఁ గల వందు రౌరవ మహారౌరవ తమ స్స్వేతాదులుఁ గలసి యిరువదెనిమిది నరక కోట్లగు వీనియందుఁ బాపులు హాహా కారంబులు సేయుచు విలపించుచు బహువిధ బాధలం బడుచుందు రింకఁ గ్రమంబుఁగా నరకభేద నామంబుల నెఱింగింతుము వినుండు.

సీసమాలిక.

ఉష్ణంబు సుదమము నొగిఁ దీక్ష్ణకర్కసం, దీపనశరములు ద్దీప్తమగుచు
నమరు మహామాయ మతిరోమమును సుభీ మసుకంటకప్రకం పములు మఱియుఁ
దీవ్ర వేగమ్మును దృఢతరమ్ములు మహా, పద్మ ప్రతర్దన పంకలేప
ములుఁ గాలసూత్రమ్ము పూతిమాంసమును నే, మియు ఖాదనంబు విణ్మాయమును ప్ర
దీపకమొనరు సుదీర్ఘము సూచీము, ఖాంగారరాశిఖ రాననములు
కూపసుపాకకుం భీపాక హ్రాదకా, తపదారుణోచ్ఛ్వాస తప్తజంతు
పంకలేపములు సర్పము తుండి శకునియు, స్పృక్స్వాయభవనంబు సింహశల్య
వృకగజవృషనామకములుఁ గ్రతునుహా, సంవర్తములు నిరుచ్ఛ్వాసకూట
శాల్మలారిష్టముల్ శ్వానమహిషవృష, మేషాద్రవములుఁ బురీషకంబు
సుప్రతాపము కపి సువిశాల వికటముల్, వ్యాఘ్రమృగాదాత్మ భక్షణంబు
లప్రతిష్ఠయు సుమహానాదము బ్రధా, వము సూకర గ్రహ వాయసములు
కుంభీరమును నక్ర కూర్మ గృధ్రోలూక, శాలూరకణధూమ సర్వభక్ష
ణమ్ముల మేయంబ నంగనొప్పారెడు, నదిజలూకము రుధి రాన్నగండ
కములుఁ గర్కటకర క్తాక్షు తుషాగ్నిక్రి, మినిచయములుఁ బూతి మృత్తికంబు
పూతివక్త్రికటాహ ములు శ్వభోజనములా, లాభక్షణాసితా లవనములును
లోహశంకువు తప్త లోహమయముఁ గంట, కముసంకటము మండ పమును నస్థి
భంగ ప్రపీడన లాంగలిసీలాయ, సేక్షుయంత్రములుగ దాత్యుగ్ర
ధారలు మఱిసు తప్తముఁ గూటపాశప్ర, మర్దనీ శైలత మః ప్రహులును
పూయకూపంబును మూత్రకూపము మల, పర్వత శాతన బహుళ దుఃఖ
ములును సుదారుణ మును నతిభంగంబు, శమలకశ్మలద్వీపా దములు నేక
పాద త్రిపాదముల్ వైతరణీనది, ముసలములూఖల మును శిలాశ
కటయంత్రమలములు గాఢముల్ భీమకూ, పయమానుగమములు పరగఁ దప్త
శూలమయంబు సు చూర్ణి మహాచూర్ణి, సమ్మోహనమహామ శకచిరంత
మములు విష్ఠాకూప మమరు సువక్త్రివి, ష్ఠా పూయపూరణ కూపములును

నరయమఱియునుహాలాహ లాదికూప, మున్మహాదుఃఖనామక మొనరునసిః
నంబువెండియుఁదాళపత్త్రంబనంగ, నమరునురుబాధకములు ముఖ్యంబులివియు.
తే. రౌరవాములునరకవ ర్గంబులైదు, నైదునొక్కటిఁగానెన్న నగునిటులను
వీనఁబాధలనధికము గానుఁగుడిచి, యవలబరిశుద్ధులయ్యెద రాదురితులు. 117
క. ఆవిధి నరకములంబడి, పావనులై స్వకృతకర్మ పరిశేషమునన్
స్థావరజన్మములందియుఁ, గేవలమా దుఃఖమున నొగిం జేడ్పడియున్. 118
ఆ. క్రిములుఁగాగనవత రించితద్దుఃఖము, లనుభవించియటవి హంగములుఁ
గాగఁబుట్టివాని కష్టంబులంబడి, యంతమీఁదబ్రాణి సంతతులను. 119
క. గోజన్మ మందిక్రమ్మఱ, శ్రీజగదీశ్వరుకృపావి శేషంబుననీ
భూజనులై జన్మించెద, రీజన్మము నందెముక్తి యేర్పడవలయున్. 120
వ. కావునఁ బ్రజ్ఞావంతులగు నరులు భగవంతుండగు నారాయణుఁ ధ్యానించి తచ్చా
రిత్రంబులు విని వేదప్రణీతంబులైన జపయజ్ఞదాన ధర్మవ్రతాదులుఁ దపంబులు
మాఘస్నానంబులు మొదలగునవియాచరించి హరికారుణ్యంబువడసి మోక్షంబు
నెందవలయునని కుమారికలుఁ దల్లుల కెఱింగించి మఱియు. 121
క. జనయిత్రులారయేమా, యినజుని పత్తనమునందు నేర్పడనంతన్
గనివచ్చినారమీచె, ప్పినదంతయుఁ గలిగియుండు వృజినాత్ములకున్. 122
ఆ. అనుఁడువారిఁజూచి జననీజనకబంధు, వారమిట్టులనియె మీరుమాకు
దెలియఁజెప్పినట్టి తెఱఁగంతయువిని, నంతనుండిభయము లందెమదులు. 123
క. యమపట్టణ మార్గంబులు, క్రమమునఁ దలపులకురాగ కాయంబులువే
గమవణఁకఁ జొచ్చె బ్రాణము, లమరంగంఠములనిల్చి నటుగాన్పించెన్. 124
క. అనివెఱచి పలుకుబంధువు, లనుఁగని కన్యకలుముదమొ లర్పఁగనిట్లం
చనుఁబల్కి రేలభయమం, దనుఁబుణ్యులుఁ గారెమీరు తలపోయంగన్. 125
క. భువనము లీరేడింటిలో, భువిముఖ్యం బందుఁబరమ పుణ్యస్థలమై
యవిరతము భరతఖండము, దివిషత్సందోహసంస్తు తిందనరారున్. 125

—(*) విప్రకన్యలు తల్లులకు ధర్మోపదేశంబున నరకభయంబు వాపుట. (*)—

తే. భరతఖండమునందుద్భ వంబునందు, మనుజులతిపుణ్యులందుల మాఘమజ్జ
నంబుఁగావించినట్టిజ నంబుమిగుల, ధన్యులవ్వారికినిలేదు తలఁపభవము. 127
ఉ. ఎక్కుడుఁగాగ సత్తపము లెంతయు దానములున్ వ్రతాదులిం
పెక్కఁగ నిందొనర్చి దురి తేతరులై త్రిదశాలయంబునన్
మక్కువ సర్వసౌఖ్యముల మానకయందిన యట్టులారయన్
దక్కినవానియందుఁ గల దాయనలేద విభోగభూములై. 128
ఆ. కర్మభూమిభరత ఖండమునాగనుఁ, బఱగియుండుధర్మ పరతఁగన్న
వారువారిసుకృత పాకముచేనజ, త్వాదిదివ్య పదము లందగలరు. 129

వ. కావున నన్నిఖండంబులలో నుత్తమం బీభరతఖండంబిం దుద్భవించిన నరుల నిత్యంబైన శరీరంబు వాసినంత మోక్షంబొందెడ స్వర్గాది సుఖలోకంబుల నొందెడ వారివారి సుకృతంబు కొలఁది నందఁగల వారిట్టిపుణ్యులయ్యుమని లయంబుం జూడ రిట్లని యెఱింగి. 130

ఉ. పొందుఁగ బ్రహ్మవంశమునఁ ॥ బుట్టిగ దాధరు నింది రేశుసం
క్రందన వంద్యుభక్తజన ॥ కల్పకుజున్ హరినాత్మనిల్పిమే
లందఁదపో వ్రతాదులఁ బ్రి ॥ యంబున ముక్తిఁగనంగ లేకయు
న్నందలఁ బోయనుఘాధుఁడుజ ॥ నంబుల నింకొకఁడున్నె చూడఁగన్. 131

ఆ. అట్టిదాఁడుజన్మ ॥ మంతముఁగాయమాం, తికముసేరినరక ॥ నికరమనుభ
వించివివిధజంతు ॥ విసరంబులోఁబుట్టి, యవలమనుజుఁడయ్యు ॥ నవనిఁబొడము.

క. ఆజన్మమునందైనను, శ్రీజగదీశ్వరుని మదినిఁ ॥ జేర్చితపముని
ర్వ్యాజతసేయకమోక్షం, బాజనునకుఁ గలుఁగదదిమ ॥ హామహామగుటన్. 133

వ. అని పలికి మఱియు నీభరతఖండ మహిమ వినుండని యిట్లనిరి. 134

ఉ. ఎంతతపంబొనర్చి జని ॥ యించిరొ భారతవర్ష భూమిలో
స్వాంతమెలర్ప మాఘమున ॥ స్నానమొనర్చుచు దానధర్మముల్
సంతతమిందుఁ జేసికలు ॥ మంబునొకించుక లేకపుణ్యమ
త్యంతముఁగైకొనంగలిగి ॥ రద్దిరసార్థత యిట్టులుండునే. 135

ఉ. ఎన్నఁడుఁగల్గుబుట్టువుల ॥ నేర్పడిభారత వర్షభూమిసం
పన్నమనోవిధంబులన ॥ పారముఁగా నొనఁగూర్చు చుంటబల్
పున్నెములంచు స్వర్గఋభ ॥ వుల్ నిరతంబు మనంబులందుఁదా
మెన్నుచునుందురానెవచి ॥ యింపఁగ భారత భూప్రభావముల్. 136

వ. మఱియు దివినుండి భరతఖండంబునం జన్మింప వచ్చువారి పుణ్యంబులు సంకీర్తనంబులుఁగా నద్దేవతలు పాడుచుందురు. 137

క. కావున మీరలు పుణ్యులు, భావింపఁగ నెన్నియేని ॥ పదఁపడి వ్రతముల్
గావించి నట్టివారలి, కేవిధిఁ బాపంబు లొదవు ॥ నెట్లగుఁబాధల్. 138

చ. మనుజుఁడు పుణ్యకార్యముల ॥ మానకచేసి దివంబునందెదున్
దనరఁగ బాపకార్యచయ ॥ తత్పరుఁడై నిరయంబునందు స
జ్జనుఁడతి సౌఖ్యగామియయి ॥ చయ్యనఁజేరు యామాలయంబు దు
ర్జనుఁడెనలేని దుఃఖములఁ ॥ జాలిచనుంగదు దీర్ఘకాలముల్. 136

వ. మఱియు. 140

ఉ. ఎల్లవిధంబులన్మనుజుఁ ॥ డేర్పడఁబుణ్యవిచారుఁడయ్యు సం
ఫుల్లసరోజనేత్రునను ॥ మోదముతో భజియించెనేనియో
వల్లనధోగతింగనదు ॥ బంధువులారవినుండు శ్రీరమా
వల్లభభక్తిఁగొల్వుఁడు ధ్రు ॥ వంబుగఁ మీకటు మోక్షమబ్బెడున్. 141

క. భావింపుఁడు చాతుర్విధ, మైవెలసిన సృష్టియందు నంచితలీలన్
దావుఁగొని యొక్కఁడేనియు, నీవసుధాస్థలిఁదనర్చు నేచూడంగన్. 214

క. నమ్మకుఁడింతైననుమది, నిమ్మహిసంపదలుతనువి దేనాడైనన్
వమ్మైపోవునుసత్యము, సుమ్మువృథాకాలమేగు చోఫలమగునే. 143

చ. అరయఁగ నూఱువత్సరము లాయువటందురు మానవాలికం
బరిగెడు రాత్రిరూపమున నర్ధముతక్కిన యేబదింటిలో
వరుసనటించుఁ బాల్యమున వైళముగా మఱివార్ధకంబునన్
బరువడి యౌవనంబు తనుఁ బైకొన నింద్రియలోలతందగన్. 144

క. బాలత్వంబునఁ దెలియం, జాలఁడు మనుజుండు తెలివి సంసారమునన్
దూలించు వార్ధకంబుని, కేలాగునఁ గల్గుమోక్ష మిట్లగునపుడున్. 145

క. సద్యోగము లభియించెడు, నుద్యోగము పూర్తిసేయ నెగియౌవనమా
వేద్యుండియ్యది తెలిసియు, విద్యాంతర్గతుఁడుఁగాక వెలియౌనెఱుకన్. 146

ఉ. ఘోరతరాతిదుఃఖములఁ గూల్చుకడుంగడు హేయమైనసం
సారముఁ నందగుల్పడియ శాశ్వతమైమలమూత్రపూయదు
ర్వారరుజాభియుక్తమును వారకమైన శరీరవాసనన్
గోరకుఁ డెన్నఁడేనియునుఁ గోరినఁదప్పదు చేటువారికిన్. 147

శా. ఈజన్మంబతి దుర్లభంబు హితమూ హింపుండు సర్వేశుని
ర్వ్యాజప్రజ్ఞఁ దలంచుటో సుకృతము ద్యల్లీలఁగావించుటో
యోజందానములిచ్చుటో సుజనసం యోగంబునన్ యోగవి
ద్యాజాలంబది యభ్యసించుటయొ ని త్యానందముం బొందగన్. 148

చ. ఇలఁగల జంతుసంహతుల కెల్లబుభుక్షయు నిద్రభీతియున్
గలయిక లన్నియున్ సమత గన్పడుఁదెల్వి యొకండుమర్త్యనం
దలవడె నెక్కుడై యదియు హైన్యముఁగాఁ బశుపక్షిపన్నగా
వలులనొకండునొఁ దెలివి వాటిలికోరఁగనొప్ప సద్గతిన్. 149

క. మానవుఁడై జనియించియు మానకసంసారమోహ మగ్నుండైకన్
గానక కాలముఁబుచ్చినఁ దానుందనుఁ జంపుకొనుని ధంబగుఁగాదే. 150

క. కపటంపు నడవడులుడిగిహ, రిపదధ్యానంబుసేయఁ బ్రీతాత్ముండై
సుపథం బొసఁగెడునామధు, రిపుఁడటుఁగా కున్నఁగలదె శ్రేయంబవనిన్. 151

వ. మఱియు మోక్షాపేక్షులగు వారికి నొండు ముఖ్యంబగు విధానంబుఁగల దదియెట్లన్నదాన ధర్మవ్రత జపాధ్వరాదులొనర్పకున్నను గృహక్షేత్రదార పుత్రబాంధవాదులభ్రాంతివీడి సాలగ్రామంబుం బూజించి తత్తీర్థపానంబు సేయుచు హరివాసరోపవాసంబుఁ గావించుచు మాఘమాసంబురాఁ బురబహిర్జలంబులని మజ్జనంబుఁ గావించుచు వస్తువిరపేక్షుండై యిందిరారమణ చరణారవిందంబుల డెందం

బునఁ జింతింపుచుండిన మోక్షంబు సులభంబని బంధువులకుం జెప్పి యవ్విప్ర
కన్యలు వెండియు నిట్లనిరి. 152

క. సతులకుఁ బతు లేహారిహార ॥ శతధృతులై యుంటవారి ॥ చరణంబులు తా
మతిభక్తిఁ గొల్వనొప్పగు నితరములె వ్వియునుఁబోల ॥ విలసద్వ్రతముల్. 153

క. అని తెలిపి రిట్టులేనొగి, వినిపించితిశ మనలోక ॥ వృత్తాంతంబుల్
జనవర యనుచు వశిష్ఠుం, డనఘాత్ము దిలీపుతోడ ॥ ననునాతంతుల్. 154

చ. ఎనుబది యాఱువేలిటకు ॥ నెన్నికయోజన సంఖ్యదూరమ
య్యినజుని పత్తనంబని ము ॥ నీశ్వర చెప్పితి వప్పుడీవున
వ్వనరుహ నేత్ర లెట్లు సని ॥ వచ్చిరి క్రమ్మఱ నెన్నిఘస్రముల్
చనియె శరీరముల్ చెడక ॥ చక్కఁగనుండె నదెట్టులింతయున్. 155

వ. చెప్పుమన వశిష్ఠుం డిట్లనియె. 156

## —(*) వశిష్ఠుండు దిలీపునకు మృతకళేబర స్థితు లెఱింగించుట. (*)—

చ. వినుము నరేంద్ర ప్రాణములు ॥ పీడినవల్వది వాసరంబులన్
దనువు కృతంబునం జెడదు ॥ తథ్యము త్రేతయు ద్వాపరంబు వీ
నను మొగిముప్పదిర్వది దినంబులు నుండెఁ గల్యుగంబునన్
దినదశకంబునుండును సు ॥ ధీజనముల్ వచియింతురింతయున్. 157

తే. సూరు లోకకొందరంత్యము ॥ సూరసుతని
వాసముం జేరఁ బోవఁగ ॥ ద్వాదశాహ
ములువిలంబన మగునని ॥ పలుకుదురిది
పుణ్యులకుఁ గాదు తలఁపఁ బా ॥ పులకుఁ గాని. 158

క. యమభటుల నిలమువలెనిర, తమువచ్చుచుఁ బోవుచుంద్రు ॥ ధాత్రికినట్లన్
గ్రమమునఁ బుణ్యాత్ములు శ్రీ, రమణాదుల కరుణఁబోక ॥ రాకలయందున్. 156

క. అతిశీఘ్ర గతులఁ బొల్చెద, రతివలువీ రమ్మహాత్ముఁ ॥ డాయముకరుణా
యతమతిఁ జని యటసర్వం, బతివేడ్కం జూచివచ్చి రవనీస్థలికిన్. 160

క. అదికృత యుగముగుకతమున, ముదితలదేహములు సెడక ॥ ముప్పదిదినముల్
వదలక బంధులు ప్రోవఁగ, సదమలగతి నుండె రాజ ॥ సత్తమ వింటే. 161

వ. మఱియు. 162

చ. మృతిఁగని నంతమాత్రమున ॥ మేదినిలోపలఁ బ్రేతదోష సం
గతములు గావుగాత్రములు ॥ కావునభూవర యేరికైనఁదా
హితవిధిమై యలంకరణ ॥ మెంతయు సేయక మన్న యిట్టుల
య్యతులు శరీరముల్ విడిచి ॥ ప్రాణముతోడుత యోగయుక్తులై. 163

వ. స్వర్గాది లోకంబులకుం జని క్రమ్మఱ తనువులం బొందుదు రట్లుంగా నవ్విప్రకన్యకలు
ముప్పదిదినంబులు యమపురంబున నుండినను దేహంబులు ప్రేతాలంకరణంబుం

బొందమి నాశౌచదోషం బొందకుండె వారును గాత్రంబులం బొంది యపవిత్రుల
గాకుండిరని చెప్పి వెండియు వశిష్ఠుం డిట్లనియె. 164

చ. ద్యుమణికులావతంసమ్మతి నొందినవారలు భూమికింబున
ర్గమన మొనర్చి దేహములఁ గైకొనితొల్లిఁటి యట్లుఁబొల్తుర
న్నమదికిఁ గ్రొత్తయయ్యెనని నమ్మకయుండెద వేమొవిన్ముపూ
ర్వమొకఁడు పుష్కరుండనెడు బ్రాహ్మణుఁడాయన లోకమేగియున్. 165

క. అందమిత యాతనావిధు, లందెడునారకు లనతిద యామతివిద్వ
ద్వందితుఁడుఁ బ్రోచిమగుడం, జెందెశరీరంబు భూమి జేరికడంకన్. 166

ఉ. నాగదిలీపుఁడిట్లనుమనంబునమోద మెలర్పహానికో
హో గురువర్య యీకథమహోత్సుకతన్ వినువాఁడనమ్మహా
భాగుఁడదెట్టులేగెయమపత్తనమందుల నున్నవారిఁదా
నేగతి బ్రోచెనారకుల నింతయునాకెఱిగింపు పెంపునన్. 167

క. ధార్మికుల చరితములు దు, ష్కర్మములం బాపువిసిన సజ్జనులఁకుఁ ద
ద్ధార్మికుల నడవడుల్ భువి, భర్మాంబర ధారునకున వశ్యములగుటన్. 168

తే. అనినముదమందిరాజున కనియెనావ, శిష్ఠుఁగృతపుణ్యుఁడుంద్విజ శేఖరుండు
దురితదూరుఁడునైనపు ష్కరునిచరిత, మెలమిఁవినుపింతువినుమని పలికెనిట్లు.

—(*) పుష్కరుండను బ్రాహ్మణుని చరిత్రము. (*)—

క. భూమీశాగ్రణినంది, గ్రామంబధి వాసముగను గైకొనివేద
ప్రాముఖ్య ధర్మపరుఁడై, యామహితాత్ముడువసించు ననవరతంబున్. 170

సీ. అప్పీటలింకొక డధివసించునుబ్రాహ్మ, ణుండతండుంబుష్క రుండనంగ
నతనికాయుఃపూర్తి యగుడువైవస్వతుఁ, డాత్మభటాలినె య్యమునఁజూచి
తెఱఁగొప్పనేగిన దగ్రామవాసుఁడౌ, పుష్కరాభిఖ్యవి ప్రునివిలంబ
నముసేయకిటఁదెండు నాగనీతనిఁగొంచుఁ, జనియమాంతికమున సరభసమ్ము
మీరనునిచినఁగాంచియా మిహిరనంద, నుండుతత్తేజమునవిస్మి తుండునగుచు
నపుడగద్దియడిగ్గి ప్రి యంబునెఱపి, గరిమమలరంగననియెఁగిం కరులఁ జూచి.

తే. భటవతంసములారయీ బ్రాహ్మణుండు, పరమపుణ్యుఁడు వైష్ణవభక్తియుతుడు
నిత్యసచ్ఛీలుఁడధిగత నిగముఁడాహి, తాగ్నిసర్వహితుండు ప్రి యంవదుండు.

చ. పదఁపడిసంతతంబునతి భవ్యముమాఘనిమజ్జనంబుసం
మ్మదమున సేయువాఁడుగృత పుణ్యుఁడహో యితనిన్ స్థిరాయువున్
మదిసెడితోడి తెచ్చితిరి మాసియునింకొకనింద్విజన్ముని
విదితయశో విశాలుబృధి పీస్థలిఁజేర్పుఁడు స్వస్థలంబునన్. 173

వ. అనిపలికిపుష్కరునవలోకించి. 174

ఉ. మీరుమహానుభావులరు మిమ్ములనిందులఁదోడితెచ్చిమా,
వారలవజ్ఞఁజేసిరిటు వైళముకానకబంధుమిత్రులున్

దారత నూజులింతకును ఽ తద్దయుదుఃఖిలు చంద్రుపొందునా,
సూరత నూజునింగనియ ఽ శోనిధిక్రమ్మఱఁ బుష్కరుండనుఁ. 175

చ. సుమహిత చిత్తధర్మగుణ ఽ శోభితసీపురి నున్నయట్టిదు
ర్దమచర కావలింబడిని ఽ రంతరబాధలఁ గుందుచుండుపా
పమతులఁ జూచు వేడుకలు ఽ భావమునం దుద యించెనట్లునీ
వమరుపు మన్నఁబ్రీతివెల ఽ యంగనురండని సత్వరంబుగఁ. 176

తే. అతనిఁదోడ్కొని చనిరార ఽ వాతిరౌర, వశ్వ భోజనముల్ క్రిమి ఽ భక్షణంబు
తప్తసికతంబరిష్టము ఽ త్కటవిశసన, కశ్మలక్రిమిశతౌర ఽ కర్దమములు. 177

వ. మలంబనునదియు నసిపత్రవనంబును కుంభీపాకంబును కరంభవాలుకా లాలా
భక్షణంబులునవీచీ మత్స్యాకరంబులును రోదనంబు మున్నగువానిఁజూపిన నందుఁ
గొఱ్ఱులం దిగఁబడినవారును నత్యుగ్ర శార్దూలములచే గ్రసింపఁబడువారును
తప్తసికతంబులంబడి తపించువారును విషమంబులగు క్రిములు మేనులఁ దొలువ
బాధలంబడువారును చలచలం గ్రాగుతైల ద్రోణులంబడి మునుంగువారును కరప
త్రంబులఁ జీల్పబడువారు నుఁగుశారాది ప్రహారంబుల నందువారును నున్నతా
ద్రులనుండి క్రిందంద్రోయ నవయవంబులు వికలంబులుఁగా మూల్గుచు లేచు
వారును మఱియు నానావిధంబులగు యాతనల ననుభవించుచు రోదనంబు సేయు
చుండువారును నైన పాపులంజూచి పరితపించి పుష్కరుండు వారి కిట్లనియె. 128

క. ఓపాపు లారమీారట, నోపికనింతైనఁబుణ్య ఽ మొనరింపకదు
ష్పాపాను వర్తులైకద, యీాపగిదిని సంకటముల ఽ కేర్పడుటలిటఁ. 179

వ. అనిన నారకులు పుష్కరుంజూచి. 180

శా. ఓపుణ్యాత్మక నీవచోవితతి యెం ఽ తోసాదరంబై బృహ
త్పాపార్తిం బహుదుఃఖముల్ గుడుచుమా ఽ పాలఁ ముదంబుఁ మన
స్తాపంబుల్ దలఁగించుచోనిడెఁ బ్రియ ఽ త్నస్ఫూర్తి నెంతేనిని
ర్లేపుల్ మీారు భవాదృశుల్ సుకృత వా ఽ ర్ధిఁ దేలుటల్ జిత్రమే. 181

తే. నిజము మీారన్నమాటల ఽ నింద్యచరిత, దురితకర్ములమగుచునీ ఽ దుఃఖవితతి
యాతనాంగము లందియు ఽ ట్లనుభవింప, నైతి మిందులనీయమ ఽ దూతలిడఁగ.

క. పరకాంతా గమనంబును, పరహింసా పరతవెండి ఽ పరధనహారణం
బురుగతిఁ గావించియునీ, పరుసునదుః ఖములకిందుఁ ఽ బాలుఁపడుటయుఁ. 183

ఆ. విప్రకులులమయ్యు ఽ వేదమ్ము బ్రహ్మచా, రులకుధనముఁగొనిని ఽ యూఢిఁజెప్పి
నట్టివారమన్య ఽ లందునునిందల, నునిచియున్నవార ఽ మనఘుచరిత. 184

వ. మఱియు. 185

చ. అనుచరు లుంమరంతమగు ఽ నాకటఁద్రుళ్లఁగ మేలిభక్తముఁ
గొనియును మాఘమజ్జనము ఽ కోరియొనర్పక యింటనుండియుఁ

దనరఁ బరాన్నముం బడిజనంబులు సేరి యొనర్చియున్న భో
జనము భుజించియుఁ గడగి స్నానము సేయక యగ్నిహోత్రముల్. 186

వ. వేల్పక భుజించియు నమితదాహంబున జలాశయంబునకుం బఱతెంచు గోవ్రజం
బును మరల్చియు దుగ్ధంబులమాత్ర ముపయోగించి తత్పశు విసరంబునకు
ఘాసోదకంబులిడకయు విప్రులకు దత్తాపహరణం బొనరించియు దానంబులఁ
గొనువారమై ధనలోభంబున నితరులకు దానంబులిడకుండ దాతల పజ్జం జేరి
బోధించియు దారల విసర్జించియు వ్రతాదు లాచరింపకయుఁ బతివ్రతాజనంబుల
యం దాసక్తిఁ జేసియు నిక్షేపంబులం బరిగ్రహించియు మిత్రద్రోహంబొనర్చియు
నింక నిట్టి పాపకార్యంబు లనేకంబులు గావించి యీ వేదనలం బడుచున్నవారము
మహాత్మా యని వదనంబుల విన్నదనంబు దోప నీరెలుంగునం బలికిన పాపాత్ములకు
మగుడఁ బుష్కరుం డిట్లనియె. 187

ఉ. నారకులార మీరలు సనాతను దీనశరణ్యు నిందిరా
సారసనేత్రి భర్తనని శంబు మనంబులఁ జింత సేయ కీ
ఘోరతరంబులౌ నరక కోటులఁ గూలఁగ నైతి రామహో
దారుఁ గృపాలవాలు నిరతంబు భజించిన నింత వచ్చునే. 188

చ. తరువులు పుష్పపత్రఫలదంబులు నిర్ఝరిణీనదంబులు
ర్వరజలపూరితంబులు కరంబులు పాదములుం బ్రశస్తముల్
దురితవిదూరు భక్తజనదుఃఖవినాశను నిందిరామనో
హరు నభిషేకపూజనము లాదృతి సేయని హేతు వేమికన్. 189

క. హరిఁ బూజించిన దురితము, లరయంగాఁ గలవె మీర లటుఁ బూజాత
త్పరతం గానమి బహుదు, స్తరదుఃఖము లిప్పుడివ్విధంబునఁ గదిరెన్. 190

క. ఇపుడైన మానసములా, ద్విపవరదుని యందుఁ జేర్చి ధృతిఁ దలఁచుండా,
తపనీయచేలుఁ డెంతయు నెపమెన్నక ప్రోచి మిముపు నీతులఁ జేయున్. 191

వ. ఏను మీకు శుభంబుఁ గోరి లోకనాయకుండును శుభదాయకుండును కరుణా
సముద్రుండునగు పుండరీకాక్షుఁ భజించెద మేలగుననుడు దీనవత్సలుండగు
పుష్కరునకు నమస్కరించి నారకు లిట్లనిరి. 192

క. మీ పాదంబుల సాక్షిగ, నో పావనచరిత మాకు నొక్కట తనుసం
తాపంబు లణఁగె మాపై, మీపైఁ బఱతెంచుగాడ్పు మేలిమిఁ బర్వెన్. 193

ఉ. ఎంతటి పుణ్యశాలివి మహీసురవంశవిభూషణంబ యొ
క్కింతవిరామముం గనక యేము రుదుఃఖము లందుచుండని
వెంతయు మోదమీ మెడ వహింపఁగఁ జేసెఁ ద్వదీయదర్శనం
బింత కృపారసంబుఁ గలదే బహుపాపుల మైన మాయెడన్. 194

వ. ఎట్లయిన నీవ మముద్ధరింప సమర్థుండవు. 195

క. అని పలుకుచుండు నవసర, మునబుష్కరు తోడనాయ । ముండనునిటమీ
రనువార నన్ని యెడలం, గనుగొంటిరి గాదెయింకఁ । గడుశీఘ్రమునన్. 196
చ. చనుఁడు భవత్సుతాప్తజన । సంఘముమీసుద తీలలామముల్
ఘనమగు దుఃఖవార్ధిఁగడఁ । గానకమున్గుచు నుండ్రునావుడి
ట్లనియె ధరామరుండు విని । ధాధికబాధల నందుచున్నమముల్
బనిగొని బ్రోవవేయనుచుఁ । బల్కెడివారల వీడనెట్లగున్. 197
వ. మఱియు. 198
క. వారక మొఱవెట్టుచునీ, వారము రక్షింపుమనెడి । వారిఁదొఱఁగియె
వ్వారైనఁ బోదలంతురే, భూరిదయా మతులుశమన । బుధనుతసుమనా. 199

—(*) పుష్కరుండు నారకుల నరక విముక్తులఁజేయుట. (*)—

వ. అనిపలికి తన్నారక రక్షాపరత్వ మంగీకరించి యప్పరమకారుణి కుండగు పుష్కరుండు. 200
తే. అఖిల భూతంబులకునాత్మ । యైనవాఁడు, సర్వమయుఁడును నీశుండు । సర్వసాక్షి
యైన నారాయణుండు మ । దర్చనముల, నెలమి నెటులందెనటులవీ । రలనుఁగాచు.
ఉ. ఏమహా నీయునందువసి । యించుసమస్తము నంతటన్ మతే
స్వామి జగన్మయత్వమున । సంగతుఁడై వెలుఁగొందుచుండునిం
ద్రామర విశ్వసృడ్భవులు ప్రార్థనసేయుదు రెవ్వనింబరం
ధాముఁడె వండతండు విత । తాదృతిపీరల నిప్డుఁగావుతన్. 202
వ. అని మఱియు. 203
శా. ఓకంజేక్షణ కృష్ణమాధవయనా । ధోద్ధార గోవిందను
శ్రీకల్యాణ సురారిగర్వహరశౌ । రీదీనమందార యో
హోకారుణ్యనిధానదండధర బా । ధోపేతులన్వీరినా
లోకింపగదె వీతకల్మషులఁ గా । లోకేశ లక్ష్మీపతీ. 204
క. అనిపుష్కరుండొనర్చిల, వనజాక్షుని సంస్తవంబు । వారుసుభక్తిన్
వినిత న్నిరుపమసత్కృప, జనవరవీ డ్వడిరినరక । సంహాతివలనన్. 205
వ. అట్లు నరకవిముక్తులై పుష్కరు సన్నుతించి మహాత్మా మీ యనుగ్రహంబునఁ గృతార్థులమైతిమి భవద్యశంబు జగద్వ్యాపితంబై యాచంద్ర తారార్కంబుఁగా నెగడుఁగాతమని రపుడు యముం డంతయుంజూచి విస్మితుండై బుష్కరుం బలుమారుపొగడి యిట్లనియె. 206
ఉ. నీవతి పుణ్యశాలివవ । నీసురశేఖర నీచరిత్రముల్
పావనముల్ గృతార్థులుఁగ । వారకచేసితి వీరినింనువి
శ్రావము గాభవద్యశము । సంతతమింకను నీకునీదు మి
త్రావలికిన్ మదీయభయ । మందదుపొందదు పాపపుంజమున్. 207

క. నీమహానీయచరిత్రము, నేమానవుఁ డైననేని । యేర్పడమదిలోఁ
ప్రేమించి సన్నుతించిన, నామనుజునిఁ జెందదెప్పు । డపమృత్యువుదాన్. 208

క. నరగుణఁ జనుమింకనుభూ, సురశేఖర పుడమిఁకీవు । సుదతీసుతసో
దరులాది బంధువర్గము, గురుతరదుఃఖములఁజాలఁ । గుందెదరచటన్. 209

వ. అని యముం డనుగ్రహించి పంచిన పుష్కరుండు మరల భూలోకంబునకు వచ్చి నిజశరీరంబు సొచ్చి బంధువులు మోదంబంద యథాస్థితి నుండెనని చెప్పి వెండియు నిప్పుణ్య చారిత్రంబు నీకెఱింగించితి దీనిఁ జదివిన విన్నవా రయ్యమునికరుణ నప మృత్యుభయంబునం దలఁగువారని గురుండు మఱియు రాజున కిట్లనియె. 210

చ. నరవరకేశవుంగమల । నాభుగదాధరునిందిరామనో
హరునుతి సేయవిన్న దురి । తాత్మకు లప్పుడ పాసిరందు దు
స్తరనరక వ్రజంబులను । ధార్మికులై నిరతంబుభక్తి న
మ్మురహరు సంస్మరించుజనముల్ దురితంబులఁ బాయుట బ్రమే. 211

క. అనిపుష్కరుని చరిత్రము, వినిపించె దిలీపభూమి । విభునకునని య
మ్మునివల్లభుండు సూతుం, డనెవెండియుఁ దానుశౌన । కాదులతోడన్. 212

క. భూరిగుణార్ణవులారా, ధారిణికిని మరలయమని । ధామము మొదలన్
జేరినవారిటులెందరొ, తారరుదెంచుటయుఁగలదు । తలఁపోయంగన్ 213

క. త్రేతాయుగమునరామ, క్ష్మాతలపతి విప్రబాలు । గతజీవుఁబున
శ్చైతన్యునిఁ గావించిన, నాతండటుఁ బ్రదికెసర్వు । లానందింపన్. 214

క. శ్రీకృష్ణమూర్తితనయశ, మాకల్పముఁ గాగమరల । నవనీస్థలిసు
శ్లోకుని సాందీపనిసుతు, నాకాలుపురంబునుండి । యటమునుదెచ్చెన్. 215

వ. అనిన మునులు వీనిం దెల్పుమనుడు సూతుం డిట్లనియె. 216

—(*) శ్రీరామచరిత్రము. (*)—

ఆ. అమరులెల్లనంబు । జాసనయుక్తులై, రావణాదిదుష్ట । రాక్షసులకు
వెరచిశరణుఁజొచ్చి । వెరవేదియనవారి, భయమువాపఁ గంజ । నయనుఁడెలమి.

సీ. శ్రీసూర్యవంశాబ్ధి । శీతమయూఖుఁడై, యాజకిఁగౌసల్య । యందుఁబొడమి
కౌశికుజన్నంబుఁ । గాచితాటకిఁద్రుంచి, విసపుమేతరివిల్లు । విరిచిసీతఁ
బరిణయమైసహో । దరసతీయుతముఁగా, జనకాజ్ఞ దఁడకా । వనికినేగి
మునులఁబ్రోచివిరాధుఁ । దునిమినాసాకర్ణ, రహితగావించిశూ । ర్పణఖఁగదియ
త్రిశిరఖరదూషణాదుల । విశసనంబొ, నర్చినీచునిమారీచు । నామమణచి
సీతఁగోల్పోయివెదకుచుఁ । జెచ్చెరంజ, టాయుఁగాంచికబంధున । డంచియంత.

ఆ. ఆమతంగపర్వ । తాశ్రమస్థితమైన, శబరిఁజేరియధిక । సంభ్రమమున
నదియొనర్పఁబూజ । లన్నియుఁగైకొని, పరమొసంగిపంప । కరిగియుందు. 219

క. హనుమంతునిఁ బరిచరుఁగాఁ, గొనియినజుని చెలిమివాలిఁ । గూలిచికపిరా
జునుఁజేయ రవిజుఁడంపిన, జనకజఁగనుఁ గొనఁగఁగీశ । సంహతితోడన్. 220

క. అనిలాత్మజుండు సని దా వననిధి లంఘించి లంక వామాక్షిం గ
న్గొనివచ్చి చెప్పనప్పుడు, వనచరపతి బలయుతముఁగ వార్థికినడువన్. 221

క. కట్టించి వానరులచే, నెట్టన సేతువు బయోధి నృపుఁడవ్వలిదా
గట్టునకుఁ జేరిమదిలోఁ, దొట్టిన కనలార విలయ ధూర్జటివోలెన్. 222

క. సుతబంధుసోదరాప్త, ప్రతతిబలాన్వితముఁగాఁగ రావణుననిలో
హతమొనరించి యిలాసుత, నతివేడుక శిఖిముఖమున నరుదేఁగొనియున్. 223

క. శరణాగతుని విభీషణుఁ, దిరముఁగ తా లంకకధిప తిం జేసి వియ
చ్చరులెల్ల వొగడఁబుష్పక, మరుదారఁగ నెక్కి నిజపు రాభిముఖుండై. 224

తే. అరిగి నిజరాజ్య వైభవ మంది ముగురు,
తమ్ములనమాత్యులుం గొల్వ దశరథాగ్ర
నందనుఁడు నిండుఁగొల్వు పు రందరుండు,
వోలెనుండఁగ నొకనాఁడు భూసురుండు. 225

క. మరణించిన కొమరుంగొని, త్వరనగరికి వచ్చియునిచి వాకిటఁ బ్రజల
బ్బురమంది చూడవారలఁ, వరుసం దిలకించియిట్లు వాపోఁదొడఁగెన్. 226

ఉ. అక్కటచూడ రయ్యప్రజ లాత్మజుఁడుం గనువృద్ధు నైననా
కొక్కఁడు వీఁడుఁ గల్గఁ బ్రియ మూనిన నైదవయేట నేనన్
జక్కనడించి యేగఁ ద్రిద శాలయు మేనెటు తాళువాఁడ నిం
కెక్కడఁ బోవువాఁడ విధి నేమనిదూరెదు వాఁడనింతకున్. 227

క. కడువను సత్యము హింసకు, నెడదభయుం బడుదుశీల మేవిడువఁగడుం
గడుదుఃఖము నాకిడి యీ, బ్బుడుతఁడ కాలమునఁజావఁ బోలునెయిట్లున్. 228

—(*) విప్రుండు మృతసూను మొగసాలనుంచి రామునిందించుట. (*)—

క. ఏపాపమెఱుఁగనాకునుఁ, బాపురె మరణాంతమునను పదఁపడి స్వర్గ
ప్రాపకములైన సత్క్రియ, లేపునఁ గావింపకేగె నేయపమృతిచేన్. 229

క. రాముని పాపం బీగతి, భీమంబై పృథివినిండె బిడ్డఁడు వోగా
నీమాట నిశ్చయంబగు, మోమోటమి కేల సత్య మున్ వాక్రువ్వన్. 230

చ. బ్రదుకఁగ నేల యింకనిట భార్యయు నేదనువుల్ దొఱంగి న
మ్మదిమొయి మత్తనూజునిఁ గ్రమంబున సేరెద మిద్ధరావరుం
డుదిత ముదంబుతోడ సతి యున్ దనకూర్చు సహోదరాదులున్
బ్రదుకఁగ నిమ్ము ధారిణిఁ జిరాయురు పేతులుగాఁ సుఖంబునన్. 231

తే. రాజదోషంబునంగాక ప్రజలకిట్టి, చావులెట్లగు నధిపుఁడు సత్యధర్మ
శీలుఁడగునేని యదిధర్మ కాలమెట్లుఁ, గాకయుండును నాశమెక్కరణిఁగలుగు.

క. లేదించుక సందేహము, రాదిటు మావానిచావు రాజాఘముచే
గాదనక చచ్చెఁగాకిక, నేదైవ మొసంగువిప్రు డిబ్బాలకునిన్. 233

క. అని మఱియుఁ బెక్కువిధములఁ, బనువుచు దుఃఖించుచుముదుక । పాఱునివిధముల్
జనిసర్వమచటనెఱిఁగిం, చినచారులు రామవిభుఁడు । చెచ్చెరనటకున్. 234

వ. చేరి మృతకుమారు వస్త్రాచ్ఛాదితుఁజేసి తెచ్చి యునిచి తన్ను నిందించుచున్న బ్రాహ్మణుంజూచి యత్యధికంబగు సంతాపంబునం గొలువుకూటంబుననుండు మంత్రులతో నాలోచించుచుండు నెడ బ్రహ్మర్షులగు కాస్యప కాత్యాయన జాబాలి గౌతమ మార్కండేయ మౌద్గల్య వామదేవులతోడ సురర్షియగు నారదుండు చనుదెంచిన ముదమంది రామచంద్రుండు వారినుచితాసన స్థితులఁగావించి తగు విధానంబులఁ బూజించి మహాత్ములగు వారితో నవ్విధినంతయుం దెలిపి కారణం బడిగిన నందు నారదుం డిట్లనియె. 235

క. జనలోక నాథవినుమీ, దినమేతద్బాలుఁడపమృ । తింబొందినకా
రణమెఱిఁగించెదనాలో । చనసేయుము పిదపదాని సందర్భంబున్. 236

క. కృతయుగమున బ్రాహ్మణుల, ద్భుతతపములు సేయుచుండ్రు । మొగిఁజేయుదురా
క్షితిపతులుఁ ద్రేతసల్పుదు, రతివేడ్కం ద్వాపరంబు । నందూరప్యుల్. 237

వ. మఱియుఁ గలియుగంబున శూద్రులాచరింతు రట్లు వా రుగ్రతపం బొనర్చియు నిజకుల ధర్మవిరుద్ధంబై యుంటఁ దత్ఫలంబునం దరిది త్రేతాయుగం బిక్కాలంబున.

శా. నీదేశంబుననెందొ శూద్రుఁడొగిని । గ్నిద్రప్రభావంబుతో
నోదేవస్తుత సేయుచుండుఁదప మ । త్యుగ్రత్వ మొప్పారఁగా
నాదోషంబున నీధరామరుఁడుసం । త్యక్తాసుఁ డయ్యెంజుఁడీ
రాదే పాపముధారిణీపతికిఁ ద । దాష్ట్ర ప్రజోత్పన్నమై. 239

క. నరవరుఁడు దానిఁజక్కనఁ, బరువడిఁగా వింపడేని । పదపడితానున్
నరకంబు నందునీవా, దరమునఁబనిఁ గొనుము వేగ । ధర్మాసక్తా. 240

క. దురితం బెచ్చోఁగలుగుం, ధరణిపుఁడ చ్చోఁబ్రయత్న । తంగనియడఁపన్
వరమగు ధర్మువుదానను, ధరణీపతి వృద్ధిఁబొందుఁ దానాయువునన్. 241

వ. మఱియుఁ బ్రజావృద్ధియగు నీ విందునకుం గడంగి. 242

క. వెదకించి నాల్గుదిక్కుల, నదిచక్కనఁ జేయుమీద్వి । జాత్మజుఁడెలమిన్
బ్రదుకంగఁ గలఁడు శ్రేయా, స్పదుఁడీవగు దనుచుమౌని । సత్తముఁడనినన్. 243

క. వినిరామ చంద్రుఁడిట్లను, ననుజన్మునిఁ జూచిలక్ష్మ । ణాయిదివింటే
చనివేగ నామహీసుర, తనయునిశవ మిడఁగఁజేయు । తైలద్రోణిన్. 244

తే. అనుచు లక్ష్మణుతోఁబల్కి । యినకులుండు, తనమనంబునఁబుష్పకం । బునుఁదలంప
దరలియదివచ్చియొకముహూ । ర్తంబులోన, నెదురనిలిచినమానుల । కెఱిఁగియపుడు.

తే. వారియనుమతిఁగైకొని । వరుసతోడ, కంకటంబును ధనురస్త్ర । ఖడ్గసమితి
దాల్చి పుష్పకమెక్కియా । ధరణినాథుఁ, డపర దిగ్భాగముంగూర్చి । యరిగియందు.

క. ఎల్లెడల వెదకికానక, బల్లిదుఁడా రాఘవుండు । పదఁపడిక్ష్మాభృ
త్తల్లజ మాహిమవద్గిరి, యల్లికొనిన యుత్తరాశ । కరిగియునందున్. 247

క. వీక్షింప నట్టిచందం, బక్షిద్వయి వడమినధిపుఁ డంతటనచ్చో
టాక్షణమ వీడిపూర్వాది, శాక్షోణిం జేరియందు సర్వముజూడన్. 248
క. అందెందుఁ గానరాకు, న్కిందరలివి శాలమైవి నిర్మలమైపెం
పొందిన దక్షిణమేగియ, టందగనొక పర్వతోత్క టారణ్యమునన్. 249
చ. ఒకసరసీతటంబున మహోరుతరంబగు నిష్ఠతోడఁ గ్రిం
దికిశిరముం బదద్వయము దెంపునమీఁదికిఁ గాఁగఁ జేసితా
నకుటిల వృత్తిమైతపమ హార్పతి తేజము మీఱసల్పునొం
డొకనిఁగనెన్ రఘూద్వహుఁడ హోయిదివేద్యమ టంచునెంచుచున్. 250
వ. అట్లు వీక్షించి యతనిండగ్గఱి. 251
మ. ఉరుపుణ్యాత్మక నీవెవండవిటులీ యుగ్రాటవిం జాలభీ
కరమైనట్టి తపంబుసల్పెదవశ క్యంబిద్ది విప్రుండవో
ధరణీపాలక వంశజాతుఁడవొ త ధ్యంబీవు వైశ్యుండవో
చరణావిర్భవ వంశసంభవుఁడవో చక్కన్వచింపంగదే. 252
క. వినఁగోరు వాఁడనీదగు, ఘనతేజం బద్భుతంబుఁ గావించెమనం
బునకేను రామనాముఁడ, నినవంశుఁడ దశరథావ నీశునిసుతుఁడన్. 253
ఆ. అననతండుదక్షి ణాస్యుఁడై రామునిఁ, దేరిచూచిపలికె ధృతిదలిర్ప
నధిపశూద్రకులుఁడ నాఖ్యశంబుకుఁడని, త్తనువుతోడస్వర్గ మునకుఁబోవ. 254
క. బలునిష్ఠ మెయిఁదపంబే, సలిపెదనన రామవిభుఁడు శంబుకుఁ గోడన్
బలికెం గ్రమ్మఱనీవిధ, మలవడునే త్రేతశూద్రుఁ డంచునెతపముల్. 255
వ. మఱియు నీ స్థూలశరీరంబుతోడ దివంబునకేగ నుద్యమించినవారలుఁ బూర్వం
బున విఫలమనోరథులై యున్నవారిది మాని నీవంశాచారవిధంబున నార్యజనం
బులం గొలిచి సద్గతిం బడయుమనిన నతండు. 256
క. జనపాల వినుముపూసిన, ఘనతపమే విడువదీన గైకొనువాఁడం
గొనకొని నాకపదంబు, ర్వినరుల్దా మొసఁగువారె వేడికొలిచినన్. 257
ఆ. సద్గతికినిశూద్ర జాతుండుతగఁడేల, తపమొనర్పఁడేల తత్ఫలంబు
నొందఁడేలయిన్నిఁ జేపట్టఁద్రైవర్ణి, కులనుగొలువనేల పొలుపడంగి. 258
వ. అఖిల జనంబులకు నాత్మయొక్కండై యుండి తదీయధ్యానంబు సేయుటకుఁ గాల
దేశపాత్రంబు లూహింపనేల యీవేడబంబులన్నియు శ్రేయోవిఘ్నంబులగుఁ గాని
మఱియొండుఁగాదు పొండనుచు మరలఁ దపంబున కారంభింప రామచంద్రుం
డాత్మగతంబున. 259
క. వేదోక్తమైనధర్మం, బాదరమునఁ గొనడుమూర్ఖుఁ డైయిటుఁడానా
మోదించెసత్పథంబిదిఁ, గాదనరా దిట్టులైనఁ గలుఁగునఘంబుల్. 260
తే. అనుచుఁ జింతించి ద్విజసూను నసువులెత్త, వలయు మత్కరఖడ్గని ర్దళితుసితని
నేఁడెఱింజేసి సురలోక మీయవలయు, దీనశుభమనిచేసెనా తెఱుఁగువిభుఁడు,

వ. అంత. 262

క. ఉరుగతినాడిరిదివిన, ప్సరసల్ మొగిఁబుష్పవృష్టి వర్షించెనుమే
దురముగ సురదుందుభి భా, స్వరవాదము లడరెసురలు వచ్చిరచటికిన్. 263

తే. అట్లు చనుదెంచి మున్నయ్యు న నలుఁడుండ,
నిలిచి శ్రీరామచంద్రునిఁ బలుఁదెఱఁగుల
బొగడికోరు మభీష్టార్థ ములనొసంగు,
వారమనుటయు రాముండు వారికనియె. 264

తే. అమర వరులార మీరు మా కఖిలవరము,
లొసఁగినట్లగు నిష్ఠభూ మి సురవర్యు
సూనుఁ బ్రదికింపుఁ డనవుడు సురలురామ,
చంద్రుతో నిట్లులని రతి సంభ్రమమున. 265

క. ధరణీశ్వర శంబుకుఁడు, ద్వరఁగూలిన యపుడెజీవ వంతుండయ్యెన్
మరణించి యున్న భూమీ, సురసూనుఁడు మీయశంబు శోభిలెదిశలన్. 266

క. అనిపలికి రామ భూవిభు, ననుమతి నమరాలిసనియె నాతండునుఁబ
త్తనమేగు దెంచిజీవిం, చిన విప్రాత్మజునిఁజూచి చెందెముదంబున్. 267

వ. అంత నయ్యయోధ్యా పురంబునంగల భూమిసురులందఱు పరమానందభరితులై రామ భూవిభుంజేరి. 268

ఉ. రాజకులావతంససుర రాజసభా కలితప్రశంస నీ
రాజితకీర్తి కీయదిధ రాస్థలిసార్థకమయ్యె రాజులి
ట్లీజగతిన్ గతించిన మ హీసుర బాలురఁదెచ్చి యిచ్చిరే
యోజన నాథనీకు నెన యున్ వివిధాధిక సౌఖ్యసంపదల్. 269

వ. అని దీవించి చనిరి రాముండును సోదరాన్వితుండై యథావిధి సుఖంబుఁగా రాజ్యంబు సేయుచుండె నని సూతుండు శౌనకాదులకుం బలికి కృష్ణుండు యమ మందిరంబుననుండి గురునందనుం దెచ్చిన విధం బెఱింగింపంగోరి యిట్లనియె. 270

—(*) సాందీపని చరిత్రము. (*)—

చ. వసుధన వంతినాగనొక పత్తనమొప్పున సంఖ్యభూసురా
వసథ మనేకచారుతరు భాసితమంచిత వస్తుపూరితం
బసదృశ భాగ్యసంగతమ యాచకమర్త్య గణాన్వితంబుసా
రసకల హంసశోభితన రస్సరిదంతిక మై యొసంగుచున్. 271

వ. మఱియు నొక్కయోజనంబు నిడివియు నంతియ వెడలుపుంగలిగి వర్ణాశ్రమాచార తత్పరులగు చాతుర్వర్ణ్యంబులవారితో నొప్పు నప్పురంబునందు. 272

తే. ఉండు సాందీపనియన విప్రుండువేద,
శాస్త్రపారగుఁడును సత్య శౌచరతుఁడు

స్వాశ్రమాచారపరుఁడతి । శాంతియుతుఁడు,
దాంతుఁడు జితేంద్రియుండు జి । తక్రుధుండు. 273

వ. మఱియు సర్వలక్షణ సంపన్నుండును నసూయారహితుండు మితాశి యుమితవచనుండు తపోధ్యయన తత్పరుండు దేవద్విజ పూజాపరుండు దృఢవ్రతుండు సర్వభూతహితుండు స్థిరచిత్తుండు స్థిరప్రయత్నుండు దోషవివర్జితుండునైన యతనికి.

క. చిరకాల మరిగినంతట, వరసూనుం డొక్కఁడుద్భ । వంబైనమహా
దరబుద్ధిఁ దానుసతితోఁ, నరయుచుఁ బోషించిపంచ । మాబ్దమునందున్. 275

క. ఉపనీతుఁ జేసి వేదము, లపుడతఁడుఁ బఠింపఁజేయ । నన్నిఁబఠించెన్
సుపథమున నీతనికినీ, డిపుడితఁడే యనుచుజనము । లెల్లనుతింపన్. 276

వ. అటుల నక్కుమారుం డధీత సర్వవేదుండై. 277

ఆ. అరిగె మాఘమజ్జ । నార్థియైపూర్ణిమ, నాప్రభాసతీర్థ । మునుఁగుఁ జెలులు
చెలులుతోడ మనసువ । వడిన హర్షుఖమునఁ, బితరులకునుభక్తి । నతులుసలిపి. 278

ఉ. భూసుర నందనుండటులఁ । బోయి ముదంబునఁగాంచెఁ బుణ్యసం
వాసము సిద్ధమానిజన । వార నితాంతవి మజ్జనాతి వి
శ్వాసము నిర్మలాంబు పరి । వర్తిత పాంసుపతత్ర సంచయో
ల్లాసము తీరభూరుహ చ । లచ్ఛిఖిలాసము నాప్రభాసమున్. 279

వ. కాంచి కృతాచమనుండై శాస్త్రవిధి నుదకమధ్యంబున నిలిచి. 280

క. ఓకృష్ణమాధవా హరి, యీకమనీయోదకముల । నిక్కల్యమునన్
గైకొనెద మాఘనియతిం, జేకొనినన్నుద్ధరింపు । క్షేమమెలర్పన్. 281

క. అనిసంస్మరించి జలముల, మునిఁగిన వాఁడట్టె మునిగె । మొగివిప్రసుతుల్
మునిఁగి తటంబును శీఘ్రం, బునఁజేరియుఁ గొంతజూచి । పోయికడువడిన్. 282

క. సాందీపనికిం దత్సుతి, కిందను జన్నుండుతటిని । కిందమవెంటన్
ముందువడి వచ్చినీటం, డిందినగతిఁ దెలుపవినివ । డిన్జననిధరన్. 283

వ. త్రెళ్లి మూర్ఛిల్లుటయు. 284

క. ఆలీలమేనెఱుంగక, నేలంబడి యున్నవిప్రు । నెలఁతుక నాప్తుల్
చాల నుపచార విధులం, దేలించినఁ గొంతకుఁదలఁచి । ధృతిపీడ్వడఁగన్. 285

క. వేయటు లేచుచుఁ బడుచున, యోయమ్మయి కెట్లటంచు । నోయనిపెలుచన్
వాపొత్తి యరచుచుం దాఁ, బోయెనెనుం దవిలికొంతఁ । బోనటుజనముల్. 286

వ. అట్లుం బోయి యవ్వాహినిం జేరి యందు. 287

క. జలములఁ బడఁబోనడుగిడు, నెలుఁగెత్తియు యోసుతాయి । దేచనుదేరా
జలముల వెలువడియనుచుం, బలుమారును విభ్రమంపు । పలుకులఁబిలుచున్.

వ. సాందీపనియుం ధోడ నరిగినవాఁడు షడ్గుణసంపత్తిఁ గలవాఁడగుట దుఃఖింపక విప్రకుమారులం జేరఁ బిలిచి మత్తనూజుం డేమనుచు జలంబుల మునిఁగె నెఱిం గింపుండ నవుడు బ్రహ్మచారు లిట్లనిరి, 289

క. శ్రీకృష్ణ మాధవాహరి, యీకమనీ మోదకముల నిక్కల్యమునన్
గైకొనెద మాఘనియతిం, జేకొని నన్నుద్ధరింపు క్షేమమెలర్పన్. 290

వ. అనుచు మునుకవైచినవాఁడు లేవఁడయ్యె ననుటయు సతంకు. 291

క. పలుమారు చానియర్థము, తలఁపునఁ జింతించి కడుముదంబున నా శ్రీ
లలనాధిపుండె మత్సుతు, వెలయఁగ రక్షించునని నివృత్తుండయ్యెన్. 292

క. అంతటఁ గొందఱుతన్నది, నెంతయు నీరముల వెదకి యెందునుఁ గనమిన్
వంతంబడు తత్సతినిని, శాంతమునకు జేర్చి యుండ్లఁ జనిరందఱొగిన్. 293

వ. అటఁ గొన్ని వాసరంబులు సనిన నవ్వనితయుఁ గుమారుఁ గొంతమఱచి పతిం
గొలిచి యుండె పదంపడి కొంతకాలంబునకు. 294

సీ. శూరావనీశాత్మజుండగు వసుదేవుఁ, డలరుచుఁ దనదు పుత్రులకు రామ
కృష్ణాభిధానుల కెలమి బురోహిత, బ్రాహ్మణతతిచే నుపనయనంబుఁ
సేయించి యధిక దక్షిణలిచ్చి తత్సుతో, దయకాలమునఁ గంస ధరణినాథు
బంధనంబుననుండి పదఁపడి తామనం, బుననివ్వ నెంచిన ధనచయంబుఁ
గోవ్రజంబుల సమ్మేటి కొదువఁగామి, బ్రాహ్మణోత్తములకు సమర్పణముఁ జేసి
ముదము చెందిన వెనుక నమ్మోహనాంగు, లిరువురుం దీక్షితులునయ్యి యింపుఁ దనర.

క. యదువులకుం గులగురుఁడై, ముదమున వెలుఁ గొందు గర్గ మునిగాయత్రిన్
వదలక బోధింపఁగ సమ్మదమునఁ గొని రప్పుడా కుమారశ్రేష్ఠుల్. 296

వ. అట్లుఁ గైకొని దాని ననుష్ఠింపుచు. 297

తే. అఖిల సద్విద్యలకు నాలయములు మఱియు,
నఖిలగురులును నఖిలాత్మలఖిలమునకుఁ
బ్రభువులయ్యును జనవిడంబనము సేయ,
నెమ్మదింగోరి వారలు సమ్మదమున. 298

—(*) రామకృష్ణులు విద్యార్థులై సాందీపనిం జేరుట (*)—

క. గురుకులవాసము సేయుచుఁ బరువడి విద్యలను నేర్వ బలదేవుఁడు సో
దరుఁడైన కృష్ణమూర్తియు, నరిగిరి దేశాంతరముల నాచార్యునకై. 299

వ. అట్లు. 300

క. చనిచని కాశీవిషయం, బునఁ గలుగు నవంతిఁ జేరి పుణ్యుని సాందీ
పనిఁ జూచి యమ్మహాత్ముని ఘనతేజంబునకు వెఱగుఁ గాంచి మనములన్. 301

క. ఈయిరువురు పుణ్యుఁడు మనకుం, బాయక గురుఁ డౌటకొప్పు పదఁపడి మనముఁన్
జేయుటకు నొప్పు సుశ్రూ, షాయత్నంబులను భక్తి సదమలబుద్ధిన్. 302

వ. అని యతనిం జేరి శిష్యులై సేవించుటయు. 303

క. సాందీపనియును వారల, యందలవడి యున్న భక్తి కలరి పఠింపం
జెందగ శ్రుతిశాస్త్రంబులు, పొందుఁగఁదా నుపనిషత్సమూహము మఱియున్.

వ. వేదాంగంబులును ధనుర్వేదంబు సంగీతము మొదలుగాఁ జౌషష్టివిద్యల నెఱిం
గించిన. 305

ఉ. వారు జగద్వితానమున వారణఁ బ్రోవఁగఁ బుట్టినట్టిదై
త్యారి వరాంశజాతులు మహామహులౌట తదీయవిద్యలన్
దారు దినక్రమంబులను తద్దయుఁ జెప్పిన యంత నేర్చిరౌ
రౌర భళీయటంచు జను లాడఁగ నర్వది నాల్దినంబులన్. 306

క. వెరవార నేర్చియువ్విధి, గురునిం దిలకించి యేమి కోరికమీకున్
గురుదక్షిణఁగ నొసంగెద, మరయుమహాత్మా నిజాత్మ నననాతండున్. 307

వ. వారి యమానుష లక్షణంబు లుపలక్షించి వీరు కారణపురుషులని భావించి
నిజాంగనామణితో నాలోచించి యనంతరంబ. 308

క. నీరధికిఁ జేరియుండియు, పారంబై యున్నయాప్రభాసాఖ్యధునీ
వారి మునింగినసూనునిఁ, గోరెంగురు దక్షిణయుఁగఁ గూర్పుఁడటంచున్. 309

ఆ. అట్లుఁగోరవార లగుఁగాక యనిజగ, దాఢ్యులఖిలకామి తార్థసిద్ధు
లగుటఁజేసితత్క్రియారంభులైగురు, పాదములకు మ్రొక్కి పనివినియును.

చ. వనజ దళాక్షుసీరులు కృపాణధనుశ్శర పాణులైకన
త్కనక రథంబులెక్కి నిజ కాంతులుదిక్కులఁ బర్వఁగారయం
బునఁజని చేరిరూర్మిచయ భూరినినాద వినిద్రమున్ బృహ
ద్వనచర జంతుసంఘుకచి తాధిక రౌద్రము నా సముద్రమున్. 311

సీ. సుమహితాధికవి హంగమతురంగములతో, నురుతిమింగిలగంధ కరులతోడ
తరణిప్రకాండభా స్వరరథావలులతో, నంతరీపశిరోగృ హములతోడ
విపులోర్మికానీక విషణిమార్గములతో, నతిగభీరాంబుఖే యంబుతోడ
జలనీలికాసము జ్జ్వలవనావళులతో, సైకతోన్నతసౌధ సమితితోడ
జలచరాదిక జంతుప్ర జాలితోడ, కలితనిజరావ జనకల కలముతోడ
బరగి యవ్వార్ధి యపుడుఁజూపట్టెవరుణుఁ, డేలు శ్రద్ధావతిదియోఁగాబోలుననఁగ.

ర. మఱియు నా సముద్రుంను. 313

ఉ. తుంగత రంగహస్తములఁ దోరపు వేడుక సాచివారినా
లింగన మాచరించియును లీల మహారవ సంస్తుతుల్ రసం
బుగడు మీరసల్పియదు పుంగవులం దన రంగసత్కరిం
చెంగని యధ్వయానమునఁ జేకుఱినట్టి శ్రమంబుపోవఁగన్. 314

. అంత శ్రీకృష్ణుఁ డయ్యాప గాధినాథు
తోడమద్గురు తనుజాతు నాడుసీను
తోయములఁగ్రుంక హరియింప న్యాయమగునె
తెమ్ముసత్వరముఁగ బాలు నిమ్ము మాకు. 315

చ. అనుడు దధీశుఁడాయదుధ రాధిపుఁగృష్ణునిఁ జూచియిట్లు వ
ల్కెననఘ యేను బాలునప కీర్తి యొసంగ హరింపలేదు మ
ద్వనముల సంతతంబొకఁడు పంచజనుండను మానవాదుఁ డి
మ్మునఁజరి యించువాఁడు దర ముంబలెరూపముఁ దాల్చియుండెడున్. 316

వ. అద్దనుజుండు భవద్గురు తనూజు మ్రింగె. 317

క. అనివారిధీశుఁ డెఱిఁగిం, చిననంబుధిసొచ్చియందుఁ జెలఁగివిహారం
బొనరించుదనుజు నారసి, వినుతబలాఢ్యుండు వాని వెసఁదునుమాడెన్. 318

వ. అట్లు. 319

క. పంచజనుఁ జంపియాయదు, పంచాననుఁ డసురకుక్షిఁ బాగుఁగమును వీ
క్షించినవిప్రాత్మజుగురు, తించుక లేదయ్యెఁ జిక్కె నెదనొకదరమున్. 320

—(*) రామకృష్ణులు గురుసుతుఁదే యమసదనంబున కరుగుట. (*)—

ఉ. అంతట నమ్మురారివిబుధాహితదేహజమైనశంఖ మ
త్యంతముదంబునం గొనిని జాగ్రజుఁగూడి పరేతరాట్పుర
ప్రాంతముసేరి యచ్చటదరంబొగినొత్తినఁ దన్నాదమ
య్యంతకుఁ డాలకించి ముదమార నెదుర్కొనె రామకృష్ణులన్. 321

వ. అట్లెదుర్కొని విహితవిధి మందిరమ్మునకుం దోడ్కొనిపోయి పూజించి నిజాగ
మనకార్యంబడిగిన శ్రాద్ధదేవునకు వాసుదేవుండిట్లనియె. 322

క. సమవర్తనమునఁ జరుగుదు, వమలుఁడవై సర్వచేతనావలియందున్
గ్రమమెఱిఁగియుండి కావున, సమవర్తిసమాఖ్యనీకుఁ జనియె మహాత్మా. 323

క. శమనా వినుమిపుడస్మ, ద్గమనమునకు హేతువదిము దంబునసీవున్
సముచితగతి సేయందగు, గమనాగమనములు పూర్వ కర్మక్రమముల్. 324

ఉ. కావునఁబూర్వకర్మమునుఁ గైకొనియిచ్చటనుండు వానినా
భూవిబుధాగ్రగణ్యగురు పుత్రకునిమ్మిది రాగతంబునా
నావనజాప్తసూనుఁడు ప్రియంబున విప్రతనూజుఁ దెచ్చిదీ
నావను లైనవారల మనంబులు రంజిల నుంచెముందటన్. 325

ఆ. అంతరామకృష్ణు లంతకువీడ్కొని, గురుతనూజుఁదోడు కొనిముదమున
నవ్యవంతిఁ జేరి యాచార్యునకుసుతు, నప్పగింప నమ్మహాత్ముఁడలరి. 326

ఉ. శ్రేయముఁ గల్గుమీకుయదు సింహములార ముదంబుఁగంటిమ
స్నీయ వనింగురూత్తముల కిచ్చిరెకొంచక యీప్సితార్థముల్
పాయక యిట్లు శిష్యులన పాయఫలప్రదు లీరుఁగల్గనిం
కేయుదిమాకు లోపముమ దిష్టములన్నియుఁ దీరెనింతకున్. 327

క. చిరకీర్తిమీకు నగును, ర్వరధార్మికులార యంచు వడిదీవింపన్
గురుననుమతితోడు తనం, బురుహదళాక్షుండు మసలి ముదమలరారన్. 328

చ. శ్వసనసమాన వేగములు ♦ వారిధరారవముల్ ప్రభాత్తది
గ్విసరములౌ శతాంగముల ♦ వేడ్క మెయింగొలు వైతనుద్యుతుల్
బిసరుహమిత్రకాంతులకు ♦ బింకముఁజూపఁగ నేగి వేనిజా
వసథముఁజేరి రాత్మజన ♦ వర్గముపౌరులు మోదమందఁగన్. 329

వ. అట్లు రామకృష్ణులు మధురానగరంబు సేరి సుఖంబుండిరని సూతుండు వెండియు 330

ఉ. భూవిబుధుండు మాఘమునఁ ♦ బూర్ణిమరాగనహస్సుఖంబునన్
బావనతీర్థరాజము ప్ర ♦ భాసమునందు మునుంగఁజేసిరా
మావరజప్రభావమున ♦ నయ్యమలోకము వీడిపూనులొ
రావిలసిల్లెలొంటిగటిఁ ♦ బ్రాప్తతనుండయి భూస్థలంబునన్. 331

క. వెంపియునివ్విధమున భూ, మండలమున కెందరేని ♦ మగిడినవారై
యుండుదురారయ సమ్మా, ర్తాండాత్మజపురము నుండి ♦ దావిధివిధులన్. 332

వ. అనినశౌనకాదులు సూతుంజూచిది లీపుండువశిష్ఠునవల నేమడిగె నతం డేమి
చెప్పె మీదటికథా వృత్తాంతం బేనునుటయు. 333

—(*) ఆశ్వాసాంతము. (*)—

ఉ. రామసురారి సంచయవి ♦ రామకరంతరసంస్తుతామర
స్తోమకుభృల్లలామపుర ♦ సూదనసన్నుత నామనీరద
శ్యామగుణాభిరామదురి ♦ తాంధతమశ్చయ తీవ్రధామసు
క్షేమసురూపసౌమ్యన ♦ శేషవిడంబిత కామరాఘవా. 334

శా. గోరాజ స్తవనార్హ్వనిర్మలయశ ♦ గోరాజ వాహార్చితా
గోరాజాధిక వైభవానుభవభా ♦ గ్గోరాజ చూడామణీ
గోరాజాన్వయ దుగ్ధవాధిరిశశీ ♦ గోరాజ భాస్వద్విభా
గోరాజాది సుధాశన ప్రణుతస ♦ ద్గోరాజ దుద్యన్ద్వధీ. 335

మత్తకోకిల. వారిజాప్తకులావతంసని ♦ వారితాఖిలకల్మషా
వారిజాసనముఖ్యనిర్జర ♦ వంద్యకారణ పూరుషా
వారిజాక్షకృపావయోనిధి ♦ వాలిగర్వని వారణా
వారిజాంకుశరేఖచిహ్నిత ♦ పాదదుష్టవిదారణా. 336

ఇంద్రవజ్రము. దీనావనానిత్య సుధీనమేతా, భూనాథచూడాగ్రవి ♦ భూషప్రీతా
సానంద సన్మానిజ♦నానుషంగా మాణిక్యభూషా యుత♦మంగళాంగా.

గద్యము.

ఇది శ్రీరామచంద్ర కృపాకటాక్ష వీక్షణా వాప్తకవిత్వ విద్యాప్రాభవపవిత్ర
పత్రిపిన శేషమ రాజాగ్రతనూభవ సుధీజనవిధేయ సుబ్బరాజాభి
ధేయ ప్రణీతంబైన శ్రీమదాంధ్ర మాఘపురాణంబునందు
ద్వితీయాశ్వాసము సంపూర్ణము.





శ్రీరస్తు.

---

# శ్రీమదాంధ్ర మాఘ పురాణము.

## తృతీయాశ్వాసము.

---

కందపద్యము.



శ్రీ జానకీమనోహర,
భూజననుత భువనపాల । మునిమానస నీ
రేజ మధువ్రత కపికుల,
రాజావన కీర్తిసాంద్ర । రామనరేంద్రా.

తే. అవధరింపుముసూత । మహర్షిచంద్రుఁ, డాదరమ్మునశౌనకా । ద్యఖిలమౌని
శేఖరులఁజూచి పలికె వ । శిష్ఠుఁడట్లు, లద్దిలీపావనీపతి । కనియెనిట్లు. 2

క. జనలోక నాథయికవిను, మనఘుండౌ కౌత్సచరిత । మదికడముట్టన్
వినిపింతును సత్పురుషుల, ఘనచరితలు వినినఁగాదె । కలుషములడఁగున్. 3

చ. అనినదిలీపుఁడమ్ముని వ । రాగ్రణికట్లగుఁ గాకచెప్పవే
యనిన వశిష్ఠుఁ డిట్లను ని । లాధిపయమ్ముని పుత్రుఁడవ్విధం
బునగురు నింటవిద్యలను । మోదముతోఁ గొనిదక్షిణన్ సభ
క్తినిడి తదాజ్ఞనింటికరు । దెంచి ముదంబుననుండి యంతటన్. 4

—(*) మృగశృంగుడు సువృత్తాది కన్యాచతుష్టయంబును బెండ్లియగుట. (*)—

తే. అయ్యుచథ్యాత్మజునివివా । హమ్ముఁగాఁగఁ, గోరెనాతఁడుఁగుత్సకు । మారునకును
గన్యనిచ్చెదు వాఁడునై । కడఁకమంచి, లగ్నమున నక్కుమారి న । లంకరించి. 5

శే. సమధి కామ్నాయ విదులైన । సద్విజులను,
సకల బంధు వ్రజంబును । సరవితోడ
రాఁగఁ బిలిపించి యంకు । రార్పణ మొనర్చెఁ,
బ్రీతి నాపెండ్లి కయ్యునా । హూతులగుచు. 6

చ. కపిలుఁడు రైభ్యుఁడుఁ సుమతి కణ్వుఁడు కాణసుతీక్ష్ణపైలక
స్యప జమదగ్ని పర్వతులు సత్యుఁడు జైమిని వామదేవకా
శ్యపశర భంగగౌతములు శంకహారీతులు ముద్గలుండు న
త్తపనసమానతేజులురు దాంతియుతుల్ శమనిర్మలాత్మకుల్. 7

వ. ఐన కాబాలిమాండవ్య కాత్యాయన భృగ్వాపస్తం బాంగీరసాత్రి మహామునులు మున్నగువారు విచ్చేసినం బ్రియంబంది కుత్సుండు మధుపర్కంబులిప్పించి వారిఁ బూజించె పదంపడి యవ్వివాహంబునందు. 8

మత్తకోకిల. అమ్మహర్షి సమాజముఁ దగ నాగమోక్తి నొనర్పఁగా
సమ్మదంబున హోమకృత్యము చక్కఁగా నెఱవేర్చి శా
స్త్రమునంగల రీతితోఁ ద్రిద శాలిమెచ్చఁగఁ జేసె బెం
డ్లిమ్మునఁ మృగశృంగ మహానికి నెంతయుం జనకుండుఁ దాఁ. 9

తే. అట్లుచధ్యుఁడుసాలంకృ తాత్మజాత, నానువృత్తుఁగాత్ముని కతిముదమ్ము
సెలఁగనిచ్చినఁదత్సఖి చెలులుకమల, విమలసురసలు మృగశృంగు రమణఁజేరి.

ఉ. ఓమదనోపమాంగ సుగు ణోదధి దీనశరణ్యమమ్ము ని
త్తామర సాక్షినింగడు ము దంబునఁ బెండిలియైన యట్లునీ
వీమహితోప యామమున నేర్పఁడ జేకొను మట్లుఁగానిచో
నేముశపించు వారమని జేప్సితముల్ నెరవేర్పకున్కిచేఁ. 11

ఆ. అయ్యరణ్యకూప మందేగిపడియున్న, వారినల్వురంగ్ర పారసమున
మమ్ముఁ బ్రాణములకు మఱికూర్చితివిజీవి తేశ్వరుండుకావె యీవుమాకు.

క. అనిపలుకు కన్యకామణు, లనుఁగని మృగశృంగమహాని లగ్నంబౌకటఁ
గనరాదో పరిణయమని, యనుమానింపంగఁదదుప యామాగతులఁ. 13

వ. ఒక్కండై వచ్చి తన్ముని సమాజమధ్యగతుండైయున్న యొక బ్రహ్మర్షి యిట్లనియె.

క. ఓకుత్స తనయ యీచా, మీకరగుచి రాంగలఁ స మీచీనవిధిఁ
గైకొమ్ము పరిణయంబున, నీకరణిం గలిగెమున్న నేకములుర్విఁ. 15

మ. మునుమాంధాతృ తనూజలేఁ బదుగురఁ మోదంబుతోఁ బెండ్లి య
య్యెను బ్రహ్మర్షివరుండు సౌభరియు న య్యేందుండునుం దక్షసం
దనలాయిర్వది యేడ్వురఁ మొగిముహూ ర్తంబొంటఁ బెండ్లాడెనిం
దున సందేహములేదు సుమ్ము బుధసం స్తుత్యా వివాహమ్ముఁగాఁ. 16

క. అనివేదవిదుండగున, మ్మునివల్లభుఁ డాసతీయ మునుకొనిహోమం
బొనరించి సరవిముప్వర వనితలఁ గుత్సాత్మజుడు వి వాహంబాడెఁ. 17

తే. బ్రాహ్మనామవివాహంబు బ్రాహ్మణులకు, విహితవిధియనివేదోక్తి వెలయుఁగాన
నమ్మహాత్మకు డవ్వివా హామునసల్వు, రంగ్రమంబునఁ బెండ్లాడె రహిఁదలిర్ప.

ఉ. అవ్విధిఁ బెండ్లిపూర్తియగు నంతటసంతస మాత్మనిూరఁగా
నివ్వఁగనెంచి యున్నమణి హేమవిభూషణముల్ సువస్త్రముల్

నవ్వేఁపు ధేనువుల్ ద్విజ సమాజము ప్రీతిఁగొనంగ నిచ్చెదా
నవ్విబుధాంచితుండు వెలయం దనకీర్తులు కుత్సమానియుఁ. 19

వ. మఱియు నవ్వివాహంబునకుం జనుదెంచిన మునీంద్రులకుఁ దగు మర్యాదల సలి
పిన నెల్లవారు నిజనివాసంబుల కనుజ్ఞాతులై చనిరనిన దిలీపుండు వశిష్ఠుంజూచి
మహాత్మా బ్రాహ్మణాది చాతుర్వర్ణంబుల వారికెన్ని విధంబులైన వివాహంబులుఁ
గల నెఱింగింపు మనుటయు నతండిట్లనియె. 20

—(*) వశిష్ఠుండు దిలీపున కష్టవిధ వివాహంబుల నెఱింగించుట. (*)—

సీ. అవనిబేర్కొనువివాహములెన్నికలవన్ని, వివరింతువరుసమై వినుము బ్రాహ్మ
మునుదైవమార్షంబు మొనరుప్రాజాపత్య, మాసురంబును మహాహ్లాదద్విభూతి
గ్రాలుగాంధర్వంబు రాక్షసపైశాచ, ములునాగనెనిమిది వెలయునిందుఁ
గన్యకామణినలంకారంబుఁగావించి, వరుఁదెచ్చిచేయు వివాహమదియు
బ్రాహ్మమనఁబడు నాచూలు వరుసనిరువ, దింటిపైనొండు తరములఁదేటపడఁగఁ
జేయు విమలముజన్నంబు సేయఁబూని, దానిఁ గావించువానికితరుణినొసఁగి.

క. కావించు పరిణయంబది, దైవంబనఁ బరగునట్టి దంపతులకునిం
పావహిలఁ బుట్టుసూనుఁడు, పావనములఁ జేయునాల్గుఁ బదియుతరంబుల్. 22

క. వరువలన గోద్వయంబునుఁ, బరువడిఁగొని సేయునదివివాహం బార్షం
బురుగతి వారలసూనుం, డరయఁగఁబరి శుద్ధిసేయు నాఱుతరంబుల్. 23

మ. పరమశ్రేయముమీరు సేయుఁడనుచుం బాటించి పుణ్యాత్ముఁడుఁ
సరసుండౌ వరుఁగూర్చిసేయునది ప్రాజాపత్య మద్దంపతుల్
సరవింగాంచిన సూనుఁడాఱు తరముల్ సంశుద్ధిఁ గావించును
ర్వరనీ నాల్గువివాహముల్ ద్విజులకుఁ వర్తిల్లు ముఖ్యంబులై. 24

మ. ధనముంగైకొని కన్యనిచ్చునదిగో త్రాధీశ యాసానాసురం
బనఁగాఁ గన్యకయుఁ వరుండిరువుర న్యోన్యాను రాగంబుచొ
ప్పునఁగైకొన్న వచింత్రుదాని బుధులె ప్పుంబూని గాంధర్వమం
చునుఁగన్యఁ హరియించిసేయు నదిపొల్చుఁ రాక్షసా భిఖ్యమై. 25

వ. ఈరాక్షసంబుం బుధు లంగీకరింప రింక మోసంబునఁ గన్యం గైకొని చేయు
వివాహంబది పైశాచంబు నాఁబడునది యధమంబు వెనుకం బలికిన నాలుగు
వివాహంబుల గాంధర్వాసుర రాక్షసంబులు విశేషించి రాజుల సూరవ్యుల
నాచరణీయంబులై యుండు నెనిమిదవదైన పైశాచంబు దురితంబుఁ గావున నది
దురితాత్ములగు వారుఁ బాటింతు రిదియుంగాక బ్రాహ్మణుండు చతుర్వర్ణంబుల
వివాహం బొనువిధియుం గల దట్టి పట్టులందు. 26

మ. నిజవర్ణంబున నుద్భవించి నకనన్నిరేజపత్రేక్షణఁ
సుజనుల్ మెచ్చఁగరంబువట్టికొనియుఁ క్షోణీధవాపత్యముఁ

ద్విజుఁడు ద్వాహముఁ గాంచునప్డు శరము ఽ ర్విన్ వైశ్య కన్యామణిన్
యజమానుండు ప్రతోదముంగొనియుఁ గ ఽ ల్యాణంబుఁగా నొప్పగున్. 27

క. చరణోద్భ వాన్వయంబునఁ, బరిణయమగు నప్డుశాస్త్ర ఽ పద్ధతిఁగన్యా
వరచే లాంచలముం దాఁ, గరమునఁగొని ద్విజుఁడు పెండ్లిఁ ఽ గాదగునధిపా. 28

వ. ఇట్లు విధివిహితంబుఁగా బరిణయంబైన దంపతులయం దుద్భవించువారు శతా
యుష్కులు ధర్మాత్ములునై యుందురు. 29

తే. అగ్రజన్ములకును బ్రాహ్మ ఽ మదివిహితము, గాఁగఁనొప్పనుభూపాల ఽ కాగ్రకన్య
యమ్మిథునమునకుద్భవ ఽ మైనసూనుఁ, డగుతపశ్శీలుఁడఖిలాగ ఽ మాంతవేది 30

క. మునుఁ బ్రాజాపత్యవిధిం, దనరఁగ సౌభరిగ్రహించె ఽ ధరణిపమాంధా
తృని దుహితల నేబదుగుర, ననమానికిఁ బలికెనధిపుఁ డతివినయమునన్. 31

ఉ ఏమినిమిత్తమమ్ముని మ ఽ హీశుఁడుఁ బెండిలి యయ్యెనే బహుం
డ్రామహిళాలలామముల ఽ నవ్విధ మీవిపుడాను పూర్విగా
నో మునిలోకనాథ విన ఽ నుల్లముఁగోరెడు దెల్పునాకు స
త్రేమన నందిలీపప్రభృతి ఽ పీపతి కిట్లని చెప్పె మానియున్. 32

—(*) సౌ భ రి చ రి త్ర ము. (*)—

సీ. పృథివీశవిస్మకాం ఽ పిల్యపత్తనమునం, దిరవందుఁ ద్విజుఁడు సౌ ఽ భరియనంగ
నతఁడఖిలాంగమాం ఽ తార్థవిదుండు స, ర్వప్రాణిహితుఁడు భా ఽ స్వదృఢైక
హృదయుండుశీలియు ఽ నీడితాంభోజప, త్రాయతాక్షుండుచాం ఽ ద్రాయణముల
వ్రతములమాసోప ఽ వాసవ్రతంబుల, రహిసల్పిజీర్ణప ఽ త్రాశియగుచు
నమరఁగొన్నాళ్లువర్తించి ఽ యంతమీఁద, నంబువులనుండిచేసెమ ఽ హాతపంబు
నద్భుతంబుఁగఁబదిరెండు ఽ హాయనంబు, లొగినిరాహారుఁడై పూర్వ ఽ మొక్కనదిని.

ఉ. ఆనదియందు వర్తిలుఁ బ్రి ఽ యంబున మానవలోకనాథజా
నైనదియొక్క మీనుశబ ఽ రాఖ్యము తన్నదినుండు మీలకున్
దానధినాథుఁడై యనుది ఽ నంబు నిజాంగన లాత్మబంధువుల్
సూనులు పౌత్రులాప్తులును ఽ సోదరులాదిఁగఁ దన్నుఁగొల్వఁగన్. 34

తే. అట్లునఖిలాప్తబంధుపు ఽ త్రాన్వితముఁగ, సంతతంబును విహరించు ఽ శబరనామ
కాంబుచారముఁగనిమౌని ఽ యవ్విధమునఁ, దానుసంతానసంవృద్ధి ఽ మైనటింప.

వ. మనంబునం గోరి యాక్షణం బన్నీరంబులనుండి వెలువడి వివాహార్థియై. 36

క. అమ్మౌని వర్యుఁడరిగెను, సమ్మదమున మీనువంశ ఽ సంజాతుండౌ
యమ్మాంధాతృనికడ కీ, విమ్మని యొకకన్నెనడుగు ఽ నిష్టముతోడన్. 37

చ. మునివరుఁ డట్లుఁబోయి నృప ఽ ముఖ్యునిఁగాంచిన నాతఁడున్న తా
సనముఁగడుం గడంకడిగి ఽ సౌభరి చెంగటి కేగి తెచ్చి భ
క్తిని వివిధోపచారములఁ ఽ గేవలముం బరితోషఁజేయ న
మ్ముని యుచితాసనంబునను ఽ మోదమెలర్ప వసించి యుండియున్. 38

క. ఇక్ష్వాకులునిఁ జూచియప్పుడీ, ట్లనియెం గాకుత్స్థవంశు - లనవరతంబున్
మనములర నాశ్రితావలి, కెనయించిరి కాదె యున్న - భీష్టము లెల్లన్. 39
తే. ఏనుఁగన్యార్థినై యీదు - నింటికిప్పు, డరుగుదెంచితి నేఁబదుం - డ్రాత్మజాత
లధిపనీకున్న వారల - యత్తివలంతు, నలరనొకదానిఁ బెండ్లిఁగా - నడుగఁగోరి.
క. అన విని మదిసినవాడీ, యనపరిణాయ మునకనర్హుం - డటుఁగాదన్నన్
గనలును కోరంగలరే, వనితలుయువ కులనుఁగాక - వడిసిద్ధృశులన్. 41
తే. పాము కుబుసముఁబోలిక - నుప్పుబడుఁగు, దేహచర్మము రెల్లునాఁ - దెల్లవారి
యున్న శ్మశ్రు శిరోజము - లొప్పినట్టి, బొక్కిముదుకడుఁ ఘూబోండ్ల - బూచిగాడె.
వ. అని మనంబునం జింతించి కొండొక యుపాయంబున. 43
క. ధన్యాత్మ రాచకులమునఁ, గన్యాప్రియుఁ డైనవానిఁ గాంతుని సేయన్
మాన్య లొనర్చినవిధియహా, నన్యముఁగా వింపధర్మ - మది సెమనవనిన్. 44
క. కావునఁ దద్విధికిందగు, త్రోవం జింతింపుమనుడు - ద్యుమణికులేంద్రున్
భావించి చూచియమ్ముని, యీవిధమున కీయుకొంటి - నిప్పుడునీవున్. 45
చ. గొనకొని త్వత్కుమారికలు - కూర్మి వసించెడి చోటికేను జ
య్యనఁజను లాగుసేయుమట - నమ్ముదితల్ నను లోవరింపఁగా
బనివడి కోరిరేని నృప - వర్యవివాహము సేయుమట్టులం
గనలు వరింపరైరనిఁ - గ్రమ్మఱిపోయెద వచ్చినట్టులన్. 46
ఉ. నావుడు సమ్మతించిముని - నాథునిజాత్మజ లున్నచోటికిన్
సేవల భక్తిఁ దోడ్కొని మృ - గీదృశపొమ్మని యొక్కదాసికా
భూవరుఁ డాజ్ఞసేయఁబనిఁ - బూని తదీయ గృహమ్ము సేరగా
నావిరి బోణితెచ్చుసమ - యంబుననమ్ముని రాజువేడ్కతోన్ 47
సీ. లలితసలావణ్య - కలితముఖాబ్జంబు, రాకాసుధాంశువా - రకహసింప
రహిఁజాలఁ బేర్చిచా - రలపట్టు కెనఁగునే, త్రములంబు జాతప - త్రములనొంప
సూనాశుగాసనా - స్థానపీఠమునాఁగ, రమణించు విపులవ - క్షముపొసంగ
నతులితాజానుబా - హార్గళంబులనును, పసమృణాళద్యుతి - నసమకోలుపఁ
కసటు వోఁ దీర్చి కాచిన - పసిడిమిసల, కెనఁగు తనురుచులంతంత - దెసలఁబర్వ
మించి మన్మథవిధుల జ - యించునట్టి, దైనరూపంబుఁ గైకొని - యరిగెనందు. 48
చ. అటుచని భూమిపాలతన - యావలియున్న వినూత్నరత్న వి
స్ఫుటరుచి దీప్తమాభవన - ముంగనిచారిణి తోడఁ జొచ్చి చం
గటఁగనె మూనివల్లభుఁడు - కంజవిలోచనలన్ మనోజ్ఞుఁడు,
త్కటముఁగ సానవెట్టిన సి - తాస్త్రములాయనఁ బొల్చువారలన్. 49
ఉ. ఆయమృతాంశుబింబ సదృ - శాననలుం బొలుపారఁ జూచి ర
క్కాయజ యక్షరాట్తనుజ - గ్లౌర్బుభ వాధిప పుత్రచైత్రులన్

ఛాయక క్రిందుసేయుచు ను నంబలరించెడు రూపసౌష్ఠవ
శ్రీ యిర వారునమ్మునివ రేణ్యుసవిస్మయ మోదచిత్తలై. 50

తే. అప్పు డవ్వాలుగంటుల కధిపుతోడ, నప్పనముఁ గాంచివచ్చిన యదియువక్కా-
నయ్యు మీతోడఁ దెలుపనా కానతిచ్చి, యున్న సందేశ మదివినుం డోనరననుచు.

ఉ. ఈముని లోకవల్లభుని నిందరిలో నెవరైనఁ గోరినం
దాముది మెచ్చివారివసు ధాపతిసంభ్రమ యుక్తిసంయమి
గ్రామణి కిచ్చిపెండిలిఁది రంబుఁగఁ జేసి నిరంతరంబుగా
రామునఁ జూచువాఁడటకు రంగవిలోచన లారవింటిరే. 52

వ. ఇదియునుంగాక యి మ్మహాత్ముండు. 53

క. సౌందర్యమ్మున విధునర, విందాశుగుఁ గ్రిందొనర్చు పృథుతపమునఁ బెం
పొందినమాహాత్మ్యమునఁబు, రందర విభవంబునుంచు రహిఁదనయింటన్. 54

మ. అనుఁ డత్యంత ముదంబునం బొదలి య య్యంభోజ పత్రాక్షు లె
ల్లనునీ పూరుష వర్యునేఁగొలుతు ని ల్లాలై మహాభక్తినే
ననయం బిమ్మహితాత్మునిం గొలుతు భా ర్యంగానటంచే బదుం
ద్రును నమ్మౌనిశిఖామణిం బొదివిరం దున్ మోహవిభ్రాంతలై. 55

వ. అట్లు మదకరీంద్రంబుం బొదువుకరేణు సముదయంబుంబోలెఁ జుట్టుకొను డంత
తయు నెఱింగి మాంధాత దుహితల నందఱంగోరినట్లు సౌభరికిచ్చి పరిణయంబు
గావించె నమ్మునియు వారి నిజాశ్రమంబునకుం దోడ్కొనిపోయి దేవశిల్పియగు
విశ్వకర్మను రావించియందు. 56

సీ. స్ఫటికాశ్మవిమలసో పానకుడ్యంబులు, తతచంద్రకాంతావి తర్దికలును
మరకతమణిగణ స్ఫురదిందుశాలాళి, మణిహేమనిర్మిత మహితవప్ర
తతిపద్మరాగోన్న తద్వారకవ్యాప్ర, తానముల్ రత్నవా తాయనంబు
లమరుస్వర్ణస్తంభ సముదాయముల్ విద్రు, మాంచితదేహళీ సంచయములు
వితతవైడూర్యతోరణ ప్రతతిఁగలిగి, రమణఁగాంచినసౌధరా జములనెంద
రందరికినన్నిఁ జేసిపు రందరైక, వైభవమునించి గృహవస్తు వర్గముంచి. 57

చ. వనితల నందుఁజేర్చి ముని వల్లభుఁ డత్యధికాను మోదముల్
దనరఁగఁ గాము కేళిని ని తాంత సుఖంబుల నందు చుండెనం
గనలు తదీయ సత్కృపనొ కంటఁ గొఱంతయుఁ గానకుండి నె
మ్మనముల సంతసింపుచు స మంచిత భక్తినిఁగొల్వ నాతనిన్. 58

ఆ. అట్లుఁ గొంతకాల మరిగినజామాత, నాత్మజాతలం బ్రి యంబుతోడఁ
జూడఁగోరిమదిని క్షోణీధవుఁడుతదా, శ్రమధరాస్థలికిని రాగనందు. 59

క. త్రిదశేంద్ర యక్షవల్లభ, సదనములకుఁ బ్రతిఘటించు సమధికవిభవా
స్పదముల సౌధములంగని, మదిలో నాశ్చర్యమంది మనుకులుఁడంతన్. 60

ఉ. అందొకదానిసొచ్చి తన యంగని తద్విహితోపచారముల్
డెందమెలర్ప నంది ప్రకటించి నిజాధిపుఁడైన పూనికా
రిందగ ముచ్చటింపవిని మెల్లన నొండొక సౌధరాజమిం
పొందవఁగఁ జేరి సత్కృతి మున్నతి నందిత దంగనామణిన్ 61

చ. గొనకొని భర్త కూర్మి తన కుంగలదే యనువారఁ దెల్పుమో
తనయ యటన్న నయ్యువిద తండ్రికి నిట్లను నాథుకూర్మినే
మని వచియింతు మన్నిలయ మందు వసించనయంబు నెందులం
జనఁ డిదిఁగాక యేమిట నొసంగడు వస్తుతతిం గొఱంతయున్. 62

చ. అనవుడు దానివీడ్కొని ప్రియంబున వేరొకపట్టి యింటికిన్
జనియది తన్ముఁబూజలఁ బ్రసన్నునిఁ జేసిన భూమిభర్త య
ల్లుని విధమేమిటేనియును లోపములేమి నెఱింగి యట్టుల
వ్వనితల నందఱన్ వరుస వాయక వేడుడు నట్లువల్కినన్. 63

క. వినితన మదిలోనద్భుత, మునుముదముం బొందిమౌని పుంగవుతోన
జ్జనవల్ల భాగ్రగణ్యుం, డనియెం బ్రేమాతిశయస మంచితయుక్తిన్. 64

ఉ. ఓముని చూళికాభరణ యోభువనాద్భుత కృత్యయోతప
శ్శ్రీమహిత ప్రభావసుర సేవ్య భవన్మహిమంబ మేయమా
నీమహిమాదృశుల్ దెలియ నెంతటి వారలమయ్య యిట్టినీ
కీమహిళాలలామములు నింతులుఁగాగ మదీయ భాగ్యముల్. 65

క. ఇవ్విధమున మునివర యీ, పువ్వారుం బొండ్లఁగూడి పొందుముసౌఖ్యం
బెవ్వేళ ననుచు వీడ్కొని, యవ్విభుఁడేగెం బ్రమోద మాత్మంగనుచున్. 66

వ. అంతఁ గొంతకాలంబున కాసౌభరి యయ్యేబదుండ్రయందు నొక్కొక్కఱు నిజ
తేజోవిడంబిత వీతిహోత్రులగు పుత్రుల పెక్కండ్రఁ బడసెనట్లు పుత్రపౌత్ర
ప్రపౌత్రంబుగా వంశం బభివృద్ధినందించి సంసారసుఖంబుం బెద్దకాలం బనుభ
వించె నింతయుం బదిరెండుమాఘంబు లుదకంబుననుండి తపంబుగావించిన దానఁ
గలిగె నీమాఘ మాహాత్మ్యం బిట్టిదని యెఱింగించి మఱియు నీచారిత్రంబు విను
వారును వినిపించువారును సౌభరిబోలి సంతానసంవృద్ధినంది యఖిల సుఖంబు
లనుభవించి యనంతరంబు దివంబున కరుగుదురనుచు వలికిన వశిష్ఠునకు దిలీపుం
డిట్లనియె. 67

చ. మొనరఁగవింటి నీదుకృప మోదముఁ గేవల మాత్మఁ గొంటి స
జ్జననుతకీర్తి సాంద్రుఁడగు సౌభరి సచ్చరితంబు నింకనా
కనఘదయా రసంబుఁ దొలు కాడఁగ నవ్వలిదా కథాస్థితిన్
బనివడి వీనులన్ వినఁగఁ బల్కుము నాగవశిష్ఠుఁ డిట్లనున్. 68

క. తగవినుము ధరణినాయక, మృగశృంగుం డట్లుశ్రుతివి హితముఁగఁ బెండ్లిన్
నగరాజ కుచల నల్వుర, నగునగు నననయ్యుఁగనె గృహస్థాశ్రమమున్. 69

చ. అతని గృహస్థధర్మమును | నాతని కాంతల సద్వ్రతాధిక,
స్థితులు గణింపఁజాలమటు | సేయఁగ నెవ్వరుఁ గల్గువారు స
న్నుతి యిదిఁ గాదు భూవర | కనుంగొనువారల కబ్బురంబు సం
తతము నొసంగుచుండు నిర | తాతిశయస్థితిఁ బొల్చియుండుటన్. 70

వ. అనుడు దిలీపుండు గృహస్థధర్మంబునుఁ బతివ్రతా లక్షణంబులును నా కెఱింగింపు మనుడిహ పరలోక సాధకంబైన గృహస్థధర్మంబు మున్నెఱింగింతు వినుమని యిట్లనియె. 71

—(*) వశిష్ఠుండు దిలీపునకు గృహస్థధర్మంబుల నెఱిఁగించుట. (*)—

చ. అనఘ గృహస్థధర్మమున | యంబున సల్పెడు వాఁడహర్ముఖం
బునన కడంక లేచి తన | బుద్ధిని ధర్మము నర్థమివ్వి రెం
డునుఁదల పోసి యెంతయుఁ ద | నుస్థిత బాధకుఁ గాగడంగి యూ
రినిరుతి దిక్కునాశుగపు | వ్రేటునకుం బొడవైన దూరమున్. 72

ఆ. అతిశయించి యోగి | యందు మూత్రపురీష, ములను విడుచునప్పు | డొగి ద్విజుండు
జన్నిదంబుఁ జెవికి | సవరించి యునుదీచి, కిస మొగంబుఁగాఁగఁ దృణధరిత్రి. 73

వ. శిరంబు వస్త్రాచ్ఛాదనంబుఁ గావించుకొని కూర్చుండి నిరుక్తి నిరుచ్ఛ్వాసుండై క్రాసి యుమియక విలంబనము సేయక యుండి యవల తన్మలావలోకనంబుఁ గాకుండఁ బురుష చిహ్నంబుం డాపలి కరంబునం బూని లేచి యపవిత్ర నీరస తృణ మృత్తికల దుర్గంధ విముక్తి యగునట్లుఁ దత్ప్రదేశము విడిచి క్రమక్రియనంబువుల లెక్కించి ప్రక్షాళనం బొనరింపవలయు నెట్టి వేళనుఁ దత్ప్రక్షాళనంబు నదీసరస్తటాకాదులం గాక యయ్యెడఁ బాత్రవిహీనంబయ్యేనేని తజ్జలంబులకు మూరదూరంబునఁ గుదురేర్పరచి యందునం జలుల జలమ్ముఁ బూరించి జలాశయంబునకుం బ్రాహ్మణునకు నభిముఖంబుఁగా గుదప్రక్షాళనంబు సేయ రామివిముఖుండై యాజలంబులఁ గావించి యనంతరం బాస్థలంబుం బరిశుద్ధి సేయనగు వెండియుం బ్రక్షాళనక్రమంబు వినుము. 74

తే. అమర నొకమారు లింగము | నైదుమార్లు,
గుదము మఱి వామహస్తము | పదియుమార్లు
వెనుక నైదేసి మారులు | తనరఁ గడిగి,
కొనియు నవ్వలఁ గరయుగ | మనువుఁగాను. 75

తే. ఏడుమారులు మృత్తిక | నేసి కడిగి,
యవలఁ బాదద్వయమ్ముఁ దో | యములముంచి
యంత నొండొకచోటికి | నరుగుదెంచి
యేనుమారులు పాదంబు | లేడుమార్లు. 76

క. కరములు మృత్తికవలననుఁ, బరిశుద్ధి యొనర్చి నీటఁ | బదఁపడి కరముల్
చరణములుఁ గడిగి యవ్వలఁ, బరిధానము నెప్పగట్టి | బ్రాహ్మణుఁడంతన్. 77

క. సిగముడి సపరించియుఁదాఁ, దగురీతిం జన్నిదంబుఁ । దాల్చియాచమం
బొగిసలిపి యవలజానువు, లెగువకుఁగా కునికినణచి । యింపెనయంగన్. 78

వ. పరిశుద్ధస్థలంబునం దుత్తరముఖంబుఁగాఁ గూరుచుండి జలంబు గండూషించి పవిత్రముం దాల్చి బ్రహ్మతీర్థంబున నాచమింపవలయు ననంతరం బుదకంబులతోడ నేత్రంబులం దుడిచికొని కంటక యుతంబొండె క్షీరయుతం బొండెనైన మ్రాని పుడుకనొండుఁ జదనైక నిష్ఠాంగుళిదృఢంబుండు నది గ్రహించిదాని ద్వాదశాంగుళప్రమాణం బుండఁ దునియించి యందొక్క మొన నలియంగొట్టి మెత్తపరచి యద్దాని జలంబులంగడిగి చేఁబూని. 79

క. ఆయుర్బల మాత్మజత, పాయనియశముం ధనంబుఁ । బశుతతి తేజం
బాయధిక మేధప్రజకరు, ణాయుతమతి నీవెమోవ । నస్పతినాకున్. 80

వ. అని యుచ్చరించి విశుద్ధస్థలంబునఁ బూర్వోత్తరంబుల నొండె నభిముఖుండై యాస్యాయస్యేతి మంత్రంబున దంతధావనంబు సేయవలయు నీ దంతశుద్ధి యష్టమీ నవమి పూర్ణిమలయందునుఁ దా నుద్భవించిన తారయందుం గృహస్థు మానుచు నభ్యంజన మిథునకర్మంబులఁ బరిత్యజింపవలయు నిదియుంగాక. 81

క. తలిదండ్రుల యాబ్దికమునఁ, బొలఁతినిఋతు దినమైయెనఁ । బొందందగది
మ్ములఋతు వాసరమైనం, జెలిమిం ద్వాదశిఁజతుర్ద । శింగూడనగున్. 82

క. అనిపలికి మఱియు నమ్ముని, జనపాలుం డధిపుతోడ । శాస్త్రంబులనే
దినములఁ బలుఁదోమఁగరా, దనివినఁబడు వానివదలి । యద్దినములలోన్. 83

క. పదిరెండు మార్గజలములఁ, బదపడితాఁ బుక్కిలింపఁ । బరిశుద్ధియగున్
రదనాంతరములఁ గల్మష, మదిపోవ నొనర్చితృణక । ణావలిచేతన్. 84

తే. అట్లు ముఖశుద్ధిగావించి । యాచమించి, యుదయకాలంపు స్నానమిం । పొదవసేయ
వలయు నాస్నానకాలమి । మ్ములనొనర్చు, విధులనాసక్తిమైపూని । పృథివినాథా. 85

వ. ఆవిధు లెట్టివనిన పవమాన స్సువర్జనః యను ననువాకంబుచేతను ద్రుపదాదివ మంత్రంబుచేత మఱియు నాపోహిష్ఠాది మంత్రంబులచేత నుదకంబులుఁ జల్లుకొని యనంతరంబ స్నానంబొనరించి తీరంబుసేరి విధిహితంబుఁగా నాచమించి పూర్వోత్తరంబుల నొండె నభిముఖుండై పాదద్వయంబుఁ గదియ నిలువంబడి జలంబుల నంజలింగొని గోశృంగ ప్రమాణంబు మీఁదికెత్తి యుదకమధ్యంబున విడువవలయు నట్లు వట్టిన బ్రాహ్మణు నంజలిం గలజలంబునందు. 86

ఆ. వ్రేళ్లకొనలనుండి । వెలసినతీర్థంబు, దేవతీర్థమనియు । తెలియఁజెలున
వ్రేళ్లనడుమదాని । పృథివీశ ఋషితీర్థ, మనియుబొటనవ్రేలి । కినిమఱియును. 87

వ. తర్జనికింగల మధ్యస్థలంబునం దుండు నుదకంబుఁ బితృతీర్థంబనియు నాయంగుష్ఠోపరిజలంబు బ్రహ్మతీర్థంబనియుం జెప్పవడుఁదాన నయ్యంజలింగల జలంబులఁ దర్పణంబులు విడుపుడుఁ గ్రమంబుఁగా దేవఋషి పితృబ్రహ్మలుఁ దృప్తులగుదు రట్లుఁ గావించి యవల నీరంబుననుండి వెలువడి యంతకుమున్ను నిర్మలంబుఁగా నుదికి

యారవైచియున్న పరిధానంబుఁగట్టి యుత్తరీయంబు నలవరించి సిగముడి సవ
రించి వెండియు మృత్తికవలన రెండుహస్తంబులుం బరిశుద్ధిఁగావించి యాచమించి
మొదల నూర్ధ్వపుండ్రంబుం ధరించి భస్మంబునంది ర్యక్పుండ్రంబుం ధరింప
వలయు నెవ్వండేని భస్మంబున నూర్ధ్వపుండ్రంబు ధరించినఁ బ్రళయపర్యం
తంబు ఘోరనరకం బనుభవించుఁ గావున మృత్తిక నూర్ధ్వపుండ్రంబును భస్మం
బునంది ర్యక్పుండ్రంబుం ధరింపవలయు వెండియు నీరెంటియందు నెద్దేని పూర్వా
చారంబుఁగా నుండు దాని నవలంబింపనగు నిట్లు పుండ్రధారణంబుఁ గావించి
తర్జనీ మధ్యాంగుళ్యంగుష్ఠంబులచేత నాసాగ్రముంబట్టి. ఓంభూః. యను మంత్రం
బుచేఁ బ్రాణంబులం బంధించి విడిచి యవల సంధ్యోపాస్తి సేయునప్పు డాపో
హిష్ఠయను ఋక్కుచేఁ గుశోదకంబులఁ బ్రోక్షించుకొనునాఁడా ఋక్కుప్రథమ
పాదంబులు నాలుగుఁ బ్రణవయుక్తంబులుఁ గనుఁ గడమ నాలుగుఁ బ్రణవ రహి
తంబులుఁ గనుం జెప్పి యవల నన్నిఋక్కులఁ బ్రణవయుక్తంబులుగా నుచ్చరిం
చుచు భూశీర్షాకాశంబుల జలంబులుఁ జల్లుకొనునెడ నిట్లు రెండుమారు లాచరించి
యంతఁ దన శరీరాద్యంతంబుం జల్లుకొని. ఓంభూర్భువస్సువః. యను వ్యాహృతి
మంత్రంబు నుచ్చరించి యుదకంబులం ద్రిప్పి యాచమింపవలయు సింధుద్వీపుండు
ఋషియు ననుష్టుప్ఛందంబు నుదకంబు దేవతయు నీ యాపోహిష్ఠ మంత్రంబు
నకు నీరంబులుఁ జల్లుకొనుట వినియోగంబై యుండు నివ్విధి బ్రాహ్మణుండు
సమ్మార్జనంబుఁ గావించి యనంతరంబ మంత్రపూర్వకంబుఁగా నాచమించి ప్రణవ
యుక్తంబుఁగ ఋగ్యజుస్సామంబులఁ బ్రీణాతుస్వాహాయనుచు నొక్కొక్కదాని
నొక్కొక్కమాటు నుచ్చరించి మూఁడుమారు లాచమించి. 88

ఆ. బొటనవ్రేలి మొదలఁ । బొలుపారపోష్ఠద్వ, యంబు రెండుమారు । లడ్డపాటు
గాఁగఁదుడిచియంతఁ । గడఁగియధర్వాంగి, రసులమంత్రములనుఁ । గ్రమతఁదలఁచి.
క. వెండియు బ్రాహ్మణములునా, మెండగుమంత్రములనొడివి । మెలకువతోడన్
రెండుపదంబులఁగరముల, గాండంబులఁ జల్లుకొనిమొ । గముఁదుడుచుకయున్.
క. విధివిహిత మైనకర్మపు, పథములనొగి నెఱిఁగియున్న । పండితుఁడెలమిన్
బుధులు నుతింపఁగఁ దొలుతం, బ్రధనోర్వి విదారితారి । పటలదిలీపా. 91
వ. ఒండొకటిచేరియున్న యంగుళంబుల నితిహాసకల్ప సూత్రములగు విశేషగాథా
నారాశంసాది మంత్రంబుల స్మరించి యుదకంబులు స్పృశించి కరపాదాద్యవ
యవంబులం దుడిచికొను నిట్లుఁగావించి తర్జన్యంగుష్ఠంబులఁజేరికఁ గాఁబట్టి యున్న
జలంబు నాసారంధ్రంబుల వేర్వేఱఁదాకించి విడిచి యవల సూర్యశ్చయను మం
త్రంబుచే మంత్రితంబైన జలంబుం బుచ్చుకొని యనంతరంబ దోయిఁట నీరంబు లె
త్తి సూర్యున కభిముఖుండై నిలువంబడి గాయత్రిచే నభిమంత్రించి మీఁదికెత్తి
క్రిందం బడునట్లు ముమ్మారు విడిచి శ్రుత్యుక్తంబుఁగా సతారకంబైన దివంబుం దిల

కించుచు ప్రాతస్సంధ్యా స్తోత్రంబు సేయవలయు నిట్లు సూర్యోదయంబునకు
మున్నుఁ బ్రాతస్సంధ్యనంతయుందీర్చి యంత. 92

క. ఉదయాద్రి పైనిసూర్యుఁ, డుదితుండగు నంతదనుక నొగిగాయత్రిన్
వదలక జపించి యవ్వల, ముదమున రవిదేవతాక మూలమంత్రములన్. 93

వ. జపియించి ప్రాతస్సంధ్యయు గాయత్రియు సావిత్రి సరస్వతి యనెడు మంత్రాధిదే
వతలను కామోకార్షీతనెడు మంత్రంబుం జపించి సకలదేవతా ప్రీత్యర్థంబుఁగా
నాలుమారులు ప్రదక్షిణంబుఁగావించి పాదద్వయంబు మోపి తనపైనిలువంబడి
యుండినందులకు భూదేవతకుం గేలుమోడ్చి నమస్కరించి యిట్లు సాంధ్య
కృత్యంబంతయుఁ సాంతంబైన వెనుక శాస్త్రవిధి హోమంబుఁ గావించి
యథాశక్తి దానంబిడ వలయు నిట్లు. 91

క. మొగి నెనిమిది భాగంబులుఁ, బగలింటి నొనర్చి ప్రథమ భాగమునందీ
తగుకర్మంబులఁదా నొ, ప్పుగ సల్పి ద్వితీయభాగమున వేదంబున్. 95

చ. తవిలి పఠించి యుంగుశల తాంతసమిత్ఫల వస్తుజాతమె
క్కువతమి సేకరించియటుఁ గొబ్బున మూఁడవ పాలి కాల మా
ర్గవమునఁగించి దార్గవము ప్రాప్తముఁదాఁ బదివేలుఁగాఁగ భూ
దివిజుఁ డెఱింగి సర్వ్యనుతింపఁగఁ జేయఁగ నొప్పు నెండియున్. 96

వ. బ్రాహ్మణుడు కొడంబడియుండు యజనయాజనాధ్యయనాధ్యాపవదాన ప్రతిగ్ర
హంబులను షట్కర్మంబులయందు యాజనాధ్యాపన ప్రతిగ్రహంబుల మూఁడింటి
ముఖ్యంబులుగాఁ గొనవలయుఁ బదంపడి నాలవ భాగంబునందు. 97

సీ. మధ్యాహ్నకృత్యమాన్నాయోక్తి సేయఁగాఁ, దొడగి సుస్నాతుఁడై తొలుత దేవ
ఋషితర్పణములు పేర్మిఁ పితౄత్తమతర్ప, ణంబుఁ దత్తత్పవిత్రాంబువులను
మొగిఁ జేసి మెలమి నాపోహిష్ఠయను మంత్ర, మును బఠించి శిరంబున నుజలంబు
లిడుకొని యంబువుల్ బుడిసిట గైకొని, యప్పు ఋషియను ష్టుప్పు ఛంద
మంబువుం దేవతయునది యమరఁబుచ్చు, కొనుటవిని యోగమై ధరిత్రి నిఁ జెలంగు
దానినాశకపుసంతు మంత్రంబునుడివి, తజ్జలంబునుఁ బ్రాశించి తగువిధమున.

తే. మంత్రపూర్వకముఁగ వార్చి మరలఁ జలము,
ల జలింగొని గాయత్రి నమరనొడివి
యవియు దినమణిఁ గూర్చి నెయ్యమున విడిచి,
యంతఁ గాయత్రి జపియించి హరిభజించి. 99

వ. ప్రదక్షిణనమస్కృతులుసలిపి దర్భాసనస్థుండై పవిత్రంబుచేఁబూని బ్రహ్మయజ్ఞం
బునకు హస్తద్వయంబు మోడ్చి శాస్త్రహితంబులై ఋగ్యజుస్సామంబులఁ
జెప్పంబడిన మంత్రంబులం జపించి దేవఋషి పితృతర్పణంబులఁ గ్రమంబుగా
నుపవీతినివీతి ప్రాచీనావీతుల నొనరించి తత్తద్విహితతీర్థంబుల సర్వభూతం
బుల కట్లుదకదానంబు లిడి జలదేవతా నమస్కారణంబుఁ గావించి. 100

క. ఇలుసేరి యినుసఁ బార్వతి, నలరఁగ వైకుంఠుఁగుంజ రాస్యుని శివునిఁ
గొలిచి యథావిధి బ్రాహ్మణుఁ, డెలమిం దా వైశ్వదేవ మేర్పడ సేయున్. 101

క. పూనికఁ బనిఁగొని తద్విధి, మానుగఁ గావించియంత మసలక బలి స
మ్మానత నిడియవ్వలనే, నైనమహా యజ్ఞములఁ బ్రియంబుఁ దలిర్పన్. 102

సీ. బలిపిండమిడుచునే ప్రాణివర్గంబుల, న్నార్తిమైయెంతయు నడలుచుండు
నవియునుయక్షసి ద్ధామరోరగపశు, పక్షిపిశాచముల్ రాక్షసాలి
క్రిమికీటకములుధా త్రీస్థలివర్తించు, నన్నిప్రాణులకుమ దస్థకలిత
పిండమునందృప్తి పేర్మినయ్యెడుగాత, మనిసమాహితచిత్త మునవచించి
యెలమిబలిపుష్టకుర్కుర ములకువరుస, నిడినయంతటవేశ్వర నిడియువెఁడి
యాచమించిగృహస్థుమ హాదరమున, నతిథికైయింటివాకిటి యందునిలచి.

క. గోదోహ కాలమట్టుల, సాదరమున నిలిచియున్న సమయంబునభా
గ్యోదయమై భిక్షుకుఁడొకఁ, డాదాంతికి గోచరింప నతిమోదమునన్. 104

తే. అతనిఁగొని తెచ్చిశ్రీహరి యనితలంచి, పూజలందృప్తిఁగావించి పొసఁగవటుని
భిక్షునిరువురఁబక్వాన్న భక్షణమున, వలయుసంతుష్టిసేయని మ్ములమహీశా.

వ. మఱియు యతి బ్రహ్మచారులు మందిరంబునం దన్నంబువండికొని భుజించువారు గా కునికి నయ్యిరువుర నతినెయ్యంబున గృహస్థుపిలిచి యతికి మున్ను హస్తంబులు కడిగి వ్యంజనాన్వితంబైన యన్నకబళంబు కరస్థితంబుఁ గావించి భుజించిన పిదప వెండియుఁ గరంబుల నీరువోసికడిగి విశుద్ధుఁజేయ వలయునట్లు బ్రహ్మచారికిం దగు పాత్రంబున భోజనంబిడి తృప్తిఁగావింపఁ నొప్పు నివ్విధంబున నిరువుర దృప్తిఁగావించి నగృహమేధికి తద్భిక్షమేరు తుల్యంబును తజ్జలంబు సముద్రసమంబై యభివృద్ధినందు మఱియు దీనగోదాన ఫలంబుదొరకు నిట్లుఁ గాక యెవ్వండేనియు. 106

క. వటువును భిక్షుంబిల్చుట, లటుమరచి భుజించెనేని యాగృహితాను
త్కటమగు చాంద్రాయణమూ, దటఁ బ్రాయశ్చిత్తవిధికిఁ దాల్పఁగవలయున్.

తే. అనుచు షాడ్గుణ్య సంపత్తి నమరియున్న,
యమ్మహా మహుఁడగు యముఁ డానతిచ్చె
ననివశిష్ఠుఁడు భూభర్త కనియు వెండి,
యును ముదంబున వినుమని యనియెనిట్లు. 108

సీ. యజమానుండగు నాతఁడట్లుగురు వృద్ధాత్మీయ మాతాపితృ
స్వజనాభ్యాగత గర్భిణీయు వతులా బాలాతిథుల్ మున్నుఁగా
భుజియింపంగఁ దదీయతృప్తికి మదిన్ మోదించి తానవ్వలన్
నిజహస్తాంఘ్రి విశుద్ధినాచ మనమున్ ధీయుక్తిఁ గావించియున్. 109

పరిశుద్ధస్థలంబున మౌనియై కూరుచుండి నిరంతరం బెవ్వఁడు కాంస్యపాత్రంబున భుజించు నతని కాయుఃకీర్తి బుద్ధిబలంబు లభివృద్ధినందు నట్లగుటం జేసి తత్పాత్ర

యందిడిన యన్నంబుఁ బ్రాతస్సంధ్యల నగ్నిహోత్రంబు లెట్లు నియతంబులో యట్లు భోజనంబు నియతంబుఁ గావున నావిధి భుజించునెడ లోపంబు విచారింపక నిజాత్మశుద్ధికై ప్రాణాహుతిఁగావించి నిండుమనంబునం దనకు లభించిన యది భుజింపనగు మఱియు నొక్కవిశేషంబు వినుము. 110

తే. అధిప భోజన మొనరించు | నపుడుదోడ్త,
నాఁడు వారినిఁ గన్యల | నర్భకులనుఁ
గూర్చుచుండఁగఁ జేయక | కుడువవలయు,
నది మహాదోషమని యార్యు | లనెడు కతన. 111

తే. ఆలుమగలొకపాత్రయం | దలరఁగుడువ, మదిఁదలంచిననూటయే | బదిపలంబు
లమరతూనికఁగలిగిన | యట్టికాంస్య, పాత్రయుందగునదియట్టి | పాత్రగామి.

వ. భుజించిన కన్యార్భకాంగనాదులఁగూడి భుజించిన దోషంబు చాంద్రాయణాదులఁ బోవుంగాని యిది యట్లుఁబోనొల్ల దందువలన భార్యాభర్తలియవ్వురుంగూడి భుజింపందగదింత యెఱింగి యుండనగు వెండియు యజమానుండు భుజించునప్పుడుఁ దనపంక్తి నొకరుండేని లేక భుజింపంద గదా భుజంచువాఁడు వ్యంజనంబుల వేర్వేరపాత్రలనుంచుకొనక యన్నియు నొక్కపాత్రవడ్డించుకొని యుండవలయు.

తే. మఱియుఁ బ్రాణా హుతిక్రమ | మెఱుఁగ వలయు,
వినుము రవివంశతిలక భో | జనమునందు
తెనరవడ్డించి యున్నయో | దనములోనొ,
కింతఁగైకొని కూరల | నెల్లఁగలిపి. 114

తే. ఆజ్యమిశ్రము గావించి | యుదియుమంత్ర,
పూర్వకంబుఁగఁ జిత్రగు | ప్తునకు యమున
కఖిల భూతంబులకును నే | నాస్థనిచ్చు,
బలులు సంతృప్తి యగుఁగాక | యెలమిననుచు. 115

వ. యమ చిత్రగుప్తులకు నమస్కరించి మొదలనోం యనియుం బిదప స్వాహాయని యుఁబలుకు ప్రాణాదిమంత్రంబుల నుచ్చరించుచుఁ బ్రాణాహుతు లొనరించి రదనంబుల నొక్కక నాలుకం జప్పరించి మ్రింగవలయు నట్లుభుజించు వాఁడితరవిషయంబులఁ బుద్ధిఁ జొరనీయకుండి. 116

సీ. ఇనవంశతిలకతీ | యనిపదార్థములుము, న్లవణామ్లముల్దద | నంతరమున
కారంబునగరునుఁ | గలపదార్థములు వానికి, వెనుకరసముల | న్నియునుఁబిదప
వానివెంటనదృఢం | బైనపదార్థంబు, లన్నియుభుజియించి | నంతద్రవప
దార్థంబులన్నియు | నారగింపంజను, నరసియీాగతిసేయు | నతనిదేహ
మమరు సబలంబు నారోగ్య | మగుచు ధాత్రి,
ననుచు వాక్రుచ్చు నార్యజ | నాలిమెపుడు

మఱియు నాహార నియమంబు । మానకేను,
వినఁగ జెప్పెద సమ్మదం । బున ననువినుము. 117

క. మునియెనిమిది కబళంబులు, వనవాసి పదాఱుగెస్తు । ద్వాత్రింశతియున్
దినఁదగు నిష్టముఁదీరం, గనుఁగుడువఁగ నొప్పవటువు । కలయన్నంబున్. 118

ఉ. ఈనియమం బొకించుక మ । హీశ్వర వీడిభుజింప రాదొగిన్
మానవలెం భుజించుటలు । మానుఁగ శాస్త్ర నిషిద్ధ వస్తువుల్
దానటుఁ జల్ది శుష్కమును । ధారిణి నిన్ని యెఱింగి బ్రాహ్మణుం
డైనయతండు భుక్తినన । యంబుఁ గొనందగ వైతనర్చెడున్. 119

తే. అట్లు భుజియించినంతట । నాచమించి, లపనహస్తంబు లంబువు । లనువిశుద్ధి
మొదలఁగావించిమట్టిచేఁ । బివపఁ జేసి, యవలఁబడి యూరుమార్లుతో । యములతోడ.

వ. ముఖంబు గండూషించి. 121

క. పావము పాపాడెమతరి, నాదంతాంతరములందు । నంటినయన్న
చ్ఛేదములు వోవునట్లుఁ ద్రు, ణాదులచేఁ గ్రుచ్చిముఖము । హస్తద్వయమున్. 122

క. ప్రక్షాళనంబొనర్చియు, భక్షించిన పాత్రశుద్ధి । పరచివిశుద్ధిన్
సుక్షితిఁ గూర్చొనివార్చిమ, హాక్షాంతిఁ దనర్చికించి । దార్ఢ్యకరుండై. 123

వ. శ్వాసోత్సర్జనంబు సేయక పాశితలంబున నాభిప్రదేశం బుంద డవి యంగుష్ఠమాత్రః పురుషయను మంత్రంబుసెప్పి నీరంబుల నంగుళులునిచి యంగుష్ఠంబుచే నర్ఘ్యంబిడి వార్చి యూర్ధ్వబాహుండై సూర్యు నవలోకింపుచు శ్రద్ధాయాంప్రాణేయను నైదుమంత్రంబులచేతను తస్యేదంపురుషయను మంత్రంబుచేతను సూర్యోపాస్తి యొనరించి నిర్మలంబగు మనంబున సుఖాసీనుండై యిష్టదేవతాధ్యానంబుసలిపి యాచమించి నంతట తాంబూలంబు వైవనగు నీవిధంబున రెండు భాగంబులు సనుడాఱు నేఁడు భాగంబుల వేదాంతవిచారంబునను ధర్మమార్గంబులగు నితిహాస పురాణాదులం గడపి యష్టమాంశంబున లౌకికం బనుసరించి యవల సంధ్యాకాలంబగుటయు. 124

తే. మరలఁ దత్కాలకృత్యముల్ । వరుససేయుఁ,
గడఁగి సూర్యాస్తమానంబుఁ । గాఁదొడంగు
నవసరంబున నూరిబా । హ్యప్రదేశ
మునకు వచ్చిజలాశయ । మొనరఁజేరి. 125

క. కరమునఁ బవిత్రమిడి స, త్వరమునరవి క్రుంకిక్రుంకు । వడకుండఁగదా
నురువునఁ బ్రాణాయామము, కరముప్రియం బమరఁ జేసి । కార్యజ్ఞుండై. 126

సీ. జలదేవతాకమై । చనుమంత్రసంహతి, చేజలంబులనుఁ బ్రో । క్షించుకొనియు
నగ్నిశ్చయనెడిమం । త్రాగ్రగణ్యమునకా, యర్కుండుఋషియు గా । యత్రిఛంద
మగ్నిహోత్రుండుతా । నమరదేవతవిని, యోగంబుజీవన । మోలిఁబుచ్చు
కొనుటయూ నివ్విధం । బుననుతన్మంత్రమం, త్రితములౌజలముల । నతులభక్తి

వార్చి వెండియు నిరుమార్లు వార్చి ద్విజుఁడు, గడఁగి బడమటిముఖము నేర్పడ వసించి
మొగి దివంబున నక్షత్రములు వెలుంగు, నంతదాఁకను మౌనియై యచలమతిని.

క. తనరం బ్రాణవ్యాహృతు, లెనయఁగ గాయత్రి నియమ మేర్పడ జపమా
లనుఁదాల్చి నొడివి జలధీ, శునిమంత్రంబుల నొనర్చి సూర్యోపాస్తిన్. 128

వ. ప్రదక్షిణంబు సేయుచు నామంత్రంబుల సూర్యునకు దిక్పాలకు నమస్కరించి యింటికిం జనుదెంచి ప్రవర్తితాగ్ని కార్యుండై హవ్యవర్గంబు నతిథ్యభ్యాగతాదులు భుజియింప భుజింపనగునట్లు రాత్రిభోజనంబు మానియున్నవాఁడైనను బ్రాతస్సాయం సమయంబుల వైశ్వదేవ భూతబలులం దప్పక సలుపంబడు నవ్విధి సర్వకార్యంబులం గావించి శయనించువాఁడు కరచరణంబుల జలంబుల శుద్ధిగావించుకొని యిరుగడలఁ దలగడలుఁ గలిగిన మృదుల తల్పంబునందు. 129

తే. అనఘ తనయింట నైనఁ దూర్పున కుశ్వశుర, గేహమున దక్షిణమునకుఁ గృత్య మొదవి
యటఁ బ్రవాసియుఁ గాఁ బడమటికి శిరము, జేసి శయనింపనగును దీక్షఁ జిఁదొఱంగి.

తే. అట్లు శయనించువాఁడు ప్రియంబుతోడ,
రాత్రిసూక్తము జపియించి రమణసుఖశ
యానులగు దైవతముల ఖగాధినాథు
నయ్యధోక్షజుఁ గుంభజు నాకపిలుని. 131

వ. అస్తీకుని ముచుకుందు స్మరించి భద్రాత్మకంబుగా జలపూర్ణ కలశంబు శిరోభాగంబునం దునిచికొని శయనింపనగు వెండియు. 132

ఆ. భార్య తనదు కూర్మిఁ బాటించియుండెడు, పట్టులందు మిగుల వాంఛఁ జేసి
గవయ జనదు తాను కాలంబు నను ఋతు, సమయమైన నరయ జనును నదియును.

వ. అని మఱియు నిట్లనియె. 134

తే. మొదలికడ యామముల నెప్పు మొనసియాఁగ,
మోక్తమంత్రాళిఁ బఠియింపు చొగినిఁ గడపఁ
దగును మిగిలినవాని నిద్రకు నొసంగి,
పుడమి దేవుఁడు నిష్ఠమై యుండుఁగ క్షితిప. 135

ఉ. ఈనియమంబు తప్పక మహీశ్వర యెవ్వఁడు నిత్యకృత్యముల్
బూనికఁ దీర్చు నాతఁడు సమున్నత కీర్తిసిహంబు నందు సం
తానత సాక మందమర మండలిచే ననువారఁ గాంచు నెం
తేని గృహస్థ ధర్మమిది యింతయు నీవడుగంగఁ బల్కితిన్. 136

క. భూతలపతి వినుమికవి, ఖ్యాతంబై యవని నఖిల కాంతాతతికిన్
బూతంబై యధిగత శుభ, జాతంబై యొప్పునట్టి సద్వ్రతచర్యల్. 137

—(*) వశిష్ఠుండు దిలీపునకు స్త్రీధర్మంబు లెఱింగించుట (*)—

వ. అని వశిష్ఠుండు దిలీపునకిట్లను నరేంద్రా స్త్రీల నవరతంబును ధర్మంబుల వినుచుండు టొప్పునట్లు వినఁటం జేసి తదీయచిత్తంబులు ధర్మానువర్తనంబులై యుండు మొదల

యోష్యాజనంబులకు ముఖ్యధర్మంబు పతిసేవయకాని యితరంబులేదు దానివలన
బ్రాహ్మణుండాగ మోక్షంబైన నిజధర్మంబుఁ దప్పకవర్తించిన నెట్టిపుణ్యంబు సిద్ధిం
చునని శాస్త్రంబుల వినవచ్చునట్టి సద్గతి లభించు నింతయెఱింగి. 138

సీ. పతికురూపియు దుస్స్వ - భావుఁడ యైనరోగి, యునైన నిత్యము - కినుకఁజూపు
వాఁడైనఁగలుద్రావు - వాఁడైనభూతంబు, సోకినవాఁడైన - మూకయైన
నాచారహీనుఁడ - న్యాయప్రవర్తనుఁ, డైనసత్వవిహీనుఁ - డైనబధిరుఁ
డైననుఁగుత్సితుఁ - డైనఁగాతరుఁడైన, నంధుఁడైననుజారుఁ - డైనలోభి
యైనజూదరియైనని - తాంతకుష్ఠు, రోగజనితాంగవికలత - రోతఁగలుగు
వాఁడయైనను పూజింప - వలెఁద్రికరణ, శుద్ధిఁగైకొని హరియట్లుఁ జూచిసతియు.

వ. మఱియు నుత్తమస్త్రీజనంబులు ప్రవర్తింపవలయు విధానంబులన్నియు నెఱిం
గింతు వినుము. 140

క. పతికిఁ బ్రియమగు కార్యము, సతిసేయం జనదుతనకు - సంపదతనవా
రతిప్రేమ నొసఁగియుండిన, నతివకు స్వాతంత్ర్యమొప్పదవనిపమఱియున్. 141

క. కామక్రోధాదుల క, ళ్లెనూత్రం బెడమనీక - హృదయంబాత్మ
స్వామిపయిఁ జేర్చియుండద, త్రేవమకుఁ బాత్రంబునై తీఁరతిన్ మెలఁగనగున్. 142

ఉ. కాముకుఁ డెవ్వఁడేని తనుఁ - గాంచిప్రియం పడియెన్ని భంగులన్
బ్రేముడు లందఁజూపి నవ - రింపక సందడి రాకపోకలం
దేమఱి యన్యుసోకిన మ - ఱింతియకాక మదాంధుఁడొంటిఁ ద
న్మానమున హస్తముందిగిచి - నంతటనైనను దైన్యవృత్తిచేన్. 143

క. కాముని శరముల బాఱిం - గోమలిపడఁ జాలనేలు - కొమ్మానేనీ
ప్రేమకుఁ బాత్రుఁడ ననియే, మేమోప్రార్థించినప్పు - డేనియుమదిలోన్. 144

తే. ఇంచుకేనియుఁజలి యింప - కేపొలంతి, మానసముఁ నాథుపైఁ జేర్చి - మసలకవల
జనునొనిక్కవమదియుర - సావధూటి, కినిశిరోభూషణంబయి - వినుతిఁగాంచు.

క. క్రూరుఁడు చెఱఁదీసిబలా, త్కారముఁ గావింపనైనఁ - గవయకతనువే
నారి దొఱంగెడు నదిత, త్పారం పర్యంబుధన్య - తంబొందించున్. 146

క. ఏనారి యెవ్వఁడేనియు, మానకతనుఁ బల్కరింప - మాటాడకయెం
తేనియుఁ జూచిన చూడక, తానేగెడు నదియెసాధ్వి - తరణికులేశా. 147

ఉ. చక్కఁదనంబు నెక్కుడగు - జవ్వనముందన కబ్బియుండితా
మక్కువరూప యవ్వన స - మన్వితుఁ గాంచిన సేయకుండియున్
మిక్కిలిరూప హీనుఁబతి - మెచ్చిరమాసుతు నట్లుఁగాంచు నే
ఱెక్కువలాడి యయ్యది వ - డిన్ ధరఁదాల్చుఁ బతివ్రతాఖ్యయున్. 148

వ. మఱియు. 149

క. అప్పద్మ నయన కెలమిం, దప్పకనిరతంబువంద - నము సేయుదురా
తిప్పల రాయని కూతురు, నప్పద్మ విరించిగృహిణి - హరిహాయుసతియున్. 150

చ. అనఘ దిలీప భూపవిభుఁ డత్యధికం బగునిష్ఠ రోక్తులన్
గనలి వచించినం బెలుచఁ గానఁబుమోదిన భీతిఁజూపినన్
మనము కలంగ కింతయొక మాటునజేరక చీరకెవ్వరిన్
ననుఁగృపఁ గావవేయనుచు నాథుని వేడెను సద్దిసాధ్వియా. 151

ఆ. వసుధ నితరుఁ డెంత వాఁడైన తనమనో, వల్లభునకుఁ గ్రింది వాఁడుఁగాఁగఁ
దలఁచునేమృగాక్షి ధాత్రీస్థలిందానిఁ, బద్మయనుచునేల పలుకరాదు 152

వ. మఱియుఁ బతివ్రతను హరిహర హిరణ్యగర్భాద్యసురులు పతికసమానులు
పూజార్హులై యుండుదురుగాన నది నిరతంబు పతింగొల్చి యిహపరంబులఁ బతి
తోడి సుఖంబునందు నింత తెలిసి సుశీలయగు కాంత పత్యనువర్తినియై. 153

సీ. సుఖమునఁ బతియున్న సుఖమందియుండును, జింతాన్వితుఁడుఁగాఁగఁ జింతసేయు
సంతోషియైనచో సంతసంబునునుండు, దుఃఖింపఁదన్నది దుఃఖమందు
భోజనాదులభర్త భుజియింపభుజియించు, నిదురించినంతట నిద్రఁజెందు
నిదురించియునులేవఁ గదిసియంతకుమున్న, మొనరంగఁబరిచర్యలనుఘటించు
పతిప్రవాసియైనఁ బదఁపడిమలినాంబ, రములుఁగట్టిహేమ రత్నఖచిత
భూషణములువీడి పాలుపెంతయుందక్క, యుండుశుభముఁగోరు చుండిపతికి.

చ. మఱియుఁ బతివ్రతాంగన సమంచిత భక్తినిభర్తకన్న న
క్కఱ శ్వశురోప చారములఁ గల్గి విభుండొనరించునట్టి పె
ద్దఱికపు మేలికృత్యములఁ దద్దయు సమ్మతియుంచివానికే
యఱగొఱ లెందునేనితన యందునుఁదోఁపఁగ నీకయుండెడున్. 155

క. ఇలుపరి శుద్ధము సేయం, గలిగినయవి యున్విశుద్ధ కర్మంబులు తా
లలిమున్నరి శుద్ధాత్మక, జలజాక్షి పతివ్రతాల సద్గుణమైనన్. 156

సీ. పృథివీశతిలకసా ధ్వీలలామమపతి, యెందేశిఁబోయి తా మందిరమ్ము
సేరంగరానిరీ క్షించిప్రత్యుత్థాన, మొనరించిపాదము లనుజలములఁ
గడిగి వేతడియొత్తి కైమోడ్చియాసన, మిడివండినన్నంబుఁ గుడువఁబెట్టి
తాంబూలమొసఁగియొం తయుఁగాసినొందితి, రనివీవనములుగై కొనితదంతి
కమున నిలిచియు వీచి య క్కటికమొదవ,
మృదులతల్పము సమకూర్చి మదికిముదముఁ
గదిరి భాషింపఁ బోయిన కార్యముల వి,
ధంబుఁ దానప్పు డడుగు మో దంబుతోడ. 157

తే. ఇటఁగలిగినవారల కెల్లఁబ్రియత, మంబుఁగా గనువర్తించు మనికిసేర
వచ్చుచుండెడుభిక్షుకా భ్యాగతాతి, థులకు వేడుకలొనరించు నిలనుసుసతి.

క. వెలినుండి గేహకృత్యం, బులకైపతి తెచ్చియిచ్చు మూల్యముఁదా ని
మ్ములదాచుఁ గొంచమనకయె, తలఁపదు త్యాగార్థమైన దానినిదాపన్. 159

క. చేరదిరుగులం బొరుగుల, మీరదుపతి యాజ్ఞఁబనుల మెలఁగెడుచోటన్
గోరదు కోరిక లూరక, మారదు సుగుణముల నెంత మాత్రంబేనిన్. 160

క. త్రవ్వఁగఁబో విరులకథ, లివ్వదుపతి సెప్పకేని నేరికినైనన్
నవ్వదుమిక్కిలి కోపం, బెవ్వల సందేసునొవద మేసర దెప్పుడున్. 161

క. పతివర్జించిన వస్తువి, తతిఁదానుం బాయుఁబ్రోషి తాధవయైనన్
హితమతిఁగై సేయదుఁదా, బతికిష్టము దేనినేనిఁ బాటింపదొగిన్. 162

క. తనపతిపంచత నొందిన, మనమలరఁగఁ జేయుసహగ మనముం బతితో
డనుఁదన కొకపిండం బ, త్యనుపమమగు బ్రహ్మపదము నందెడుకొరకున్ 163

వ. ఇన్నియుం బతివ్రతాలక్షణంబులని పలికి వశిష్ఠుండు క్రమ్మఱ దిలీపున కిట్లనియె.

క. లోకం బేమనునోయని, శోకంబున క్రోధమునను సూనులు లేమిన్
జేకొని పెద్దల భయముం, బోకార్పం బోలదగ్నిఁ బొలఁతికి తనువున్. 165

వ. వెండియు. 166

తే. చంటిపాపడుఁ గలయట్టి చానగణిక, పుష్పవతిగర్భిణియుఁజోరఁ బోలదగ్ని
సహగమనవాంఛమైత్కీతి శాగ్రగణ్య, యదిమహాదోష మనిబుధు లనెదుకతన.

తే. మఱియుముట్టుతయైనట్టి తెఱవమొదలి, దినముచండాలి రెండవ దినము బ్రహ్మ
ఘాతుక బ్రాహ్మణితృతీయ ఘస్రమునఁద, దర్ధపాతక భారతానైతనర్చి. 168

వ. నాలవ దినంబునందుఁ బరిశుద్ధాత్మకయై యుండు నట్లగుటం జేసి మొదలి మూఁడుదినంబులందును. 169

సీ. మజ్జనమున్ సుధాశనన మస్కృతి యేడ్పను నవ్వుద్యూతమున్
సజ్జప్రయాణ మర్చనము చందనలేపము దేవపూజలం
బుజ్జవమూరఁ జెప్పటలు పోలదు నిద్రపవల్ దలంటుఁబా
రజ్జువు వెంచుటల్ రదన రాజివిశుద్ధి మనోజ కేళియున్. 170

సీ. ఇంచుకైననువీనిఁద లంచకొండు, ముట్టుసతిఁగూడుటయుఁజూడ్కి వెట్టుటయువ
సించుటయుమానవోభుజి యించుటయును, దానిచేరికమైవిను తరుణికధిప

తే. ఇచ్చవోడమినయట్టుల నెలమిబయలఁ, దిరుగరాదటులడవుల కరుగరాదు
నదులదిగరాదుతైలమిం పొదవఁబూయ, రాదు చెల్లదునిజనఖ రములఁద్రుంప.

కానియ్య గూడదించుక, తానశనముఁ గుడుచునప్పు తద్వనిశిశువుల్
బోనంబడిగిన నితరుల, చేనిడఁజేయంగవలయుఁ జెల్లమిఁదానున్. 173

ఆలకువత్సంబులనిడఁ, బోలదు పండులనుఁగోయఁ బోలదుశశినిన్
హేళినిఁ దిలకింపంగాఁ, బోలదు పోలదుశిరోజ ములుదువ్వకొనన్. 174

మైలవిడువరాదు మఱియునునిజకర, పాదములునుతినిన పాత్రఁగడుగు
టాదిమందిరమున కత్యంతికంబునఁ, జనదుముట్టుసతికి జనవరేణ్య. 175

ఇట్లు మూఁడుదినంబులుండి నాల్గవదిన ముదయంబున లేచి తొఁబరుండుచుఁ గూర్చుండుచు భుజించుచుండిన స్థలంబుఁ జతురంగుళ ప్రమాణంబు త్రవ్వితమృత్తి

కగృహంబునకు దూరంబున బారవైచి వేరొండు మృత్తికం దదీయ స్థలంబుం
జక్కవరచి జలంబుల నొండె గోమయంబున నొండె యలికి శయ్యోపధానాం
బరంబులం దానెగైకొని దూరంబగు జలాశయంబునకుం బోయి చోటం దడిపి
యుడికించి యుదికి యొండెడ నిడియంత. 176

తే. ఱాలఁ బదకరనఖముల ఱాచి కడిగి, గుహ్యమును మృత్తికంబూని కొనరి ముప్ప
దింటిపై రెండు మారులు తెలివ శుద్ధిఁ, జేసికొని వెండి జలములఁ జేసికొనియు. 177

ఆ. దంతధావనమ్ము తదనంతరము భస్మమున నొనర్చి నీట మొగిని పోడ
శద్వయమ్ముఁ దావె సంబుక్షాళించి ముఖంబుఁ గడిగి కడుము దంబుతోడ. 178

చ. కసటుఁ గొలంగ మేనికి మొగంబునకుం నునుమూర్ధజాలికా
యుసిరిక పిండి ఱాచి జల మొయ్యన తీరముఁ జేర్చి పాత్రచే
నసితశిరోజముల్ దడిసి యంగమునంగల యట్టికల్మషం
బెసఁగి తొలంగ తానముకు భృత్యుచ చేసి యనంతరంబునన్. 179

క. నీరంబులలో డిగియును, వారక ముప్పదియుఁ గాగ వడిమున్కలు తా
నారిమునుం గగవలయుం, గోరికనటు లెక్కవెట్టి క్రుంకినపిదపన్. 180

ఆ. మున్ను నుదికి యుంచి యున్నట్టి, శయ్యాది కంబుఁ గేలనంది కడఁకఁ బోడ
శద్వయంబు నీట సంక్షాళనం బొన, రించి మఱియు మొదలి రీతి మునిఁగి. 181

క. అటు నేకోచ్ఛ్వాసంబునఁ, బటుతరముగ మునిఁగి రవికి వందనమిడి య
ప్పటములఁ గైకొని మదివి, స్ఫుటముఁగఁ బతినిలిపి మొరులఁ జూడక యుండన్, 182

క. ఇలు సేరవలయు నటుల, పొ్వలఁతికిఁ బరపూరుషుండు పొడకట్టినచోఁ
దలఁపునఁ బతిఁ దలఁచి హరిం, దిలకించియు బ్రహ్మకూర్చ తీర్థం బెలమిన్. 183

క. పానంబొనరించియుట, స్నానముఁ గగో క్షీరమును మనంబలరంగా
నానజలంబుల ద్రావియు, మానినితిన వలయునప్డు మఱియన్నంబున్. 184

వ. ఇదియునుం గాక నీరాడివచ్చునపుడు శిశుదర్శనంబునుం గాఁ గూడదట్లయినను నీచె
ప్పినవిధం బాచరింపంగవలయు మఱియు బ్రహ్మకూర్చ పానానంతరంబునఁ బంచ
గవ్యంబునుం బుచ్చుకొన్న నింకను విశేషంబగునట్లుఁ గావించి భుజించి నంతట
బాలురం గాంచిన దోషంబు లేదు. 185

క. యోషారత్నంబటుసం, తోషంబునఁ గుడిచి విడెము నున్నమలి మణీ
భూషాలంకృతయై ప్రియ, భాషలఁ బతిఁ జేగవలయు భానుకులేశా. 186

తే. అట్లుదంజేరవచ్చిన యతిపస్రవద, స్పృశ్వి శేషయె యైయున్న చెలువుఁ డెలమిఁ
గూడ రాదట్లుఁ గూడిన కొమరుఁ డుదితుఁ, డైనన భిశస్తుఁడై యప ఖ్యాతినించు.

క. వినుమిక చూలాలై యుం, డినసతి వర్తింపఁదగిన నియమం బనయం
బునుతన శరీరధర్మముఁ, గనియటు మెలఁగంగవలయు గర్భముఁ గావన్. 188

క, పరిశుద్ధ గంధభూషాం, బర ధారిణి యయ్యుఁ బ్రాణ పతి సేవాత
త్పరయయ్యు దుష్టనారీ, పరిచితి పరిహారయయ్యుఁ వారకమఱియున్, 189

క. మృతవత్సా సంసర్గం, బతిభీభత్సావలోక నాభిరతియుఁ ద్రా
సతమంబులు నౌగాథల, సతతంబును వినుటనూని చనువర్తింపన్. 490
క. భక్షింపంగాఁ బోలద, తిక్షారమ సక్తికంబు తీక్ష్ణకరంబౌ
భక్షణము చల్దిఁదాగ, ర్భక్షేమముఁ గోరిశుద్ధ్భ రాతురమైనన్. 191
తే. మఱియు భక్షింపఁగా రాదు మాంద్యకరిన,
కార్శ్య కరవస్తుతతిసూర్ప గంధవహము
సోకనీరాదు తానుఁ గూ ర్చుండుపట్ల,
క్రిందు మీఁదగు పీటల యందుతగదు. 192
క. గృహకార్యంబుల నిత్యము, బహుళముగాఁ జేయరాదు వడిని శ్రేణిన్
మిహిరాన్వయాబ్ధిరాకా, మిహికాకర యెక్కఁజనదు మేలదిగామిన్. 193
తే. అంటువడియున్న సతిచతుర్థాహమునను, జలక మొనరించి రాఁగఁ గాంచంగ రాదు
మొనసి గర్భిణియైనను బంధనము లెల్ల, నాత్మ మఱువక వర్తించె ననినదియు.
వ. గర్భపతనంబునుం బ్రసవసమయంబున శిశుస్తంభనంబు మొదలగునవి లేక సుఖం
బునం బ్రసవించు మఱియు నాచూలుసుశీలుండగు కుమారుండగు వెండియు. 195
క. సవతులుఁ గలదై యుండిన, సువినయమై మొదలఁదమక సూయయె యున్నన్
బ్రవిమల వాక్కులదానిం, దవిలియెడం బాపనగును దమువడయుంగన్. 196
ఉ. ఇంతియ కాక గర్భిణి హృ దీశ్వరు సన్నిధినుండి సంతతం
బెంతయుఁ బ్రీతిమై యధిపు డేమివచించిన దానివించు నో
క్కింత వివాదముం గొనక యెల్లవిధంబుల భక్తిఁ జూపుచుం
గాంతుఁడు గాంక్షసేయఁ గుతుకంబున కేళిగృహంబు సేరియున్. 197
క. రసికుఁడు విభుఁడై తన్నుం, గుసుమాయుధ కేళిఁగవసి కుశలతఁజూపన్
విసువక సంతోషింపుచు, నసితాలక జాలయుండ నగునది మఱియున్. 198
వ. సాధ్వియగు పొలంతి యేసమయంబునం గాని పతిచెంగటనుండు నప్పుడు. 199
తే. గాత్రభంగము ప్రహసన మాత్రమును మ,
నోవికలత యుత్సుకమును మోవిఁగఱచు
టయునుఁ గరముల గోకికొం టయును జృంభ,
ణంబుఁగా సముచీదుట యుంబా నరదు. 200
సీ. హృదయేశ్వరుఁడు తన్నుఁ బెదరించినను బెట్టి, దములాడినను లేక దండనంబుఁ
గావించినను నెట్టి కష్టముల్ వెట్టిన, భయమందియుల్వీడి పాఱివారి
వీరిఁజేరక తన వారితోఁ జెప్పక, యెలుగెత్తియేడ్వక కలయవిధిని
దూఱకపతిఁజేరి తొలఁగిపోఁగోపంబుఁ, బలుమారుఁ బ్రార్థించి చెలువశాంతుఁ
డైన యంతట మీరిటు లాచరింప, నెవరు దిక్కెంచుఁ జనుదాన నింకమీఁదు
నెయ్యదిష్టంబునాజ్ఞయిం డిప్పుదాని, సేయఁగడఁగుదుననుచువ చింపనగును.

క. విందుల మందిరములలో, నెందేనిఁ బ్రయోజనంబు | లేర్పడెనేనిన్
ముందుగఁ బతి యానతి లే, కిందరుణికిఁ జెల్లదరుగ | మిహిరకులేశా. 202
క. పతిప్రోషితుండు కాఁగా, నతివయు జనుఁగానంగ | నమరెడుపనులీ
క్షితిసల్పి బ్రదుకనగు న, ప్రతిమము సీమావిశేష | భాసురయగుచున్. 203
క. దేశాంతరమున కేగుచు, నీశుఁడు తన కేదికృత్య | మేర్పరచెం దా
నాశశిముఖి యవ్వర్తన, మేశరణముఁ గాగనుండు | టేయదియొప్పున్. 204
క. వెండియుఁ బతి ప్రోషితుఁడై, యుండిన సతి రాత్రులందు | నోగినిదుర ధరా
ఖండల శ్వశురాంతికమున, నుండియుఁ గావింపనగు హి | తోపాయములన్. 205
ఆ. మఱికి వెడలి భర్త | పనిఁబూని దేశాంత, రమున కేగి దినము | లమితముగను
గడువ దైవతములఁ | గడువేడ్కఁ బూజింపు, చుండనొను పతికి | శుభముఁగోరి.
ఆ. వెండిదినదినంబు | వెలఁది ప్రాణేశ్వరు, కుశలమెఱుఁగ మదినిఁ | గోరితగు ప్ర
యత్నములనుఁ జేర్చి | నవనీశ సేయుచు, నుండవలయు నింట | నుండి తాను. 207
క. ఈవివరించిన విధముల, భూవల్లభ వీడి హేతు | వుల్లేకయె య
న్యావస ధమ్ములఁ జేరం, బోవుటఁ బరపురుష సేవ | మొగినాసక్తిన్. 208
వ. లజ్జావిహీనయై సేయుచుండఁదగదు మఱియు నేపొలంతుక యేనియు బరిశుద్ధాత్మకయై హారిద్రా కుంకుమాద్యలంకృత యుస్మిత ముఖాంభోజయుం బ్రియానుకూలినియునై యీ యెఱింగించిన విధంబుల నుండెనేని యయ్యింట నిందిర కాపురంబుండు నయ్యువిదయు నిహపరంబుల గీర్తిసుఖంబులం బొందు మఱియు వినుము.
మ. పురుషుం డాత్మసుఖంబుఁగోరి తనకుం | బూబోణి నిత్యంబు సా
దరయై సర్వవిధంబులం దనుపత | ధ్యంబింతఁ గార్హస్థ్యమున్
ధరఁ బాటింపఁగ నెప్పులేని యెడఁ గాం | తారంబునం దేగి యొ
క్కరుఁడై వన్యఫలామలన్న మలియో | గానక్తినుం టొప్పగున్. 210
వ. అని చెప్పి వశిష్ఠుండు క్రమ్మఱ దిలీపున కిట్లనియె. నిట్టి పతివ్రతా లక్షణంబులుఁ గల సతులు నఖువురుంగొలువఁ జిరసౌఖ్యంబు లనుభవించుచు మృగశృంగుండు వాజపేయాతి రాత్రచయనాది సత్క్రతువు లాచరించి కృతార్థుండయ్యె ననిన దిలీపావనీపుం డిట్లనియె. 211
చ. మునివర తెల్పుమమ్ము వి | భుండు తనూజుల నెందఱింగనెన్
దనువెటు వీడి సద్గతి ము | దంబునఁ గాంచె ననంతరంపు వ
ర్తనమది యెట్లు సర్వముని | తాంతదయాపరి పూర్ణమానసం
బున ననుఁ జూచి నాగముని | పుంగవుఁ డిట్లని చెప్పె వెండియున్. 212

—(*) వశిష్ఠుండు దిలీపునకు మృగశృంగు సంతతిం దెల్పుట. (*)—

మ. కుతలాధీశ లలామ యట్లు మృగశృం | గుండుం గృతానేక స
త్క్రతుజాలుండయి కొంతకాలమరుగం | గాంచెన్ సువృత్తాఖ్యయం

దతిపుణ్యాత్మకు సూనునాత్మసమున । య్యంభోరుహాస్త్రోపమాం
చితరూపు౯ నిజగోత్రపావనుని సు । శ్రేయంపు లగ్నంబున౯. 213

క. అంతటనతఁడు పితృత్రాణము, నంతయు నెడఁబాయుటం గృ । తార్థుండై తా
నెంతయు ముదమున సలిపె గృ, హాంతరమున జాతకర్మ । మబ్బాలునకు౯. 214

వ. అట్లు సలిపి. 215

మ. మును నే నుగ్ర తపంబు సేయ హరిణం । బుల్ శృంగ కండూతిఁబో
నను నిత్యం బెటు డాయుచుండె నటు సాం । ద్రఖ్యాతి వీడుం దపం
బునుఁగావించెనుఁగాన నే నిడుదుము । న్మున్నే మృకండుండు నా
జను పేరంచుఁ దదీయ నామమిడియె౯ । సమ్మోద మేపారఁగ౯. 216

క. తనరనటు నామకరణం, బొనరించియుఁ బంచమాబ్ద । మొగినుపనయనం
బును శాస్త్రరీతి సలుపం, గను నాతఁడు జనకునాజ్ఞఁ । గైకొనియంత౯. 217

క. గురుఁజేరి సాంతములుఁగా, వరమతి వేదములు నాల్గుఁ । బఠియించియనం
తరమతి భక్తి మెయిం దా, గురుదక్షిణ నిడి తదాజ్ఞ । గొనియలు సేరె౯. 218

వ. అట్లు గార్హస్థ్యంబునకుం దగినవాఁడై తన చెంతఁజేరిన కుమారునకు మృగశృంగుండు ముద్గలుండను మునికూతు మరుద్వతిం బరిణయంబుఁగావించె నంత. 219

క. మృగశృంగునకం గనలలో, నగకుచ రెం డవదికమల । నాబడు సతియు౯
దగనుత్తమాఖ్యఁబుత్రకు, సుగుణోత్తరుఁ గనెఁదదాఖ్య । సుస్థితి వెలయ౯. 220

తే. తండ్రి చేనతండు । తగనుపనీతుఁడై, సకల వేద శాస్త్ర । సమితిఁజదివి
విమలరూపయగుచు । విమలాఖ్య నెసఁగిన, కన్యకూతుఁ బెండ్లిఁ । గాంచె వేడ్క.

క. సుమకోమలి మూడవసతి, విమలాఖ్యత నూజుఁగని యె । విశ్వఖ్యాతు౯
సుమతియను వానినతఁడు౯, సుమహితమతిఁ జదివె ననన్ని । శ్రుతులోలి మెయి౯.

చ. వరగుణుఁ డయ్యెనాతఁడు వి । వాహము వేడ్క మెయి౯ సుమంతుకూ
తురునగు సత్యనాఁబడు వి । ధుం తుదవేణిని పెండ్లియమ్ము నీ
శ్వరుఁ చతుర్థకామినివె । సంగని యె౯ సురసాఖ్య మారసుం
దరతను సువ్రతాఖ్యసుగు । ణాఢ్యుఁడతండను మోదచిత్తుఁడై. 223

క. సకలామ్నాయంబులుఁదాఁ, బ్రకటక్రియఁ జదివియంత । రహిగార్హస్థ్యం
బకలంకతఁ గైకొనియు, త్సుకతఁ బ్రియం వదను పృథుని । సుతవరియించె౯. 224

తే. ఇట్లు నల్వురసతులయం । దింపుతోడ, నల్వురంగాంచి కొమరుల । నల్వురకును
బెండ్లిఁ గావించినంతట । బెద్ద వాసి, కమ్మృకండునకుందక్క । నందఱకును. 225

వ. సుపుత్త్రు లనేకు లుద్భవించి వేదశాస్త్ర పారంగతులై సదక్షిణలుఁగ ననేక యజ్ఞంబు లొనరించి జనకులం బవిత్రులఁ గావించి రివ్విధంబున మృగశృంగుండు సతీసుత పౌత్త్రసున్నపాదులంగూడి నిరంతరం బతిమోదంబున గృహస్థధర్మంబు నడుపుచుండియు. 226

తే. మాఘమాసముఁ గదియనె స్మనమునందు,
నధికమోదము గమరఁదా నహరహంబుఁ
దనకుటుంబముతోఁ బ్రభా తమున లేచి
యేటిలో మున్గి యింటికి నేగుదెంచు. 227

క. ఒకనాఁ డేనియునాతఁ, తనకుమారుఁడు మాఘమునను స్నానము లేకూ
రకయింట నుండి యెఱుగఁడు, సకలావని నాథనియమ సంభృతమతియై. 228

వ. మఱియు గృహమేధియగు వానికి స్నానదాన జపవ్రతాదులైన నియమంబు
లన్నియు ముఖ్యంబులై యున్నను మాఘమాసంబునందవి విశేషఫల మొసంగు
చుండునట్లు మృగశృంగుండు గృహస్థధర్మంబుం బెద్దకాలం బనుసరించి శరీర
పాటవం బుడుగుసు కాలంబుఁ జింతించి నిజాంగనలఁ గుమారుల చెంత నునిచి తన
యం దగ్ని సమారోపణంబుఁ గావించుకొని తపంబునకై వనంబునకరిగి యందు

చ. మొగిమృగముం బలెన్ దృణస ముత్కరముర్వినిఁ బద్ధపత్రముల్
మొగమునఁ ద్రెంచితించుకర ముల్ ధర నూదిచరించు చవ్విధిన్
డిగిజల మానిపల్వలపు టెంకులతాలఁ బరుండియుండియా
మృగములఁ గూడిసంతతము మేదినిఁ ద్రిమ్మరుచున్ మహాటవిన్. 230

ఆ. పెద్దకాలముండి పిమ్మటనమ్మృగ, శృంగమౌనివిశ్వ సృత్పదంబు
సర్వదేవతాలి సంస్తుతులొనరింపఁ, జేరిసంతసంబు మీరనందు. 231

ఆ. నలువచేతమిగుల నలువారనచ్చటి, నలువురౌననంగ నలువుగాంచి
సర్వసౌఖ్యములనుఁ జక్కనఁ జిరకాల, మనుభవించియంత టనునతండు. 232

వ. కల్పాంతంబైన వెండియు శ్వేతవరాహ కల్పంబునందు ఋభునామ ధేయంబునఁ
బితామహున కుద్భవించి నిదాఘుని మోక్షాయత్తుఁ గావించి యధోక్షజునాకృతి
దీర్చినవాఁడై కృతార్థత వడసెనని మృగశృంగు విధం బెఱింగించి వశిష్ఠుండు
మఱియు నిట్లనియె. 233

క. అమ్మృగశృంగుని సుదతులు, తమ్మతనూ జన్ములధిక దయఁబోషింపన్
సమ్మతినానావ్రత దా, నమ్ములు సలుపుచును ముదము నంబొందలనటన్. 234

ఆ. దంతపంక్తివదలె తలవెంట్రుకలువెల్ల, నయ్యెబిగువుఁదప్పె నంగములకు
నింద్రియములశక్తి తెల్లనువీడ్వడెఁ, గడిదియైనముప్పు కాలమెదుగ. 235

—(*) మృకండుండు సతీమాతృ సహితుండై కాశీప్రయాణంబగుట (*)—

సీ. అట్టిసమయంబునం దాసువృత్తాత్మజుఁ, డైనమృకండుమ హామునీంద్రుఁ
డపపత్యుఁడై యిట్లు తనమనంబున నెంచె, నెచ్చోటఁ దానప ర్ణేశుఁడభవు
డనిశమ్ముఁ బ్రాణిలో కావసానమునందు, రహిఁ జెప్పుచుండుఁదా రకము చెవిని
నట్టిపుణ్యక్షేత్ర మైనకాశీపుర, మరిగెదమాతృజా యాన్వితముగ
ననుచునాలోనఁ దానుఁ బ్ర యాణమయ్యె; దండుతోడనతద్రాష్ట్ర ధరణినాథుఁ
డైనరాష్ట్రవివర్ధనుఁ డప్పుడతనుఁ, దరలెఁ దల్లులు సతియువెం దవిలిరాగ. 236

వ. అట్లు సోదరాదుల గృహంబునందించి దినదిన ప్రయాణంబులఁ గాశీమార్గంబు నడుచుచు శ్రాంతలగు తల్లులకుం జాయకుఁ గాశీప్రభావం బిట్లని వర్ణించి చెప్పఁ దొడంగె. 237

చ. కడువడి తల్లిదండ్రులకుఁ । గాదిలిచుట్టలకింతఁ గాక యె
వ్వొడల విహీనుఁడయ్యు చరి । యించు శరీరికి రోగబాధలం
బడివిలపించు వానికినిఁ । బాపముల న్మఁడిబడ్డవానికిన్
గడిదిజరా ప్రకృష్టునకుఁ । గాశియె కాకితరంబుఁ గల్గునే. 238

ఉ. వారక మోహపాశముల । బంధితుఁడై కడలేని హీనసం
సారపయోధి మగ్నుఁడగు । మర్త్యునకుం గులహీన సద్వ్రతో
దారదయావిహీనులక । ధర్మునకుం దనుజన్ములాలు ద
న్నారయమిన్ వ్యథల్ బడియె । డాతనికిం గతికాశియెకాఁ గదా. 239

తే. అఖిల కల్మషములతోడ । నంగసమితి,
భస్మమొనరించు నాబృహ । ద్భానుఁడేస్మ
శానమునఁ బ్రజ్వలించెను । సంతతంబు,
నట్టికాశియె గతియనా । థౌఘమునకు. 240

క. రూప విహీనునకును నురు, పాపాత్మున కమితవిషయ । ఫణిదష్టునకున్
రూపింప జ్ఞానహీనున, కాపైరక్షింపఁ గాశి । యానిద్ధాత్రిన్. 241

చ. యమనియమాదియోగముల । నాదృతిసల్పిన యంతసార్థకం
బమల మనీషతోఁ దపమ । హర్నిశమున్ బొనరింపఁ గల్గు పు
ణ్యము వ్రతదానధర్మముల । నందెడుసత్ఫల మబ్బునంద్రుఁ దా
మమర గిరీశుఁ గొల్చుచు మ । హామతిఁ గాశి వసించువారికిన్. 242

క. కాశియె దివ్యావాసము, కాశి వసించుటయె దివ్య । కాంతాసుఖమున్
గాశియె పితృగురుజనములు, కాశియె సద్విద్యయదియె । కైవల్యంబున్. 243

ఆ. కాశికాశియంచు । నాశించి పల్కుచెం, తేనిదూరముండు । వానిదైనఁ
బాపసంచయంబు । పరిహారమయ్యెడు, నందెయుండఁదగదె । యమ్మలారా. 244

వ. మఱియుఁ గాశి వసించి నిరతంబా విశ్వనాథు నారాధించువారికి ధర్మార్థకామంబులను మూఁడుపురుషార్థంబులు సిద్ధించుచుండునుం దత్కింకరచయంబును నేమి సేయంజాల రమ్మహాత్ములకుఁ గామక్రోధాదులు లేక జ్ఞానసంపన్నత గలిగియుండు నింత వచింపనేల యవ్వారణాశియే శివలోకంబని యెఱిఁగించుచు. 245

చ. జననులుఁ దానిజాంగనవె । సంజనుదెనొక కొన్నిఘస్రముల్
సనఁజనఁ బోయిపోయి ఋషి । సత్తముఁడైన మృకండుఁ డంతటన్
గనుఁగొనె మానసంబలర । కాంచనగోపుర హర్మ్యసౌధ సూ
తనరుచిరప్రకాశినిన । దాఘవినాశి నివారణాశినిన్. 246

అట్లుఁ జూచి తత్పురంబుఁ జేరి. 247

క. ఫణిభూషణుఁ జింతింపుచు, మణికర్ణిస్నానమాడి | మఱియవ్విప్రా
గ్రణితత్కాల విధుల్దా, నణుమాత్రముఁ గొఱతలేక | యన్నియుఁదీర్చెన్. 248
మ. తిలపుష్పాక్షతలం గృహీటములనా | దిత్యాలి బుష్పాలికం
దెలమిందర్పణముల్ దనర్పనిడెహా | యిన్ భక్ష్య భోజ్యాజ్య ని
స్తులశాకాదులఁ దీర్థవాసులకు ముం | దోడ్తోడ దీనాలికి
మ్ముల సంతర్పణవెట్టి మిక్కిలి ప్రియం | బున్భక్తి నిండారఁగన్. 249
తే. ఢుండి గజముఖునాజ్యసిం|దూర లేపి, తాంగుఁ గావించెమాతృజా|యాన్వితముగ
నన్నయార్గుర నైదైదు | నొక్క రొకరి, కి నిఁగమోద కములనిడి|వినతిసలిపి 250
వ. అనంతరం బక్కాశీక్షేత్రంబుఁ బ్రవేశించి పక్షాపర పక్షంబులు లేక యందుఁగల సర్వదేవతలకు యథాశక్తిఁ బూజనంబులిడి విశ్వనాథస్వామిం జేరి నమస్కరణ స్తుతులాచరించి మృకండుండు సతీమాతృయుతుండై క్షేత్రోపవాసంబుండి మరునాడరుణోదయంబున యథావిధి మణికర్ణీ స్నానంబుఁగావించి కృతనిత్య కృత్యుండై పరిశుద్ధుండగుచు శైవాగమ విదులగు విప్రజనంబులఁగూపి విధిహితంబుఁగా నిష్టార్థసిద్ధికై యొక్క దివ్యలింగంబుఁ దనపేరం బ్రతిష్ఠించె నంత. 2 1
క. పదఁపడి వారలునల్వురు, ముదుసల్లుం బ్రీతిభక్తి | మునుకొనశోభా
స్పదముల లింగంబులనప్పు, వదలక స్థాపించిరొగిని | వారలపేర్లన్. 252

—(*) మృకండుఁడు మాతృజాయాసహితుండై వేశ్వేర లింగప్రతిష్ఠసేయుట. (*)—

వ. అట్లు మరుద్వతియు నొక్క మనోహరంబైన లింగంబు స్థాపించెనని చెప్పి వశిష్ఠుండు వెండియు నిట్లనియె. 153
తే. అధిపమండి వినాయకు | నగ్రభూమి, నెలమినిలిపిన యమ్మృకం | డ్యేశ్వరాఖ్య
లింగమెవ్వరు పూజనో | లిసినెనర్తు, రిలనువారల కఖిలార్థ | ములుఫలించు.
శా. ఆలింగంబున కగ్రభాగమునఁ జె | ల్వానాసు వృత్తేశ్వరున్
వాలాయం బతిభక్తిఁగొల్చిన నరుల్ | నందారు మందారుఁడౌ
ప్రాలేయాద్రి తనూజవల్లభునయున్ | భద్రంబులం బొంది యె
క్కాలంబుం దుదఁదత్పదంబుఁగడు వే | డ్కంబొందు వారల్నృపా. 255
మ. అమరం దద్ఘన లింగరాజమునక | య్యాఖండలా శాస్థలిన్
గమలాస్థాపిత శర్వలింగమునుఁ గాం | తుల్ మీరఁగా నెవ్వరీ
క్షముఁబూజింతురో వారుఁగాంతురుమహా | హంకాధి వాసంబు ని
ర్జముధాత్రీశ్వర సంతతంబతుల సౌ | ఖ్యానందముల్ బొందఁగన్. 256
తే. ఢుండి గణాధినాయకుని | తోరఁపు దేహళికిన్ సమీపమం
దుండి ప్రసిద్ధిమైవిమల | తోడఁ బ్రతిష్ఠిత మైనలింగమున్
నింపు ముదంబుతోనెవర | నింద్యచరిత్ర దిలీపకొల్తు భూ
మండలి వారుఁగాంచెదర | మర్త్యనుతుండగు శూలివాసమున్. 257

క. సరవిం దల్లింగంబున, కరయఁగనీ శాన్యభాగ ƒ మందుం డెడునా
సురసేశ్వర లింగంబి, ద్ధరఁగొల్చిన వారివైన ƒ తలఁపులు చెల్లున్. 258

ఆ. అమ్మృకండునింతి ƒ యైన మరుద్వతి, కడఁకతోడనుమతి ƒ కర్ణికకును
చరమభాగమునను ƒ స్థాపించియున్న లిం, గార్చనమునఁగాంతు ƒ రభవునరులు. 259

క. అనిచెప్పి వెండియిట్లను, మునియవ్విధిఁ దల్లులతివ ƒ మోదముతోఁదా
నును మొగి లింగస్థాపన, మొనరించి మృకండుమౌని యుండగనందున్. 260

వ. ఏకాబ్దంబు నివసించి యచ్చటంగల తీర్థముల సుస్నాతుండై విధిక్రియం బ్రతి
పర్వంబునందును శివు నారాధింపుచుండ నట నొక్కనాటి మధ్యాహ్నంబునందు.

తే. అమ్మృకండు నిజనయిత్రు ƒ లధికభక్తి,
నరిగి మణికర్ణికాస్నాన ƒ మాడివిశ్వ,
నాథు గుడిచుట్టుఁదిరుగుచు ƒ న్నపుడువారి,
కమితముఁగఁగ్లై నేత్రఘూ ƒ ర్ణమము శ్రమము. 262

క. అంతట వారలునాత్రిపు, రాంతకునకుగజచర్మవసను ƒ హరుమృడు మదిలోఁ
జింతింపుచు నేలంబడి, రెంతయుని వ్వెఱఁగుఁదోప ƒ నేమనిచెప్పన్. 263

ఉ. అప్పుడ హీంద్రభూషణుఁడ ƒ పార్వతిసోమ కృశానువీక్షణుం
డొప్పుఁగ వచ్చివారితల ƒ లొయ్యనఁ జేతులఁ గ్రుచ్చివీనులన్
గుప్పున నోంకృతిన్నుడివి ƒ కూరిమినందె తిరోహితుండునై
యెప్పటి యట్లనేగె కుత ƒ లేశ్వరవింతయె శూలికింతయున్. 264

క. అవ్వేలు పరలోకంబున, కవ్విధమునఁ జనినవెనుక ƒ నగ్నిసంస్క్రియల్
నెవ్వడిని నుత్తరక్రియ, లెవ్వియు పీడకయ సూనుఁ ƒ డేర్పడఁ జేసెన్. 265

వ. అట్లుఁగావించి శివు నారాధింపుచుండం గొంతకాలంబున కయ్యభవు ననుగ్రహం
బునం జేసి మరుద్వతియందు మార్కండేయుఁడన దీర్ఘాయుష్కుండగు తనూజు
వడసె ననుటయు వశిష్ఠునకు దిలీపుం డిట్లనియె. 266

ఆ. అనఘమును మృకండుఁ ƒ డనపత్యుఁడసపల్కె, తశనికభవుఁడెప్డు ƒ డాత్మజాతు
నొసఁగె నాతఁడెవరి ƒ వసమున దీర్ఘాయు, వందెనింతవట్టు ƒ నానతిమ్ము. 267

తే. అనినముని వెండిజనపతి ƒ కనియెనిట్లుఁ, గాశి వశియించియుండి మృ ƒ కండుఁడాత్మ
సంతతియులేమిఁ జింతించి ƒ సతియుఁదాను, గోమతికినేగి తత్తీర ƒ భూమియందు.

వ. రమణీయంబగు చోట నాశ్రమంబేర్పరచుకొని నిత్యంబును దన్నీరంబుల సుస్నా
తుండై హోమంబులుం బితృతర్పణాదులుఁగావించుచు మహానియమంబుం బూని.

సీ. మొనసిఫలాహార ƒ ముననొక్కమాస మే, ర్పడమాసయుగళంబు ƒ పర్ణసమితి
ననువందనటనిరా ƒ హారుఁడై బీరెండ, నిలిచిమాసద్వయం ƒ బెలమినవలఁ
బ్రావృడ్దినంబుల ƒ వర్షంబునందుండి, హేమంతముననుండి ƒ హిమమునందు
నటసిదాఘంబునం ƒ దర్కావలోకన మ్మురఁబంచాగ్ని మ ƒ ధ్యమున నిలిచి

మొగియుగంబులు పదివేలు బోవఘోర, తపముఁగావించె నెడనెడఁ గృపణబుద్ధి
నింద్రుఁ డపకారములఁజేయఁ నింతయేని, నవియుఁ గైకొన కాత్మలో నధికశాంతి.

—(*) మృకండుఁడు శివుంగూర్చి తపంబుసేయుట. (*)—

చ. అటువలె నామృకండుఁడు పుత్రార్థకుఁ గూర్చి తపంబుసేయఁ ద
చ్చటులత గోష్ఠధూమముది శావలిఁ గప్పిన భీతినేగి యా
కటసుర నాథులెల్ల సితికంఠుని వేఁడిన వారిఁ గూడి ధూ
ర్జటికడు వైభవంబున వెసంజను దెంచిత దాంతికంబునన్. 271

క. సాక్షాత్కరించి యోమహా, నిక్షితిపా మెచ్చి మదిని నీతపమునకే
నక్షయ వరములనిడనీ, దాక్షాయణి తోడ నిటకు దరలితినింకన్. 272

వ. తపంబుసాలించి సతీయుతుండవై యిష్టార్థంబు లడుగుమనుటయు నతండు
మెల్లనఁ గన్నులువిచ్చి తన పురోభాగంబునందు. 273

సీ. మొగిఁ జాత్రికచ్ఛవిం దెగడించు నెమ్మేన, రుద్రాక్షహారముల్ రూఢిదనర
సిగయందుఁ జుట్టితాల్చినఫణేందులకాంతి, కలయంగనల్దిశల్ వెలసిరాగ
చెలువైన కొమ్మావి చివురులపసమించు, సురుచిరాధరరుచి స్ఫురణమడర
కంధిజోత్కటవిష గ్రసనకంఠద్యుతు, లమితనైల్యప్రభ నమరనింప
ఘటితనవరత్న చారుకంకణకిరీట. హారకుండలవితతకేయూరకలితుఁ
డగుచు విలసిల్లువానిన్నపాధినాథు, భక్తరక్షాపరుంజూచి భవునిమౌని. 274

వ. ఇట్లని నుతించె. 275

క. ఈశ గిరీశ మహేశవి, లేశయవర భూమభస్త్ర లిప్తాంగ హృషీ
కేశాది వినుతహైమవ, తీశాజయ జయనిరీశ యీశానశివా. 276

సీ. జయజయ సర్వనిర్జరమౌనిసంపూజ్య, జయ జగత్కారణ భయవిదూర
జయజయసత్కృపో దయయవిద్యాదూర, జయసుప్రసన్న భాస్వద్విలాస
జయజయరవిచంద్ర జాతవేదాంబక జయసర్వమయనిరస్తాఘనిచయ
జయజయస్వాశ్రితాభయదానసంశీల, జయసుప్రబోధన సదమలాత్మ
జయగుణాత్మక నిర్గుణ జయయపార, ఘోరసంసార సర్పద ష్టోరువిషభి
షగ్వరాదేవ నిటలాక్షసాంబయాభవ, జయరణాంగణ విజితర క్షస్సమూహ.

క. ప్రకృతికి దూరస్థుఁడవై, యకలంకత నొప్పునీశ్వరా సర్వజగ
త్ప్రికరావన సద్భావన, మకరద్వజ జనకహితయుమావరయభవా. 278

క. భువనమయ భువననిగ్రహ, భువనేశ్వర భువనవినుత భువనాధారా
భువనభృతీ భువనకృతీ, భువనావన భువనసాక్షి భువనశిరోజా. 279

తే. చెడని యునికియురూపంబు చెడనిశక్తి, చెడనికోరిక లిరవంద చెడనివాఁడ
వగుచు లోకంబులర్మిలి నరసి బ్రోచు, నిత్యపరిపూర్ణ సన్నుత నిగమనిచయ.

క. ఫాలాంబకానలంబున, నోలిం బ్రళయమునభస్మ మొనరించి జగ
జ్జాలము వెండిచతుర్ముఖుఁ, డైలలిస్సృజియించు నచ్చిదానందశివా. 281

ఆ. సూక్ష్మబుద్ధులైన సూరులచేఁదెలి, యంగబడుచు సూక్ష్మమై చరాచ
రాదిజంతువితతి యందజస్రము వెలుఁ, గొందుచిద్విలాస యిందుజూట. 282
చ. సమధిక తత్త్వసంహతి న జస్రమునాసన యుక్తి నిల్పిమే
లమర నిజాశ్రితావనత నందియు సంసరణావనీ జము
ద్యమము మెయిన్ సమూలముఁగ నార్చి విరాగముఁ గూర్చుపార్వతీ
రమణ గిరీశశంకర ప రాత్పర దుష్టగుణాబ్జ వారణా. 283
క. జ్ఞానేంద్రియములఁ దెలియం, గానగు సర్వంబునయ్యు గడువడియోగ
శ్రీనిలయుల మానసముల, మానుఁగ వర్తించుకలుష మర్దనయీశా. 284
మ. ప్రకటప్రాభవ కార్యజృంభణ భవ ధ్వాంతార్క సంతాపకా
రకసంసార మహామయార్తిహర గీ ర్వాణారి సంతానశు
ష్కకరీర వ్రజదావ పావకయశో గంభీర త్రైగుణ్య దూ
రకరీంద్రాజిన ధారమేరునగధీ రావారణా శిక్షితా. 285
వ, అని మఱియు. 286
మ. కరిచర్మాంబర ధారదుష్టజన శి క్షాప్రాభవోదార దు
ర్భరపాపౌఘవిదూర శైలతనయా భాగ్యైక సారానిరం
తరసంపూజిత భక్తవారవిప దు ర్ధారాదయా నిమ్నగే
శ్వరకాశీపుర మందిరా విమల చం చద్భోగి హారాహరా. 287
ఉ. శశ్వదఖండ రూపవిల సద్భుజగేంద్ర కలాప శ్రీమహా
హాశ్వయశః ప్రదీపవిబు ధాలయచాప సుధాశనారిజి
ద్విశ్వసృడింద్ర మానిజన బృందనితాంత హితానులాపకా
శీశ్వర ముక్తిదానపరి తృప్తసదానత సద్వనీపకా. 288
వ. అని యనేకవిధంబుల వినుతించి యామృడు వామభాగం బలంకరించియున్న
మృడాని నవలోకించి. 289
ఉ. అంబదురంత కిల్బిషమ హాద్రివిపాట నశస్త శంబహే
రంబనిజాంబ పాలిత సు రప్రమదాని కురుంబ సత్కృపా
లంబవినూత్న రత్నపట లప్రవిభాసిత చారుమేఖలా
లంబినితంబని న్మదీఁద లంతు ననుంగృపఁజూడు మిమ్మెయిన్. 290
అర్మిలినాత్మత్రయమును, నిర్మింపనుఁ బెంపఁద్రుంప నీవైతివిని
ష్కర్మలునిన్ బ్రణవంబని, తీర్మానించియునుఁ బొగడ ధీవిలసితులై. 291
అజ్ఞానతిమిర కౌముది, ప్రజ్ఞాఢ్య మదంబభక్త ఫలదాయిని స
ర్వజ్ఞార్ధతను నివాసిని, విజ్ఞాంచిత నన్నుకరుణ వెలయంగనవే. 292
అని సంస్తుతించియు మామహేశ్వరుల నిరువురం గూర్చి. 293
మీయతుల ప్రభావముల మేయము లుర్వీఁదలంప మాదృశుల్
పాయక యెన్ని యెన్నివిపు లంబుఁగ సంస్తుతి సేయనౌనెయో

గేయ గుణాఢ్యులార పరి ఽ కింపఁగ మీకుముదంబుఁ గూర్ప న
త్యాయత భక్తిగాకమఱి ఽ యన్యము లెవ్వియు వ్యర్థముల్ గదా. 294

క. మీపద పద్మార్చనమును, మీపద సేవకులతోడి ఽ మిత్రత్వంబున్
రూపింప భూతదయయుఁ గృ, పాపరతన్నాకుఁ గూర్పఁ ఽ బ్రార్థింతు మిమున్. 295

క. అనియిట్లు సన్నుతించిన, మునివరునెడ నాయుమాపి ఽ భుండను మోదం
బునుఁ బొంది యట్టులనియెను, జనవర వర్షాగమాభ్ర ఽ సంరావమునన్. 296

చ. మునివర మిమ్ముఁ బోలెమౌని ఽ ముఖ్యులు ఘోరతపం బొనర్ప రి
ట్లనయము నన్నుఁ గూరిచి మ ఽ దాత్మ ముదంబునుఁ బొంది నీమనం
బునఁగల కోర్కెలెల్లఁ దుది ఽ ముట్టనొసంగఁగ వచ్చితీయుమా
వనజముఖీ సమేతముగ ఽ వాంఛితముల్ వివరింపు నావుడున్. 297

వ. మృకండుండు మావల్లభ చరణంబులకుఁ గృత నమస్కారుండై యిట్లనియె.

క. అన పత్యుఁడనై యేని ఽ ట్లనయముఁ గావించితధిక ఽ మైనతపంబున్
నినుఁ గూర్చి యుంజగజ్జన, వినుతగుణా స్వదునిసుతుని ఽ వేయొసఁగఁగదే. 299

మ. అనుడాయిందు ధరుండు మౌనికనునీ ఽ కత్యంత సత్యవ్రతుం
డనఘుండంచిత పుణ్యశాలి సుతుఁ డ ఽ ల్పాయుష్కుఁ డామూర్ఖుఁడై
ననుదీర్ఘాయురు పేతుఁడౌ నతఁడుఁగా ఽ నాకోరు మిందేనినై
ననుచర్చించి మనంబునందును సదా ఽ నంబుంగ నెంతేనియున్. 300

క. అనవెఱగంది మునీంద్రుఁడు, మనమునఁ బ్రాప్తమునకొండు ఽ మఱియయ్యేడినే
యనివెండి యిమ్మునాకో, మనసిజహర సుగుణుఁడౌ కు ఽ మారునినాగన్. 301

క. అనలాంబకుండు వినుమో, మునివర నీకగున శేష ఽ భూజనవినుతుం
డనఘుఁడు పదియాఱేడుల, దనుకం జీవించువాఁడు ఽ తనయుండెలమిన్. 302

క. అని తెలియఁ బలికి వృషవా, హనుఁడంతె యదృశ్యుఁడైన ఽ యంత మృకండుం
డనువార నాశ్రమంబునఁ, దనవనితా యుతుడునై య ఽ థాస్థితి జేరెన్. 303

ఆ. అంతగొన్ని నాళ్ల ఽ కమ్మునీశ్వరసతీ, మణిమరుద్వతీ స ఽ మాఖ్యగర్భ
ల్పగండమెలమిఁదా ఽ ములు వెల్లనైపలు, చనముఁబూనె నడక ఽ జడిమదనరె. 304

—(*) మార్కండేయ జననము. (*)—

తే. ఆరుతీరైయెనైల్యంబు ఽ నందెగురుకు, చాగ్రములు మేనఁబడలిక ఽ లతిశయించె
నిదురయురుచియొసఁగెఁ ఽ గదిరెఁజిట్టుములణు, మధ్యమంతకంత ఽ కధికమయ్యె.

తే. మృత్తికా భక్షణాపేక్ష ఽ మేనఁజెమట,
లుప్పతిల్లుట నిట్టూర్పు ఽ లురువులగుటఁ
గార్శ్యముం గాంచుటయు నొడల్ ఽ గ్రమముఁగాగఁ,
గలిగె నమ్మౌని నెమ్మదిఁ ఽ గౌతుకింప. 306

క. మాసాష్టక మునమునిపతి, ఁగఁసివా గావించెఁబుంస ఽ వనమెలమిమెయిన్
భూసుర యువతీవారవి, భాసుర సీమంతమంత ఽ భవ్యస్ఫూర్తిన్. 307

తే. అట్లు నవమాసములు వోవ § నన్ని గ్రహము,
లుచిత గతినుండి సురగురుఁ § డుచ్చవాసి
యైనశుభవేళ శతతార § యందనువృజిన
తిమిరబాలార్కుఁ గనెనింతి § యమిచెలంగ. 308

వ. అయ్యవసరంబున. 307

క. విరిసెం దిశలంగావిరి, సురదుందుభి నినదమడరె § సొరిదినిమింటన్
గురిసెం బువ్వులజడి య, చ్చరలాడిరి పాడిరాలు § సంభవవేళన్. 3.0

క. అరుదెంచిరటకునాలోఁ, బురుహూతా ద్యమరులుం ద్రి § మూర్తులుబుషులున్
గరమను రక్తినిశాబకుఁ, దరుణేందు సమానుఁజూచు § తలఁపులునిగుడన్. 311

క. వచ్చిన బుషివర్యులలో, నచ్చపుఁ దయఁజేసెనొక మ § హర్షి వరుఁడుఁ దా
నచ్చిఱుతని జాతక్రియ, నచ్చుగఁ దన్నామకరణ § మాగమవిధులన్. 312

వ. అంతనమ్మృకండుఁ వలనఁ బూజితులై యఖిలదేవతలు బుషులునిజనివాసంబులకుం జనిరట వెండియుం గొన్నివాసరంబులకు నారదుం డరుదెంచి మృకండుచే నర్చితుండై సులక్షణుండై తదంక పీఠంబునందున్న బాలుండగు మార్కండేయుఁ జూచి హర్షంబునం జేరఁదీసి నిజహస్తంబున నతని శరీరాద్యంతము న్నిమిరితదంగాంగ రేఖాసముత్కర ముపలక్షించి వెఱగంది బాలుకేలువట్టి మృకండు దెసఁజూచి యిట్లనియె. 313

క. మునినాథ నీతనూజుని, తనుకర పాదములయందుఁ § దద్దయురేఖల్
మునుకొని శుభచిహ్నములై, యనువందె నితండగుంజి § రాయుష్కుఁడుగాన్.

తే. అయిననితనికిఁబూర్ణాయు § వబ్జమాళి, యానతిచ్చినయదిపది § యాఱువత్స
రంబులగుటవిమర్శింప § రాదుదైవ § విధినెఱుంగఁగనేరికీ § పృథివినగును. 3 5

వ. అని పలికి నారదుండుసనియె నంత మృకండుండు నారదోక్తియుఁ జంద్రశేఖరు వరంబునుఁ జింతించి కుమారునకు నాలవమాసంబున నేత్రారనిదురయు నాఱవ మాసంబు నందన్న ప్రాశనంబును వత్సరత్రితయాంతరంబున శిరోజంబులం దీయించుటయుం గావించి. 316

తే. శ్రవణనక్షత్రమునఁబాలు § శాస్త్రయుక్తిఁ, గర్ణవేధితుఁగావించి § కడఁకఁబంచ
మాబ్దమునురాగ బ్రహ్మతే § జోభివృద్ధిఁ, గాగనుపనయనంబుపా § కర్మమెలమి.

తే. సలిపియధిగతవేదసం § చయునిఁజేసి, కొమరుఁదీవించియిట్లను § నమలవాక్య
సంహతినిమాసితానిజ § స్వాంతమునవి, ధంబునిదియిట్టిదనియెంచి § ధారిణీశా.

క. తనయా నీవిం కిదిమొద, లనుదినముం బుధజనాలి § నవలోకింపం
గనెవంద నమ్ములిడువా, రనువృన దీర్ఘాయువౌదు § వనిదీవింపన్. 319

ఆ. వేదవాదులైన § విప్రులాశీర్వాదిం, చినఁదదుక్తిసెడక § సిద్ధిఁబొందు
వందనంబుసేయు § వారలదీవించు, టదిబుధాలిధర్మ § మవనియందు. 320

చ. అనిగురుఁ డానతిచ్చిన ప్రి | యంబునఁ గైకొని యమ్మరుద్వతీ
తనయుఁడటుం గనుంగొను బు | ధ వ్రకరంబునకుం నమస్కృతుల్
దనరఁగసల్పి వారలు ము | దంబున శ్రేయమునుం జిరాయువుం
గనుమని దీవనంబులిడఁ | గానటు వర్ధిలుచుండె నెంతయుం. 321

—(*) మృకండు నాశ్రమంబునకు సప్తర్షు లేతెంచుట (*)—

వ. అంత నతనికిఁ బదియేను సంవత్సరంబులు నిండుటయు నొక్కనాఁడేనుఁ గశ్యపాత్రి భరద్వాజ విశ్వామిత్ర గౌతమ జమదగ్నులంగూడి మృకండు నాశ్రమంబు సేరఁ జనుఁడతండు విహితవిధిం బూజించి సుఖాశీనులైన మూకు వందనంబులిడఁ గుమారు నియోగించుటయు నతండు. 322

చ. ముదమునఁ గశ్యపాదిముని | ముఖ్యుల కాత్మురకుం బ్రణామముల్
వదలకసల్పి వారలటు | వైళమనీకుఁ జిరాయువంచుమా
రదమను వాక్యముల్ మఱచి | వ్రాలిన వేడ్కల నియ్యదీవనల్
పదపడి వానిఁగైకొని త | లంగిననుం మొగిఁ జేర వచ్చినం. 323

వ. అప్పుడేను. 324

క. బాలక వందన మిడఁగాఁ, బోలదు నాకనిననన్ను | మునులాత్మురుని
వేలాయిటు లనఁబూజ్యుల, కేలాగు నమస్కరింప | నీయని రీతుల్. 325

ఆ. అగ్రజన్ముఁడెవ్వఁ | డైయుండునాతఁడు, తనకుభక్తినొకఁడు | దండమిడగ
వలదటంచువాని | వారించునేయది, కొనియుబిదపస్వస్తి | యుదువలుకక. 326

క. అనినవ్వాక్షేపణము, మ్మునివర్యులు సేయవారి | మొగములఁగని యే
ననఘాత్ము లారయిూదీ, వనల నృతములగుటఁజేసి | వలదనియంటిన్. 327

ఆ. అనినమరలవారు | ననుఁగాంచిమాదీవ, నంబులెట్లసత్య | ముం బొఱసెడు
సూనృతమునఁగాని | సుమ్మేమసత్యమె, ప్పట్టులందుఁగాన | మెట్టులోదవు. 328

క. వినఁదెలుపు మనినవారలఁ, గనిపెండియు నంటినిప్డుఁ | గడుదీర్ఘాయు
ష్కునిఁగా దీవించితిరీ, యనకుఁబదా ఱేండ్లుఁగాదె | హాయుఁడిచ్చుటయుం. 329

తే. గరళకంఠుని వాక్యమ్ము | కడకుఁద్రోచి, కడక మీారలునొడివిన | నుడువులెట్లు
సాగునవుడు తెలిసివి | చారపడిరి, నిజవచోభంగమునకు ము | నీంద్రులధిప. 330

వ. అప్పుడేను మీారేల చింతించెదరి మ్మార్కండేయుఁ దోడ్కొని మనమిందఱ మిప్పు డరవింద సంభవుపాలికిం బోయి మ్మొక్కింతమతఁ డితనియెడ నేమనునో యది యెఱింగి పిదప విచారింతమనిన వల్లెయనుటయు నప్పుండఱుముంగూడి యమ్మునికుమారుం దోడ్కొని. 331

చ. బలువడి నేగిమౌనులు సు | పర్వులుఁగొల్వ సరోజపీఠినిం
పలరవసించి తత్తదుచి | తామలభాషల నాలకించుచుం
వెలయ జగంబులన్నుచు | విశ్రుతకీర్తి సమేతుసత్కృపా
జ్వాలగుణ పూతునన్నలిన | జాతుసతీయుతుఁ గాంచియంతటం. 332

క. క్రమమున నేమేదురమ, య్యమరజ్యేష్ఠునకు భక్తి నభివందనముల్
సముచిత రీతిని సలిపితి, నుమరఁగఁదా నట్లుఁ జేసె నవ్వటుఁ డప్డున్. 333

తే. తనయ దీర్ఘాయువౌదని ధాతవలికె,
నటుఁబదంపడి యచ్చట నధివసించి
యున్నవారెల్లఁ బల్కిర ట్లోగి మృకండు,
సుతుఁడు సద్భక్తితోనమ స్కృతులు సలుప. 334

క. అయ్యెడ నేనెలనవ్వున, నయ్యబ్జాసనునిఁ జూచి యయ్యా యిది యే
మియ్యతులు వోలెఁ దామును, జయ్యన నన్నృతోక్తి వలుకఁ జనునే యంటిన్. 335

చ. అనుడు విధాతృఁ గాంచి బుధు లందఱి దేమి వశిష్ఠుఁ డిట్లు వ
ల్కెనుమన మేమసత్యము మొగిన్ వచియించిన వారమిందునం
చనఁగ మలాసనుండు తెలియన్ వివరింపుమనంగ నేనటుం
డినగలిఁ దెల్పఁ గామిగుల సివ్వెఱఁ గందియు నున్న వారలున్. 336

వ. ఒండొరు నవలోకింపుచుండ నప్పుడు వెండియు. 337

చ. అనఘు విరించిఁ గాంచి వినయంబున నేనిటు లంటిఁ దావకో
క్తి నిజముఁ గాక యున్న జగతిన్ నిగమంబులు సెల్ల విజ్జగం
బునన్ ఋత మౌనుగాన మదిఁ బోలఁగఁ జూడుము పాయ మిందునీ
వనుడతఁ డింతచింతిలి పురాంతకులీలల నాత్మ నెంచియున్. 338

చ. హరుఁడు నిజాశ్రితౌఘముల యందధికంబగు ప్రీతిఁ జేసి మే
లరసి తనంత వారిఁగఁ జిరాయులఁ జేయుట లేదె కోరిమున్
గరుడునను న్విభీషణుజనార్దనువ్యాసు ధ్రువున్ మరుత్సుతున్
సురరిపు సూను బాణుని ఘనున్ శుకుఁ జేయఁడె యబ్బలీంద్రునిన్. 339

. హరుఁ గడు వనితరులెవ్వరు, పరిపూర్ణాయువునొసంగి భద్రాత్ములఁగా
నిరవందఁ జేయ శ్రితులం, గురుకరుణా దృష్టి మెఱసి కుంభినియందున్. 340

. అనిపలికి యమ్మార్కండేయు మహాదరమ్మునం జేరఁదీసి కౌగిలించి నిజహస్తమ్మతని మస్తమ్మునందునిచి యూరతలంబునం దధివసింపఁ జేసి శిరంబు మూర్కొని బుజ్జగించి యిట్లనియె. 341

చ. త్రికరణశుద్ధి నే నుజగతీధరచాపున నారతంబుత
ప్పక నుతియింతు నేని నిజభక్తుల నింతకుఁ దానుమున్ గృపా
ధికమతిఁ బ్రోచునేని విను తింపజగంబులు ప్రీతి నీకుమా
రకు నొనరించుఁ గావుతఁ జిరాయురుపేతునిఁ గా గిరీశుడున్. 342

. అనిప్రతిజ్ఞఁ జేసి యయ్యబ్జసంభవుఁ, డనిమె నతనికిట్లు మునికుమార
సత్వరముగఁ గాసిఁ జని సేయుము మహా, శ్వేరునిఁ గూర్చి యురు తపంబు నీవు.

—{ మార్కండేయుండు శివుంగూర్చి తపంబుసేయ నజప్రేరితుండై మహికివచ్చుట. }—

చ. గురుమతితీర్థ భజించుచున - కుంఠితలీలఁ దపంబుసేయు స
త్పురుషుల కప్పురారిపరి - పూర్ణదయామతి యైయభీష్టముల్
పరువడి వచ్చియిచ్చును ధ్రు - వంబుఁగనాఁగ మృకండుసూనుఁడం
బురుహజు నాజ్ఞగైకొని మ - ముంగని మ్రొక్కి ముదంబుతోడుతన్. 344

తే. ధరణిడిగి తల్లిదండ్రుల - చరణములకు,
వందనముఁ జేసి యయ్యర - విందసంభ
వునిసభాంతరమునఁ దానుఁ - గనినలాభ,
వాక్యముల వారితో వేడ్క - వలుకుటయును, 345

వ. వారు సంతసింపక పరమాత్ముండగు మహాదేవు వచనంబు రిత్తవోవునేయని వందురుచు షణ్మాసంబు లాయురవధిఁగా నేలంబడి విలపించి రందు మృకండుండు.

క. లోకంబున తలిదండ్రుల, కేకరణిం గలుగుసుఖము - లిలఁ జేయు క్రియల్
నాకసుఖ ప్రదములు సు, శ్రీకుఁడుసుతుఁ డొక్కరుఁడు ధ - రిత్రిన్ లేమిన్. 347

క. గార్హస్థ్యం బుత్తమమై, యర్హతకుం బాయునదిసు - తాపగతునకున్
గర్హితుఁ డన్నిటనాతం, డర్హుం డెయ్యెడలఁగాఁడ - హాతలపోయన్. 348

చ. కొడుకులు లేమిదుఃఖమది - గొంటులువుట్టిర యేనిపెద్దయౌఁ
గడువడి రెంటికన్నకల - కాలముదుఃఖము సత్కుమారుఁడే
ర్పడినశి యించెనేని యును - వత్సకడుంగడు దుఃఖమింకనే
ముడుఁగక తాల్పనౌముదము - నొందెడిసంతటి పుణ్యమున్న దే. 349

ఉ. ఆపర మేశ్వరుండిటుల - నాదృతిఁజూచుట కేముమున్నుఁ ద
చ్ఛ్రీపద పద్మముల్ మది స్మ - రింపమొతొల్లిఁటి బాముసందుని
శ్లేపునఁ గన్నవారుకడు - నేడ్వసుతాదులఁ బాపినారమొ
పావ మటంచునెంచక నె - పంబులనన్యుల నుంచినారమో. 350

వ. మఱియు. 351

సీ. అపహరించినవాఁడ - నైతినో భూమీసు, రార్థముల్ పెద్దల - నతిథిజనుల
నిందించినాఁడనో - నిందలకోర్చి య, న్యాంగనాసక్తిమై - యధిగమించి
నాఁడనోయతిథిక - న్నమురాత్రిరానిడ, కుడుకునదుడుకాడి - విడిచినాను
అధికతైశ్వర్యుండ - నైయుండి సదృశులౌ, నితరులఁజెరుపఁగా - నెంచినానో
ధనముఁ గొనిధర్మమనకన - ధర్మపథము, వట్టిసాధించియున్నట్టి - వాఁడనైతి
నో తలంపఁగననుచు నె - న్నోవిధముల, నెన్నువలువెట్టియేడ్చుచు - నున్నవేళ.

తే. అమ్మరుద్వతియధికశో ✽ కాబ్ధిమునిఁగి
సుతుఁగవుంగిటఁ జేర్చి తాఁ ✽ బతియుఁబోలె
నిట్లు విలపించెనెంతయు ✽ నీరెలుంగు
తోడఁ బాష్పాంబువులఁబైట ✽ దోఁగఁగాను. 353

క. పసిబిడ్డలఁదల్లులకే, నసమునఁబాపితినొ లేగ ✽ నరయకదుగ్ధం
బసదని పిదికితినోవె, క్కసములుపలికితినొసుతులఁ ✽ గన్నసవతుల్. 354

వ. వెండియుందొల్లి రూపహీనుఁ బతిగికురించి సురూపుండని యన్యుఁగూడియుఁ బతి
యాజ్ఞమీఱి పరగృహంబులవర్తించియు గృహోపకరణంబుల నన్యులకొసంగి
నాశంబొనరించియు నింక నిట్టిపనులం బ్రవర్తించి ప్రాణేశ్వరు మనంబుఁ గుందించిన
దాననై యుండితి నొక్కొ కానియెడ నిట్టిచందంబుఁ బ్రాపించునేయని విలపించు
చుండ జననీజనకులంజూచి విజ్ఞాననిధియగు మార్కండేయుండను నయవాక్యం
బుల నూఱడింపం దొడంగుచు కుమారునకు తండ్రి యిట్లనియె. 355

క. నీకుం గాదేయింతటి, శోకవ్యాకులితమాన ✽ సులమగుటహారుం
డోకొమర యింతేఁదనుకేఁ, గాకాయువు నీయఁడయ్యెఁ ✽ గాయధికంబుల్. 356

ఆ. ఆఱు నెలలు కొదువ ✽ యైయుండషోడశా,
బ్దములుఁ గడచెనవియు ✽ గ్రమతవచ్చు
నేమి సేయనింక ✽ నెయ్యదిదిక్కని,
యేమితోఁచకునికి యింతవట్టు. 357

చ. కొమరులు లేనివానినిల ✽ గ్రుడ్డినినొక్కటిఁ గాఁగఁబోల్తుర
ట్లమరునె చీకుకిజ్జగమె ✽ యంధమపుత్రున కన్నన న్నిలో
కముల మితాంధకారమయి ✽ కన్పడునాత్మ దలంపనింతని
క్కముసుఖమించుకేనియునుఁ ✽ గాంచమినెందుల నెందునేనియున్. 358

గ. అనినఁ గన్నతండ్రికిఁ బ్రియకుమారుం డిట్లనియె. 359

ఉ. ఓ నను గన్నతండ్రి యిటు ✽ లుత్కటశోకము నాకుఁగాగమీ
రూనఁగ నేలనయ్యభవుఁ ✽ డుల్లములోనను మెచ్చిచావు లే
కీనవయౌవనంబె తిర ✽ మిద్ధరనై చెలువందనియ్యని
ష్ఠేనధిక ప్రయత్నము వ ✽ హించితిఁ దామరసోద్భవానతిన్. 360

గ. అది యెట్లంటేని. 361

మ. గురుభక్తిన్ భువనావనాధ్యుదళితా ✽ ఘుర్ఫాల నేత్రుంజగ
ద్గురుసన్మాని జనానుకూలు హరును ✽ గ్రుర్జంద్రజూటున్మహే
శ్వరుఁ గాలాంతకుఁ గాలకూటధరు భా ✽ స్వత్పాండరాకారు హృ
త్సరసీజంబున నిల్పికొల్చె దనితాం ✽ తధ్యానయోగంబునన్. 362

వ. అనిన జననీజనకు లింత ముదంబంది సుతుఁ గౌఁగిలించిరనుడు దిలీపుం డవ్వల నెట్లయ్యె ననుటయు. 363

—(*) ఆశ్వాసాంతము. (*)—

ఉ. సారస మిత్రవంశకల శాంబుధిచంద్ర సుకీర్తిసాంద్రవి
స్ఫారద యాగుణాఢ్యరిపు భంజనసార శరీరదార్ఢ్యశ్రీ
తారమణీ హృదీశనిర తాంచితకీశ సురేశవంద్యదు
ర్వారభ వాబ్ధిపోతబుధ వర్ణితసద్గుణ జాతరాఘవా. 364

క. సారంగ నేత్రబలజిత, సారంగా మిత్రరూప సారంగాస్త్రా
సారంగా హితవక్త్రా, సారంగాం చత్కరాగ్ర సంస్తుతిపాత్రా. 365

తోదకము. భూమిసురావన భూజనసేవ్యా,
సోమసమానన సుందరభవ్యా,
సామజవైరిల సద్ఘనశౌర్యా,
క్ష్మామహిళావర సద్గుణధుర్యా. 366

స్రగ్విణి. ఘోర సంగ్రామ విక్షోభి తారివ్రజా,
సూరి సంఘాత సంస్తూయ మానాద్విజా.
ధారిణీభృద్ధనూ ద్వృద్ధనుః ఖండనా,
వారి జాతాప్త సద్వంశ సన్మండనా. 367

గద్యము.

ఇది శ్రీరామచంద్ర కృపాకటాక్ష వీక్షణా వాప్తకవిత్వ విద్యాప్రాభవ పశు
పర్తి పిన శేషమ రాజాగ్రతనూభవ సుధీజనవిధేయ సుబ్బరా
జాభిధేయ ప్రణీత శ్రీమ న్మాఘపురాణంబునందు
తృతీయాశ్వాసము సంపూర్ణము.







శ్రీరస్తు.

# శ్రీమదాంధ్ర మాఘ పురాణము.

## చతుర్థాశ్వాసము.

### కందపద్యము.



శ్రీభూమి జామనోహర,
భూభృజ్జన మకుటమణి సముజ్జ్వలదీప్తి
శ్రీభాసిత పదవిభవ,
ప్రాభవ సుత్రామ రామరాజలలామా. 1

తే. అవధరింపుము సూత మహర్షిచంద్రుఁ, డాదరమ్మున శౌనకాద్యఖిలమౌని
శేఖరులఁ జూచి పలికె వసిష్ఠుఁడట్లు, లద్దిలీపావనీపతి కనియె నిట్లు. 2

వ. అట్లు మృకండుండు కుమారు నుపగూహనం బొనరించుకొని యిట్లనియె. 3

మ. తనుజన్మా యిపుడన్న నీ పలుకు తథ్యంబింతకున్ ముఖ్యమౌ
పనియొండున్నదె మేలు సత్వరము ప్రాప్తంబౌట కిద్ధాత్రిఁ జే
కొనసౌ క్షేత్రమటంచు సర్వమును లగ్గోదావరీ తీరభూ
మినిఁదామెంతు రటుండియుందపము పేర్మిం జేయఁ బొమ్మా వెసన్. 4

చ. అనఘ చరిత్రుఁ డిజ్జగతి నాశ్రితసంహతి కీప్సితార్థముల్
పనివడి సత్వరంబొసఁగ భావభవాంతకుఁ డొక్కరుండుఁగా
కనెగడ రెవ్వరయ్య భవుఁ గైకొని సన్నుతిఁ జేసి కాదె మున్
ఘనుఁడల శ్వేతకేతనుఁడు గాంచెఁ గృతాంతుని బంధమోక్షమున్. 5

వ. మఱియు శిలాదతనూజు నష్టాబ్దంబుల వాని శమనాపహృతు నందీశ్వరుండు రక్షించి శివస్థానంబు నందునిచె నప్పురహరుం డఖిలలోక సంరక్షణార్థంబై క్షీరార్ణవోదితంబై విలయాగ్ని తుల్యంబుఁగానున్న హాలాహలంబు మ్రింగె వెండియు. 6

## —(*) జలంధరాసుర వృత్తాంతము. (*)—

మ. ధరఁగూల్చెన్ భువనావనంబునకు రా । ద్రస్ఫారుఁడై యజ్జలం
ధరునాత్మీయ సుదర్శనంబు నదకాం । తర్దేశమం దిందిరా
వరునింజేరిచి తత్త్రిశూలమును శం । భల్లీలమై పూని శ్రీ
హరినింగూడి సరస్తటంబునమహా । ద్యత్సంగ రక్షోణిలోన్. 7

తే. అనినఁ దంత్రికిఁగొమరుఁ డి । ట్లనియెనయ్య, చక్రమసురారిదభవుని । సాధనంబు
శూలమైయుండ నపుడటు । లేలమార్చ, నసురవృత్తాంత మదియెట్టు । లానతిమ్ము.

వ. అనిన మృకండుఁ డిట్లనియెఁ దొల్లి హిరణ్యాండనువాని దశమపుత్త్రుం డగ్నిజిహ్వుఁ
డను రాక్షసుం డధికబలంబున మూఁడులోకంబుల జయించి దనుజ రాజ్యంబు
సేయుచుండఁ గొంతకాలంబున కయ్యసురునకుఁ బుత్త్రుండు సూకరుండునాఁ
బొడమి యద్దురితాత్మకుండు. 9

చ. అతుల తపంబుసల్పి చతు । రాననుసంతస మందఁ జేయఁగా
నతఁడిడినన్ వరంబులు వి । యచ్చరకిన్నర సిద్ధసాధ్య నా
గతుషిత దైత్యదానవని । కాయముచేమృతి లేనిజీవన
స్థితిసలి లప్రచారమును । చేకొనియవ్విధి వాఁడజస్రమున్. 10

ఆ. వనధిజలవిహార । మునజలంధరుఁడునా, వడఁబ్రసిద్ధిఁగాంచి । వాసవాది
దివిజవరులఁదోలి । భువనత్రయంబుచే, కొనియునంతఁబోక । గురుబలమున. 11

క. హరిహరు లిరువురసమరో, ర్వరనోర్వం గోరిత న్ని । వాసంబులు స
త్వరమునఁ జేరెనునాలో, సురమునిచే నెఱిగి త్రిపుర । సూదనవిష్ణుల్. 12

చ. తరలిసు మేరుఁజేరివిహి । తస్థితిసంతత సన్నుతైకని
ర్జరులట నున్నమానస స । రంబునఁడాగు కనుండిరన్యులె
వ్వరుఁదముఁ గానమిం దనుజ । వల్లభుఁడుం ద్రిజగంబులందుఁ దా
నరయుచు నుండెనిల్లుఁ ద్రిద । శాబ్దశతం బొగిఁజెల్లెనంతకున్. 13

వ. విరోధంబువాయక వారిజయింపమి నీ త్రిలోకరాజ్యంబు నాకు లేకుండినదే యని
వెదకుచు నుండె నట్లు హరిహరు లయ్యుదకంబునందుండి. 14

క. అభయజ్ఞుం డైతానపు, డభవు త్రిశూలంబుమదిని । ధ్యానించిసుర
ప్రభులెన్నఁ గైవసముకై, టభదైత్య విదారిసేయు । టంగనిశివుడున్. 15

క. తిలకింపం ద్రిగుణా వ, స్థలెరూపముఁ గాఁదనర్చు । తచ్చూలంబున్
జలజాక్షు వలనఁగైకొనఁ, దలఁచిపదాంగుష్ఠ రేఖఁ । దత్క్షణమాత్రన్. 16

మ. క్షయకాలాంబు భవస్వరూపమొగి ను । త్సాహాది శక్త్యాత్మకం
బయశోధ్వాంత వియన్మణి ప్రభమసా । ధ్యంబున్ గృతాంతాంతకం
బయియొప్పార సృజించిచక్ర మిదెదై । త్యారాతి కైకొమ్ముని
ర్భయదంబెప్డు సుదర్శనాఖ్యవిజిత । ప్రత్యర్థియై పొల్చెడున్. 17

తే. అనిసుదర్శన మయ్యె సురాంతకునకు,
నిచ్చెశూలము తాఁగొని యిచ్చనిటువు
రహితుఁ బొఱిఁగొన సమయంబు నరయుచుండ
నంతయు నెఱింగి నారదుఁ డసురుఁ జేరి. 18

వ. మిగుల నక్కఱఁగల వాక్యంబుల నిట్లనియె. 19

శా. ఓదైత్యేంద్ర భవత్ప్రతాపమున కుద్యోగంబులం దెల్లని
ర్వేదం బేర్పడ భీతిఁ బాఱి హరియున్ శ్రీకంఠుఁ డమ్మేరుకు
ధ్రోదారామల మానసాంబువులలో నున్నా రలీవేగమం
దాదిన్ వారలఁ ద్రుంపఁగావె యిటు నీ వత్యంతముం గాచుటల్. 20

ఆ. సేయ నౌనుశత్రు శేషంబు ఋణశేష, మగ్నిశేష మామయంపుశేష
మసురనాథ సాధనార్ధోదకౌషధ, ములను నిరవశేష ముఁగధరిత్రి. 21

చ. అనవిని యట్టిపొంగియమ రాహితుఁడమ్ముని వాళిచేయుదం
బునశిల వందియక్కనక భూధరమప్పుడ సేరిదైత్య మ
ర్దనమ్మృడు లున్న మానస సరంబును సొచ్చి తదంతరాంబువ
ర్తనులగు వారిఁగాంచి యట దైత్యుఁడు రోష కషాయి తాక్షుఁడై. 22

మ. కడుభీమంబుఁగ హుంకరించినలి నాతొజాతవే దాకుయిం
దడఁగం బోసెడు నే జలంధరుఁడు రం డాసంగ రక్షోశి హా
యుడు కారించెద నింక నెందుఁ జనలే రున్నట్టి యీః దమేఁ
గడఁకం గాంచితినంచు వాఁడు వలుకన్ గల్పాభ్ర న దంబునన్. 23

క. అంతట మాధవుఁడుంద్రిపు, రాంతకుఁ డక్కొలనినుండి యధికత్వర ని
ష్క్రాంతులయి తీరభూమిసు, రాంతకునివ్రక్క మణమునకు నారయునాలోన్.

శా. చండక్రోధము తోడనూర్పులెసఁగన్ జంచత్త్ర పీనోష్ఠుఁడై
కాండం బుత్కటవీచికా జనితమై కంపింపఁగా సారమ
చ్ఛండుండున్ వడివీడి రాఁగిరిశకం జాక్షుల్ వెసం జూచి దో
ర్దండోద్యన్నిభృతాయుధప్రతిభ నుత్సాహించి యత్యుద్ధతిన్. 25

చ. ఉరువడి మీఁదికింబరవ నోడకయాత్మ కరోరుఖేటకో
ద్ధురగదల ప్రతిప్రకట దోర్బలుఁడై వడిఁ ద్రిప్పి త్రిప్పి య
బ్బురముఁగ నంతగుప్పున సమున్నతినభ్రము దాఁటి వారిపైఁ
బరువడిఁ దాకఁ గ్రేవకు నవక్రపరాక్రమ యుక్తిఁ జేరియున్. 26

క. హరి చక్రాయుధముంబుర, హరుఁడు త్రిశూలంబుఁబూని యసురునిఁదొడరన్
గురువిక్రముఁడై వెండియు, సురుచిరఖడ్గమునఁ బలుకఁ జోపుచుఁ గడిమిన్. 27

ఉ. ఘోరరణంబుఁ జేసియు నకుంఠితసత్త్వుఁడు వెండినింగిఁ బో
బోరనఁ జౌకళింపఁబడ ముల్ ధరఁ ద్రెళ్లఁ బురాంతకుండు దు

ర్వారుఁడు త్రుంచెశూలమున వానికిమున్న సురారిమింటికిన్
జేరిన వాఁడుచక్రమునఁ జెండెశిరంబమిత ప్రతాపుఁడై. 28

తే. సురలు గురిపించి రంతటవిరులవాన, మొఱసె దుందుభినినదముల్ మొగిన శేష
భువనములు పొందెనధిక ప్రమోదముర, నమరవిద్వేషికుంభిని యణఁచఁబడిన.

వ. అట్లు లోకోపద్రవకారియగు జలంధరు నంతంబొనరించి విష్ణుండు శివుని పాదారవిందంబుల నిజనయన పుష్పంబులచేఁ బూజించి చక్రముఁగైకొని నిజనివాసంబున కరిగె నాటనుండి హరిచక్రియు హరుండు శూలియునైరని మృకండుం డాత్మజున కెఱింగించి వెండియుఁ బురాంతకుని ప్రభావంబు వినుమని యిట్లనియె.

ఆ. అగ్నిహోత్రుఁడజుఁ డసురారిముప్పురుఁ, గూడితనకుమున్న కోలగాఁగ
హరిమహోక్షరూపి యైస్యందనముక్రింద, నిలువఁ ద్రిపురములను సీరుఁజేసె.

చ. మఱియుఁ ద్రిలోకభీకరుఁ డమర్త్యవిరోధిని నంధకాఖ్యుఁ నే
ర్తెఱఁదనదాత్రిశూలమునఁ దీవ్రతఁగ్రుచ్చి యనంతవీధికిన్
గఱకఱి నెత్తిసూర్యకిరణాగ్నులఁ బ్రేల సహస్రవర్షముల్
దఱియఁగ నుంచివానిభసితంబుఁగఁజేసె జగంబులౌనన్. 32

క. త్రిజగద్విజేతనంగజు, నిజవీక్షణ వహ్నిచేత నీఱౌనటులం
బుజగర్భాదులుగనుఁగొన, నజితుండ భవుండొనర్చె నద్భుతశక్తిన్. 33

వ. వెండియు నఖండరణ పాండిత్యంబున శుండాలాసురాదినక్తంచర తండంబుల ఖండనంబున నాఖండలాదు లగ్గింపఁ బిండిఁగావించి సురమండలి కఖండంబగు మోదంబుఁ గల్పించె నిట్టి సమస్తభువ నావనుండును శాశ్వతుండునుఁ బురందర స్వరూపుండునగు మృడు నారాధింపుమా శంకరుండు నీయెడం గరుణించి యిష్టంబు లొసంగుననుడు మార్కండేయుండు. 34

—(*) మార్కండేయుం డీశ్వరునారాధింప గోదావరీతటంబున కరుగుట. (*)—

క. జనకుం డెఱిఁగించినవిధ, మునఁగౌతమ మౌనివిహిత పూజావిధులం
దనరిన గోదావరికిం, జనిదక్షిణ తీరభూమి సద్భక్తిమెయిన్. 35

క. శ్రుతివిహితంబుఁగలింగం, బతఁడు ప్రతిష్ఠించిసమధి కారాధనముల్
ప్రతిదినము మూడువేళల, సితికంఠుని జాత్మనిల్పి సేయుచునుండెన్. 36

వ. అట్లు. 37

క. కాలాంతకుఁడై విలయఁపు, కాలంబున కాలుఁడయ్యుఁ గాలాతీతుం
డైలీల నఖిలవిద్యల, మూలంబై యున్నవాని భువనారాధ్యున్. 38

వ. చింతింపుచు సమాధియోగంబున నుండ నిజాయురవధియగు షణ్మాసంబు లతిక్రమించె నా సమయంబున శతానందుం డమరమునిగణ సమేతుండై కైలాసముం జేరి దక్షిణామూర్తియగు మహేశ్వరునకు వందనంబులు గావించి సంస్తుతించి తనయెడఁ బ్రసన్నుండై స్వాగతం బడిగినను మేశ్వరునకు వాణీశ్వరుం డిట్లనియె.

చ. అనఘ మృకండుఁ డాత్మజున కాయువు షోడశ వత్సరంబు లీ
వు నొసఁగు టెల్ల నెంచి వెర వుంగణియించి యొకొండు చూచినం
తనెబుధ కోటికిన్ సుతు బ్రణామములం ఘటియింపఁ జేసె న
ట్లనయు మతండొనర్చె నుచిరాయువు గమ్మన వారుదీవనన్. 40
చ. అటుననుఁ జేరవచ్చి వినయంబున మత్పద పంకజంబులన్
దటుకున వ్రాలఁ గూరిమి ముదంబుఁ గడుంగడు మీఱ విస్మృతిన్
వటుక శతాయుగమ్మనుచు వారకయంటి నొకేసుమారుల
చ్చటిమును లందఱున్ వినఁగఁ జయ్యన నవ్వె వశిష్ఠుఁడంతటన్. 41
క. ఏనా యొలనవ్వనకున్, మానుఁగఁ గారణమునడుగ మఱియిట్లంచ
మ్మానీంద్రు లెల్లరునువిన, గానివాక్యంబుఁ గ్రమము గాఁదెల్పెనటన్. 42
తే. మునివతంసుల పలుకులు మొదలనాఁడు, పలుకునిజమింతెఁ గాకున్న పఱగ జగము
లన్ని యనృతంబులగు నీవు నగుదువట్లు, భువనపితతికిఁ గారణుఁ డవుటవలన.
వ. కావున నిది నిజంబుఁ గావింపుమని యనేకభంగుల వినుతింప నీశ్వరుండు ముని
సూనునకు మున్నుఁ దానొసంగిన వరంబుఁ జింతించి పరమేష్ఠికి తలవొసంగి
యాక్షణంబ పార్వతీయుక్తుండై మహోక్షరాజంబు నెక్కి దేవగంధర్వ కిన్నరా
దులుఁ జనుదేర మార్కండేయు నాశ్రమంబు చేరి తదద్భుత సమారాధనంబునకు
సంతసించి సతీయుక్తంబుఁగాఁ దల్లింగంబునం దావేశించియుండె నాసమయంబున.

–(*) యముండు మార్కండేయ ప్రాణాపహరణంబునకై యరుదెంచుట. (*)–

క. కాలుం డభవు గిరీశుని, వ్యాళాజిన ధారుఁ బూజ నాదులభక్తిన్
మేలందఁ జేసి మునిసుతుఁ, గాలంబని మృత్యువుఁ గూడి కడువడి తోడన్. 45
సీ. సంవర్తసమయ వైశ్వానరద్యుతిమీఱు, కందోయి రుచితీక్ష్ణ గరిమ నింప
వృశ్చికోత్కటసరీసృపములు లురుదేహ, రోమముల్ మిగులదారుణత నొసఁగ
మేరుగహ్వరసమానోరుముఖాంతరో, జ్జ్వలదీర్ఘ చటులదంష్ట్రలు వెలుంగ
ముసలాంకుశాసిపట్టసపాశశక్త్యాది, సాధనోత్కరము హస్తములఁ దనర
ఘనఘనాఘనదీప్తిప్రకాశదీర్ఘ, తనురుచుల్ చాల విలసిల్లఁ దరలియప్పు
డటకునేతెంచి శివునుదయంపుపూజ, సలిపి ధ్యానించు వటునిముంగలను నిలిచి.
ఆ. అడరి కాలపాశ మాత్తీయకరమునఁ, దాల్చి కంఠమునకుఁ దాఁదగుల్ప
చిక్కియుంచుకేనిఁ జేతంబుఁ గలఁగక, సంతసమున ననియె శమనుతోడ. 47
క. ఓధర్మరాజ యిపుడఖి, లాధారుం డైనయభవు నతినిష్ఠ సమా
రాధింపుచున్న వాఁడను, బాధింపకు మిదియు ముగియు పర్యంతంబున్. 48
తే. అఖిల ధర్మజ్ఞుఁ డగుట నీ వనఘచరిత, ధర్మరాజన వెలసితి తనర నేను
నర్చ్చు నీనీలగళపూజ నస్తవమ్ము, లమరఁ బరిపూర్తి యగుదాఁక నశనమునకు.
వ. నీరమునకు నిదురకుం బాయుట యేగాక మత్కరంబు లీపూజనంబునందును శిరం
బు నమస్కృతియందును నయనంబులీ శివస్వరూపావలోకనంబునందు రసనంబు

స్తవంబునందు దేహమీయు మాధవు దాస్యంబునందు శ్రవణంబు లిప్పరమేశ్వర
కథా కర్ణనంబులందు పాదంబు లీయింమధర ప్రదక్షిణంబులందు ఘ్రాణం బిప్ప
రాంతకున కర్పితంబులైన గంధకుసుమాదుల నాఘ్రాణించుటయందు మనంబు
మున్ని భక్తవత్సలు నందుఁ జేర్చియుండుటయుం గలిగి చలింపక యిందు విస్మృ
తేతరుండనై యున్నవాఁడ నింతయు నార్తశరణ్యుండగు శంకరునకు మనః
ప్రియంబై మదభీష్టంబు లొసంగ సాక్షాత్కరించు నిది సత్యంబు నీవంతకుండవై
యుండుమనిన యముండు దరహసిత వదనుండై మృకండుజున కిట్లనియె. 50

ఆ. నీకుఁ దెలియకున్న నిజమింతయుని సుధీ, జనులవలననైన వినఁగ లేదె
తగువిధానములకుఁ దద్దయు మున్నుఁగాఁ, గడఁగవలయు నరుఁడు పుడమి ననుచు.

వ. మఱియు. 52

క. కడుపడి మాసాష్టకమి, ప్పుడమిఁ గృషిం జేసినట్టి పురుషుఁడు భుక్తిన్
గుడిచెడు నటులేకొక యే, డుడిగియు నపుడన్న నెట్టు లాదవు భుజింపన్. 53

క. వెండియు బాల్యాదిస య, త్నుండై తగుపనుల నొనర్చి తోడ్తో ముదిమిన్
నిండుసుఖ మనుభవించెడు, నుండునె యటుఁగానివాని కుర్వీసుఖంబుల్. 54

క. రేపటికృత్యము మాపున, మాపునకది వలయునన్న మధ్యాహ్నమునం
దేపనిఁ గొనంగఁ గడఁగిన, నాపనికొక యిక్కఁగలుగ కయ్యెడువింటే. 55

వ. ఇవ్విధంబున నరుండు జన్మసార్థకంబులగు కార్యంబులకు మునుమున్నఁ బ్రయ
త్నింపవలయు గృహంబగ్నిచే దహింపుచుండఁద చ్ఛాంతికై యప్పుడు కూప
ఖననంబున కుద్యమించినట్లుఁ బ్రాణావసానంబున జపతపంబులకుం బూనిన నట్లుఁ
బొసంగు ప్రాణికి యురంత్యంబు సమకూరమి ననేక బాణంబులఁ గాయంబుఁ
దూంట్లుఁ బడవైచినను జావుఁగలుగ దయ్యంత్యబయ్యెనేనిఁ దృణకణంబు సోఁకి
నంతఁ బ్రాణంబు వాయు దేహికి మరణంబు సంసిద్ధంబై యుండు నిత్తెఱంగున నాచే
వేలకొలంద నింద్రులుం జక్రవర్తులు మదీయలోకంబునకుం జేర్పవడి రిందుఁజిం
తింపకు మది యిడి సేయఁగలననిన నునుఁగఁగాదని విజృంభించి పలుక నప్పలు
కుల శివపూజానుష్ఠాన వినిష్ఠితంబైన చిత్తంబు భయగ్రస్తంబై చలింపకుండఁజేసి
భయవిరహితుండై మగుడనిన సూనునకు మునిసూనుం డిట్లనియె. 56

ఉ. ఇంచుకయేని నీకునిపు డేనుభయంపడు నట్టులేదు య
త్నించి దృఢైక చిత్తమున నీలగళున్ స్మరియించు వారికిన్
గొంచెపుబుద్ధి విఘ్నమొడఁ గూర్చెడు వానికిఁ జేటుమున్నుఁ బ్రా
పించుటఁ జేసి తెల్పితి వివేకమునం దలఁపోయు మింతయున్. 57

వ. మఱియు నీవేను దండధరుండ నంటివేని. 58

క. ఎలికతన భృత్యాలికి, వాలాయం బాజ్ఞసేయు వాఁడైనటుల
న్శైలబిల సఖుని భక్తుల, కాలావరి గాకశాస నాదులకొరులే. 59

వ. ఇదియుంగాక. 60

చ. అతులతపః ప్రభావమున నద్రులఁ బిండియొనర్ప నయ్యపాం
పతిజలమెల్లఁ గ్రోలసుర వర్త్మముఁ గ్రిందుగ మీఁదుఁగాఁగ ని
కి తినొనరింపఁ జాలుదురు శీతమయూఖ వతంసభక్తుల
ప్రతిములు వారుఁగాంతురు దివస్పతినైనఁ దృణంబు పోలికన్. 61
తే. అట్టివారికి ననఘుల కతులమతుల, కధికులకు నిత్యులకు నేటి యంతకుండు
కలఁడు చర్చింపనను వార్తఁ దెలియమున్న, వినజవిబుధాలి వలుకఁగా వినఁగ లేదె.
క. కోపింపరు మొదలార్యులు, కోపించిన రుద్రభక్త కోటికిజావుం
బ్రాపింపఁ జేయఁజాలుదు, రేపద్మాక్షాబ్జజాదు లేనిగృతాంతా. 63
వ. నీ వెంతవాఁడవగు దీయుగ్యమంబుడు గుమనుడు యముండు ప్రళయకాలానలుం
బోలె మండి యధిక నిస్వనంబున నిట్లనియె. 64
ఉ. ఓరిమదాంధ నాయెదుర నోడక యుర్విధిఁ బల్కసాగితో
శారగిరీశ నీరజభ వాచ్యుత జిష్ణులు వేనవేలుమున్
ధారిణిఁ ద్రెళ్ళి రంతకుఁడ నంగలనావల నంభవాదృశుల్
కోరిమదుత్కట ప్రభుత కుంగడు మీఁరితలంగు వారలే. 65
క. ఇదెయే నీకంఠంబున, కొదవించిన పాశబంధ మూఢ్చిమహాసం
మదముభవ దర్పితుండగు, మదనారి యొనర్పఁగా నస మస్తముఁ గాంతున్. 66
తే. అనుచు మెడనున్న పాశ మ య్యంతకుండు,
తిగుచు టయుహాని సాంబమూ ర్తిని దృఢ ముఁగఁ
జిత్తమున నిల్పి నన్ను ర క్షింపు మభవ,
యని నుతింపుచుఁ దల్లింగ ముసకు నెదుర. 67
వ. నిలువంబడియె నప్పుడు. 63

—(*) ఈశ్వరుఁడు లింగము ననుద్భవించి శమను మడియించి మార్కండేయు రక్షించుట. (*)—

చ. ఎవనికి నిట్టిదట్టిదని యెన్నఁగరాని వయస్వరూప సు
చ్ఛవిఁదనరార నప్పుగిరి జాయుతుఁ డర్ధశశాంక ధారియా
భువనభవోదరోక్తినిజ ముం గసిపింప స్వభక్తుఁ బ్రోవఁగా
నవిరళకల్ప వారిదము హార్భటి లింగమునుండి వెల్వడెన్. 69
వ. ఇట్లావిర్భవించి విలయ సమయమధ్యందిన మార్తాండుఁబోలె మండుచు రోష
విస్ఫురణంబునఁ ద్రిపావకాత్ముండై యనల్పకోపంబున రోదసివగుల మహాధ్వని
హుమ్మనిహుంకరించి నిలువక దిగ్గజంబులు మ్రొగ్గదిగ్గన లేచి పుడమి చలింప
నడుగులిడుచు గడనడచి జము నెదఁ బాదమ్మునం దన్నుటయు నతండు జంభాంతక
ప్రయుక్త దంభోళిని హతింగూలు కుంభినీధరంబు ననుకరించుచు నేలంబడి వివశా
వయవుండై వివృతవదన గహ్వరుండు నూర్ధ్వానుండు గిరిగుహాపమ ఘ్రాణ
వివరుండు పలాయిత వ్యాధి సైనికుండునై ప్రాణంబులు విడిచెనంత. 70

సీ. అమ్మహాధ్వనివిని యంబకమ్ములవిప్పి, యమ్మౌనిసుతుఁడుని జాత్తనభవుఁ
జింతించుచున్నవా డంతఁబురోభాగ, మునగిరీశుంగ్రమం బునరమేశ
పరమేష్ఠులంబురం దరచంద్రనిర్జర, ప్రమథావలులమహా గ్రస్వరూప
మునఁదానొకింతద వ్వునఁగూలియున్నకృ, తాంతునింజూచియ త్యంతవిస్మ
యమ్మహర్షముఁగదురన యంబుతోడ, హస్తములుమోడ్చివినతుఁడై యాత్మసర్వ
మభవుఁగానెంచిపులకితాం గాంగుఁడగుచు, నేలసాగిలివినుతించె శూలినిట్లు.

—(*) మార్కండేయ కృత మృత్యుంజయ స్తోత్రము. (*)—

ఉ. మేరునగంబు చాపముఁగ మేదిని తేరుఁగఁ జిల్వరాయఁడున్
నారిఁగ వెన్నుఁడిం గలఁపు నారసముంగ ఘటించి సొంపువెం
పారఁ బురత్రయిం భసిత మై పడఁగూల్చిన సోమశేఖరున్
వారక నే భజించితివి వస్వదపత్యమి కేమిజేసెడున్. 72

ఉ. పంచతరు ప్రసూన సము పార్చిత పాదులలాట లోచనో
దంచితవహ్ని దగ్ధనలి నాంబకవిగ్రహు భస్మధారుఁబ్రా
పంచికదూరు నవ్యయుఁడు పాకరజూటును పాశ్రయించితే
నెంచికృతాంతుఁ డింకనను నేమియొనర్పఁగఁ జాలునిద్ధరన్. 73

మత్తకోకిల. మత్తవారణ ముఖ్యచర్మ స మంచితాంబర భూషితో
ద్వృత్తనుంజల జాయతాక్షు పి తామహార్చిత పాదుభా
స్వత్తరంగ సమన్వితామర వాహినీసలి లార్ద్రితో
దాత్తజూటుఁ దలంచితింకఁ గృ తాంతుఁడేమి యొనర్చెడున్. 74

మత్తకోకిలి. కుండలీకృత కుండలీశ్వర కుండలున్ వృషవాహు మా
ర్తాండ తేజు సురర్షి సన్నుత రమ్యవైభవు లోకపున్
ఖండితాంధకుఁ భక్తకల్పకుఁ గంటినే త్రిగుణాత్మకున్
దండధారి ననేమిసేయు సు ధాంశుమౌళి కృపాయుతున్. 75

మత్తకోకిలి. యక్షరాజ సఖుంభుజంగహ రాక్షహార విభూషు ను
గ్రాక్షుశైల సుతాపరిష్కృత రమ్యవామ శరీరుసం
రక్షితామరు నీలకంఠుఁగు రంగధారిఁ బరశ్వధున్
బుక్షరాజవతంసుఁ గొల్చితి నేమిసేయు యముండిఁకన్. 76

మ. అసమాక్షుం భవరోగ వైద్యునిమరం తాపన్నివారున్ సుధీ
విసరాభ్యర్చితు దక్షయజ్ఞహరు దో ర్వీర్యున్ నిరస్తాఘు సా
రసగర్భస్తుతు భుక్తిముక్తిఫలదున్ బ్రాలేయశైలాధిపా
వసథుంగొల్చిననాకు భీతియగునే వైవస్వతుం జూచినన్. 77

మ. నతవాత్సల్యుని జాత్రితౌఘునిధినా నందాత్ము దిగ్వాసు ని
ర్జితపాపున్ బరునప్రమేయు దళితా రిన్ సర్వభూతేశున

ప్రతిముఁ సోమకృశాను సోమపపయో భ్రాద్యష్ట మూర్త్యాత్మకుఁ
హితభక్తిఁ సముపాశ్రయించితి యముం డేమింకనం జేసెడుఁ. 78

చ. సరవినివిశ్వ సృష్టిజల జాతజుఁడై యొనరించి వెండియం
బురుహా దళాక్షుఁడై నిరత ముంబరిపాలన మొప్పఁజేసిసం
హరణము రుద్రనామక సమంచిత మూర్తిఁదనర్పఁ జేయున
ప్పరమునుతించి తయ్యముని ప్రాభవ మేమిక సాగునాయెడఁ. 79

వ. అనిమఱియు. 80

తే. ఎవనిచరణాబ్జ చింతన మవనిసంస, రణబిలేశయదష్టులౌ జనులకజ్ఞ
లకునఁబరమౌషధంబౌత లంపనట్టి, హరు స్మరించెదమృత్యుభ యంబువాయ.

తే. అసితగళునకుఁ బశుపతి కగ్గిరీంద్ర, తనయభర్తకురుద్రున కునునితాంత
భక్తినతిసల్పుదేమృత్యుభయముఁవాయ, సర్వమునిసన్నుతునకును స్థాణునకును.

క. హరునకుఁగరి చర్మాంబర, ధరునకునిరుపద్రవునకు దహనాక్షునకుఁ
బరునకుమ్రొక్కెద మృత్యువు, గరువముసెడి దప్పఁబారఁ గాఁగడుభక్తిఁ. 83

తే. సర్వవిద్యా స్వరూపుని సర్వమయుని
విలయమునఁ బావకుండయి వెలయువాని
కాలగళుకాల ఘస్మరుఁ గడఁగి మృత్యు
భయముఁవాయఁగ మ్రొక్కెద సద్భక్తిఁ గొలుతు. 84

క ఆనందఁ బరునినిత్యుని, మానితుసతి శాంతునత మాలాధరునిఁ
ధ్యానింతు నవ్యయునిశివు, నేననిశము మదినిమృత్యు నిగ్రహమునకుఁ. 85

తే. దేవదేవుజగన్నాథు దేవవంద్యు, వృషభకేతున నంతుని విశ్వమయునిఁ
దలఁచిమ్రొక్కెద మృత్యువు తలఁగిపోవ, నీశునీశానునభవును మేశుమృడుని.

క. స్వర్గాప వర్గదాయకు, దుర్గాప్రియు శూలహస్తు దురితవిదూరుఁ
సర్గాదికారణునిహరు, భర్గుఁదలంచె దనుమృత్యు భయమెడఁబాయఁ. 87

క. సురనిమ్నగ నబ్జారిని, శిరముసధరి యించియున్న శ్రీగళుఁగకుబం
బరుభస్మధారునహిరా, డ్వరభూషణు మృత్యుభయము వాయఁదలంతుఁ. 88

చ. అనివినుతించి మ్రొక్కి విన యంబున హస్తయుగంబు మోడ్చియే
ననఘ సరోజ సంభవల యాధికమైన నిరామయత్వ జీ
వనమునకై భజించితి కృ పామతివౌనిను నాగశంకరుం
డనియెమృకండు సూనునకు నత్యధికప్రియ భాషణంబులఁ. 89

—( ఈశ్వరుండు మార్కండేయునకు వరంబులొసంగి యదృశ్యుండగుట. )—

తే. అడిగితీవిట్లు మున్ననీ కాయువజుఁడు, కల్పసప్తక మీఁగడం కంబ్రతిజ్ఞఁ
సల్పియున్నాఁడు నే నట్లొ సంగితింకఁ, బ్రదుకుమందాకమద్భక్తిఁ బరిఢవిల్లి.

వ. అని వరంబొసంగి యచ్చోనీశ్వరుం డంతర్ధానుండయ్యెనని యెఱింగించి మఱియు
వశిష్ఠుం డిమ్మార్కండేయ స్తుతంబైన స్తవరాజం బప్పరమేశ్వరుసన్నిధి నెవరుఁ

బఠించినను వారికి మృత్యుభయంబు వాయునని వెండియు ననునట్లు భక్తావనుం
డగు చంద్రశేఖరువలన మార్కండేయుండు దీర్ఘాయువడసి స్నానంబులు గడువఁ
దలిదండ్రుల చంగటం జేరి తనకై యధికశోకార్తులై యున్నవారి పాదంబులకుం
బ్రణమిల్లి సర్వం బెఱింగించుటయు. 91

ఆ. వారుసంతసిల్లి వలనొప్పఁగౌఁగిటఁ, జేర్చిసుతుని ముద్దుఁ జేసిచింత
తెల్లఁబాసియుండి రుల్లంబునంగొన్ని, వాసరంబులట్లుఁ వాయుటయును. 92

క. జననీ జనకులయనుమతిఁ, గొనిమార్కండేయమౌని గొనకొనిచతురం
బునిధిప రీతావనియం, దునుఁగలతీర్థములఁజూడఁ దోడ్తోనరిగెన్. 93

ఆ. అరిగియొందువిడువ కన్నిటమజ్జన, మతఁడుసలిపివిధివి హితముఁగాఁగ
పెక్కుమాఘములనుఁ బెంపారఁజేసి కృ, తార్థతముఁడునయ్యె ధరణియందు.

తే. మనిన యన్నాళ్లుమానక మాఘమజ్జ, నంబొనర్చిన యాసుకృతంబుఁవోనె
యిట్టిసంతతి నభివృద్ధి నింపెలర్పఁ, జేసెఁగాకేమి నృపమృగశృంగమునికి.

వ. అనిన దిలీపుండు విస్మయాతిహర్షచేతస్కుండై గురునకు వెండియు నిట్లనియె.

—(*) నిర్గతప్రాణుండైన యముం డీశ్వరానుగ్రహంబున సంజీవితుండగుట. (*)—

క. మునివల్లభ సర్వజగ, జ్జనమృత్యుప్రదుఁడుయముఁడు చచ్చినపిదపన్
వినుపింపు మెట్లువర్తిలె, జనసంహతి కాయురంత్య సంస్థితులెల్లన్. 97

చ. అనుటయు నద్ధరావరున కయ్యతిపుంగవుఁ డిట్లువల్కె న
ట్లినజుఁడు శర్వపాదహతి నేడ్తెఱఁ బ్రాణము వాసిభూతలం
బునఁబడఁ బ్రాణిసంహతికి పుట్టువెకండయు చావులేమి వ్రే
లునుపఁగ సందులేక ప్రజ లుర్వినిఁ బెంపయి నిండియుండినన్. 98

క. ఆమస్నహామగు భారము, మేదినిభరి యింపఁజాల మికిసురలుంబ
ద్మోదరుఁడుఁ గూడిహైమవ, తీదయితుని కడకునేగ దృఢభక్తిమెయిన్. 99

చ. వినతులొనర్చి మోడ్చిసర విన్నిజహస్తయుగంబులందఱో
మనసిజవైరిసాంబపుర మర్దనసీమది లోనెఱుంగకుం
డినకథ మున్నెయైన నిట నీకడనే మెఱిగించువారమా
దినపతి సూతిత్వత్పదహ తిన్ధరఁ ద్రెళ్లుటఁ జేసియియ్యెడన్. 100

చ. ఉరుగతి నుద్భవించుటయు నొండెవినాశము లేమిఁ జేతనో
త్కరము ధరిత్రినిండి వసు ధాసతికింగడు భారమయ్యెనీ
వరసిత దీయభారపరి హారివిఁగమ్ము కృతాంతునిమ్ముసా
దరమున నాగవారియెడ దర్పకవైరి కృపామనస్కుఁడై. 101

తే. చరణనిహతిఁబడిన హరిసూనుఁ బ్రదికించి, సరసిజోద్భవాద సురలకెల్ల
సంతసంబొనర్చి సమవర్తికిట్లని, పలికెనపుడుశూల పాణియెలమి. 102

´. ఇంకిదియె మొదలుమత్పద, పంకజముల భక్తిఁగొల్చు వారియెడలనీ
బింకముసూపక మఱిని శ్శంకంబూ జించిబ్రదుకు చనుమికపురికిన్. 103

వ. అనిశలవాసంగ యముండీశ్వరునకు నమస్కరించి నిజస్థానంబునకుం జని యథా
స్థితి నుండెనని గురుం డెఱింగింప విని యగుడ దిలీపుండు. 104

ఆ. మౌనినాథ మాఘ మజ్జనమొనరింప, ముఖ్యములగుతీర్థ ములునుపుణ్య
భూములెల్ల నాకుఁ బోలుపార నెఱిగింపు, మిదియువినఁగవేడ్క మదిజనించె. 105

వ. అనియడిగిన రాజునకు వశిష్ఠుం డిట్లనియె. 106

వశిష్ఠుండు రాజునకుఁ బుణ్యక్షేత్ర తీర్థంబులుండ
తప్రభావంబులుం దెల్పుట.

క. చిత్తంబిగు రొత్తఁగనో, యుత్తమరా జన్యవినుము దుక్తంబులభా
స్వత్తీర్థంబుల మహిమము, దాత్తమతిన్ శుభములొదవు తలఁగునఘంబుల్.

తే. మాఘమాసము చనుదేర మనుజుఁడూరి, వెలిని నెందెనిఁ గ్రుంకనిర్మలజలంబుఁ
గాంచి గంగోదకంబదిఁ గాఁదలంచి, మాఘనియమముఁ గననిర స్తాఘుఁడండ్రు.

వ. అయినం గొన్నితీర్థంబులుఁ గల యీభూమి నదియుఁ బశ్చిమంబుననుండి కొన్ని
తూర్పుముఖంబుగనుఁ దూర్పుననుండి పశ్చిమముఖంబుగం గొన్నియునై ప్రవ
హించుచుండు నందు ప్రయాగ ముఖ్యక్షేత్ర తీర్థంబై యెన్నికఁగనె నింకను వివ
రింతు వినుము. 109

తే. మహితపుణ్యప్రదమ్ము శ మంతపంచ, కంబు సురసేవ్యమందు మోక్షదంబుతోడ
స్నానమొనరించి నట్టియా జనులభాగ్య, మసదృశంబగుఁ జుమ్మీధ రాధినాథ.

క. వారక మోక్షస్వర్గము, లారయసం తతియుఁగల్గు సఘములఁబాపుల్
జేరినవారికి గంగా, ద్వారంబీ వరిగిక్రుంకు వైశంబంనుల్. 111

చ. వినుమ! యి వంతినాగబృథి వీస్థలినెంచు పురంబువోల్చు స
జ్జనసము దాయసేవ్యమటఁ జచ్చినవారికి శంకరుండు చ
య్యనపవ ర్గమిచ్చును మ హాస్థలమయ్యది మాఘమందునీ
ననఘ యతేగితన్న దుల యందొనరింపుము స్నానసత్క్రియల్. 112

క. క్షితినాథ కలదుమాయా, పతియనసుర సేవ్యమగుచు పత్తనమొకడి
క్షితిఁదాని యుత్తరమునం, దతిపావన మైమలప హారిణియనఁగన్. 113

తే. పుణ్యనది యొండుగలదు త త్పూతజలము, లనుమునింగినవారలకనఘులుఁగఁ
జేయునట్లయిఁదానికి నాయభిఖ్య, యయ్యె మనుజుండు తన్నది యంనుఁగ్రుంకి.

వ. యథాశక్తి దానంబిడి యొకరాత్రి నుపవసించి మరునాడు తీర్థశ్రాద్ధంబును
మాఘస్నానంబుం గావించిన స్వర్గంబునం దమిత భోగంబుల నందఁగలండు
మఱియు. 115

చ. రవికుల రాజచంద్రమ స రస్వతిఁగ్రుంకి పితృ క్రియాదుల్
బ్రవిమల లీలసల్పిన స రస్వతిపేర్మి సుషుమ్నా నాడితోఁ
దవులుచు నమ్మహాత్ముఁడు ధన్యతముండయి చెందుబ్రహ్మమం
దవిరళ కాంతిఁబ్రహ్మసుషి రైకవినిర్గత జీవుఁడైతుదిన్. 116

శా. గంగాసాగర సంగమంబునను మాఘస్నానముం గోర్కులు
పొంగం జేసి సదక్షిణస్థితిని నుర్వ్యాల్ నీల గోధేనువు
త్తుంగఖ్యాతిని విప్రజాతికిడియం దుందాఁబితృ శ్రాద్ధముల్
సాంగోపాంగముఁ గాఁగ జేయునరు లెల్లన్ సత్యవాసుల్ తుదిన్. 117

తే. అవనిసత్య వ్రతక్షేత్ర మనఁ బ్రసిద్ధిఁ, గాంచి శ్రీవల్లభుని నిజా గారమైన
కాంచిఁ జేసినసుకృతంబు నించుకేని, కోట్లకొలఁది నెసంగెడు నట్లుఁదనరి. 118

వ. దానికిఁ బుణ్యకోటియనం జగత్ప్రసిద్ధంబగు నామంబుఁగలిగె మఱియు నందుఁ
బూర్వంబునఁ గమలాసనుండు మఖంబు సేయుచుండ తద్విఘ్నంబునకై యొక్క
నది దక్షిణంబుననుండి వేగంబునం బ్రవహించె నంతనుండి యా స్రవంతికి వేగవతి
యను పేరయ్యె నట్టి వేగవతియందును నందుంగల మున్నూటఱువది తీర్థంబు
లందును మాఘంబున సుస్నాతుండై యథాశక్తి దానంబొసంగి యక్కాంచీ
నివాసుఁ గమలనాభు నర్చించిన నరుండు పాపవిముక్తుండై త్రిదివసుఖంబు లనుభ
వించు నిదియుంగాక. 119

ఆ. కలదు ధరత్రియంబ కమునాగ నొక్కసు, క్షేత్రమది జగత్ప్రసిద్ధిగాంచి
మూఁడులోకములను ముఖ్యమైయపవర్గ, మిచ్చుభక్తిఁదన్నుఁ జొచ్చుప్రజకు

క. గోదావరీజలంబుల, మోదముతో మాఘతిథుల మునిగినయెడలన్
శ్రీదయితుఁడు తలఁగించును, సాదరమున వారిసప్త జన్మాఘంబుల్. 121

క. అన్నది దక్షిణకూలము, నన్నుతమై యధికపావ నస్థితిఁగనితాఁ
జెన్నలరు గౌతమాశ్రమ, మున్నదిము న్నందహల్య యుంగొలువంగన్. 122

ఆ. గౌతముండుతపము కడువేడ్క సేయుచు, నుండనటకుహరిహ యుండువచ్చి
చూచిమోహవశత సుందరియాఁదత్స, తీమణినిరమింపఁ దెలిసిమౌని. 123

క. తనువెల్ల యోనులుంగాఁ, ఘనవాహనుఁ గినిసితనదు కాంతామణినిం
గనిపాషాణముఁగాఁగ, న్కనలిశపియించె న్మునీంద్ర కోటులుమెచ్చన్. 124

వ. మఱియు నత్తపోవనంబునం దసురగురుండగు శుక్రుండు తొల్లి నొక్కనటద్రు
శాఖఁ జరణంబులఁ దగిల్చి యధశ్శిరుండై క్రింద పెనుధూమశిఖల నందు
నగ్నికుండంబు నిర్మించుకొని తద్ధూమాగ్నులాహారంబుఁగా నిటలాక్షుఁగూర్చి
ఘోరతపం బొనరించి పురాంతకు మెప్పించి తత్కృప మృతసంజీవని యను
విద్యంబడసె నట్టి మహాస్థలంబునందు. 125

ఆ. అవనిసురుఁడుస్నాత యైపితృతర్పణ, విధులనెల్లదీర్చి వెండిత్ర్యంబ
కాఖ్యమాత్రముం బ్రియంబునఁ బఠియింప, నతఁడువాయుభవభ యంబులెల్ల.

క. వెండియు కాలాత్మకమను, కొండయుఁగల దొకటిగాల కూటవిషంబా
ఖండేందు ధరుఁడుఁదినియు కొండననివసించిచేసి కొనెజీర్ణంబున్. 127

ఉ. దానికి నుత్తరాశవసు ధాధిపయొప్పెడు పంపనాగజా
నౌనది దానిదక్షిణ మహాతటినొక్క. పురంబుఁబొల్చెడున్

మానుగ నయ్యభిఖ్యను సమంచితవృత్తి నరుండుమాఘమం
దానగ రావనీధరము లందొకటన్ వసియించియుండియున్. 128

తే. మొనసితన్నది యందహార్ముఖమునందు, మునిఁగి శిఖిపూజనాతిథి పూజనములు
నియమయుక్తి నొనర్పుమునీంద్రులకున, గమ్యమగుహార సాయుజ్యగతిలభించు.

క. వెండియు నానదికవ్వల, నుండుఁ బ్రభా సంబనంగ నొండొకక్షేత్రం
బండజ భూషణుఁడగకో, దండుండట నుద్భవించెఁ దాలింగంబై. 130

వ. ఇందు నొక్క పురావృత్తంబుఁగలదు దాని వినిపింతు వినుము. 131

క. నరవర భగవంతుండగు, హరుఁడజుమధ్యమశిరంబు నతిక్రుద్ధఁడునుమన్
బోరితద్ధ్వాత్య గిరీశునిఁ, దరమిడివెనుఁ దాకవెఱచి దైన్యముతోడన్. 132

తే. హస్తయుగ్మము శిరమున నమరఁ జేర్చి,
యిమ్మహా పాపమేనిక నెట్లుఁ బాయు
దనుచుఁ జింతించుచుం భూమి నంతఁదిరుఁగు,
చుండెననుటయు విని దిలీ పుండువలికె. 133

ఉ. అనఘ చరిత్ర ధాత్రు చతు రాననముల్ బలె వేదశాస్త్రముల్
మనుకొని చెప్పవిందుమిట మున్నిపుడాతఁడు పంచశీర్షుఁడై
మనసిజ వైరచేతఁ దును మంబడెనంటి వదెట్లులాతఁడే
యనువునఁ బాసెఁదత్కలుమ మంతయునా కెఱిఁగింపవేదయన్. 134

—(*) లింగోద్భవ ప్రకారము. (*)—

వ. అని యడిగిన వశిష్ఠుండు రాజునకనియెఁ దొల్లి స్థావర జంగమాద్యఖిల ప్రాణి నివహంబులకు నాధారంబైన భూమియు నభంబు నదీనదాద్రి ద్రుదిక్చయంబులు లేక నామరూప హీనంబైన యనశ్వరంబొండుఁ గలిగియుండు నాడు దానియందు మొదల నిచ్ఛాశక్తి యుదయించె. 135

ఆ. దానునుద్భవించె ధాత్రీశ మొదలహం, కారమదియె సృష్టి గతికిమూల
మందువిష్ణుఁడతని యందబ్జసంభవుఁ, డభవుఁడుద్భవించి రైదుతలల. 136

వ. అట్లుఁబొడమి. 137

క. పంచ శిరస్కుఁడనేనొకఁ, డంచితగతి నుండనాకు నన్యుండొకఁడే
యంచిరువురు వాదించుచు, మించినకోపంబుతోడ మృడుఁడబ్జజుఁడున్. 138

క. దురమొన రింపఁగఁదొడఁగిన, సురవర్ష శతంబుసమసె సొలయకయందా
హరుఁడజు మధ్యమశిరము, ర్వరఁగూలిచె వామహస్త వరనఖరమునన్. 139

తే. అట్లు నిజవామకరక నిష్ఠాంగుళీన, ఖరవిదళితాబ్జ సంభవ శిరుఁడుశర్వుఁ
డైతదీయాఘ పరిహార ణార్థమూక, పాలముంగొని యదిభైక్ష పాత్రఁగాఁగ.

వ. భిక్షాటనంబు సేయుచుండె నట విరించియుఁ జతురాననుండయ్యె నట్లు పురారి బహుకాలంబు తిరుగుచు సృష్టి పిదపఁ గొంతకాలంబు సను డొకానొక సమయంబున. 141

క. దారుక వనమున కేగి వి, హారం బొనరింపుచుండ నామృడు రుచిరా
కారంబుఁ గాంచి యవ్వన, ధారిణి విహరించు ముని వతంసుల పత్నుల్. 142
ఉ. సారసలోచనల్ కుసుమ సాయకు మోహన బాణముల్ వయ
శ్శ్రీరుచిరాంగ లమ్ముని చేతిశరంబులఁ జిక్కి భ్రాంతలై
హారమణీ విభూషణము లంబరముల్ కచబంధముల్ వడిన్
వారకవీడ్వఁ డంగఁ బుర వైరి దెసంబడి పాఱి రొక్కటన్. 143
ఉ. అవ్విధి నాత్మ పత్నులఁ బు రాంతకు వెందవులంగఁ జూచి తా
రవ్వనమౌను లయ్యభవు నందతికోపముఁ బూని వేగిరం
బివ్వసుధాస్థలిం బడియె డిమ్మెయి నీతని దండముష్కముల్
ద్రెవ్వియటంచుఁ దిట్టిరవ ధీరణబుద్ధి ధరావరోత్తమా. 144
తే. అట్లు శాపించుట గునశ్యశ్రమాధవుండు, మేఢ్ర ముష్కములుం దెగి మేదినికిఁ ద
శాంగుళంబులు మిగిలి పాతాళాంత, మతిదృఢంబుగఁ బాదెసు స్థితిఁ దనర్చి.
క. లీలన్ సర్వజగంబుల, నోలిన్ సృజియించు నాతఁ డురుకోపాగ్నిం
గూలిదినవాఁడు పురముల, నాలాగు శపింపఁ బొందఁ డయ్యెం గినుకన్. 146
వ. మఱియు వారియెడఁ గరుణించి తచ్ఛాపంబంగీకరించి తల్లింగంబునందె తానైక్యంబగుడు మహాత్కట తేజంబున నదియు నఖిలలోకంబుల వ్యాపించె నత్తేజంబునకుఁ బ్రాణిసమూహం బంధంబయ్యె నప్పుడు 147
క. కలఁగి చతుర్దశ భువనం, బులనుండెడు మునులు యోగి ముఖ్యులు సురలున్
జలజాసను పాలికిఁ జన, జలజాక్షుం గూడి యతఁడు సర్వులు రాగన్. 148
క. లింగాకారుం డగుహరు, గంగాధరుఁ జేరి నుతులు కడు సేయుచు సా
ష్టాంగ నమస్కృతు లిడనపు, డంగజ వైరికిని బలికె నాహరి యెలమిన్. 149
క. లోక ప్రమోద కరసుగు, ణాకర విబుధేశ సుమహితైశ్వర్య శివా
మాకుం బ్రీతిఁ గనీదు, గ్లోకంబగు తేజమణచి లోకింపఁగదే. 150
క. తావకమగు నీ తేజం, బీవిశ్వం బందు నిండి యెసఁగె నశించుం
గావున నీ వివుడించుక, భావించి యనుగ్రహింపఁ బరమశుభంబా. 151
క. అని వేడుటయు మహాముద, మునఁ దన తేజంబు నణచి ఫుల్లాంభోజా
క్షుని నలిన జామరాదులఁ, గని హరుఁ డిట్లని యెనధిక కౌతుక మొనరన్. 152
తే. అమరముని నీరజాతోద్భవాంబుజాక్షు, లారయింకది మొదలుఁ జెలంగు నిట్టి
రూపమున నమత్స్వరూపమ్ము రూఢిఁ బూరు, పార్థసంసిద్ధికై సేయుఁ డర్చనములు.
వ. అని మఱియు నందఱికి వేఱ్వేర నిట్లనియె. 154
క. వనజాసన యిది మొదలీ, వనుపమ వేదప్రసిద్ధ మైనవిధానం
బున నీవిధ మగుననుఁ బూ, జనమొనరుపు శుభముఁ గలుగఁ ద్రిదశాసురతతికిన్. 155
ఉ. ఓజలజాతనాభ వినుమొప్పఁగ నీపను లెల్లఁ జేకుఱున్
రాజకులాభివృద్ధియగుఁ బ్రాజ్ఞులనా భృగువామదేవులన్

రాజితకీర్తి నాశుకుది - నాధిపవంశగురుల్ మృకండుజుల్
నైజమునీశ శిష్యులనొ - నర్చియిటుండెడు నన్నుఁగొల్వుమీ. 156

వ. అని యగస్త్య గౌతమదధీచి భృగ్వఘోర వామదేవ దత్తాత్రి కశ్యపులం జూచి మీరలవనీసురవర్గంబునకు మేలుఁగలుగునట్లుఁ గమలజునకు శిష్యులరై వర్తించి యివ్విధినున్న నన్నర్చింపుఁ డఖిలశుభంబు లొదవునని యెఱింగించి యందఱకు వేర్వేర వరంబులొసంగి యీశ్వరుండు మరల లింగంబునం దైక్యం బయ్యెనంత.

చ. త్రిపురవిదారి తెల్పినగ - తిన్ గమలాక్ష సరోరుహాసనుల్
విపులతరంపు భక్తిఁబృథి - వీధర చాపును పాశ్రయించియు
త్తపసులు శిష్యులై కొలువ - దానతపో వ్రతయజ్ఞ సత్క్రియల్
నిపుణతఁసల్పి బ్రోచిరవ - నీశ్వరభూ విబుధావనీపులన్. 158

వ. అనిలింగావతార కథనం బెఱింగించి వెండియు వశిష్ఠుండు పుణ్యక్షేత్ర తీర్థాదుల నెఱింగించువాఁడై యిట్లనియె. 159

క. అవనీశ తిలకవినుమో, ఘవతీతీరమునఁ గలదు - ఘనపుణ్యక్షే
త్రవరము నారాయణమన, వివరింతును దానివిధము - వినుమన మలరన్. 16(

మ. అటమున్నబ్జభవుండు సృష్టిపనికై - యాలోచనల్ సేయ ను
త్కటషాడ్గుణ్య విభూతిశాలి ప్రణవా - కారుండు నారాయణుం
డటుఁజూపట్టి యుతద్భ్రమంబు వికలం - బైపోఁగృపాయుక్తినొ
క్కటదానప్పు పదేశమిచ్చెఁ బ్రణవా - ఖ్యంబైన సన్మంత్రమున్. 161

తే. అదిపరబ్రహ్మమమృత మ - య్యాదియసృష్టి, కారణంబబ్జభవునకుఁ - గలుగఁజేసి
కడకలోకంబులం జేయఁ - గర్తయయ్యె, ననివశిష్ఠుండు క్రమ్మఱ - ననియెఁబతికి.

క. ఆయోఘవతి జలంబులఁ, బాయకస్నానం బొనర్చి - బహుళాదృతితో
నాయోంకారు సమార్చన, మేయతఁ డొనరించిఁ పిదప - నెంతయుభక్తిన్. 163

వ. తత్తీర్థశ్రాద్ధంబులఁ బితృదేవతలం దృప్తిఁబొందించు నతండు విష్ణులోకంబునం దధికసుఖంబు లనుభవించు మఱియు. 164

క. గోకర్ణం బనమోఘ, శ్రీకరమై పుటమినొక్క - క్షేత్రంబమరున్
గైకొని మాఘస్నానం, బాకమనీ యోదకముల - నాడికడంకన్. 165

క. అకడ నెలకొని యుండిన, గోకర్ణేశ్వరునిభక్తిఁ గొలిచిన నరుల
స్తోకప్రీతిం గాంత్రుది, వాకరకుల పుణ్యలోక - మంచితయుక్తిన్. 166

వ. మఱియు నిదియుంగాక తన్మహాత్వం బధికం బగుటఁ జేసి. 167

క. గోకర్ణము గోకర్ణము, గోకర్ణంబంచుభక్తిఁ - గొనితలఁచుచుఁదా
నేకడమజ్జన మాడినఁ, గైకొనునరుఁ డధికపుణ్య - గతినిక్కముఁగన్. 168

క. పురుషోత్తమంబునాని, ద్ధరఁగల దొక పుణ్యభూమి - దానంగోదా
వరినుదయస్నానంబున, నరుఁడిడఁదానము వికుంఠ - నగరముఁజేరున్. 169

క. భృగుకచ్ఛమునాథాత్రిం, దగుసుక్షేత్రంబుఁగలదు దానములందా
ప్పుఁగస్నానమాడిచేసిన, ఖగవాహనులోకమేగఁ గలఁడాతండుఁన్. 170
క. గురుభృగుతుండఁ పుగ్రుంకున్, ధరఁబుష్కర మునవోనర్చు దానముపేర్మిన్
నరుఁజేర్చు నాకముంభా, స్కరవంశ పయోధి చంద్ర సద్గుణసాంద్రా. 171

—(*) సూతుండు శౌనకాదులకు తీర్థక్షేత్రంబుల నెఱింగించుట. (*)—

వ. అనివశిష్ఠుండుది లీపునకుం జెప్పెనని చెప్పిసూతుండు శౌనకాదులకు వెండియుం దానిట్లనియె. 172
చ. వరమునులార రావణుని బాధలకెంతయు నోర్వలేమిని
జరతతులెల్లఁ బ్రార్థనలు సల్పఁగనాజికి రామలక్ష్మణుల్
భరతుఁడు శత్రుసూదనుఁడు పాయకనల్వురు సూనులైతన
ర్చిరవికులంబు పావనత జెందఁగ భూజనులుల్ల సిల్లఁగన్. 173
చ. దురమున దుష్టరాక్షసులఁ ద్రుళ్లడఁగించి ధరాధిపత్యమున్
బరవసమారఁ దాల్చియిల పైచతురాశ్రమ వర్ణపద్ధతుల్
దిరముఁగ నిల్పిభూపవిత తిన్సుగుణంబుల ప్రోగుఁజేసియు
ర్వరఁబదునొండు వేలుసన వత్సరముల్ హరియేలె నేపురిన్. 174
క. ఎప్పురిసర్వప్రాణులఁ, దెప్పునసరయువున ముంచి దివిఁజేర్చిముదం
బుప్పతిల మొదలివాసం, బప్పద్మాక్షుండుసేరె నమరులుమెచ్చన్. 175
వ. అట్టియయోధ్యానగరంబు నందుండి సరయూజలంబుల సుస్నాతుండై పితృతర్పణంబులిడినఁదత్పితృవులు వర్షసహస్రంబు శ్రాద్ధంబిడినం తతృప్తిఁజెందుదురు వెండియునప్పత్తనంబున వసించియన్నదీ స్నానంబున మాసోపవాసవ్రతంబు సలిపిన మహాత్ములు మరుజన్మంబు నందిభూలోకంబున మహదైశ్వర్యోపేతులైసుపుత్రావాప్తినధిక సుఖంబు లనుభవించి తుది ననర్ఘమణి ఖచితదివ్య విమానంబులం గూరుచుండి స్వర్గసుఖంబు లనుభవింపఁ బోఁగలవారు మఱియు. 176
క. పృథివీస్థలమునఁ దనరున్, మధువన మటఁదనువుపీడు మనుజులనఘులై
మధురిపు నాకృతిఁ దాల్చిత, దధివాసమునందఁగలరు దంచితలీలన్. 177
ఉ. దానికినుత్తరమ్మహరి దశ్వజపొల్చు వినీలకాంతిమున్
జానుఁగకృష్ణమూర్తికిన నారతముం బరితోషమిచ్చిన
మ్మానముఁగాంచె నత్తటిని మర్త్యులు మజ్జన మాడిరేనియు
ద్దానవజిత్స్వరూపమునుఁ దాల్తురు తన్మహిమంబు పెంపునన్. 178
సీ. మునివర్యులారయే పురవరమునకు నల్దిశలందు ద్వారముల్ దేజరిల్లి
ద్వారకయనుపేరఁ దనరారె నేపుర, మున నుండి శ్రీకృష్ణుఁ డనఘులైన
కుంతీసుతులఁ బ్రోచి ఘోరాహవక్షోణివారిచే దుష్టభూ వరులనెల్ల
సంహరింపించివి శ్వంభరాభారంబు వారించితానుఁగై వల్యపదము

నందేమున్నట్టి పత్తన మందునుండి పుణ్యతీర్థావగాహియై మొగినిదేవ
ఋషిపితృలకును మనుజుఁడిం పెనయఁదర్పణంబులిడివిప్రవరులకన్నంబువెట్టి.
వ. దానంబిడి యిహపరంబుల నమిత సుఖభోగంబులందు మఱియు. 180
ఉ. ఎయ్యది కిల్బిషాపహర మెయ్యది యక్షసురాది సేవితం
బెయ్యది తన్నుఁజూడఁగని కెంతయునిచ్చుఁ బ్రమోద మాత్మకే
నెయ్యెడలం బురాణముల నెక్కొని చెప్పఁగ మీఱువించుబల్
నెయ్యముతోడ సత్రము మునీంద్రులు సేయఁగ నయ్యెక్షేత్రమున్. 181
వ. అట్టిదియగు. 182
క. ఈనైమిశాఖ్యవనసు, స్థానామల తోయములఁ గృతస్నానుండై
దానమిడు నతఁడు సంసృతి, లోనిర్వృతిఁ గాంచితుదివి లోకించుహరిన్. 183
క. ఏయెడ భీష్మద్రోణము, హాయోధాదులనుఁగూడి యప్పాండుసుతుల్
పాయకరణముంబొనరిచి, రోయదియే యమరెఁగురుక్షేత్రంబై. 184
ఉ. ఓవరసూనులారవినుఁ డొప్పఁగ నందువసింప నొప్పెడున్
బావనుఁడౌస మీరణుఁడు భవ్యతమంబులు మూడుకోట్లపై
నేవదిలక్షలున్నవియ హీనసుతీర్థము లంచుఁజెప్పెనో
పైవసుధామరాలయవిహాయసతీర్థములందె యుండెనున్. 185
క. అమరుధరిత్రి విహాయా, కుమనంగాఁ దుంగభద్ర ఘనతీరమునన్
గ్రమమున నందుంగౌరీ, రమణీయుతుఁ డైతదాఖ్య రాజిలుహరుఁడున్. 186
క. ఓలిన్ బూజించిరిమును, వాలియు సుగ్రీవుఁడనిల వరసూతిమునుల్
నాలాయమాశ్రితావన, శీలున్ విధ్వస్తకాలు సితరుగ్జాలున్. 187
క. ఉర్విం బూర్వామరులున్, గీర్వాణులు మున్నుఁబోర గీర్వాణులకున్
శర్వుఁడు బాసటయైము, గ్గర్వుల రాక్షసులఁద్రుంచి కరుణదలిర్పన్. 188
క. అసురాప హృతము నమృతం, బసమాక్షుం డిచ్చిసురల నమరావతికిన్
వెసఁబంచి తానపర్ణా, బిసరుహనయ నాయుతముఁగఁ బ్రియమొప్పారన్. 189
వ. తుంగభద్రా నదీతీర ఋష్య మూకాద్రియందుఁ గ్రీడింపనిలిచె నది కారణంబా స్రవంతి కడుధన్యంబయ్యె నాజలంబులఁ గృతావగాహులై తీరగతులగు హరిహరులం బూజించి దాన జపహోమాదులు సలిపిన నరులకతుల తపఃఫలంబు లభించు వెండియు నయ్యేటియందు మాఘస్నానంబుఁ గావించు వారిరువది యొండు తమతరంబుల వారిఁబునీతులఁజేసి తామర్త్యమలోక నివాసులగుదురు మఱియు వినుండు. 190

—(*) సూతుండు శౌనకాదులకు శ్రీరంగక్షేత్ర విధం బెఱింగించుట. (*)—

ఆ. సహ్యధారిణీధ్ర సంజాతయైమొగిఁ, దుంగభద్రకదియుఁ దుల్యయగుచు,
ఘనతఁగాంచెనమలఁ గావేరియననొక్క, తటినిదానినడుమఁ దపసులారా.

శా. శ్రీరంజిల్ల విభీషణాసుర మహీక్షిన్మౌళి వైకుంఠ స
తత్పురావాసము నుండితే నతికృపాభూయిష్ఠుఁడై భక్తముం
దారుండౌ హరి యేఁగుదెంచి యది పుణ్యస్థానమై యుంటదు
ర్వారోదంచితసత్ప్రభన్విలిచె శ్రీరంగేశ విఖ్యాతితోన్. 192
వ. అనిన నిది సవిస్తరంబుఁగా నెఱింగింపుమనుఁడు సూతుండు శౌనకాదులకిట్లనియె.
చ. నరవరుఁ డాజినందనుఁ డనంతబలుండగు రామమూర్తి సం
గరమునఁ బఙ్క్తికంధరుని ద్ధాతలిఁ గూలిచి యంతలంకకున్
వరుసఁగ నవ్విభీషణు ధృవస్థితి నిల్పి కృతస్వకార్యుఁడై
హరియగుటన్ స్వకీయనిలయంబునుఁ జెందె వికుంఠధామమున్. 194
వ. అప్పుడు. 195
చ. అనుదిన మయ్యనంతుచరణాంబురుహద్వయిఁ బూజసేయ నె
మ్మనమునఁ గోరి మింట మధుమర్దనుపీటికి నేగియమ్ముకుం
దునిఁ గన నవ్విభీషణు విధుండు ముదంబునఁ గారవించి యో
దనుజవరేణ్యలంకకు సదాధిపతిత్వము నీకు నిచ్చియున్. 196
క. చను వెంచితి ధర్మంబున, దనుజులఁ బాలింపుమనుచుఁ దగ నీవిపుడెం
దున వెరు వెంచితివీయెడ, ననిన విభీషణుఁడు కైటభాంతకున కనెన్. 197
ఆ. దేవదేవ నీదుదివ్యాంఘ్రిపద్మ యు, గ్మంబు భక్తిఁ బూజనంబు సేయ
కశనముం భుజింపనంచితవ్రతమిది, పూని నాఁడ నాదు, పూన్కి సేయు. 198
చ. అనుడ సురాంతకుండు దనుజాధిపుఁ గన్గొని మింటి త్రోవ న
న్ననుదినముం భజింపఁగ రయంబున వేరువ వచ్చి పొమ్మనీ
దనుజపతిత్వమెంతయుఁ గృతార్థతనందఁగ నావుడమ్ముకుం
దునకు విభీషణుండను మృదూక్తులఁ గేల్ముకుళించి నమ్రుఁడై. 199
ఉ. పాలితభక్తసంచయ కృపాకర భూప్రజ నేలువానికే
వేళ విరామ మేర్పడు వివేకులఁ గూర్చి నిజాసనస్థితుం
డై లలిలౌకికంబులను వారనెఱుంగుచు సత్పథంబునన్
బాలనసేయుటేయగు నృపాలకుఁ దట్లొనరింప కుండినన్. 200
ఉ. కౌరవ బాధలంబడు నిరంతర మిందొక సందియంబులే
దారయ నాకవస్యము ధరాధిపతిత్వమటన్న మద్గ్రహం
బీ రఱుదెంచి పూజనము లెంతయుఁ గొండటుఁగాని శోభవ
చ్ఛ్రీరుచి రాంఘ్రులీయెడ వసించియె కొల్చెద నొల్లరాజ్యమున్. 201
క. అనిన విభీషణునకు న, వ్వనజాక్షుం డిట్టులనియె వచ్చెదనట్లై
ననునిన్నుఁ గూడి భక్తుల, కనయము వశుఁడైనవాఁడనై నకతమునన్. 202
తే. అనిన సంప్రీతి నయ్యసురాధిపుండు, ఘనతరద్వార గోపుర కక్ష్యకక్ష
కలితముఁగ స్వర్ణమణిపేటికయు రచించి, దానినంచిత భక్తిమై పూనికేల.

మ. సదసద్వ్యం బుధిధారి ణీధ్రవనసా । నాజంతు సంఘాశ్రయా
స్పదమైయున్న జగంబుకుక్షిఁ గనునో । ప్పం దాల్చియున్నట్టి ని
న్నిదె నేనిప్డు వహింతు నేతలఁపనీ । వేగాక యన్నింటికిన్
సదయాకార నిజాంఘ్రి సేవకసుర । త్నాజార మావల్లభా. 204

వ. అనిపలికి వెండియు. 205

శా. ఓభక్తావన యోకృపా నిలయయో । హాదీన మందారయో
శ్రీభర్తా దురితామ యార్తిభిషజా । శ్రీకంఠ సంసేవితా
యీభర్త్రాంచిత పేటికాంతరగతుం । డీవిప్డు గమ్మింతయున్
నీభారం బనితాల్తు మస్తమున పూ । న్కిం బోవఁగా మత్పురిన్. 206

వ. అని వేడిన భక్తవత్సలుండగు నారాయణుండు విభీషణా భీష్టంబుఁదీర్పఁ బ్రణవా
కారంబగు మంజూషం బ్రియాయుక్తుండై యధివసించుటయు నతండద్దాని శిరం
బునం దిడుకొని గగనంబున కుద్గమించి లంకామార్గంబువట్టి పోవుచుఁ గావేరి
నాలోకించి యది మధ్యాహ్న సమయంబైయుంట నిజాహ్నికంబుఁ దీర్చుకొని
పోవువాఁడై తత్తీరంబునందొక్క రమ్యస్థలంబునఁ బేటికనునిచి కృతనిత్య
కృత్యుండై మగుడనద్దానినెత్త నదిలేవకున్న దనుజాధిపుండు వెఱగంది రాజ్య
తంత్ర త్వరితమానసుండు విఘ్నితోద్యముండునునై చింతింపుచు నాహరింగూర్చి
యప్పుడు. 207

మత్తకోకిల. దేవదేవ నమస్కరింతు సు । ధీజనావన భక్తసం
భావనాకరు ణామయాత్మక । భవ్యరూప జనార్దనా
కావుమే నొనరించు పూజలఁ । గైకొనన్ హితమేనియిం
దీవుఁజల్కన యైవిలంబ మొ । కింత లేదు చనన్ వలెన్. 208

క. అనివేడుకొను విభీషణు, వనజాయత నేత్రుఁడధిక । వాత్సల్యమునన్
గనియిట్లు పలికె వినుమో, దనుజాధిప యేలపడెదు । తహతహయిట్లున్. 209

ఈసుక్షేత్రము వీడఁజాలనిది నా । యిమ్మైన వైకుంఠ స
ద్వాసంబుం బురుడించుచున్నది నితాం । త ప్రీతినిం దుండి వి
శ్వాసంబేర్పడఁ గాంతుభక్తుల నజ । స్రంబీ స్రవంతీవరం
బౌసత్యం బమరాపగా సమముసా । ఖ్యానంద సంధాయియై. 210

హితమతిఁ దెల్పెదన్ వినుమ । హీన బలాఢ్య కృతాదిగా యుగ
త్రితయమునై జరూపమున । దృశ్యుఁడనై కలివేళలన్ సదా
గతివిధినీవ దృశ్యతన । కల్మషసే ముషివచ్చి సేయున
న్నతుతిత భక్తినిందు వివి । ధార్చనముల్ నిజగేహ వర్తివై. 211

సారిది నేఁటనైశాఖ । శుద్ధపూర్ణి, మాఘమున నొక్కపరినిఁబ్రి । యంబుతోడ
నదియు సంవత్సరాంతమీ । యనుదినంబు, భక్తిఁబూజించినంతటి । ఫలమొసంగు.

క. అనివన జాయత నేత్రుఁడు, తన కెఱిఁగించుటయుఁ బ్రముది - తాత్ముండై య
ద్దనుజాధిపుండు లంకకుఁ, జనిపాలన సేయుచుండె - సద్ధర్మమునన్. 212
చ. అదిమొదలుంగవేరజ సు - రాపగసన్నిభ యయ్యె క్షేత్రమ
య్యాదియును గాసికాసమము - నయ్యెను సంయములార మీరు స
మ్మదమున నెందునేని యుని - మజ్జన మానదిఁగాఁ దలంచి యే
యుదకమునందు నైననను - నొందఁగఁ జేయుఁడు మాఘవేళలన్. 214
వ. సర్వశ్రేయంబు లొదవునని కావేరీ మాహాత్మ్యంబును శ్రీరంగక్షేత్ర ప్రకారం
బును దెలిపి సూతుండు శౌనకాదుల కనువేనియందు మునింగిన నుత్తమగతి లభిం
చునట్టి మానసతీర్థంబుల వశిష్ఠుండు దిలీపునకుం జెప్పె నట్లు మీకెఱిఁగింతు వినుం
డని పలికె నట్లు వశిష్ఠుండు రాజు నవలోకించి. 215

—(*) వశిష్ఠుండు దిలీపునకు మానసతీర్థంబు లెఱింగించుట. (*)—

తే. నృపతి! సత్యము నింద్రియ - నిగ్రహంబు, సర్వభూతదయార్జవ - క్షాంతిశౌచ
దాంతిమోదతపస్తృప్తి - దానహ్రూచ్ఛ్వ, చిత్వములు నిజాచార్య - సేవనములు.
తే. బ్రహ్మచర్యము వైరాగ్య - పథము సమత, తనరనక్రోధ మాత్మని - దర్శనంబు
సుజనసాంగత్యమును నివి - సూవెయుత్త, మోత్తమంబులు తీర్థము - లుర్వియందు.
వ. వీనిలక్షణంబుల వేర్వేర విశదంబుఁగా నెఱింగింతు వినుము. 218
చ. సరసము సన్ముదంకరము - సజ్జనవర్ణ్యము విన్నవారికిన్
గరముఁ బ్రియంబుఁ దానయి మ - నంబున కెయ్యది సమ్మతంబొ యి
ద్ధరనది సత్యమంచువసు - ధావర పల్కెద రార్యులద్దియుం
తరసివినంగ నేగలుగు - నంచితతీర్థ ఫలంబు వారికిన్. 219
ఉ. కావున సత్యమే నుడువఁ - గాఁదగు నయ్యదియుం బ్రియంబునై
భూవరయుండఁగా నగును - మున్ బ్రియమంచు నసత్యమాడఁగా
బోవనఘంబు వచ్చుకర - మున్ వివిధంబులఁ దానసత్యమెం
దేవిధినైన మానియెన - యింపఁగఁ జెల్లును సత్యమిద్ధరన్. 220
ఉ. చందన శైత్య మయ్యనలు - చండిమమున్ సమభంగిఁ జూడనో
నెందును క్షాంతి యీసుగుణ - మేనికిఁగల్గు నతండు పూజ్యుఁడ
ట్లుందను నొక్కఁడుర్మతిక - డుంగడుఁ దిట్టినకట్టి కొట్టినన్
డెందమునంగ నందుక్రుధ - డిందొనరించుటఁ జేసి భూవరా. 221
వ. మఱియు నట్టి క్షాంతి సత్యవ్రతుండును సంపన్నుఁడు మహామహుండై జగద్గురుం
డగు వెండియు. 222
క. విషయప్రవృత్తి బలములు, విషయంబులు వానివైన - వృత్తుల వెంటన్
ధిషణంబోనీకే పూ, రుషవర్యుఁడుఁ గట్టుఁదాని - రూఢి చెలంగన్. 223
తే. [illegible] నిగహ - మనిబుధాలి

యనెడు నాకాశముం బొందు నాత్మ యదియ
యచల మండ్రాత్మ విదులు ప్రి యంబుతోడ. 224

వ. అవ్విధి నెంతవరకు విషయంబులం జొరనీకుండు నంతకదియ యఖండ సుఖంబు దాన నఖిల తీర్థాచరణ ఫలంబులభించు. 225

తే. అనఘ భూమిస్థలింగల్గు నఖిలజంతు
సంతతులయందు సమత వా త్సల్యమునిచి
వెలయునాతఁడు పుణ్యుఁడై యిలఁదనర్చు
నదియదయ యండ్రు నీతికో విదులుభువిని. 226

వ. అట్టి దయామయుండు. 227

సీ. దుఃఖార్తుఁగనుఁగొన్న దుఃఖాత్మకుండగు, సంతోషిఁగాంచిన సంతసించు
క్షుధితునవలోకింప క్షుధితుచొప్పవహించు, సంపూర్ణుఁగాంచిన జరగునట్లు
తాడితులోకింపఁ దాడితుభంగినొ, నిశ్చలుఁగనినత న్నియతినుండు
దీనునిఁదిలకింప దీనతవాటించు, సౌభాగ్యుఁగనమాన సమునఁజెలఁగు
మఱియుఁదనచూడ్కివడినస మస్తజంతు, మండలికినైన స్వప్రాప్త కార్తానుభవము
తనకుఁగలిగినయట్లుఁజి త్తమునవగచు, కారణంబునఁజేసియో ధారిణీశ. 228

క. అతనికిఁ జేకుఱునంచిత, గతిసర్వనదీజలావ గాహనఫలమీ
క్షితిలోపల ననుకంపా, మతిగాకుం డినఁగలదె మఱియు ఫలంబుల్. 229

తే. కడఁగిగంగాది నదులకు వెడలికోటి, వత్సరంబులు మునిఁగిన వాఁడెయైన
లేదుదయలేమి పుణ్యము లేశమేని, యతిదయా మతితత్ఫల మనుభవించు.

చ. మనమున నెంచి నల్లెమర మాటవచించుట పల్కినట్టులన్
బనిఁగొనుటార్జవంబనుచుఁ బల్కుదు రార్యులు దానిపూన్కిచే
నెనయున నేక తీర్థముల నెంతయుఁగ్రుంకిన సత్ఫలంబు వి
న్ననువలరార నోమనుజ నాథనిజంబగు నింత భూస్థలిన్. 231

తే. తన్నుఁ దాయోగ్యుఁ డనుకొని తనరసభల
యోగ్యులగు వారితోడ ము న్నుత్కటముగఁ
జెప్పుకొనుటాత్మచోరత యప్పలువయు
నెట్టిపాపమునకునైనఁ బట్టువడును. 232

వ. వెండియు మిత్రద్రోహి స్త్రీతాననంబు నందిన్నని పలుకులు వలుకుచు నత్యధిక స్నేహంబు నెరపుచుండి వంచనామతి ద్రోహం బొనరించి పుత్రపౌత్ర గృహక్షేత్ర ధనధాన్యాది సమృద్ధిఁ దనరియున చిరకాలంబున సర్వశూన్యుండై పదంపడి వంశక్షయంబుఁగా నరకంబునం గూలుని త్రైజంగులకు దూరగులై యుండ నగుమఱియు. 233

క. భిక్షుకులకు భిక్షంబును, భక్షింపఁ గనతిథులకును భక్తముప్రియుఁడై
యిక్షితినెవడిడు నతఁడున, హాక్షేమమునందుతీర్థ యాత్రాఫలియై. 234

మ. తిలధేన్వోదనహేమ భూవృషహయాదిశ్రీ మహాదానముల్
వలనొప్పందనకున్న యంతనిడివి ప్రవ్రాతముం బ్రీతిని
మ్ములనందించు నతండహింసకుఁడు సమ్మోదంబునుం బ్రాణులం
దలఘుప్రీతిఁ గలాఁడు వీరలురు పుణ్యాత్ముల్ మహీవల్లభా. 235

ఆ. సర్వజనులకవని సంహారకారణ, దైవతముల విరోధి తలఁపనఖిల
పిధులభీతిదంబు పృథివీశ మానస, మదివశంబుసేయ నగును దాంతి. 236

క. మనమున్ విషయాదికములఁ, బనిఁగొనితిరుగంగనీక, వైరాగ్యమునన్
బెనుపొందించిన నదియే, జనవర కారణము మోక్ష సత్పద్ధతికిన్. 237

క. అటుఁగాక విషయసంహతి, నటియించెడు నేనినదియ నారతమత్యు
త్కటబంధకారణంబై, యటువంతలఁ బెట్టునిచ్చు నధికభవంబుల్. 238

వ. ఇంతయు నెఱింగి శిష్యుండు విజనప్రదేశంబగు నరణ్యంబున మోక్షకారణ విధంబు మనంబుఁ గావించి తపంబుసేయుచు యోగీశ్వరుండగు నట్టి సత్పురుషుండు దర్శన స్పర్శనాదుల నితరులకుఁ దీర్ఘఫలంబు నిచ్చు నతండు సంతుష్టుండు సమదర్శనుండగుట జగంబు తదధీనంబై యుండు మఱియు నట్టి మహాత్ముండు.

ఆ. ఒనర నొకటఁ జూచు నొగిరుచ్యమరుచియు, నేలఁ దల్పముండు కూలముంది
గంబరంబు గౌరవంబ గౌరవమభీ, ష్టార్థసిద్ధిదాని కైనచెడుపు. 240

వ. మరణంబుఁ బుత్రాదులకైన దుఃఖాదులు మున్నగువాని నతం డిట్టివాఁడై నిరంతర సంతోషియై యుండు నతని కఖిలఫలంబులుఁ దనంతన పొందు నింకఁ దృప్తియను తీర్థంబు నెఱింగింతు వినుము. 241

ఆ. అరయ సర్వజనుల కగు ధాన్యపశువసు, క్షేత్రగృహసుపుత్ర పౌత్రబంధు
వితతిఁ గలిగియుంట వినుమ శాశ్వతమిది, శాశ్వతంపుఁదృప్తిఁ జనుగొనంగ. 242

క. కలదన సర్వముఁ గలిగియు, కలలోధన మట్లు లేమిఁ గాంచెదునని యి
మ్ములఁ దెలియుఁ జ్ఞానమదిని, శ్చలతం గావించియుంట శాశ్వతమిదియున్. 243

క. ఈతృప్తి నందినాతని, చేతంబునఁ దోచునజశచీధవవిభవ
ఖ్యాత సుఖంబులు కొంచము, లైతనరని యటువిరాగియై మొదలుంటన్. 244

వ. అని యెఱింగించి మఱియు పావనంబగు బ్రహ్మచర్యంబను తీర్థంబు నెఱింగింతు వినుమని యిట్లనియె. 245

తే. శ్రవణకీర్తనకేళి వీక్షణరహస్య, భాషణంబులు మఱియును బార్థివేంద్ర
సరవి సంకల్ప మధ్యవసాయముం గ్రి, యావినిర్వృతి మైథునాష్టాంగములగు.

వ. వీని విశదీకరింతు వినుము. 247

—(*) మిథున క్రియాష్టాంగ వివరణము. (*)—

చ. సురుచిర భూషణాంబర ప్రసూనవితానము లొప్పఁ దాల్చుటం
బురుహ దళాయతాక్షులను పూరుషలొక్కెడఁ గూడియుంట శం

బరపరి పంధి కేళికి ధ్రు । వంబుఁగనా నొక యంగమంగనల్
పురుషులు చేవ రాటికలఁ । బూనిముదంబులు మీఱుచుండఁగన్. 248

క. పందెములు వైచి జూదము, లందముఁగా నాఁడుటదియు । నొకేళియగున్
గంధర్వా యోధనమున, కుందగనొక యంగమరయఁ । గువలయనాథా. 249

తే. తల్లిఁదోఁబుట్టుఁ దనకూర్మి । తనయుమైన,
నొక్క సెజ్జను వసియించు । టొప్పదెందు
నదియునొక యంగమై ప్రసూ । నాస్త్రసంగ,
రమునకుం బొల్పుటయుఁ జేసి । రవికులేశా. 250

క. కరనయన సంజ్ఞలోలిం, బరిహాస స్మితవిలోక । నంబులునొని
ద్ధరఁ బ్రేక్షణాఖ్యమంగం, బరవిందాశుగుని కేళి । కారయనాత్మన్. 251

ఆ. పదుగురున్న చోటఁ । బదఁపడితమయభి, ప్రాయములకుసన్న । మైమెలర్చు
నర్థమొసఁగుమాట । లాడుట లేకాంత, మాడుటిరువురైక్య । మాడుటయును. 252

క. అంగంబగు సూనాశుగ, సంగరమునకున్ రహస్య । సంభాషణసం
జ్ఞంగలుగు నదియునుర్విఁ బ, తంగాన్వయ వార్ధిసోమ । తతగుణధామా. 253

క. తనయిష్టం బున కెంతయు, ననుకూలం బైనవార్త । నందినశోకన్
వినునిద్ర లేకయాలో, చనమొనరుచు టంగమదియు । సంకల్పమునాన్. 254

తే. హానిమృత్యుక్షయాదుల । నాత్మనింతఁ, జింతసేయక తత్కార్య । సిద్ధిమున్న
సేయయత్నించుట దివ్యవ । సాయనామ, కాంగమైపొల్చు మిధునక్రియకునిలేశా.

ఉ. పీనప యోధరంబులేదఁ । బేరిమిఱా పిలునట్లుఁ గౌగిటన్
మానుఁగఁ జేర్చిమోవిరద । నక్షతముంచి కపోలయుగ్మమున్
బూనిక చుంబనంబులిడి । మున్నొకనిదంత నిఘర్షణంబులన్
మానినిఁ గూడినట్లుఁదన । మానసవీధిఁ దలంచుచుండియున్. 256

ఆ. అన్య మెఱుఁగకుంట । యదిక్రియా నిర్వృతి, యనెడియంగముంగ । జాహావమున
కిన్నిటికినిఁ బాయు । కేయదిచిత్తము, బ్రహ్మచర్యనామ । వరవ్రతంబు. 257

వ. ఈ బ్రహ్మచర్యంబునకు నియమంబులు వినుము. 158

తే. ఏకభుక్తమహింసయు । నిలఁబరుండు, టయు జపవ్రత తపములు । ప్రియముదేవ
తార్చనాధ్యయనమ్ములై । తనరుమనుకు, లావతంసమ వినుమహిం । సావిధమిఁక.

క. తనర మనోవాక్కాయము, లనుసర్వప్రాణివితతు । లకుఁ దాహితమి
మ్మునఁ బూని యహితమదియుం, జనఁ జేయుట వధకునొండు । జంకిననగునే. 260

క. వినుమ క్రోధనమనతన, జననీజనకులనుబంధు । జనములుశ్వశురుల్
ఘనులాచార్యులు స్నేహితుఁ, లునుఁదనమది కక్రమంబు । లుఁగవర్తింపన్.

వ. కోపంబుఁబూన కుండునదియుంకన నృశంసత నెఱింగింతు వినుము. 262

ఆ. మొనసిపుణ్యపాప । ములవిచారింపక
యుందలంచుటయుమ । హోగ్రకలుష

కార్యముల్ మనంబు కఠినంబు సేయుట
పరులఁ జెఱుచుపనుల నరయుటయును. 263

వ. పరుషంబు లాడుటయుం బరులయెడ వట్టినేరంబులును చుంటయుఁ గొండెంబులు సెప్పుటయుని న్నిన్నశంసగుణంబు లనంజరగువీనిఁ దొలంగి యుండుటయ యన్న శంసతనా నొప్పునట్లుండి యిహపరలోక విషయంబులన సపేక్షుండై వేదాంత విచారంబుఁ గలిగినిత్యా నిత్యజ్ఞుండై పరిశుద్ధ మానసుండుఁ గానదియ యఖండ సుఖం బట్టిసుఖ బ్రహ్మాదుల సుఖంబత్య ల్పంబుఁగాఁ జూచునతని కెల్ల తీర్థంబుల మునింగినఫలంబు లభించునిం కతపంబన మనంబును నింద్రియాదుల జయించిస్వ ర్గాది భోగంబుల నిచ్ఛగింపక నిజానుభవంబులగు సుఖంబుల స్వప్నతుల్యంబులుఁ గా నెంచిమితయుక్తాహారుండై వ్రతంబు నడుపునది యగునిదియ ముఖ్యంబగుతీ ర్థంబునుం దీర్ఘఫలంబు మఱియు. 264

తే. విద్యచేభూషితంబయి వెలయుచున్న, విద్య లేకున్న నదిసుధీ విసరభినుత మైనజ్ఞానముఁ గలిగిన నఖిలతీర్థ, ములనిమజ్జన మాడిన ఫలముఁగలుగు. 265

తే. హరిహరాది త్యశక్త్యాద్యు లైనదైవ, తములఁ బ్రత్యక్షమునఁగాని తనరవాని విగ్రహమ్ముల యెడఁగానిరవిమలచిత్త, మునను ధ్యానింప నగు వెండియును నరుండు.

వ. అంగన్యాసకర న్యాసంబుల తోడను ఋషిచ్ఛందాధి దైవతంబుల తోడమంత్ర జపంబులతోడను సేవించిన సర్వతీర్థ ఫలంబుచే కూరుమఱియు నవివేకులు విచా రంబు లేమిరూప సమన్వితలగు యోషాజనంబులం జూచిమాయాజనిత ప్రీతిం జేసి యుదినన్న వలోకించె మత్పరిరంభణంబుఁ గోరెనని యూరకతలంతురట్టి శరీరంబు లందును సర్వప్రాణులందు బహిరంతరంబుల వెలుంగువాఁడు పరమాత్ముండని స్త్రీపురుష భేదంబులునుపక వివేకులుఁ దిలకింతురిది ముఖ్యంబగు తీర్థంబునుం దీర్ఘఫలంబునగు నింక మోక్ష సాధకంబగు గురుసేవనంబను తీర్థంబు నెఱింగింతు వినుము. 167

తే. అధిపయాచార్యుఁ డనగమ డంగయుక్తి, నమరి పదపద్ధతులనొప్పు నట్టివేద ములఁబఠింపించి తత్క్రియం బుననటింప, నేర్పునెవ్వఁ డతండు గణింపనగును.

వ. అట్టివాని కతండు చెప్పకయె తదభిప్రాయం బెఱింగి నిరంతరంబుం బరిశుద్ధ మన స్కుండై భక్తిఁ బూజింపనగు నట్టి శుశ్రూషం జేసి పునరావృత్తి రహితంబైన బ్రహ్మలోకంబుఁ గలుగు నిట్టి గురుండు మొదలనై యుండుటకు. 269

ఆ. వటువువేదశాస్త్ర వర్గంబుగాయత్రి, నధిగమింపవలయు ననినదండ్రి యైననొప్పభ్రాత యైనంబొసంగుత, దన్యుఁడితరవర్ణుఁ డైనతగదు. 170

వ. మఱియు విప్రుండు చతుర్వేదంబులఁ గ్రమంబుగా నభ్యసింపఁగోరెనేని మున్ను స్వశాఖం బదక్రమంబునఁ జదువనేర్చి యవల నన్నియుం బఠింపనగునట్లుఁ గాక స్వశాఖామ్నాయంబువీడి యన్యంబుల నభ్యసించెనేని యతండు శాఖాఖండుఁ డనంబడి శూద్రుఁచందంబున సర్వకర్మంబులఁ బరివర్జితుండగు వెండి ద్విజులకు

మంత్ర పిండసంబంధంబులు స్వజాతిం గలుగవలసి కన్యాదానంబునకుం బైతృకా
దులకు స్వజాతీయు లేర్పడవలయు నట్లగుటం జేసి స్వశాఖావేదంబు మున్నుఁ
బఠింపం జను నింక యోషాజనంబులకు వినుము. 271

క. పతియొండె శ్వశురుఁడొండెన్, సతులకు నాచార్యుఁడౌ ధరాధిప స్వాయ
త్తత లేదెన్నఁడు వారికి, సతతముఁ దమ్మొకరు మనుపఁ జనువర్తింపన్. 272

తే. తండ్రి కన్యాత్వమున నుండుఁ దరుణి యౌవ
నమునఁ బ్రాణేశ్వరుండు ముదిమిని సుతుఁడు
పోషకులు నా దురిందులఁ బొలతి కెవఁరు,
లేకయుండిన యన్నాతి లోకమెఱుఁగ. 273

క. పెనిమిటి తోఁబుట్టుల చెం, తనఁ దగు వసియింప వారు తద్వంశస్థుల్
మును లేకయుండఁ బ్రాణే, శుని జ్ఞాతుల చెంత నొప్పు సూవె వసింపన్. 274

వ. ఇతరస్థలంబులఁ దగదింకఁ బరిశుద్ధతయును వినుము. 275

క. పరిశుద్ధత బాహ్యాంబాం, తరమును నా ధరణినాథ తనరారు భువిన్
వరుసం ద్వివిధంబై యుం, దరయఁగ బాహ్యంబు మృత్తికాంబువుల నగున్. 276

ఉ. సంతత మాత్మచింతన మొసంగఁగ సేయుచు మానసమ్మున
త్యంతము నింద్రియోత్కరము నంటకయుండ నిబంధితంబు భూ
కాంత యొనర్చునేని యది జగంబునఁ బల్కెదరార్యులెల్ల న
భ్యంతర శుద్ధి నాగ నదియా నఖిలైక సుతీర్థజాతమున్. 277

క. అంతశ్శుద్ధివిహీనత, నెంతయుఁ దీర్థములఁ గ్రుంకు దేర్పను నైల్యం
బంతయుఁ బోనని పాలన్, వంతులుఁ గొని బొగ్గు ముంపఁ బసునట్లు నృపా. 278

వ. అని యెఱింగించి మఱియు వినుమని యిట్లనియె. 279

క. దేహాత్మజాంగనాదుల, మోహమ్మున శక్యకార్యములపూన్కియు నో
హో హరిదశ్వాన్వయమది, నూహింప నహంకృతియును నొగివీడ్వఁడిన్. 280

వ. సూర్యచంద్రలోకంబులు నిజనివాసంబులగు నిది ముఖ్యతీర్థావగాహనఫలం బిట్టి
వైరాగ్యంబంతయు నీకెఱింగించితినని వెండియు వశిష్ఠుండు రాజున కిట్లనియె.

తే. అధిప యమనియమాది యోగానుభవము,
సాంఖ్యవిజ్ఞాన వైరాగ్య సమధిగమము
రహిత విషయాప్తియై సంసరణ నికృతినిఁ
గాంచఁ జిత్తము సుజనసాంగత్యమవని. 282

వ. మఱియు వినుము. 283

తే. సదమలాచారమున లక్ష్మి సంఘటించు, రూపమునుఁ దేజ మలవడు రూపడంగు
నధిప యవలక్షణమ్ములయ్యది యెమోఘ, దాయకంబగుఁ జువ్వె తథ్యము ధరిత్రి.

ఆ. దానవృద్ధిఁ బొందుఁ దన్నాశమునఁ జెడు, తద్విహీను వేద తతి విశుద్ధుఁ
జేయఁజాలదున్నఁ జెచ్చెర బాయు సు, వృత్తయుక్తమార్య వృత్తి మొదల. 285

వ. వెండియు నాచారహీనునియందుఁ గల వేదంబు మదిరాభాండస్థితోదకంబు మాడ్కి శ్వానస్పృష్టక్షీరంబు చందంబున నపవిత్రంబై యుండునట్లగుటవలన బ్రాహ్మణుండు నిరస్తద్రోహచింతనుండు సదాచారవంతుండునునై యుండ నొప్పునట్టివాఁడు బ్రహ్మాదులకైన నతిథింబోలి పూజార్హుండగు నింతవట్టు మానస తీర్థంబులగు వీని నెఱింగించితినని మగుడ మునీంద్రుండవనీంద్రునింజూచి. 286

చ. వసుమతిఁ దీర్థజాతములఁ వారకమున్గిన తత్ఫలంబు మా
నసపరిశుద్ధిలేక దిననాథకులాంబుధిచంద్ర పొందద
మ్మొసళులు భేకముల్ కమఠముల్ నిరతంబు జలంబులందు నిం
పెసఁగవసించి పూతత వహింపనియట్లగు సత్యమింతయున్. 287

క. తనుకల్మషంబు నీరము, లనుఁబోయిన యప్పుడే తలంపవిశుద్ధిన్
గనినట్లుఁగాదు మానస, మును విషయాదులకుఁదలఁగమును సేయకయున్.

క. జ్ఞానోదకములశస్త్రం, బైనచిదానందవార్థి నవగాహితుఁడౌ
నా నరుఁడు ముక్తినందెడు, మానసతీర్థంబులివి సమంచితబుద్ధిన్. 289

వ. ఎఱుంగుమనిన దిలీపుండు మునీంద్రా తీర్థంబులనునవన్నియు జలమయంబులై యుండఁ గొన్ని శ్రేష్ఠంబులనియుఁ గొన్ని యశ్రేష్ఠంబులనియు నెన్నికఁగనఁ గారణంబేమిది వినవలతుననుడు వశిష్ఠుం డిట్లనియె. 290

చ. వసుధ శరీరధారణముఁబట్టి మనుష్యుల తారతమ్యముల్
పొసఁగ వచింపసొనె మహిమోన్నతిఁగాక ధరాతలేంద్ర య
ట్లెసఁగి మహాప్రభావము మునీంద్ర పరిగ్రహణంబుచేతఁ దీ
ర్థసమితిఁగొన్ని శ్రేష్ఠతయుఁదాలిచె నట్లునుఁ గామిఁ గొన్నియున్. 291

వ. అశ్రేష్ఠంబులయ్యెనని యెఱింగించి వెండియు నరుండు భూతీర్థంబులందును మనస్తీర్థంబులందును నిరంతరావగాహనుండై సర్వోత్తమంబైన గతిం బొందుననిన మగుడ దిలీపుండు గురునవలోకించి యిట్లనియె. 292

సీ. సంయమీశ్వర తీర్థసంహతి సేవింప, నిచ్ఛగించినవానికేది నియమ
మేమి సేయంజను నే తీర్థములుముఖ్య, ములు వీడనగునవి తెలియ నెవ్వి
జాయాయుతుండగు జనునకే నియమంబు, వాఁడు పూనికసేయ వలయునట్టి
క్రమమెత్తెఱంగు మోదమున నాకింతయు, నెఱిఁగింపునాగ మునీంద్రుఁడధిపుఁ
జూచి నా యెఱిఁగియున్నంత సొరిదిఁ బుణ్య, తీర్థయాత్రాపరుల్ సమ్మతింగొనంగ
నౌ సముచితనియమంబు లన్నిఁ దెలియఁ, బలుకువాఁడను వినుమని పలికె నిట్లు.

క. పోలను తైలాభ్యంజన, మాలాగుం జనదు పరకృతాన్యాన్నము లా
లీలని షిద్ధాన్నము భూ, పాల స్వయంపాకమొక్క పరిఁగుడువనగున్. 294

—(*) వసిష్ఠుండు దిలీపునకుఁ దైర్థికనియమంబు లెఱిఁగించుట. (*)—

తే. ఎద్దు నేనుఁగు గుఱ్ఱంబు నెక్కియేగఁ, జనదు వేల్పులసేవింపఁ దనువు బడలు
నట్లు దూరాధ్వగమన మయ్యదియు సేయుఁ, నొప్ప దిమ్ములనిద్రింప నుర్వీతగును.

వ. మఱియు నాయాత్రికుండు యావన పుళింద ఖర్వటాదులగు నిషిద్ధదేశగ్రామంబుల
నిలువకచననగు నట్టిపట్టుల నివసింపవలసేనేని చక్రదండ పరిష్కృతంబైన కులా
ల నిలయంబున నుండం జను నట్లుంబోయి. 296

ఆ. పుణ్యతీర్థవితతిఁ బొలుపారస్నానము, సలుపువాఁడు నాఁటిరేతొలిదినమున
శాస్త్రయుక్తిచున్న సంకల్పముంజెప్పి, స్నానమాడి యవలసరవితోడ.

క. కృతిసత్య కృత్యుఁడై సం, స్మృతమున నుపవాసముండి మఱియన్నిశ నం
చితలీల జాగరము పు, ణ్యతమంబులునైనకథల నగు సేయంగన్. 298

వ. మరునాఁ డరుణోదయంబున సంకల్ప ప్రకారంబుగాఁ దీర్థశ్రాద్ధంబులం బితృదేవ
తలఁ దనియించి విప్రజనంబులచే వేదమంత్రంబులఁ జదివించి భోజన తాంబూల
దక్షిణాదులఁ దృప్తులంజేసి తత్పుణ్యక్షేత్రంబున దినత్రయంబుండి యవలంజన
వలయు నిత్తెఱంగున నెవ్వఁ డంగనాయుక్తుఁడై యొనరించు నతండు చిరకాలంబు
న సర్వపాపవిముక్తుండై మోక్షపదంబునందు మఱియు వినుము. 299

క. ఋతుసంవేశనమున నో, క్షితివర స్నానంబుసేయఁజెల్లదు తీర్థ
ప్రతతిఁ దదీయ విముక్తిన్, హితమతిఁ గావింపనగు మహీవిబుధునకున్. 300

తే. అట్లుఁగావించెనేని చాం ద్రాయణోప, వాసమాసోప వాస సు వ్రతవితాన
మంతయుం జేయనైనఁ బుణ్యంబులేదు, గాన నవ్వేళస్నానంబు మానవలయు.

వ. అనిచెప్పి మఱియు నిట్లనియె. 302

చ. నరవర తీర్థజాతముల స్నానమొనర్చిన మానవుండు స
త్వరమఖిలాఘముల్ దొలఁగి తాఁబరిశుద్ధతఁగాంచు హామమి
ద్ధర ననలప్రయోగముఁనఁ దాల్చినరీతి విశుద్ధినింత నీ
వరయుము బుద్ధిఁదీర్థనిచ యంబె కృతార్థద ముఖ్యమంచొగిన్. 303

వ అనిపలికి మఱియు నొకనికై యొకండు తీర్థయాత్ర సేయుటఁగల దట్లుసేయువానికి
షడంశంబు పుణ్యంబు లభించు నట్లుఁగావించువిధి వేదప్రణీతంబైయున్న దదియు
నెఱింగింతు వినుము. 304

ఆ. తీర్థయాత్రసేయు ధీశాలితా నెవ, నికిఁ సేయు నాతనిందలంచి
దర్భసమితితోడఁ దద్రూపమొనరించి, దానికొనరు విధినిఁ బ్రాణమిచ్చి. 305

క. పేరునుఁ బేరిటఁ బరగెడు, తారయుఁ దజ్జన్మతారఁ దగనాడివి ముదం
బారఁగ సంకల్పంబును, వారకఁగావించి యంతఁ బ్రతిరూపంబున్. 306

వ. ఆలింగనం బొనరించుకొని యట నీటమునింగి మంత్రస్నాన విధంబుల నెఱిఁగి
క్రమంబుఁగా మున్ను మంత్రస్నానంబును మృత్తికాస్నానంబుసలిపి యవల నఘ
మర్షణ స్నానంబు సలుపనొప్పు మఱియు వినుము. 307

క. నరవర శిరముంజెందిన, గురుపాపము పోవు తీర్థకూలమునందున్
వరమతి నుపవాసంపు వా, సరమున క్షౌరితుఁడునయ్యు స్నానమొనర్పన్. 308

వ. అని వశిష్ఠుండను నరేంద్రా యే నీతీర్థయాత్రా నియమంబు మాఘస్నాన ప్రస్తా
వనం బట్టి వాక్రుచ్చితి నింక మాఘస్నాతకొనరు విధంబు నెఱింగింతు వినుమతండు.

క. తనకుఁగల కొలఁది దానము, లనుదినము న్సలుపనొప్పు నందుం గొన్నిం
టిని దెల్పువాఁడ ముఖ్యము, లని యెఱుఁగుము వానినెల్ల నవనీనాథా. 310

సీ. మాదీఫలంబులు బాదరామలక నా, రంగఫలంబులు రహిఁదనర్చు
కదళీఫలంబులుఁ గడఁకమైజంబీర, ఫలములుఁ దేనెయుఁ బాలు పెరుఁగు
జాతీఫలంబులు చక్కెర బెల్లంబు, నుప్పునుక్కోష్టంబుఁ బిప్పళులును
జీరకంబును శుంఠి చెలువారు వస్త్రంబు, ప్రత్తియుఁ గంబళి పానకంబు
జన్నిదంబు కమండలు శంఖముం గ, ణాధినాయక దుర్గాంబికాది విగ్ర
హంబులుం గోపిచందనమన్న పూరితంబునై యున్న కాంస్య పాత్రంబు మఱియు.

వ. శర్కరా గుడ సంయుతంబైన కాంశ్యపాత్రంబును సురభి కుసుమంబులుం దేవ
తార్చనోప కరణంబులు నీలవర్ణ సాలగ్రామంబు స్ఫటికలింగంబు దానంబు సేయ
వలయు నిందు. 312

క. దినమున్ వ్యర్థము సేయక, తనకలిగిన యదియొకండు దానము సేయం
గనె నేని యతఁడు వనజా, క్షుని మందిర మేగుఁ దన్ను సురలు నుతింపన్. 313

ఆ. అతఁడు మరల జన్మ మందిన భూమి స, త్కీర్తినందు చక్ర వర్తి యగును
గాన దివస మొక్కఁడైనను వ్యర్థముఁ, సేయకుండి దాన మీయవలయు. 314

వ. మఱియు మాఘమాసంబునందు సూర్యోదయ కాలంబున స్నానంబు నియమ
ప్రకారంబున సలిపి దైవతంబులకుఁ బుష్పాక్షతాది వస్తువితతిం దర్పణంబులిడి
నిత్యకృత్యంబులైన సంధ్యాక్రియల నిర్వర్తించి స్థండిల ప్రతిమలనొండె నావాహనా
సనార్ఘ్యపాద్యమధుపర్కస్నాన వస్త్రోపవీత గంధపుష్పాక్షతాధూప దీపనైవే
ద్య తాంబూల భూషా వాద్యగీత నృత్యపురాణ స్తోత్ర పఠనాదులగు నుపచారం
బుల విష్ణు నారాధించి యనంతరంబే నెఱింగించిన దానంబుల భక్తితో భూసురు
లఁ దృప్తినందించు నతండు పుణ్యలోకంబునం దతుల భోగంబులం బొంది పునర్భ
వంబున నధిక సామ్రాజ్య యుతుండు సమంచిత కీర్తియుతుండునై యుండు నీతీర్థ
యాత్రాఫల ప్రభావంబెఱింగించు రంగనారద సంవాదంబను నితిహాసంబుగల
దదినీకు వినుపించువాఁడ వినుమని వశిష్ఠుండు దిలీపావనీపతి కిట్లనియె. 315

—(*) రంగనారద సంవాదంబను నితిహాసము. (*)—

తే. కలఁడు పూర్వంబునందు రంగాభిధాన, ధారిణీసుఁడతం డొక్క తఱిని దేవ
మౌనియగు నారదునితోడఁ బూని వినెడి, వాంఛ నిట్లని పలికె సద్భక్తిమెఱసి.

చ. అనిమిషమౌని నా మనమునందొక సందియ ముద్భవిల్లె నె
ట్లన నమితార్థ వస్తునిచయాంచితుఁడున్ మఱియొండు లేక యి
మ్మున నిజధర్మ వృత్తిగని మున్పరిశుద్ధ మనస్కుఁడైన య
మ్మనుజుఁడు స్వర్గవాసులు క్రమంబున నంత్యము నందదెట్లకో. 317

క. వినవలతు విస్తరంబుగ, నను డాతనిఁ జూచిమౌని । హర్షంబెసఁగన్
వినుమని యవ్విధమంతయు, వినుపించె నతండు వినఁగ । విశదముఁగాఁగన్. 318

సీ. ధనవంతుఁడగువాఁడు । దానధర్మములనెం, తయు వేడ్కఁ జేసి కృ । తార్థుఁడగుచుఁ
బుణ్యలోకమున సం । పూజ్యుఁడౌనయంబుఁ, గ్రమమునఁ బాపపుం । జములవలన
విడువంగబడితాను । విబుధాంచితునిపురం, దరునిచెంగటనుండి । యురుతరైక
సౌఖ్యంబుతోమతి । జనవరధనహీనుఁ, డఖిలాగమార్థర । హస్యవిదుఁడు
నిర్జితామర్షవిషయుఁడు । స్మీలితాత్ముఁ, డంగనాయుక్తుఁడై యతఁ । డఖిలజపత
పోముఖవ్రతనియతి నిం । పుఁగనుధర్మ, బుద్ధిఁదనకున్నయది దాన । ముంబొనర్చి.

క. మనమునఁ బలుకులఁ జైవులఁ, దనరం బరహితము వెలయ । దాక్షిణ్యం బి
మ్మునఁగలిగి విముఖుఁడై చెడు, పనులను సత్కార్యపరత । భాసిలిమఱియున్.

వ. ధనార్జనంబుఁ గోరకసద్గుణంబులనొప్పి దరిద్రుం డయ్యును బ్రహ్మ సాయుజ్యంబు నందు నిందునకు నిదర్శనంబుఁగాఁ బూర్వమే నొక్కనాడు దేవేంద్రునాలోకింప ద్రిదివంబున కేగి తత్సభ నతనివలనఁ గృతసత్కారుండనై చూచిన తెఱంగెఱింగింతు వినుము. 321

తే. ఆసుధర్మ సభాంతర । మందునుండు, మణిమయోత్తమ పీఠయు । గ్మముననుండి
నాకనారీసమారబ్ధ । నాట్యగీత, ములుఁదనరతుల్య వైభవ । ములనెసంగు.

వ. ధర్మవాహనుండను రాజును శ్రుతిపాలుండను బ్రాహ్మణుంగంటి నందు శ్రుతిపాలుండు దిక్పాలురు ద్వాదశాదిత్యు లాశ్వినేయులు మున్నుఁగా దేవతలుఁ గొలువఁ దేజోబలోత్సాహ సంపద్విభవంబుల నాధర్మవాహనునకన్న మిన్నయై యుండె ననుడు నారదునకు రంగభూపాలుం డిట్లనియె. 323

క. వినవలతు దీనినాకును, వినుపింపుము నాగ రంగ । విభునకుఁ బూర్వం
బున బుషులుఁ జెప్ప నేబ్రియ, మునవినినటుఁ దెల్పువాఁడ । భూవరయనుచున్.

—(*) ధర్మవాహన శ్రుతిపాలుర వృత్తాంతము. (*)—

వ. నారదుం డిట్లనియెఁ దొల్లి సూర్యకులోద్భవుండగు యజ్ఞసేనుండను రాజు నిరంతరంబు యజ్ఞతత్పరుండై యుండ నారాయణుం డతనికి సహాయుండై యుండె నట్లధికయజ్ఞంబు లొనరింప నాయజ్ఞంబుల సూర్యుండును గృతసహాయుండై యెప్పెనందతనికి యజ్ఞసేనుండు నాజగద్వినుత నామంబు సుప్రసిద్ధంబయ్యె నారాజుఁ బరమపతివ్రతయు సుగుణోత్తమయునగు పృథుకీర్తి సుత సోమకళం బరిణయంబై యామెయందు ధర్మవాహనుండను కుమారుంబడసి యజ్ఞసోపానంబుల వియన్మార్గంబున ద్రిదివంబు సేరె నాసమయంబున గుమారుండును నవయౌవనుండై యుండి.

చ. అటువలెఁ దండ్రి దేవనిల । యంబును సేరిన ధర్మవాహుఁ డు
త్కటపరిపంథిసంచయవి । ఖండనదక్షుఁడు నైకకళానిధిన్
గుటిలశిరోజఁ బెండ్లియయి । క్షోణిపసర్వదిగంత భూపరి
స్ఫుటపరిపాలనస్థితికిఁ । జొచ్చె నుదంచిత ధర్మమూర్తియై. 326

ఉ. ఏమని చెప్ప నా నృపుఁడ హీనపరాక్రముఁడై మహోగ్ర సం
గ్రామమునందుఁ బోరఁగ ధరాపరులౌనన వాహమై సము
ద్దామత ధర్మదేవత ముదంబున మోయుచునుండుఁ దన్ను ని
ష్లేమనుజాధి నాయకున కేనిఁ గనంబడెనే సువృత్తముల్. 327
క. ఆరాజున కుదయించెఁ గు, మారుఁడు వృపసేనుఁడన సమంచిత గుణ వి
స్తారుఁడు సాహసమునను గు, మారుఁడు రూపంబునందు మారుఁడనంగన్.
వ. అంత. 329
ఉ. యుక్తవయస్కుఁడైన తనయున్ యువరాజు నొనర్చి యంగనా
యుక్తత నద్ధరారమణుఁ డుర్వినిఁ గల్గిన తీర్థసంహతిన్
భక్తిమెయిం భజించుటకుఁ బాలులతోఁ బయనంబుఁ జేసి శా
స్త్రోక్తి ననేకదాన జప హోమము లందొనరించె పెక్కులన్. 330
వ. అక్కాలంబున శ్రీవత్స గోత్రోద్భవుండైన శతధృతి కుమారుండు. 331
ఉ. ఆయతభక్తి నాత్మ దనుజాంతకుఁడైన రమేశునందు వా
లాయమునుంచి జాయ శ్రుతి లక్షణపుత్త్రుఁడు వేదకారియున్
బాయక శీలభూషణ శుభాంగి నిజస్నుషతోడ దా సరి
త్తోయములన్ మునుంగుమది తో శ్రుతిపాలుఁడు సప్రయాణుఁడై. 332
ఆ. పంటచేలలోని పరిగయుఁ గందమూ
లములు ఫలము లునుము దమునఁ దనకు
నుదరపోషణమున కొగి నెరఁగావించి
విమలభక్తి మూఁడు వేళలందు. 333
వ. అగ్నికార్యంబును విష్ణుపూజయుం గావింపుచు యాత్రాఫల సంసిద్ధిదంబులైన మంత్రంబుల ననుష్ఠింపుచుఁ ద్రిషవణ స్నాతయు ధ్యాన యోగపరాయణుండును నక్రోధనుండును శాంతచిత్తుండును సర్వభూత దయాపరుండునునై యనేకతీర్థంబు లసేవింపుచు నుండెనట్లు. 334
క. ఓరగ క్షితి నాయక, వారక బహుదాన జపతపస్స్నవ ముఖ్యో
దారనియమమున నబ్భా దారుఁడుఁ గావించితీర్థ తతులం భక్తిన్. 334
తే. కలయఁ దనకీర్తి మూడులోకముల వెలయఁ
జేసి త్రిదివంబుఁ జేరి సుస్థిరతరైక
భోగములఁ జొక్కుచుండఁ బ్రస్ఫుటగుణాఢ్యుఁ
డైన శ్రుతిపాలుఁ డత్యంతమైననియతి. 336
క. భూతలమునఁ గల తీర్థ, వ్రాతంబంతయు భజించి వనితయు సుతుఁడున్
బ్రీతిం గోడలుఁ గొలువ ధ, రాతలి వలఁ గొంచు సేరి బ్రహ్మపదంబున్. 337
తే. క్షేమమున నొక్క కల్పము సెల్లునంత, దాక నివసించి విధియాజ్ఞ దానవారి
కడకుఁ బనివిని యందొక్క కల్పముండి, కరుణనతఁ డంపఁ గైలాసమరిగియుండు.

మ. కరిచర్మాంబరధారిసత్కృపఁగనం ఽ గన్ గల్పమందుండి తా
నురుభోగంబులమీరి యాజ్ఞగొని పీఽయూషాశనాధ్యక్షుఁ డ
బ్బురమందన్ ద్రిదివంబుఁజేరి హరిస ఽ మ్మోదంబుతోనీయు వి
స్ఫురదత్యున్నత రత్నపీఠికముదం ఽ బున్నిల్పఁ గూర్చుండిరన్. 339

క. అమరాంగనా వితానం, బమరం దనువివిధగతుల నర్తించి ప్రమో
దమునను సురభిసముద్భూ, తములైన పదార్థతతులఁ ఽ దనియించిరొగిన్. 340

వ. అటులఁ ద్రిదివంబునందు ధర్మవాహానునితో సద్భుతాసనంబున నాసీనుండై యధికభోగంబు లనుభవించు శ్రుతిపాలుఁగంటి నతం డారాజునకన్న మిన్నయై యుండె నని చెప్పి నీవును మాఘమాసంబున సూర్యోదయకాలంబునం బుణ్య తీర్థస్నానం బొనరించి వివిధదానంబులిడి హరిహరులం బూజింపు మతుల వైభవ శ్రీకంబగు నాకంబు సంప్రాప్తంబగుననిన నారదునకు నమస్కరించి తద నుజ్ఞాతుండై రంగభూపాలుండు. 341

క. హితమతిఁ జాయాసుత సం, గతుడగుచుం దీర్థయాత్రఁ ఽ గావించుచు నం
చితమగు కేదారంబున, మృతుఁడై త్రిదివంబునందె ఽ మిహిరకులేశా. 342

వ. నీవును మాఘస్నానప్రభావం బెఱింగి నిరంతరంబు నిమజ్జనంబు గావించి కృతా ర్థుండవుఁగమ్మని దిలీపుం బలికి వెండియు వశిష్ఠుండు. 343

క. ఈ యితిహాసం బెవ్వరు, పాయక చదువుదురొ బాడ ఽ బావలికడ సు
శ్రేయము వారికిఁదీర్థని, కాయముఁగనకున్నఁ గలుగుఁ ఽ గద మాఘమునన్. 344

ఆ. వినినవారికొదవు ఽ జననుతంబగుపుణ్య,
మవనిధర్మసార ఽ మైనకతన
ననిమునీంద్రుఁ డధిపుఁ ఽ గని మాఘ మాహాత్మ్య,
మెలమి మఱియుఁజెప్ప ఽ దలఁచి యనియె. 345

సీ. అనఘాత్మమాఘ మఽ జ్జనఘనపుణ్య మి, మ్ములఁబాప వితతులఁ ఽ దలఁగఁజేసి
నాకలోకమున ను ఽ న్నతసౌఖ్యములనిచ్చి, మరుజన్మమున హితా ఽ మాత్యబంధు
తరుణీసుతార్థసం ఽ తతసమంచిత వైభ, వోపేతసామ్రాజ్య ఽ మొనరనిచ్చు
పృథివినియ్యది చతు ఽ ర్విధపూరుషార్థ సం, సిద్ధిదమైయుంటఁ ఽ జేసి దీని
భక్తి నొనరింపకుండినఁ ఽ బాపములకు, వచ్చునాపదలకు మనో ఽ వ్యథలకమితి,
కష్టములకేది యవధిచ ఽ క్కంబొనర్చి, జన్మమునకింతఁ గలిగింప ఽ సత్ఫలంబు. 347

వ. అని మఱియు.

క. నరులకు దీనిఁదొలంగిన, వరపుణ్యప్రదమొకండు ఽ వసుధంగలదే
ధరణీసురుండు సువ్రతుఁ, డరుదారఁగఁ జెందె నభవు ఽ నందైక్యంబున్. 348

తే. అనిన నిక్కథనాకు మఽహాత్మ సాద, రముగనెఱిఁగింపునావుఁడుఽరవికులేశుఁ
జూచి కలుషాపహారమతిఽచోద్యమిదియు, వినగవినుమని చెప్పెనఽమ్మునివరుండు.

—(*) సువ్రతుండను బ్రాహ్మణుని చరిత్రము. (*)—

చ. వివిధ ఫలప్రసూన వనవిశ్రుత మంచిత తోయపూర్ణకూ
ప వరతటాకవాపిసమవాయము ధాన్య ధనప్రపూరితం
బవిరత సస్యసంగత శుభావనిమెయ్యు రసాతలాధి పా
లవర చెలంగుచుండును తళంకము నర్మద కంతికంబునన్. 350

వ. అయ్యగ్రహారంబునందు. 351

తే. ఆహితాగ్నులు పంచయజ్ఞాంచితప్ర,
వర్తనులు ధర్మచిత్తులు వరలుచుండ్రు
బ్రాహ్మణులు వారలందు సువ్రతుఁడునా నొ,
కండుఁగలఁ డాతఁ డాగమాంగంబులైన. 352

వ. శిక్షా వ్యాకరణ చ్ఛందో నిరుక్త జ్యోతిష కల్పంబులును బూర్వోత్తర మీమాం
సలు శిల్పశాస్త్ర నీతిశాస్త్ర గీతశాస్త్ర నృత్తశాస్త్ర గజాశ్వశాస్త్రంబులును
మంత్రశాస్త్ర సాంఖ్యశాస్త్ర యోగశాస్త్రంబులు మున్నగువాని నెఱింగి యఱు
వదినాల్గుకళల నానాదేశభాషల నఖిలేతిహాస పురాణామ్నాయాదుల నుపన్యసిం
చుటయు నేర్చి యిట్లన్నిటం బ్రవీణుండై ధనలోభంబున నాచార్యునకైన నొక్క
కాసియక యుపాయాంతరంబుల నోడంబరచి వెండియు ధనార్జనాసక్తుండై
యన్యాయంబులకుఁ జొచ్చి మఱియు. 353

క. జనవర యేకోద్దిష్టం, బను శ్రాద్ధక్రియయు నగ్నమనియెడు శ్రాద్ధం
బునవ శ్రాద్ధముసేయుం, బనుజన దివియన్నియుం గ్రమంబునఁదానున్. 354

తే. ఆచరింపించి యార్ద్రకృష్ణాజినంబు,
నుభయ ముఖమైనమహిషినీ యుర్వినింక
నరవరోత్తమ యెన్నిదానమునఁగొనఁగ,
రాదో యన్నియుఁ గొనియు సువ్రతుఁడు మఱియు. 355

ఉ. అంగడి వెట్టియమ్మి విపినౌఘములన్ నఱకించి యమ్మి తా
లొంగక యంత్యజాతిమొదలుర్వరలో నెవరైన నెద్దియే
నింగని దానమియ్యఁగొని నేయినిఁదైలము నమ్మి వెండి స
త్సంగతిమాని దానములొసంగిన ధేనుగణంబు లమ్మియున్. 356

వ. దధిక్షీరోదక లవణోదనంబులనుఁ గన్యకల నమ్మియు నొకరికై తీర్థయాత్రలుం
దేవతాపూజనంబులు సలిపియు ధనముంగొని వటువుల కధ్యయనంబు సెప్పియు
బరాన్నంబుఁగుడిచి నిత్య నైమిత్తికంబులగు శ్రాద్ధక్రియలఁ దొఱంగి యాశా
లంపటుండై యొక్కవేళనైన విరామముంగనక తిరిగి సంపాదించి సంపాదితా
ర్థంబుఁగుడువ కొరులకియ్యకయుం గూర్పఁ గొంతకాలంబున కాధనంబు శత
సహస్ర నిష్కంబులయ్యె నంత నయ్యవనీసురునకుం గాలక్రమంబున. 357

ఆ. ఒడలుసడలువారె ఽ నొగినింద్రియంబుల, బలములణఁగెనెజ్జఁ ఽ దలగ శక్తి,
చాలదయ్యె నట్టి ఽ సమయంబునదుదురా, శకుని యౌవనంబు ఽ సంభవించె. 358

వ. అట్టి సమయంబునందు. 359

క. ఆపిసిని కొడుకు లాలును, పాపలు పరిచారకులును ఽ బంధువు లింటన్
రూపఱఁ దినఁగట్టంగని, కోపంబునఁ బల్కునిట్లు ఽ గోరముగాగన్. 360

చ. అలఁత మనంబునం దలఁప ఽ కాకలి దప్పుల కోర్చి పూట పూ
టల నుపవాస ముప్పుడు ల ఽ డంకువనుండి పరాన్నముం దినం
దలఁగక కాసువీసముల ఽ దవ్వులకైననుఁబోయి దానమి
ములఁగొని సర్వకార్యముల ఽ ముంబడికూర్చితి నింతద్రవ్యమున్. 361

క. ఇదినాయ దింతయును నా, సదనంబున నిల్పి మీకుఁ ఽ జావైనను రా
దుదరములఁ బగులఁ దినియెద, రిదియేమిర తలఁగియేగుఁ ఽ డెందులకైనన్. 362

క. మీకిటఁ గలుఁగక పోయెనె, యాకస్మికమైన మరణ ఽ మయయో యిక నే
నేకరణిఁ జూచెదం దిను, టో కట్టుటయో కొనుచును ఽ యోగ్యాంబరముల్. 363

క. అనియేడ్చి పొరలి సెజ్జం, బనివియు రదనములుగీటి ఽ బాపురె నాకి
ట్టునుఁగాక యున్నమఱి నే, ధనమధికముఁ గూర్తుపిరిఁ ఽ దలఁగనొనర్తున్. 364

క. అనుచు నతిమఱియుందా, ఘనముఁగఁబరుషంబులాడఁ ఽ గాఁ గసరుచుఁ ద
త్తనయులు కోడండ్రాలును, మనుమలు నఖిలంబుఁగొని న ఽ మయఁదినుచుఁ దనున్.

క. కడఁగంట నైనఁజూడక, యెడనెడఁబోఁగాంచి సెజ్జ ఽ నెలుఁగెత్తి యయో
కడకింత యయ్యెనేయని, యుడుఁగక దుఃఖింపుచుండి ఽ యుం దనమదిలోన్. 366

వ. ఆహా యే నింతకై యెంతఁ గావించితిని సీయని వివేకించి తా నొనర్చిన కృత్యం
బులునుం గొనిన దుర్దానంబులుం దలంచి నాయాశ యింతకుందెచ్చి యింకను
నన్నూరటం బొందనియ్యకున్నది మనంబెంతచెడుం గిద్దిగదా సమస్తక్లేశకారణం
బని మఱియు. 367

ఆ. కనుట వినుటయందు ఽ కన్నులువీనులు, మాంద్యమునువహించె ఽ మాటలుదుటు
వాయ దంతపంక్తి ఽ వదలె శిరోజము, లెల్లవెల్లనయ్యె ఽ నిమ్ముదిమిని. 368

తే. ఆశయనునది యౌవన ఽ మధిగమించి, యుంటఁ జిత్రము బంధువు ఽ లువిద తనయు
లెల్లరోయఁగ సర్వసౌ ఽ ఖ్యేతరమయి, యేహ్యమై చాలనొప్పసి ఽ యిట్టిదశను. 369

ఉ. శాంతు సుశీలుధీయుతు వి ఽ శారదు సద్గుణునాశయొక్కఁ డ
త్యంతము చెందియుండిన మ ఽ హాకుపితాత్ముఁగఁ గష్టశీలుఁగా
నెంతయు బుద్ధిహీనుఁగ మ ఽ హీస్థలిమూఢుఁగ దుర్గుణుంగ న 370
శ్రాంతముఁ బల్కఁజేయును ని ఽ జమ్ము జనావలిచేతఁ జూచితే.

క. ఘృతకాష్ఠంబుల ననలం, బతివృద్ధిం గాంచినట్లు ఽ లవనింగాంతు
స్థితినభిఁ వృద్ధింగైకొను, సతతం బాశాగుణంబు ఽ చనదీవిధమున్. 371

ఉ. అక్కట యాశ కీర్తిచెడు నంచుఁ దలంపదు హీనుఁడైనఁ దా
నక్కఱఁ జేర్చు నర్థమునకై వినయంబుల పాలొనర్చు నే
దిక్కున కైన నీడ్చు పలుకత్రిప్పులఁ బెట్టు తలంపనీదు ము
న్నిక్కము సౌఖ్యముల్ మదిగణింపని దేగద వైరిప్రాశికిన్. 372

క. చెడుఁబాటు లొసఁగ నాశం, గడువంగా నొండుఁగలదె గౌరవముఁగులం
బడఁచుం బున్నెముల నె, క్కడనో బోఁదరుము కోరి కల్ పచరించున్. 373

వ. ఇంతదనుక నే సద్గతిం దలంప కాశాపిశాచ గ్రస్తుండనై యుండితి నిమ్ముదిమి యందైన నుత్తమగతికిం బ్రయత్నింతునని తలంప నాదిననిశా సమయంబునందు.

— (*) సువ్రతుండు విరక్తుండై సద్గతికిం బ్రయత్నంబు సేయుట. (*) —

సీ. కాదంబరీసేవ నోదితోద్యన్మదో, త్కటభీషణాననో త్కరములమర
పరభయంకర పరస్పరసత్వరాహ్వాన, కృన్మహుర్మహురహుంకృతులు చెలఁగ
దోఃప్రయుక్తాశ్మసం దోహపాతితభిత్తి, కావళీజాతాగ్ని కణములడర
లగుడ ముద్గర ముసలాది సాధనపాద, ఘట్టనాధికశబ్ద గతులుపిగుడ
వచ్చి చోరౌఘ మలమి త ద్భవనమాత్త, హస్త కరదీపికాతతి కనలమిచ్చి
వెదకి తనవారిఁ దన్నుఁబట్టి వివిధవిధులఁ, బాధలం బెట్టికొనిరి సర్వంబునందు. 375

తే. అట్లుచేకొని పోయిన నవనిదివిజుఁ, డధికదుఃఖాబ్ధి నిర్మగ్నుఁడై ధరాత
లమున మూర్ఛిలిలేచి చి త్తమున నిట్లుఁ, బలువరింపఁగ సాగె నిక్కట్టలముఁగాఁగ.

చ. మొదల సహోదరాదులకు మోసమొనర్చి సతీసుతాప్తులం
గదలఁ దపింపఁగైకొన కొకప్పుడ యేని ధరాసురాలికిం
బొదవ క్షుధార్తులౌ నరుల కోదనమైన నొకింతయీక బె
ట్టిదము నొనర్చి చిత్తము గడించిన యీధనరాశి యియ్యెడన్. 377

ఆ. అనుభవింపకొరుల కైననొసంగక, యింటనుంపఁ జోరు లిటుహరించి
కొంచుఁబోయి రింత, కుంగాఁగ నేనెంతఁ, జేసితౌర పనులు వాసి చెడఁగ. 378

క. కొసరా దొకమారైనను, పనివడిగో దానమేను పదఁపడి యెన్నో
గొని విక్రయించి తెత్తెఁ, ధనకాంక్షం జేసి యఘముఁ దలఁపక మదిలోన్. 379

తే. ఈయకృత్యము కాల్చెడు నెసకమెసఁగ, నేఁడుతరములవారి ముక్కన్నెచి ఘోర
వృజినవహ్నిని దీనికి వెరవులేదు, చేసితింతయు ధనకాంక్షఁ జేసి మఱియు. 380

వ. దేశాటనంబునం జేసి సంధ్యాకృత్యంబులనైన సమ్యగ్విధి నొనర్పకయుఁ బ్రాణాయామంబుం గ్రమంబుగా నిర్వర్తింపకయు గాయత్రిం జపింపకయు విధిహితంబుగా నాచమింపకయు భగవన్నామ చింతనంబు సేయకయుఁ బవిత్రంబు ధరించి త్రిపాదియగు గాయత్రి ననుష్ఠింపకయు సమంత్రకంబుగా నొండె నమంత్రకంబుగా నొండెఁ బుష్పపత్త్రాదుల శంకరు నారాధించిన మూఢులైనను సంసారబంధ విముక్తులగుదు రట్టి కరుణామయుండగు నీశ్వరునిఁ బూజింపకయు సర్వపాప నిబర్హణుండగు నారాయణు నఖిలకామ్య ఫలప్రదుండగు గజాస్యు నమితా

మయ నివారకుండగు సూర్యు నభీష్టప్రదాయినిమైన పార్వతినిం బూజింపకయు దంచుట నూరుట తరుగుట వండుట నూడ్చుట యను నీ పంచసూనంబులం గలుగు పాతకంబుల వారించు సూర్యునంబిక నధోక్షజు నేకదంతు నీశ్వరు ముఖ్యంబుగా నభ్యర్చింపకయుఁ బంచయజ్ఞంబు లొనరింపకయుఁ బంచయజ్ఞ పరాయణులగు బ్రాహ్మణులం బూజింపకయు స్వర్గప్రదంబులగు నతిథిపూజనంబు లాచరింపకయు భిక్షుకులకు భిక్షంబిడకయుఁ గన్యాదానంబు సేయకయు నతిథి బ్రహ్మచారుల కన్నంబిడక భుజించియు విప్రుల కన్నవస్త్రాదిదానంబు లిడకయు మంత్రసహితంబుగా యవాజ్యయుక్త సమంచిత వస్తుసమితి నగ్ని వేల్చకయుఁ గ్రమంబుగా స్త్రీపురుష పవమాన బ్రహ్మ నారాయణంబులను పంచ సూక్తంబులం జపింపకయు శనిత్రయోదశీ శుక్రవారవ్రతంబు లాచరింపకయు సద్యః పాపహరంబులగు నశ్వత్థ ప్రదక్షిణంబు లొనర్పకయు మార్గంబుల శీతలచ్ఛాయాంచితంబులగు వృక్షంబులఁ బాదకయు స్వర్గంబునందు సర్వభోగ సమృద్ధిఁ గలిగించు మృదులంబగు తల్పంబు దానంబు సేయకయు గజాశ్వ మహిష మేషంబులను దాసీజనంబులఁ గృష్ణాజినంబు తిల దధి మథితంబైన లాజాపిష్టంబుతోడ నిర్మల జలపూరిత కలశంబు నాసనంబు నుపానహంబులుం బాదుకలు నిన్నియుఁ బాత్రులగువారికి దానంబు సేయకయు దూరప్రయాణంబునం బడలి చనుదెంచు నతిథిజనంబుల పాదంబులకుఁ దైలంబు రాచి విశ్రాంతిఁ బొందించి యాతిథేయంబులం బరితృప్తిఁ బొందింపకయు చలివిందలు పెట్టింపకయు వ్యజన చ్ఛత్ర చామరాందోళికాదులఁ దాంబూల సుగంధ వస్తుజాతంబుల దానంబు సేయకయు నిత్యశ్రాద్ధంబును భూతబలియుం గావింపకయు కృచ్ఛ్ర చాంద్రాయణాది వ్రతంబు లాచరింపకయు నక్తవ్రతంబూనకయుఁ దనూ విశుద్ధినందించు సత్కార్యంబులం బ్రవర్తింపకయు యాచకుల దానాదులఁ దుష్టినందింపకయు విష్ణుపూజనోపయోగంబులైన తులశీవనంబుల వేయకయు సాలగ్రామతీర్థంబు స్వీకరించి శిరంబునం దాల్పకయు నేకాదశి నుపవసింపకయు శివలోకమందింప ముఖ్యంబైన శివరాత్రివ్రతంబు సలుపకయు గోవ్రజంబునకు ఘాసంబు సంతుష్టిఁ గానుంచుటయుం గండూతివాయ నొడలుఁ గోకుటయుఁ బంకమగ్న గావోద్ధరణంబుఁ గావించుటయు నివి గోలోకసుఖప్రదంబు లిట్టివైనం బాటింపకయు నింకంగల పరమనియతులు శుభంబులుఁ బుణ్యంబులు నగు కృత్యంబులకుం బాసి యొక్కెడ నిలువక నానాయకృత్యంబులకుం జొచ్చి వేదశాస్త్రంబులు సతీసుతులు మాన్య క్షేత్ర గృహ ధన ధాన్య వస్తుశతంబులన్నియు దేహంబు వీడునాఁ డనుగమింపవని తలంపక బహుకాలంబు సముపార్జించిన యీధనంబు క్షణకాలంబునం జోరాపహృతంబై పోయె నింక నేమిసేయంగలవాఁడఁ గరచరణంబులం దెమలింప నసమర్థుండైన యిప్పెనుముదిమిఁ గదిసె నానాటికిం దండధరావసథంబు సమీపించు నించుక పాథేయంబునకైనఁ బుణ్యంబు సేయనైతి నయ్యమపరిసరవర్తు లేతెంచి

నను గొంపోయి దండధరునండను పనందు కేమనువాఁడ నతండేమిబాధలనిడునో యని వదనంబున దైన్యంబుఁదోప భయవిహ్వలుండై దుఃఖించుచున్న సుప్రతునకుఁ గొంతవడి కొక్కండు జ్ఞప్తి రానప్పుడు. 381

క. పరలోక సౌఖ్య మమరఁ, గరుణించి జనంబు లకునుఘనులు మునీంద్రుల్
గురుమతి శ్లోకార్థంబున, ధర వక్కాణించిరొక్కతాత్పర్యంబున్. 382

క. అది నాకిప్పుడు తలఁపున, కొదవెంగడు మదిమిఁ జిక్కియుండినఁ దన క
య్యదియే శరణము స్వర్గ, ప్రదమును మోక్షప్రదంబుభవ్యం బరయన్. 383

క. మును నే ధన సంపాదన, మునకుం గాశ్మీరదేశమున కేగి ముదం
బున మాఘ మజ్జనము గం, గ నొనర్చి వసించియున్న ద్విజాసుర సమితిన్. 384

వ. కనుంగొంటి నందొక్కరుం డున్న తనవారితో "శ్లో. మాఘే నిమగ్నా స్సలిలే సుశీతే విధూతపాపా స్త్రిదివం ప్రయాంతి." అని మునివచనంబుఁ బురాణోక్తం బై యున్నదని ప్రస్తావించె నమ్మహా తపోధనులవాక్యం బసత్యంబగునే కావున.

తే. మొనసిమాఘంబునం గల్యమున సుశీత,లాంబువులమున్గ నఖిలపాపౌఘములకుఁ
దలఁగి త్రిదివంబు నందురు తపసివాక్య, మే ప్రమాణంబు నాకికనిట్లు సేయ.

—(*) సుప్రతుండు నర్మదా నిమజ్జనంబునఁ బుసీతుండై దివంబున కేగుట. (*)—

క. అని చనిమజ్జన మాడెం, దిన నవకము సుప్రతుం డతిప్రియ భక్తిన్
గని దళిత భక్త దుర్మద,దనరునితాం తోరుశర్మదన్ నర్మద దాన్. 387

వ. అట్లు మాఘమాసోదయ కాలంబున మునింగి దశమదివసంబునందు స్నానానంతరంబున మిక్కుటంబగు చలిని వడంకుచు. 388

క. చెందిన భక్తిర మాధవు, డెందంబున నిల్పి నీటిచెంకికి నెడయై
యందఱు నివ్వెఱఁగన గో, విందా గోవింద యనుచువీడ్కొనె నసువుల్. 389

క. అంతట సర్వదిగం తా, త్యంతా క్రాంతోరు దీప్తి నలరు విమానం
బంతికముఁ గాగ నతడు త, దంతరమునఁ గూరుచుండియరిగె దివంబున్. 390

వ. అవ్విధంబునం బోయి యందు సర్వదేవతా సముత్కర సంసేవ్య మానుండై యమిత సుఖంబు లందుచు. 391

సీ. ఒక మన్వంతిర కాలముండి యట నయ్యూర్వీ సురోత్తంముఁ డు
ర్వికి నేతెంచి ద్విజాన్వవాయుఁ డయి శౌరిం భక్తిఁ బూజించి య
త్యకలం కేచ్ఛఁ బ్రయాగ మజ్జనము భవ్యస్ఫూర్తిఁ గావించి త
ప్పక తా బ్రహ్మపదంబు నంది యట నప్పద్మోదరుం గొల్చుచున్. 392

ఆ. బ్రహ్మ కల్పముండిపదవడి యుం ధరా, స్థలిని ద్విజుఁడుఁగాగసంభవించి
వారణాశిఁ జేరివరమాఘ మాహాత్మ్య, మున మహేశు కృపనుతనువు విడిచి.

మ నార సాయుజ్యము నందె నర్మద దశాహంబు ల్నివర్తించి భూ
సుర వంశాగ్రణి మాఘ మజ్జనము పూజ్యుల్ మెచ్చ వింటే మహీ

శ్వర చూడాగ్రమణి యటంచును దిలీప క్ష్మాతలేంద్రుం బురం
దర సద్వైభవ సాంద్రు వల్కెను శతానందాత్మజుం డర్మిలిన్. 394

వ. వెండియు నవ్వలికథ వినువాఁడై దిలీపుండు మాఘస్నానప్రభావంబడిగిన నతండు.

—(*) ఆశ్వాసాంతము. (*)—

మ. పురుహూతాది దిగీశ సన్నుత కనద్భూరి ప్రతాపోన్నతా
సురగోత్ర ప్రతిమాన ధీర జిత రక్షోవాహినీవార సా
దర చేతోంబుజ దీనకల్ప కుజ శ్రీతా మానసాంభోజభా
స్కర సర్వామర సేవ్యమాన పదకంజాతా నృపాగ్రేసరా. 396

పంచచామరము. కబంధబంధు రచ్చవి ప్రకాశభాసు రాకృతీ
కబంధ బంధన ప్రసిద్ధకార్యధుర్య ధీమతీ
కబంధవైరి వంశదుగ్ధకంధి కైరవప్రియా
కబంధ దర్పకాననాంత్యకాలమారుతప్రియా. 397

తరల. జలజలోచన శైలశాసన సన్నుతారిపుమర్దనా
కలితసద్గుణ జాలనిర్మల కంధిగర్వ విభంజనా
యిలతనూభవ ప్రాణవల్లభ యిందుసద్రుచిరాననా
జలజమిత్రకులాబ్ధిపూర్ణిమ చంద్రమా నతపాలనా. 398

పంచచామరము. సురారిగర్వ నిగ్రహా విశుద్ధసత్త్వ విగ్రహా
సరోజసంభవార్చితా లసత్సుగంధ చర్చితా
తిరస్కృతాఘ సంచయా సుధీజనోత్కరప్రియా
పరోపకార సత్క్రియా విభాసితోన్నతాశయా. 399

గద్యము.

ఇది శ్రీరామచంద్ర కరుణాకటాక్ష వీక్షణావాప్తకవిత్వ విద్యాప్రాభవ పశు
పర్తి పినశేషమరాజాగ్రతనూభవ సుధీజనవిధేయ సుబ్బరా
జాభిధేయ ప్రణీత శ్రీమన్మాఘపురాణంబునందు
చతుర్థాశ్వాసము సంపూర్ణము.





# శ్రీమదాంధ్ర మాఘ పురాణము.

## పంచమాశ్వాసము.



కందపద్యము.

శ్రీకర గుణరత్నాకర,
లోకేశాద్యఖిల విబుధలోకాంచిత సు
శ్లోక చరిత్ర కృపామయ,
సాకేత విభవామరేంద్ర రామ నరేంద్రా. 1

తే. అవధరింపుము సూత మహర్షి చంద్రుఁ
డాదరమ్మున శౌనకాద్యఖిల మౌని
శేఖరులఁజూచి పలికె వశిష్ఠుఁడట్టు
లద్దిలీపావనీపతి కనియె నిట్లు. 2
తే. అనఘ విను తెల్పువాఁడ నత్యంతపుణ్య
తమమునౌ మాఘ మాహాత్మ్య మమర మఱియు
వినినవారికి ఘనపుణ్యమొనయు ననిన
నటులఁ గావింపఁ దత్ఫల మగునె యెన్న. 3

—(*) మాఘస్నాన ప్రభావము. (*)—

మ. పౌరిమాసంబుల నెల్ల శ్రేష్ఠ మగుచుఁ బొల్పారు నమ్మాఘ ము
ర్వరలోఁ దన్మహిమంబు నేమనఁగ గోత్రాధీశ సర్వామరో
త్కర సంసేవ్యము నౌచుఁ దాఁ గదియ రాఁగఁ బాప సంఘంబు మే
దురచింతా వినిమగ్నమై దనకు నెందున్నిల్వఁగా రామికిన్. 4
వ. అది యెట్లనిన నఘంబులన్నియుం గుమిఁగూడి యవియు. 5
ఆ. తరణి యుత్తరమునఁ జరియించు సర్వజ్ఞ, నాలి మజ్జనంబులాడు నుదయ
వేళనుంట కేది వెరవింక మాఘమ, త్యనఘ మగుచుఁ బ్రజల నట్లు సేయ. 6
మ. అని చింతింపఁగ నందుఁ బాప తతిలో నగ్రేసరంబై భయం
బొనఁగూర్పించెడు బ్రహ్మహత్యమను నంహోజాతమా యెందుకీ

ఘనచింతం బని లేదు దీనికిని ముఖ్యం బైన సందర్భ మేఁ
గనుఁగొంటిన్ మతిహీనలోక మెఱుఁగం గాఁజాల దింతేనియున్. 7

వ. అది యెట్లంటేని. 8

చ. త్రికరణ శుద్ధిఁ గల్గి జగతీ జనులందఱు సేయఁగాదె యి
మ్మకర గతార్కమం బయిన మాఘమునందు నిమజ్జనంబు త
ప్పక మనలం దొఱంగి కడుభవ్యతనం దెద రట్లుఁగాని చో
మకర ముఖాంబుచారములు మానక యుండవె నీటమున్గుచున్. 9

క. వానికిఁ గల్గనె యతుల, జ్ఞానం బనఘతయు మొదల స్నానము తీర్థ
స్థానములఁ జేయు ఫలమది, మానుఁగఁ బొందునె త్రిశుద్ధి మఱఁగక యున్నన్.

వ. కావునఁ గామాదుల నత్యసూయా భావంబుల నొప్పి యాచార హీనుండయి
ప్రవర్తించు నరుండు తీర్థస్నాన ఫలంబు నెందఁ డట్టివారి యెడ వృద్ధిఁ బొందఁగల
వారమనిన బ్రహ్మహత్యాఘంబునకు నెండియు నితరకలుషంబు లిట్లనియె. 11

ఆ. అతి రహస్య మగుచు నమరిన యీధర్మ, సూక్ష్మ మీవు మాకు సూటిఁగాఁగ
నెఱుఁగఁ బల్కితిప్డు తెఱఁగొప్ప నిస్సంశ, యము గనుండఁ దగుదు మట్టిపట్ల.

తే. ధర్మసూక్ష్మము లహిపాద తతులు వోలె
నతిని గూఢములౌను గుహాగతుండ
యైన పరమాత్ముఁ దెలియని యట్లు మూఢు
లెఱుఁగలే రాత్మ విదులెల్ల నెఱుఁగుచుంద్రు. 13

క. ఐనను నీ వెఱిఁగించిన, పూనిక యుంగాదు పుణ్యములలో ముఖ్యం
బై నలువొందిన మాఘ, స్నానాంచ త్పుణ్యసూక్ష్మ సందర్భమునన్. 14

వ. అది యెట్లనిన. 15

సీ. కోరికావించిన గురుపుణ్యు లగు, వారిఁ గోరిక లేనట్టి వారి మఱియుఁ
దత్ప్ర యత్నంబు చేదలకొను వారిని, తలఁపని వారిని తెలియకున్న
వారి నజ్ఞులనుఁ బ్రజ్ఞాఢ్యులను మూర్ఖు, లగువారి నమిత పాపాత్ములైన
వారి దురాచార వర్తనులగు వారి, దుష్టులఁ బరమనికృష్ట మతులఁ
గడకఁ బ్రత్యూషమునఁ గడువడి విశుద్ధ, జలములను మునిగినంత నె సదమలులఁగఁ
జేయు మాఘంబ దెట్లు వర్ణింపమనకు, నెలవు లుఁగనౌను తద్దేహములు ధరిత్రి.

తే. మాఘమాసమునను వరి నుళ్లలోని, గనిమలం బోవు చుండియు కాలుజారి
తజ్జలంబులఁ బడమేనుఁ దడియువాని, కైన తత్ఫలమబ్బెను నన వినమె. 17

వ. ఇంక శ్రద్ధాభక్తి నవగాహనం బొనరించిన వారికి మోక్ష స్వర్గంబులుఁ గలుఁగకుండు
నను టెట్లు నట్లయ్యు నియతులకు నని యతుల కెట్టివారికైన మాఘ ముదయస్నా
నంబున ననఘత వాటించి సద్గతిం బొందించు నది నిస్సంశయం బింత మాహాత్మ్యంబు
మాఘంబునకు కారణం బేమనిన. 18

తే. అమర సంఘంబు మాఘ మాసమున నాత్మ
తేజముల నోలి జలమున భూజనముల
మేలునకు నుంచుచుంటఁ గీలాల మప్పు
డఖిల పాపనిబర్హణ మై యెసంగు. 19
తే. అట్టి యుదకము స్నాన మహార్ఘ్యముఖమున, నాచరించిన నాత్మహత్యాదిపాప
సమితులెల్లనుఁబాపి పుణ్యమునుఁగూర్చి, సద్గతింబొందఁ జేయును జనములకును.
క. సుర సమ్మానంబును భా, సురకీర్తి లతావితానసూనంబును వి
స్ఫురదురు పుణ్యవ్రజ సం, భరణ నిదానంబు నత్తపాస్నానంబౌ. 21
వ. మఱియు నీ మాఘస్నాతకు లభించునంతటి పుణ్యంబు ధర్మయుద్ధంబున నభియాతిం
దొడరి మరణించిన శూరునకైన లభింప దిట్టి మహత్వంబుఁగల మాఘంబునందు
మనకు సంచారంబులమరునే యని బ్రహ్మహత్యకు నితరపాపంబులు వలికి
వెడలు గావున. 22
తే. పాఱు చుండెడు నదులలోఁ బరమనియతి
మాఘ మున సేయఁ దగును నిమజ్జనంబు
దేహ మారోగ్య ముఁగనున్న దేహికింటఁ
దగదు పుణ్యంబు లేమిని ధారిణీశా. 23
క. చెఱువుల బావులఁ గుంటల, మఱియును నూతులను సేయు మజ్జనమది యే
త్తెఱమధ్యమ ఫలదంబగుఁ, దొఱగించును పాపసమితి తోడ్తోనదులన్. 24
వ. మఱియు. 25
చ. దధినిమథింప నిత్తువును దగ్రతగానుగ వెట్ట వెన్న యున్
మధురరసంబు నెట్టులఁగనంజను నట్లు నిరంతరంబు బల్
వ్యథలనలంపఁగాని యొడ లబ్బదు పుణ్య మటయ్యు స్నాతకా
నధికత శీతలాంబువులయందె మునుంగఁ గనొప్పు నెప్పుడున్. 26
క. మునుకొని మాఘోదయమున, జనవరస్నానంబొనర్చి చలిఁగాఁచుకొనం
జన దనలాంతికమునఁ జని, తనుదార్ఢ్యంబమరియున్న ధర్మరతుఁడిలన్. 27
క. తనుదృఢత లేని రోగులు, మునువృద్ధులు బాలురంగములుఁ చలిచేతన్
బెనఁగొనిన నొప్పనించుక, యనలంబంటించి కాఁచ నయ్యనలంబున్. 28
వ. ఇతరులచేఁ బ్రజ్వలింపించినదియుఁ దృణకణంబులనైనదియుఁగాక స్వయమింధ
నంబులఁగొని ప్రజ్వలింపించినదిఁగానుండనొప్పు నట్టి యనలంబునంజలిఁ గాఁచు
వాఁడు ముఖంబుఁ బాదంబులు పృష్ఠభాగంబు. బ్రక్కలుఁ గాచందగదు మఱియు
మాఘస్నానంబు సేయువా రంతికంబున వాపీతటాకాదులు లేకున్నఁ గూపోద
కంబుంజేది తొలిదిన సాయంసమయంబున నూతనభాండంబులఁ బూరించి రాత్రి
నంతయుం గాడ్పుసోఁకి పరిశుద్ధంబైన జలంబు ప్రత్యూషంబున నావాహన
మంత్రంబుల ముఖ్యుండగు భాస్కరు నఖిలదేవతల సర్వనదుల నాహ్వానం

బొనర్చి భక్తిమై నజ్జలంబుల స్నానంబుఁగావింప నా స్నానంబు గంగాస్నాన
తుల్యంబై యధికఫలం బొసంగు. 29

చ. అవనిఁ దనర్చుపుణ్యములనన్నిటఁజూచిన మాఘమజ్జన
ప్రవిమల పుణ్యమెంతయును భవ్యమొసంగు ననేకజన్మ సం
భవములునైన పాపములఁబాపి ప్రజాలికి వహ్ని హేమముం
దవిలినయట్టి కల్మషము ద్రుంచి విశుద్ధతనిచ్చు కైవడిన్. 30

ఆ. అబ్జజుండు మొదల హవ్యవాహనునందు, దహనశక్తియుంచి తద్విధమున
జలమునందు సర్వ జంతూత్కరంబును, పావనంబుసేయు భావమునిచె. 31

వ. ఉదకంబట్టిదై మాఘంబున సర్వదేవతలాత్మీయ తేజంబులునుచుట నతిపూతం
బై యుదయస్నానంబున విశేషపుణ్యంబొసంగు దానం జేసి. 32

ఉ. త్రావరు లగ్నియందుఁ జొరుకంటె దురంబునఁ జచ్చుకంటె గో
భూ విబుధావనంబునకుఁ బ్రాణి శరీరము లూడ్చుకంటె సం
భావన బుద్ధిఁ బ్రోవగ నమస్కృతిఁ జేసిన వారిఁ బ్రోచు కం
టె వర మాఘమజ్జన మనింద్యమొనర్చిన పుణ్యమెక్కుడౌ 33

క. అనుదినము మాఘమాసం, బునఁ దిలలుం జక్కెరయును భూసురులకు భ
క్తినొసంగుచు మాసాంతం, బున షడ్రసయుక్తమైన భోజనమిడియున్. 34

వ. వారిఁ బ్రయాగమాధవస్వరూపులఁగాఁ దలంచి పూజించిన నరులిహంబునందు
దీర్ఘాయురారోగ్యైశ్వర్య సంపన్నులు విద్వాంసులు యశోవంతులుం దేజో
వంతులు సౌభాగ్యవంతులు సురూపవంతులునై వయోరూప లావణ్య వినయ
గాంభీర్య దాక్షిణ్యాదులుఁ గలిగి శీలలైన సతులతో సుపుత్రపౌత్రాభివృద్ధి
నెసంగుదురు మఱియు. 35

—(*) వశిష్ఠుండు దిలీపునకు మాఘస్నాతల నియమంబులు సెప్పుట. (*)—

సీ. జగతీశ మాఘమాసమునఁ దైలాభ్యంజ, నము మైథునము నిషిద్ధములు తినుప
దార్థముల్ గొనుట యంత్యజులనుం బతితుల, నన్నులముట్టినలినముఖులఁ
జేరిపల్కుటయు నవ్వారిఁగాఁ బరిహాస, ములువల్కుటయు ననభ్యులనుఁగూడి
భాషించుటయు వ్యర్థభాషణంబులువల్కుటయు నిందలనుచు టెంతయును లేని
నేరములు వల్కుటయు మదిరనీరసించి,
కొండెములు జెప్పుటయు నొడ్లకును విరోధ
మూన్చుటయు దూషణోక్తులు నొనర విన్ని,
మాని యుండంగ వలయును మఱియువినుము. 36

క. బూతులు వల్కుటయన్యుల, నాతులఁ గాంక్షించుటయును నవ్వులనేనిన్
నీతులు వదలుట విప్ర, వ్రాతము నిందించుటయును వారక మఱియున్. 37

క. ఒరునింటఁ గుడుచుటయు నొరు, సిరికోర్వక యుంట దానిఁ జేకొనుటకు నై
యరయుట యున్నియుదాఁ దు, ర్భరకలుషము లనుచు వీడి పరమనియతి మై. 38

క. మౌనవ్రతంబుఁ దాలిచి, పూనికఁ దన యిష్టదైవముం దలచియటన్
శ్రీనిలయాబ్జజ భవవై, శ్వానరరవి శశి శివా గజాస్యులభక్తిన్. 39

సీ. ధ్యానించుచు నిరంతరము వేదాధ్యయ, నాదితత్పరుఁడయ్యు నహరహంబు
తలిదండ్రులం గురూత్తములఁ బూజించుచుఁ, దవిలి శాంతమునఁ గ్రోధంబు వదలి
నిఖిలేంద్రియంబుల నిర్జించి సత్యవ్ర, తాంచితాచారుఁడై యధికనియతిఁ
బొరిమూఁడు వేళలఁ బూజించుచుం దైవ, తంబుల భక్తిమై దాంతిఁ గలిగి
పటువు విప్రుఁడు భూభర్తయటఁ గిరాటుఁ,
డైన తదితరుఁడగు శూద్రుఁడైన హరిహ
రాబ్జజుల చేతఁ బూజలనందు నతిథి
మాడ్కిఁ గల్పము స్నాతయై మాఘమునను. 50

వ. మఱియు నెవరైన రోగాదిబాధల మాఘస్నానంబు సేయ నశక్తులైనఁ దమవా
రు సితరు నొక్కభూసురు నియోగింపనొప్పు నట్టి బ్రాహ్మణునకు ధౌతచేలద్వ
యంబు నుత్తరీయద్వయంబు నొక్కవలిపెంపుపుట్టంబును గొడుగుం బాదరక్ష
లుఁ గుండియు నొసంగి స్వగృహంబునంద నానావ్యంజన సమన్వితంబై యాజ్య
మధు గుడాదుల శర్కరా గోరసంబులతోడఁ బరమసంపన్నంబైన యన్నంబు
వెట్టుచు మధుమధురంబులై మనోజ్ఞంబులగు ఫలాదులఁ దృప్తినందించుచుం
దత్కుటుంబమునుం ధాన్యాదికంబుల భరించి మాసాంతంబు స్నానంబు సేయించి
యనంతరంబ సంకల్పపూర్వకంబుఁగాఁ దా నొనరించిన మాఘస్నానఫలంబుం
దారవోసిన ద్విజునకు వెండియు ధౌతవస్త్రద్వయంబు నుత్తరీయంబు నొసంగి
యథోచిత దక్షిణనిడి వస్త్రాలంకారయుక్తంబును సవత్సంబునగు నొక్కపాడి
మొదవు నొసంగవలయు నిట్లు. 31

క. తనరం గావించిన నరు, లనఘాత్మక తామె మాఘమంతయు నియతిన్
గని స్నానముఁ గావించిన, ఘనఫలమునకంటె మిగులఁ గండ్రు ఫలంబున్. 42

వ. అని చెప్పి మఱియు నిట్లనియె. 43

తే. ఒకనికై మాఘ మజ్జనమ్ముర్వి సేయు, నాతఁడుం బూర్వమున తనదైన నిత్య
కృత్యమంతయు నెరవేర్చి కీర్తి వెలయఁ, గడఁగ నొప్పెడు నితరుని కార్యమునకు.

క. స్నాన ప్రయత్నుఁడై తాఁ, బూనికఁ దద్గోత్ర నామములు దలఁచి క్రమం
బౌనటు సంకల్ప విధా, నానూనవిధులఁ దనర్పనగు నిష్ఠమెయిన్. 45

వ. అట్లు మంత్రస్నానంబును దేవతాప్రార్థనంబు సర్వతీర్థావాహనంబునుం గావించి
యవల నిమజ్జనం బాచరింపవలయు నిట్లు మాసాంతంబుఁ గావించుచు. 46

క. ఏ యతనికి మజ్జనముం, జేయం దొఱకొనియె నతని చెంతనె తత్కా
ర్యాయత్తుఁడై సమాప్తిం, బాయక వసియించి యవలఁ బరమప్రీతిన్. 47

క. తా నొనరించిన మాఘ, స్నానఫలంబుం బ్రియుక్తసంకల్పముగాం
బూని యొసంగఁగనగు యజ, మానునకును సలిలధారసమానుఁగ ద్విజుఁడున్.

వ. అని యెఱింగించి మఱియు వశిష్ఠుండను నరేంద్రా పాపాత్ముల పాపంబులం బుణ్యుల పుణ్యంబుల ననుసరించుచుఁ బరమశ్రేష్ఠంబై యతిరహస్యంబై యొప్పునీ నిరుపమంబగు మాఘస్నాన ప్రభావం బింకను వినుపింతు వినుమని యిట్లనియె. 49

క. మాసోపవాస నియతిన్, వాసిఁగ త్రైవర్ణికులఁ నెవండైన తపో
మాసమున విరహిత శ్రముఁ, డై సరవి జిత క్రుధుండునై వెండియుఁ దాన్. 50

వ. నిర్జితేంద్రియుండు నిర్ద్వంద్వుండు మానవ్రతుండు హరిధ్యానరతుండు ధరణీశయనుండు తిలదాన తిలహోమ తిలశయన తిలభక్షణుండుఁ గుశాస్తరణుండు గుశపవిత్రధారియుం ద్రివేళల దేవతారాధనంబునుఁ బ్రాత స్స్నాయంకాలంబుల వైశ్వదేవ పంచయజ్ఞంబులు సలుపువాఁడునునై యథాస్థితి నుదయస్నానంబు సేయుచుండి మాసాంతంబున భూసురుల శాల్యన్న భక్ష్యభోజ్యపాయసాజ్యాదులఁ దృప్తిఁగావించి పాడిమొదవుల యథోచిత దక్షిణల నొసంగి తదాశీర్వచనపూర్వకంబుఁగా భోజనానుజ్ఞాతుండై బంధుయుతంబుఁగాఁ బారణంబుఁ గావించిన యతండు బ్రహ్మ విష్ణ్వీశ్వరేంద్రలోకంబులఁ గ్రమంబుఁగా నిరువదేనుకల్పంబులు నివసించు మఱియు వినుము. 51

క. అనఘాత్మ మాఘ మజ్జన, మొనరం గావించు మనుజుఁడొగి నుదయమునందును శుద్ధాత్ముండై యా, దిన మణి నతిభక్తిమెయి మసిదిన్ నిల్పి యటన్. 52

తే. ఒనర లోకుల కెల్ల జ్ఞానో దయంబు, సేయు వాఁడవు వెలిలో వసించియున్న
కలుష ములఁ బాపు వాఁడవు ఘన కృపాంబు, రాశివగు నీకునిత్తు నర్ఘ్యంబుదేవ.

వ. ఈ మాఘస్నాన ఫలంబు నాకునిమ్మను నర్థంబుఁగల మంత్రంబుసెప్పి యర్ఘ్యం బొసంగి మరల మునింగి మనంబునం దదుపాస్తి సలిపి. 54

క. మృతిఁ జెందిన వారల గతి, నతి నిద్రలఁ జొక్కి మేనుసలరయక కార్యస్థితు లొల్లకుండువారల, నతిదయ బోధించి త న్నిసయామకములకున్. 55

క. ప్రేరించెడు నీకు నమ, స్కారంబని మరల మునిఁగి కడుఁ గడక మెయిన్
గోరి జపింపఁగ వలయు ను, దారత భాస్కరుని యివ్విధంబునఁ దానున్. 56

క. సర్వా ఘౌఘ వినాశక, సర్వనదీ క్షేత్ర తీర్థసమధికరూపా
సర్వామర సంపూజిత, సర్వాత్మక ప్రణతి నీరజాత్ప హారీ. 57

వ. అని మఱియుఁ బరంజ్యోతి స్వరూపుండవు మహానందాత్మకుండవు సవితృండవుం బ్రసవితృండవు సర్వజగంబులకు నాది మధ్యాంతంబులు మాతాపితృలునైన వాఁడవు ఋగ్యజుస్సామంబు లనియెడు మూఁడు వేదంబుల కధికారివై యందుఁ జరించుఁవాఁడవునైన నీకు నమస్కార మీమాఘస్నాన ఫలంబు నాకొసంగు మనియెడర్థంబుఁగల మంత్రంబులం జపింపవలయు నివ్విధి సూర్యోదయంబునందు స్నానానంతరం బొనరించువాఁడు తదర్ఘ్యమ మార్గంబునంజని యవ్వలంగల విష్ణు

లోకంబు సేరి యందు నివసించు. 58

క. ఈవిధి నఖిలాభీష్టద, మై వరమై మాఘమాసమమరిన మాడ్కిన్
భూవర మాసం బితరం, బీ వసుధం దనరియున్నదే ఫలదంబై. 59

తే. మఱియు నీమాఘమునఁ దాఁ గ్రమంబు తోడఁ,
బూర్వ పక్షంబు ననువచ్చు భువన పూజ్య
మైన యేకాదశిం భక్తినే నరుండు,
మొగిని నుపవాసముం జేయుఁ దగ నతనికి. 60

క. ఇరువది నాలుగు హరివా, సరముల నుపవాసమున్న సత్ఫలము మహీ
శ్వర! పొందుచుండు శ్రేయ, స్కరమై పొగడొందు మాఘసంయోగమునన్.

వ. అని వశిష్ఠుండు దిలీపునకుం జెప్పెనని చెప్పి వెండియు సూతుండు శౌనకాదుల
తోఁ దానిట్లను నీమాఘ శుక్లైకాదశీ ప్రభావంబుం దెలుపు నితిహాసం బొండుఁ
గల దేనెఱింగింతు వినుండు తొల్లి పాండురాజ ద్వితీయపుత్త్రుండైన భీమసేనుండు
తమకుఁ బురోహితుండగు ధౌమ్యుఁ జూచి మహాత్మా భగవంతుండైన నారాయ
ణుఁ దినం బేకాదశి నఖిలజనంబు లుపవసింతు రాదినంబు బాలురకుం దుగ్ధంబు
లిడ రట్టినాడు. 62

ఆ. అతి బుభుక్షుడస్సి యశనంబుఁ దొఱఁగి య, న్యముల నైన మెసవు నన్నుఁ జూచి
ధార్తరాష్ట్రు లెల్లఁ దాఁ దిండి పోతు వీఁ, డంద్రు దుస్స సేయుఁ డంచు లెస్స. 63

క. చయ్యన నా హరివాసర, మయ్యా జఠరాగ్ని యధికమయ్యెడు నాకున్
దయ్యె మెఱుంగును తద్విధి, వెయ్యేటికిఁ బ్రాణ మొక్కవిధమునఁ దాల్తున్. 64

వ. అది యెట్లనిన. 65

ఆ. పేలఁ బిండి తెలికపిండియుం బాలునుఁ, బెరుగు నేయి ఫలములురు తరముఁగఁ
గంద మూల ములునుఁ గైకొని తిని నీరు, ద్రావి యుపవసింతుఁ దాపసేంద్ర.

వ. కావున నన్ని హరి వాసరంబుల నుపవసించి నఘుపు వ్రతఫలం బొక్కటనే గలుగు
నట్టి ముఖ్య హరివాసరం బొందుండినఁ దద్వ్రతి క్రమంబును దత్సమయ భక్ష
ణంబులతోడ నా కెఱింగించి నను ధన్యుఁ గావింపుమని ప్రార్థించినఁ గరుణించి
ధౌమ్యుండు కుంతీ ద్వితీయాపత్యంబున కిట్లనియె. 67

సీ. అనిలజ నీవు నన్నడిగిన ప్రశ్న మ, త్యనఘంబు సర్వలోకదియెముఖ్య
మమ్మాఘసితపక్షమందునుఁ బరతెంచు, హరివాసరము వొల్చునరయనదియు
బుష్యసంయుక్తమై పొలుపారరా వెండి, యును విశేషంబయి తనరునట్లుఁ
గాకయుండినను మాఘాన్వితమయి మహో, త్తమమగుచు హరివాసరములయందు
నరవి సంవత్సరాంతము నలిపినంత,
ఫలమొసంగును తద్దినవ్రతసమాప్తిఁ
దొలఁగు నఘములు ధారిణీమన్నృపుని
దొలఁగు నటు రాజ్యవిభవము లెలమిఁ బాసి. 68

వ. మఱియు నమ్మాఘ శుక్లైకాదశీ వ్రతంబు విధిహితంబుగా నాచరించినవారివైన పాపంబులు. 69

సీ. సూర్యోదయమున మంచును శుభంబుల నర్థమునను బ్రహ్మాపనంబునను ధర్మ
మతి తపంబున విషయాఘంబు శిక్షింప, ఖిం బాలురు గాయమిని పశువ్ర
జంబు ద్విజావర్గ శ్రాద్ధముఁ గోపంబు, ననుఁ దపంబునుఁ జనువనఁగనొక్క
దివసంబునందైన తెఱఁగొప్పజనువమి, విప్రుండు చదువక వెలది తిరుగ
మఱిగి గేస్తు ప్రియాంగనఁదొలఁగి మెట్లు,
చెడియెడుం ధాత్రి నవ్విధిఁ జేయుచుఁబొందు
నధిక పుణ్యంబు నిక్కవమరయుమాత్మ
ననిల నందన వెండియు వినుము తెలియ. 70

ఆ. మూడు పుష్కరముల మునిఁగినఁదొలఁగని, పంచపాతకంబు లంచితముఁగఁ
దొలఁగు మాఘమాస విలసిత సితపక్ష, కలితవైష్ణవాహఘన వ్రతమున. 71

ఆ. కడఁక నైమిశంబు గయ ప్రయాగ సరస్వ, తియును గంగ నర్మద యును దేవి
కయు గవేరజయునుఁ గడుధన్యమగు కురు, క్షేత్రమిన్ని యాత్రఁ జేసియైన. 72

చ. పడయఁగ రాని పుణ్యమతిభక్తిమెయిన్ హరి వాసరంబు నం
దుపగత పస్తునుండి కననొక్కటనౌ నిటులేల యెన్నియో
నుడువ సమీరనందన యనూన తపోవ్రత దానసంహతుల్
కడువడి నెన్నఁజేసి ననుఁగా వొకడింత ఫలంబుఁ గూర్పఁగన్. 73

క. విశదముఁగ నొక్క యేకాదశి నుపవాసంబె తా యథాయథఁ బరపన్
వశమగునె నిల్వ నఘముల, కశనము లేకునికి సలుపు నా వ్రతులందున్. 74

క. వెలయఁగ హరిదివసవ్రత, ఫలముం భూదానఫలము వడినిరుగడలన్
దులనిడి తూపఁగ వ్రతనిస్తుల సత్ఫలమున నెముల్లు సూపునధికమై. 75

మ. దశమీ ద్వాదశి రాత్రులం గుడువ భక్తం బెంత యున్నాని స
ద్వశ! యేకాదశి రెండువేళలను నన్నంబు వర్జించి య
ద్దశమీ ద్వాదశి మాంససేవనము కాంతా భోగము న్వీడి భూ
మిశయా నుండయి యుండఁగావలయు నెమ్మిందాఁ గృతార్థుండుఁగన్. 76

వ. ఇది వ్రతంబునకు ముఖ్య నియమంబగు నింకను వినుము. 77

క. భూసురుఁడా మధురిపు స, ద్వాసర ముదయమున లేచి తానంబొనరం
జేసి యు దయాహ్నికము వి, శ్వాసమున నొనర్చి భక్తి వైశముఁగాగన్. 78

ఆ. ఉపవసించియుండి యోపిక నోపాస, నమును బ్రహ్మయజ్ఞమమరసలిపి
దేవదేవు విష్ణు భావంబునందిట్లుఁ, దలఁపవలయు మంత్రకలితముఁగను. 79

తే. పుండరీకాక్ష యచ్యుత పురుషవర్య, కేశవా మాధవా హరి కృపఁదలిర్ప
నన్ను రక్షింపు మీసుదినంబునందు, నుపవసించియు ద్వాదశి నొనరుభక్తి. 80

వ. నిన్నుఁ బూజించి పారణంబుఁ గావించెదఁ బ్రమాదాలస్యాదుల నీ వ్రతంబునకు
నంతరాయంబుఁ గలుగకుండునట్లు సేయుమని జపంబుసలిపి యథావిధి సంకల్పం
బొనరించి నియతుండై. 81

చ. మొనర వరాహరూపమునకున్న సువర్ణముచేఁ బయోజనా
భుని నొనరించి గోమయముఁ బూని వసుంధరనల్కి యందుపై
నొనరఁగ నాల్గువాకిళులకొప్పు గృహంబును ముగ్గుచేఁ గ్రమం
బున రచియించి మౌక్తికవిభూషిత దివ్యవితానజాతమున్. 82

తే. కూర్చి నాలుగుదిక్కులకునుఁ గృపీట, పూర్ణ కలశంబులును మధ్యభూమి ఛత్ర
చామరాంచిత మౌక్తికదామపుష్ప, దామ ముకురాది శుభవస్తుతతినమర్చి.

క. అది ధాన్యపూరితముఁగా, మొదలంగావించి రాసిమొనపితవస్త్రం
బొనవంగఁబరచి క్షేమ, ప్రదమై యొప్పారుదానిపై కడు పూన్కిన్. 84

క. క్షౌమావృత కలశంబును, నేమంబునఁ నిలిపి ముదముననిగుడఁగ శ్రీభూ
భామాన్వితుహరి దులసీ, దామం దృఢభక్తినిలిపి తద్దయు వేడ్కన్. 85

వ. తత్కలశంబుల కష్టదిక్కులయందు యవవ్రీహి తిల మాష ముద్గ గోధూమ శాలి
శ్యామాక ధాన్యంబు లొండొండు ద్రోణ చతుష్కంబుబోసి సుస్నాతుండై
మాధ్యాహ్నికంబులైన వైశ్వదేవభూత బల్యాదికృత్యంబులు నిర్వర్తించి నానా
విధ కుసుమఫల పత్రాదులఁ బూజోపకరణంబులఁ గైకొని తములంబుసేయ
కయుఁ బలుమారు నుదకపానంబొనరింపకయు ఫలమూలాదుల మెసవకయు
నొకవిధంబునఁ బ్రాణరక్షణంబునకు నాజ్య దుగ్ధ జల ఫలంబుల నొండేని సూక్ష్మం
బుగా నుపయోగించి యప్పవలంతయు నిరశనుండై యుండి సాయంసమయం
బున నాజ్యదీపంబులు వెలిఁగించి ప్రాణాయామంబును సంకల్పముం జెప్పి. 86

ఆ. అవ్వరాహరూపమమర స్వర్ణంబుచే, వెలయుచున్న విష్ణువిగ్రహంబు
కలశమునను ప్రాణకలితంబుఁ గానుంచి, యపుడుసేయ వలయునర్చనములు. 87

వ. తత్పూజా క్రమంబెట్లనిన నావాహనాది దీపాంతంబులైన షోడశవిధార్చనంబులు
సలిపి మత్స్యాది దశావతారంబుల వరుసఁగాఁ దలంచుచు నమస్కారం బని పా
దమధ్య నాభి కుక్షి కర కంఠ ముఖ లలాట మూర్ధ కేశంబులం బూజించి తన్నునుఁ
దనకు నంతరాత్మయగు నారాయణు జీవాత్మయగు ప్రాణంబునుఁ గలశంబునకు
నాల్గుదిక్కులఁ గ్రమంబుఁగా నావాహనంబు సలిపి వెండియు ధూపదీప నైవేద్య
తాంబూలాద్యుపచారంబుల నుపచరించి పుష్ప గంధ వస్త్రాభరణాదులు సమ
ర్పించి కేశవాది ద్వాదశనామంబులతోడ నర్చించి యనంతరంబా భగవంతుని
స్తోత్రంబులఁ బురాణాద్యాకర్ణన సంకీర్తనాదుల నారాత్రినంతయుం జాగరణంబుఁ
గావింపవలయు నిట్లు. 88

ఆ. వేగునంతకుండి వెండియు స్నాన సం, ధ్యార్చన స్తవాదులన్ని సలిపి
గురు పదాబ్జములకు గురుభక్తి వందన, మిడి యనంతరంబ కడుముదమున. 89

ఆ. ఆసువర్ణ విగ్రహంబునుఁ గలశంబు, గలశవేష్టితాంశుకంబు ధాన్య
సమితి యచటఁగల్గు సర్వముఁ దాసద, క్షిణఁగనిచ్చి పూజఁజేసి ద్విజుని. 90
క. ద్వాదశిఁ బారణ మతి భ, వ్యోదయ ముఁగ సేయవలయు నోహా యుజ యే
కాదశి నాబడు వ్రతమిా, వాదట నిటు వింటిఁగా దెయచల మనీషా. 91
క. ఇది విబుధనియమ మిటుఁదా, వదలకఁ గావించునరుని పాప వితానం
బుదయమున భాస్కర ప్రభఁ, గదలెను తిమిరములమాడ్కిఁ గడువడిఁబోవున్.
తే. కాన నిమ్మాఘ శుక్లపక్షమున నీవ్ర, తంబుఁ గైకొను మీవు తథ్యంబ లేని
వత్స రాంత మొనర్చిన వ్రతఫలంబు, సెందునని పల్కుటయు భీమసేనుఁడపుడు.
చ. ప్రవిమలబుద్ధి ధౌమ్యపదపంకజముల్ తనఫాల భాగ ముం
దవులఁగ నివ్విధంబు నను తప్పక చేసెదనంచు మ్రొక్కి త
ద్దివసమురా విశుద్ధమతిఁ దీర్చి నిజాహ్నికమెల్ల భక్తిమై
తవిలి వరాహపూజనముఁ దానొనరించియు నాక్షణంబునన్. 94
ఆ. నిజ పురోపకంఠ నిబిడోప వనమును, జేరి యందులక్షు నారికేళ
ములును దశసహస్ర పుండ్రేక్షు దండము, లమర రెండు వేల నఁటిపండ్లు. 95
ఆ. పనసపండ్లు లొక్క పదినూర్లు వడిఁదెచ్చి వనరుహాక్షునకును దనర నార
గింపువెట్టి వానిఁ గెరలు నాకటికిఁగాఁ, దినియు నీరుఁ ద్రావి తృప్తివడక
వ. ఒక్క విధంబుననుండి యా సాయంకాలంబునందుఁ బునర్నిమజ్జనంబుఁ గావించి దేవతాభ్యర్చనాదులు సలిపి వేగునంతకు జాగరణంబుఁ గావించి యరుణోదయంబున. 97
ఆ. తానమాడి దేవతా పూజనము సల్పి, శక్తికొలఁది విప్రసమితి కెల్ల
దానముల నొసంగి తనియఁ బారణముఁ బ, ర్వతముఁ బోలునన్న రాసిఁజేసె. 98
వ. అదిమొదలు మాఘ పూర్వపక్షమ్మున వచ్చు నేకాదశి భీమైకాదశి యనంబఱగె నని సూతుండు శౌనకాదులకుం జెప్పి వెండియు వశిష్ఠుండు దిలీపునకుం జెప్పిన చందంబున మాఘస్నాన ప్రభావం బిట్లు వాక్రువ్వం దొడంగె నట్లు మునీంద్రుం డవనీంద్రునింజూచి. 99
ఆ. అనఘ మాఘమందహర్పతి మకర సం, గతుఁడుఁ గాఁగ నట్టి కాలముదక
మనఘ మఖిల జనము లొందరు దాన యో, గ్యులునుఁ బనులవన్నియును వరములు.
వ. సర్వవస్తువులుం దానంబునకు యోగ్యంబులై యుండునని మఱియు నిట్లనియె.
సీ. మేధమ్ములం దశ్వమేధమ్ము గిరులలో, హిమగిరి వ్రతములనమర సూనృ
తవ్రతమ్మును దానతతిన భయమ్ము మం, త్రములలోఁ బ్రణవమ్ము ధర్మముల న
హింస యంగనలలో నిందిర విద్యల, బ్రహ్మవిద్యయు శివభక్తులందు
నారాయణ ఋషి నగధన్వి హరిభక్త, సంహతి గాయత్రి ఛందములను
నాల సురగవి తపములఁ బ్రాణపవన, మది యధీనత సేయుట మదిఁదలంపఁ
బాత్రులం దాహితాగ్ని యు ధాత్రి శస్త, మైనగతి మాఘ మజ్జనమగు వరంబు.

క. గరుడుం గన్గొను నంతనె, యురగంబులు పాఱునట్టు లుర్వి నఘంబుల్
ధరణీవర పఱువిడు న, త్వరమింతని చెప్పనగునె తత్ఫల విధముల్. 103

క. వ్యసనంబుల కెంతయుఁ గై, వసమై వర్తించుచున్న వానికిఁ బాపా
వసథునకు నర్థహీనున, కసమాన మహాప్రభావ మమరించు నృపా. 104

సీ. కమల మిత్రుఁడు లేని గగన మంబుజవైరి, రాకతక్కినయట్టి రాత్రి మఱియు
జలమింకి యున్నట్టి జలజాకరమ్మును, చదువింత లేని ద్విజాన్వయంబు
సంతాన హీనయౌ చాన కన్నది లేని, పాప నిర్ధనమైన వైశ్యకులము
వసువులూడిన గాత్ర మది పాలుఁ బిదుకని, యావు దక్షిణలేని యజ్ఞవిధము
నెవ్విధంబున శోభింప వవ్విధమున, నఖిల పాపనిబర్హణమైన మాఘ
మున నిమజ్జన మాడని మనుజజన్మ, మది నిరర్థకమై యొప్పదవని నాథ. 105

వ. మఱియు మాఘస్నానమ్ముఁ గావింపని నరులు. 106

క. అతి చతురులయ్యు నజ్ఞులు, శ్రుతివేత్తలు నయ్యు తెలివిసొరని విమూఢుల్
క్షితి నంచితాత్ములై యుం, ధతములును కులీనులయ్యు తగని కులస్థుల్. 107

వ. అనిచెప్పి వశిష్ఠుండు వెండియు. 108

సీ. మూడు దినమ్ములు మొనరంగఁ బవలొక్క, పరి వెండి మూడు వాసరములొక్క
పూటరాత్రులయందు మొగి క్రమ్మ అనుమూడ, హమ్ములయాచితాహారమునను
వరుసఁగా మఱిమూడు వాసరమ్ములు నీర, ములనిట్లు వ్రతనియముండు నయ్యు
ద్వాదశాహమ్ము లెంతయుఁ బుచ్చి యన్వలఁ, దనశక్తిఁ దానముల్ ధరణిదివిజు
లకు నొసంగి ముదంబుఁ జెలంగఁ గుడిచి, నట్టినరునకుఁ బ్రాపించు నజపదంబు
మను కులాధీశ తప్పక మాఘమున ని, మజ్జనం బుదయమున సమ్మతి నొనర్చు.

ఆ. భవ మహార్ణవమునఁ బడి పాప నక్రవి, తతికిఁ జిక్కు మూఢ తతులనుద్ధ
రింప మాఘమదిఁ దలంపని మజ్జన, మునన కాని యొండు భువినిఁ గలదె. 110

తే. కోరిమైనను మనమునఁ గోరకైన, మాఘ మజ్జన మొనరించు మానవులకు
బ్రహ్మపదమబ్బు ననవేరఁ బలుకనేల, భక్తి నొనరించు వారి కవ్యయమటంచు.

మ. కల లోకంబులలో సరోజభవ లోకం బెట్లు ముఖ్యంబునై
చెలువొందుం దగనట్లు మాసముల వీక్షింపంగ మాఘంబు భూ
లలనాధీశ మహాత్తమస్థితికిఁ జాలం దచ్చుభాహాంబులన్
వొలఁగం బాయుదు రెల్లమర్త్యు లఘముల్ దోడ్తో నుపస్నాతలై. 112

వ. అట్లు సూర్యుండు మకర సంగతుఁడుగా నుదయంబునం బురబహిర్జలంబుల నెందేని హరిహరుల స్మరించుచు మునింగి తత్పూజనంబుఁ గావించిన నరులు దివ్యాంగనా జనంబులం గూడి నిరంతర సౌఖ్యంబు లబ్ధిని ననుభవింపంగలవారు మఱియు నిప్పరమ పుణ్యప్రదంబైన మాఘంబునం దసితపక్ష చతుర్దశి శివరాత్రి నా బఱు వ్రతంబొండు సలుపంబడునది శివున కతి ప్రియంబై తల్లోకంబగు కైలాసం బొసంగు దాని సవిస్తరంబుగా నెఱింగింతు వినుము. 113

## —(*) శివరాత్రి వ్రత మాహాత్మ్యము. (*)—

క. వసుధేశ ! బిల్వదళముల, నసమాక్షుని నుపవసించి యర్చించిన మా
నసమున జాగరణంబు, య్యసితగళుని కథల నలిపి నట్టి మహాత్ముల్. 114

క. సుమహిత మతి మృడసాయు, జ్యము నందుదు రెలమి నమ్మహా పదమందగ్
గ్రమమున జపదానతపః, ప్రముఖంబుల నైనఁగాదు భానుకులేశా. 115

క. అట్టి శివమనః ప్రియంబైన వ్రతంబు నీమనంబున నిలుపు మదియు. 116

సీ. సురుచిర ప్రభల భాస్కరమండలమునట్లు, పూరుషావలి దైత్యవైరిభాతి
భూజనంబుల విప్రపుంగవు వలెనంబు, జాతుల నత్రిసంయమిసతిగతి
ధాత్రీద్రుముల రుక్మధాత్రీధరము పోల్కి, గోరాజి కపిలంపుగోవుమాడ్కి
కల మంత్రములయందు గాయత్రి, విధమున తగు రసంబుల నమృతంబుపగిది
కారుణికులందుఁ ద్రిపురసంహారి తెఱఁగు, నఖిల వ్రతముల శివరాత్రి యనఁగబరగు
సద్వ్రతంబెక్కుడది కలుపాటవులను, చండదావంబుఁ బోలె భస్మంబు సేయు.

తే. పలలపంకము రుధిర ప్రవాహ మైన, భయదవైతరణీ నది పాయన మధు
శాద మంచిత దుర్గలసత్ప్రవాహ, మగుచుఁ గన్పట్టు నీసము ద్వ్యద్వ్రతులకు. 118

క. ఇందున కొక్క పుణ్యేతిహాసంబుఁ గల దెఱింగింతు వినుము. 119

## —(*) ల్లుబ్ధకోపాఖ్యానము. (*)—

క. శ్రీ కాకుత్స్థ కులాబ్ధిని, శాకర శాకలము నాగజను పత్తన మం
దాకాలుఁ బోలుచుం భయ, దాకారంబమరనం కిలాఖ్యుం డుండున్. 120

తే. అక్కిరాతుఁడంతికావనీ గ్రామవా, సులకు భయదుఁడగుచు సుతులనాత్మ
సతినిఁ బ్రోచుచుండు సంతతమును మృగా, ఖేటనంబె నిత్య కృత్యముగను. 121

వ. అతి మలిన తనూవసనుండును కుజనానుషంగుండును శోణితాక్షుండు నమిత
జపుండును సమదుండును రక్తసిక్త ఖరకరను ఖరుండునునగు నతం డొండొక దినం
బు నందు. 122

సీ. కజ్జల ద్యుతిఁ గ్రిందుగావించు మేనితో - సరివచ్చు నొకక వచంబుఁ దొడిగి
యుడుము తోలునఁ గుట్టియున్నట్టి యంగుష్ఠ, కవచంబు వ్రేల నొక్కటి నమర్చి
పలితకేశము లొక్కపాటి వీడ్వడకుండఁ, బ్రాఁ బ్రేలికల మెల్కొవడఁగ జుట్టి
నిశితాశుగంబులు నెఱివిల్లు చేఁబూని, యొకచూరిమే ఖలనుండఁ జెరివి
ఘనఘనాఘన సద్రుచిఁ గారుకొన్న,
యున్న తోర్వీజములచే మహాగ్ర మృగస
మూహముల చేత నెంతయు మొనరు నొక్క,
కాననం బొంట్రి మెయి సొచ్చి కడఁక నంను. 123

క. భయవిరహితుఁడై మృగ సము, దయముల కాల్జాడ లరయఁ దడయక యా ని
ర్దయుఁ గాంచి యెల్ల మృగములు, భయమున నందంద డాగి పఱచెన్ వనిలోన్.

ఉ. అంతట నక్క రాతుఁడు మృగావలి జాడ లెఱింగి వాగురా
సంతతివైచి యొండొక దేశంబులు దుంపలనుండి పక్షుల
శ్రాంతముఁ గూయ నట్టులఁ బోసంగ గళ స్వనమిచ్చుచుం బరి
శ్రాంతుఁడుఁ గాక పల్విధులఁ జంపఁగ నుండె మృగాండ జంబులన్. 125

వ. అట్లు. 126

క. పొంచి యువాగు రలంగ ద, లించియు నొండెడన వైచి లెంపతరువు లం
దుంచియుఁ జిప్పరుం గండె లో, కించుక కాలూన కడవిని నల్లఁ జరించెన్. 127

వ. చరించి సర్వ ప్రయత్నంబుల విఫలుండై యొక్క విమమన్దలంబునం బఱచు శశం
బుం దిలకించి దండధరుండై వెనుఁదవులుటయు నది దవ్వులం జని గికురువెట్టి
డాగుడు మొగంబున విన్నఁ దనంబుఁదోప రిక్తహస్తుండై మగిడి గృహంబునకుఁ
బోవనుండు సతీసుతుల కాహారంబు లేకునికి వెరవెఱుంగక సంతాపించుచు
మఱియు నయ్యడవిఁ బిసితంబునకుఁ నాలోచింపుచుండె నప్పుడు. 128

ఉ. శాకల వాని యుద్యమముసర్వ మెఱింగితి లోక బాంధవా
ఖ్యాకత సార్థకంబుఁ గనఁగాహితమూనుట లెస్స యంటినో
ఈకడ జీవహింసకదియే చెడు నిట్టిటనుంట మానిపో
నాకు శుభం బటంచుఁ జనెనాఁ జరమాద్రికిఁ జేరె నర్కుఁడున్. 129

తే. సాంధ్య రాగము చరమదిశావధూటి, ప్రాచిఁ బఱతెంచు విధుఁడనురక్తిఁ దన్నుఁ
జేర వలెనంచుఁ దలఁచిగైసేసినట్టి, శోణ చీనాం బరంబనసొంపు మీఁగె. 130

తే. కాల గతి మిత్రు నద్వనుజాల మెల్ల, నాచి తనశిరి జగముఁగసంగ వచ్చు
నిట్టి దోషాకరుంజూచు కెట్టులని మొ, గములు ముడుఁచిన గతినీరజములు మొగిడె.

చ. అమిత మహా ప్రతాప యుతుఁడైన యినుండొకఁ డొప్పియుండ సం
భ్రమము లడంగి దుర్గతులభావములుం దుదిరేగు నట్టు ల
య్యమిత మహాప్రతాప యుతుఁడైన యినుండొకఁ డొప్పియుండ సం
భ్రమము లడంగి యుండి తుదిగమ్ము కొనెం జగముందమిస్రముల్. 132

వ. అట్టి సమయంబు నందు. 133

క. మృగపక్షు లణఁగి కూయమి, నగముల నొక పత్రమైన నల్లాడమి చా
లుగ రాలియున్న పూవులఁ, దగినని యొప్పారె నిదురఁదవిలిన మాడ్కిన్. 134

ఉ. ఆయమి తాంధకార యుతమై కడుఁ ఘోరము నైన కాన న
బ్బోయని జాత్మ నిట్లు వెతఁబోయె నయో యొకవేళ నైన నేఁ
బోయిన వాఁడగాను మృగముం బడవైవక యింటి నేని ని
ట్లీయెడఁ గల్గె నింటికెటులేగుదునా మమమింత లేకయున్. 135

క. తిరిగితి వేసట లేకే, నురులొడ్డితి వలలని డితినొక మృగమైనన్
బొరినిందుఁ జిక్క దాయెను, చరమాంబుధిఁ బడియె రవియొసంగెతమంబున్.

క. ఈకదు చీకటిఁ జూచుట, లే కరణిం గలుగు మృగము లెవ్విధిఁ జిక్కున్
గా కేగుదు ననవతి తుఁ, ద్వ్యాకులితుల్ మనికి యందు ననతివయు సుతులున్. 137
ఆ. ఎదురు సూచు చుందు రింతకు మాంసముఁ, దెచ్చు తినెద మనుచు ధృతి వహించి
ఏమి సేయువాఁ డనిది కానమ్మునే, నిందుఁ గల నటంచు నేరు వడదు. 138
ఆ. అని దురంత చింత నందియా దుష్టాన్వ, యుండు సుకృత మతి నిజోద యమున
కాత్మలోఁ గలంగు నట్లా దినంబునఁ, దనదు పూన్కి నెడుట కునుఁ గలంగి. 139
వ. అంకిలుండు వెండియు మృగసంహనన ప్రయత్నుండై చేరువనున్న జలాశయంబు
డాసి తత్తీరంబునం బురాతనంబై బదరీమండ మధ్యగతంబైన బిల్వంబుఁ గని యిత్త
రు మూలంబునుండి యీజలాశయ నీరంబులానఁ జనుదెంచు మృగంబులఁ ద్రుం
తునని మెల్లన నచ్చోనరిగి యందుఁగల తృణకంటక శిలాదులఁ ద్రోసికొని కూర్చుం
డి యొండు బాణంబు కేల వట్టియున్నవి క్రిందనునిచి చలింపని దృష్టియు దృఢ
మానసంబు గలిగి పదిలంబుఁగా నుండె. 140
సీ. అబ్బో యుతద్వ్యాఘ్రభయంబు క్రిందటి పురా, తనమయ్యు నెవరెఱుంగనిదియైన
శర్వలింగము పైనిఁ జర్చించి యిదియిట్టి, దని యెఱుంగక యవశ్యాయతోయ
సంక్లిన్న మూర్ధకేశస్తోమ్ముఁ డ హార, నిద్రావిహీనుం డునిశ్చలాత్ముఁ
డయి యుండి చూడ్కి కెంతయు నిరోధించిన, బిల్వదళంబులఁ బిడికిళులను
త్రెంచి పడవైవ నప్డు ధాత్రీధ్ర ధన్వి, పూజనము సల్పి నట్లయ్యెఁ బూసఁ గనద్ది
నంబు శివరాత్రి గాన వ్రతంబు తోడ, వాని పుణ్యంబ దేమనవలయు నధిప.
వ. అట్లు వైచి యతండు. 142
చ. బలమగు నాకటింబడి విభావరి యామ చతుష్కమే గఁదా
బలలముఁ గోరి యమ్మదువుపై నిడి దృష్టి బకంబపోలె ని
శ్చలత నసించె మేరుగిరిచాపుఁడు మూఁడు జగంబు లట్టు ల
ర్మిలిమెయిఁ బ్రోవఁ దన్నిశఁ గ్రమించెఁ గృపారస సాంద్ర దృష్టులన్. 143
తే. మాఘ కృష్ణ చతుర్దశి మహితబిల్వ, దళ చయంబును మఱియు నిర్మల జలంబు
నభవు లింగంబు నొకసమయంబునందె, యబ్బె నేనియు వాఁడె ధన్యాత్ముఁ డరయ.
వ. అట్లు మాంసంబు దొఱకమి దినంబంతయు నుపవసించియు మృగహననేచ్ఛ రా
త్రి యంతయు మేల్కనియు బిల్వదళంబుల లింగంబునం బడవైచియు నీహారవారి
సర్వాంగములుం దడిసియు నవ్వ్రతంబునకుం గాకతాళీ యన్యాయంబున నుప
వాస జాగరణ స్నానార్చనాదులైన నియమంబులన్నియుఁ జక్కం బడె నిక్కడ
తదీయావసథంబు నందు. 145
క. దినమంతయు నొక విధమునఁ, దనయుల నూరార్చి కొనుచుఁ దనవిభు రాకం
గనుఁ గొనుచు రాత్రి సగమ్మై, నను రాకయు నున్నఁ దామసంబున వగతోన్.
తే. చంటి పాపని నొక్కనిఁ జంకనునిచి, కొండి కలుఁదాను మంచానఁ గూరుచుండి
నిదురఁగానక బోయత నిక్కి నిక్కి, కలకు లనుఁజూచు మఱియు దుఃఖించునిట్లు.

ఉ. అక్కట యెన్నఁ డేని మగఁ డర్భకులన్ ననువీడి కానసం
బెక్కటి వేటలాడుటకు నేగిన నుండఁడిటింత ప్రొద్దుఁ దాఁ
జిక్కిన మాంస మించుకయుఁ జిక్కక యుండిన వచ్చుఁగాని నే
డిక్కరణి న్వనస్థలుల నెయ్యది హేతువు జాగు సేయఁగన్. 148

ఆ. అశనవేళఁ దప్పె నహమెల్లఁ గడచెఁ, గాక రేయిఁ గడువఁ గాఁదొడంగె
నేమి సేయుదాన నేమయ్యెనో కదా, యశవి మద్విభుండు తడయుటకును. 149

మ. తరుమూలంబునఁ బొంచి వింట శరసంధానంబుఁ గావించి శం
బరముం గూల్పఁగఁ జూచుచుండ తఱి నాత్యూర్జాత గంభీర కో
టరసంవాసి మహోరగంబు దిగుచున్ దాప్రం బహిర్వర్తియై
సరసం జూచుటఁ జేసి తన్గఱచె నోసంత్రాస మూలంబునన్. 150

క. అసి త్రేటుఁ దవిలి సింగం, బసమునఁ బఱతెంచి సునిశితాయత దంష్ట్రా
విసర వ్యాప్తముఖంబున, వెస నమలెనొ శిరమున ఖరవితతి నలమియున్. 151

క. అని ఘటియ పెక్కుఁ దెఱఁగులఁ, దనవిభునిం గూర్చి బోయతరుణి నిశాంతం
బున దుఃఖింప నిశాంతం, బునుఁ గాఁదెల తెల్లనయ్యెఁ బూర్వపుదిశయున్. 152

ఉ. మేరు మహీధరోరు తటిఁ గ్రమించి యొకింతను దీచియైన పా
కారి దిశం ఘటోద్భవుని కైవడిఁ బూని తమఃపయోనిధిన్
దారున నాచమించి జనతావనుఁడైన సరోజబంధుఁడం
భోరుహ సంభవాండము సమున్నతి శోభిలఁ దోఁచె నంతయున్. 153

ఉ. అంతట బోయ మోపిడిన యట్టి ధనుర్లత నజ్జగించి రే
యంతయు మేల్కనం గనిన యత్తరుమూలము వీడి యింటి క
త్యంతరయంబుతోడుతఁ బ్రయాణ మొనర్చి పథంబునందు పెం
న్వంతఁ దనుం గనుంగొనఁగ వచ్చు సతీసుత వర్గముం గనెన్. 154

వ. వారును తనువుం బాసిన ప్రాణంబులు మగుడ వచ్చినం జూచినంత సంతసంబంది రట్లందఱుం గూడి ప్రియభాషణంబులతో నిల్లు సేరి రంత నతనికిం గొన్ని వాసరంబు లరుగుటయు. 155

ఆ. కలుష మానసులకుఁ గనరానిదియు సర్వ, జంతుసంహతికి ననంతికమున
నుండునదియు నంత్య మొనరించు నదిబల, మైనయదియు మృత్యు వధిగమించె. 156

ఆ. అట్లు చావు మూడ నబ్బోయ కాయాంత, రంబు నంది మేచకాంబుదాభ
దీర్ఘతనుల పాణిధృతదండులం బురో, భాగగతుల నతుల భాసహితుల. 157

తే. స్యంద నాక్షగభీర వీక్షణుల రోష, విస్ఫురద్ఘోర వక్త్రుల విపుల రోమ
యుత మహాకాయులం బితృపతి నియుక్తులైన దూతలఁ గని భయమంది పెలుచ.

వ. వడంకుచుండె నయ్యమభటులును వానిం బట్టుఁడు కొట్టుఁ డీడ్చుఁడు పొడ్చుఁడు కాల్చుఁడు ప్రేల్చుఁడు కోయుఁడు డాయుఁడని యాటోపింప నందొక్కరుం డున్నవారి కిట్లనియె. 159

ఉ. ఓయమదూతలార వినుఁడోపిక వీని విధించు భంగి మె
ట్లోయన నేల యీ యధముఁ డుత్కటపాపుఁడు తప్తవాలుకా
తోయము లుండి నంగుడువఁ ద్రోయఁగ దైలకటాహ మయ్యెడన్
జూ! యతి శీఘ్రమీతనికిఁ జూపుఁడు సంయమనీపురస్థలిన్. 160

క. అని పలుకుచుండ నాలో, వినుతోద్యత్కాంతియుతులు విశ్రుతకీర్తుల్
తనుదీప్తు లబ్జజాండం, బును గప్పఁగ వచ్చి రటకు భూతేశభటుల్. 161

వ. అట్లు చంద్రమండల సన్నిభంబగు విమానం బీశ్వరాజ్ఞ శిరంబులం దాల్చి విద్యాధర రూపంబులతోడ వచ్చి శివానుచరులం కిలుఁ బరివేష్టించియున్న యమదూతలం దఱిమి యతని దివ్యరూపుఁగా విమానంబునం దాసీనుఁ గావించిన నివ్వెఱఁగంది జితులైన యామ్యులు శైవులం జూచి. 162

—(*) శివదూతా యమదూతల సంవాదము. (*)—

ఉ. ఓయతులప్రభావ విభవోజ్జ్వలులార యెఱుంగఁ జేయుఁడీ
ట్లీయెడ మా వశుండయిన యీ యతిపాపుని బుచ్చికొంచుఁ బో
నేయెడ కౌనొ మీరు దివిజేంద్రుని యుక్తులొ శార్ఙ్గిదూతలో
కాయజవైరివారొ యలకాధిపు బంటులొ పాశిచారులో. 163

ఆ. పాపవృత్తిఁ జేసి పదఁపడి యొన్నియో, జంతుసంహతులనుఁ జంపి మిగుల
క్రోధదృష్టిఁ గలిగి క్రుమ్మరుచుండెనీ, యవని నిక్కరాతుఁ డహరంబు. 164

క. కడుదీర్ఘకాలమిచ్చెడుఁ, గుడుఁగక మా వలన నరకకూపంబులలో
బడి బాధ లుత్కటంబుగఁ, గుడువఁగ నగుఁ గాక యిట్లుఁ గొంపోనగునే. 165

చ. నియమిత ధర్మసంహతులనెక్కని చేయఁగ మాని పాపసం
చయములఁ బాలుపడ్డ మనుజాధము నందునె మేలు విష్టపా
ప్రియములు సేతలొప్పను విరించికి నైనను నిట్టి పద్ధతిన్
నయనిధులార యిచ్చెడుఁ గొనర్చిన పుణ్యము దేమొ చెప్పుఁడీ. 166

క. వెఱఁగయ్యె మా మనంబులఁ, గఱసేయక వీనివ్యోమయానంబున న
క్కఱ నుంచు టెంతయును మీ, తెఱఁగంతయు మాకు నేమి తెలియక యున్కిన్.

వ. అట్లు మీ వృత్తాంతం బెఱిఁగింపక వీనిఁ జేకొనిపోయెద మన యమనియుక్తుల మగు మే మలతింబోము మీ శిరంబులు వగిలించి మిముఁ రక్తసిక్తతనులం గావించి చేకొనియెదమని నిష్ఠురంబుగాఁ బలికిన శివానుచరు లప్పలుకులఁ గోపింపక మందహాసం బొనరించి నయోచిత వాక్యంబుల యమదూతల కిట్లనిరి.

సీ. వినుఁడు సంయమనీశ్వరుని దూతలార సంభ్రమము దక్క సరోజభవుని మొదల
సృజియించె నెవ్వాఁడు విజితుఁ జేసె నెవండు, చయ్యన మీ నిజస్వామి నెదుర
నెవ్వాండు ప్రీతిమై యేలంగఁ బూర్వద, క్షిణప్రతీచీయుదీచీముఖముల
శక్రాంతకాంబుధీశ్వర ధనేశ్వరులను, దా నుంచె నెవఁడు భక్తావనుండు

ననఘుఁ డట్టిదేవుఁడౌ మాకు నేలిక, యతనియాజ్ఞ శిరములఁ దాల్తు
రంబుజాసనాదు లౌనని తన్ని యో, గమునఁ గలిగెగాక గమనమిందు. 169

తే. అని యెఱింగించి యయ్యంక, లాఖ్యవ్యోమ,
యానయుతు శిరములఁ దాల్చి యభవులోక
మునకుఁ గొంపోఁ బ్రయత్నింప నినజభటులు
పేర్చి దురహంకృతిని నడ్డపెట్టుటయును. 170

క. ప్రళయాగ్ని కల్పులై శ్రీ, గళకింకర వరులు మండి గైకొని బాహా
గ్గళములఁ బరిఘాయుధముల, పెళుపెళ్లున మోది రేచి ప్రిదుల శిరంబుల్. 171

చ. మదయుతులై యెఱుంగ మతిమంతులు ధర్మము లూది చెప్ప సం
మదమున వాలకింపక సమస్తము మద్వని యుక్తమంచు ప్ర
ల్లదములు పల్కి యార్యులఁ గలంపఁ దలంచు దురాత్ములం బటు
ప్రదరములన్ వధింపఁగ ధరాధర ధన్వినియోగమౌగదా. 172

క. దండధరు భటులనవ్విధిఁ, దండన మొనరింప రక్తధారలు వెలుచన్
దుండములఁ గ్రుక్కుచుం భూ, మండలమునఁ గూలి రయ్యమానుచరవరుల్. 173

—(*) యమదూతలు పరాజితులై యమాంతికంబు జేరుట. (*)—

వ. అట్లు వారి పరాజితులఁ గావించి శివానుచరులయ్యంకిలుం గైకొని నిజలోకం
బున కరిగిన కొంతవడికి యామ్యులుం దెప్పిరి రక్తసిక్తంబులైన దేహంబులు
సంధ్యాకాల పయోధరంబుల ననుకరింప నిజపురమార్గంబు పట్టి చని యందు.

సీ. కాలాంతకుఁడు మృత్యుకామాది షడ్వర్గ, మనురాగ విస్మృత్యహంకృతులును
నటనున్న శీత జ్వరాదులుఁ గుట్టు క్షు, యాదిదుర్వ్యాధులు పేదరికము
శోకంబు నిద్రయు నాకలి దప్పియు, సత్యంబు శ్రమమింద్రజాల ముకలి
వెండియు వివిధంపు వృజినముల్ తంద్రయు, మూర్తుల ధరియించి మోదమలర
నోలగింపఁగ సమధిక శ్రీల బుధులు, నేడ్వురుం గూడి ధర్మము లేర్పరింపఁ
జిత్రగుప్తుండు లిఖియింపఁ జెలువుఁ దనర, నిందుకొలువున్న సంయమనీశుఁ జేరి.

క. పుచ్చిన బోయినవారల, మచ్చుట మా వెతల సెప్పనలవియె యయ్యో
చచ్చితిమి చచ్చితిమి యీ, వచ్చుట యెట్లో యెఱుంగ వశమే మాకున్. 176

వ. అని మిగుల నాక్రందనంబు సేయుచు జంఝానిల సంయుతంబైన వర్షాసమ
యంబునం గూలు మహీరుహంబుల చాడ్పున రక్తబిందు సందోహంబులతోడ
సభాంగణంబునం జాల్పడినఁ జూపఱులు మున్నెన్నండు లేని పరాభవంబై మహా
ద్భుత వ్యాకులమానసులై చూచుచుండి రప్పు డయ్యముండు. 177

చ. బహుళతరంపుభీతి కలప్రాణుల కెల్ల నొసంగు కృత్యమున్
సహజముఁ గాఁ దనర్చు తనకుత్రతకైన పరాభవంబు దు
స్సహమగుటన్ మహాక్రుధ విశంకటుఁడైన సమీప వర్తులై
యహరహ ముందువారు భయమందిరి చూడఁగఁ గాలుఁ డాదిగన్. 178

క. అటువికట భ్రూకుటితట, నిటలుఁడు రూక్షేక్షణుండు నీరజ తేజో
ద్భటుఁడై మండుచుఁ దనముం, దటివారల రక్తసిక్తతనులం భటులన్. 179

వ. చూచి మహాదర్పంబున నిట్లనియె. 180

ఆ. ఊరడిల్లి మీర లోపిక మిమ్మిట్లుఁ, జేసియున్నవారు సిద్ధసాధ్య
గరుడ తుషితయక్షగంధర్వ విశ్వామ, రాములందు నెవ్వఁడదియు చెప్పుఁడ. 181

క. వారల మనుమాడఁగ దు, ర్వారపరాక్రములు వొప్పు వారు మదీయా
జ్ఞారాధి మృత్యుకాలురు, బోరన నన భటులుఁ గేలు మోడ్చియు మనకున్. 182

వ. ఇట్లనిరి. 183

సీ. అఖిలేశ మాకైన యట్టియీ ఘనపరా, భవవార్త వినుమట్లు భవదనుగ్ర
హంబునఁ జిత్రగుప్తాదేశబద్ధుల మైవ్యాధుఁ దేఁబోయి నట్టివార
మప్పాపుఁ బట్టి చయ్యనఁ దేఁ బ్రయత్నింప, ఘనమేఘవారనిస్సాక్రాంతచంద్ర
మండల సదృశులై మహాకంబ రమ్మున, నుండి శ్వరుని దూత లొక్కరీతి
నరుగుదెంచి యదల్చి నిజాయుధముల, మాకరమ్ములుఁ దునుమాడి మమ్ము దరిమి
వాని తమ తెచ్చి యున్న విమానమునను, దివ్యరూపునిఁ గావించి ధృతిని నిలిపి.

తే. ఉత్తరాశా గమనులుఁ గానోహటింప, కేము వెంటాడి యంకిలనాము మరల
బట్టఁబోవారు మిగులఁ దోర్బలము మెరసి, మమ్ము పరిఘులఁ జదిమి పథమ్ముఁ గొనిరి.

వ. ఇట్లు మా యేలినవాని యానతిం జేసి వచ్చితి మితం డధిక పాపుండని పలికినను
మమ్ము కారులాడి వానిఁ గైకొనిపోయి రిదె కనుంగొను మనుచు. 186

క. కాయములుఁ జూపి యేడ్చుచు, నీయట్టి విభుండు మాకు నెగడి యిటుల బా
ధాయుత పరిభవమును మే, మీయెడఁ బొందితిమి యింక నేమని చెప్పన్. 187

క. అనివిన్న నైన దూతలఁ, గని యిట్లని పలికె మిగుల కడఁ కందనచం
తనునుండు చిత్రగుప్తునిఁ, గని యించుక సంశయమ్ము గదురఁగ మదిలోన్. 188

తే. శివగణంబుల చేత నా శివపదంబుఁ, జేరఁ గొంపోవనా బోయ చిత్రగుప్త
యేమి ధర్మవు నలిపె ముస్నేర్పడంగ, నుడువు చెచ్చెర నానాతఁడొడయ నికిని.

వ. ఇట్లనియె. 190

మ. అనువార న్వినుధర్మ కార్యము లన వ్యాధుండు వర్తింప కుం
డిన లేకుండెను వాని పేర్లయిన వర్ణింపంగ విన్నట్టి వాఁ
డునుఁ గాఁడెందును విన్క లేదటుల తోడ్తో నున్న యన్నాళ్లు వే
టను హింసించిన జంతుసంహతులు తోడా లక్షలో కోటులో. 191

క. లెక్కించి ప్రాయుటకు నే, నొక్కఁడ దిన దినము సాల కుండుదు వాఁ డీ
చక్కివివిధంపు నరకము, లొక్కట నను భవము సేయు నొప్పెడు వింటే. 192

తే. అనిన చిత్రగుప్తుఁ గని వెండి యిట్లను,
శమను డింక నేల సందియంబు

మనము శివుని మ్రోలఁ జని యిప్పుడే వృజి,
నముల పటము మఱియు గ్రమముతోడ. 193

—(*) యముండు సపరివారుండై యీశ్వరు సన్నిధి కరుగుట. (*)—

వ. ముద్రయు దండపాశాది సాధనంబులు మున్నిడి యిట్విధం బెఱింగించి యింక మనకెట్టి యధికారంబుఁ గలదో తెలియ నడుగుద మని యాక్షణంబ ప్రయాణంబై పరిజనంబులతో నప్పుడు. 194

క. కాటుక కొండం బోలిన, మేటి లులాయంబు నెక్కి మిహిరాత్మజుఁ డ
క్కైటభజిన్మిత్రుని పద, మాటోపము సెలఁగ నరిగెయందు మొదలఁ దాన్.

చ. వరమతి నిందుశేఖరుని వార్తికుఁ డై మొన నుండు నంది చే
సరగ నిజాగమంబు హితసంగతిఁ బంచిత దాజ్ఞఁ దత్స భాం
తరమును సొచ్చి కన్గొనె నితాంత కృపాగుణ ఝాటుశాంబరీ
స్ఫురితవ నాటునోమధిపజూటు విఖండిత దుర్నిశాటునిన్. 196

వ. మఱియు నందు వసించియుండు బ్రహ్మ విష్ణ్వింద్ర వహ్ని వరుణ కుబేరుల గంగాది నదుల హిమవదాద్యహార్య యక్ష గంధర్వ చారణాదుల మహార్హులం జూచి మ్రొక్కి వారివారి వృత్తాంతంబుల వినుచుండి కొంతవడి శభవుండు భవదీయ స్థితి యేమని కనుసన్న నడిగిన యముండు కృతాంజలియై వినయంబున నిట్లనియె.

తే. దేవదేవేశ నతపోషదివ్యపురుష, నీకు మ్రొక్కెద సత్కృపా స్తోకచరిత
చిత్తగింపుము భవదాజ్ఞఁ జేసి నిర్జ, రాసురాదులు వర్తించునట్లొనర్చి. 198

క. తమతమ యధికారంబుల, సుమహితమతి నుండఁ గంజజుండు జగంబుల్
రమణ సృజింపను హరియున్, గ్రమమున రక్షింప మిగుల గారవయుక్తిన్. 199

వ. స్వర్గమర్త్య పాతాళంబులను మూఁడు లోకంబుల యునికిం జేసి తక్కినవారయ్యయ్యధికారంబులం బ్రవర్తింతు రది మొదలు మీ యానతి మా యధికారంబులు మాకు సెల్లుచుండు నిట్లు. 200

తే. సత్యమింతయు సత్యంబు సత్యమనుచు, సర్వులుం బల్క నిచ్చి తీశ్వరవరంబు
లమ్మహాసత్యముననె చరాచరాది, జంతు సంగతమైన యీజగము గలదు. 201

క. నిటలాక్ష నీవ యీగతి, కుటిలత సత్యంబుఁ గమువఁ గోరిన నొరులిం
కెటు సత్యముఁ గాపాడెద, రిటులైనం జగము క్రుంకదే యొక్కత్రుటిన్. 202

మ. సకలలోచ్చస్థితి కారణం బయిన యీసత్యంబు లేకున్న వా
రకలోకంబున కక్షులై వెలయు చంద్రాదిత్యులం బర్వ మొ
ప్పక స్వర్భానుగ్రహించెదున్ గబళముల్ భక్షింప రెండుం గ వే
చక సంవర్తము విశ్వమున్ సలుపు నాశం బాశు గాఁగ్నుల్ వెసన్. 203

వ. మఱియు సత్యంబు లేకునికి సముద్రుండు తరంగంబులను తన నిడుద హస్తంబుల వేలంబు లతిక్రమింప సాచి లోకంబునంతయు లోఁగొను కులాద్రి దిగ్గజానంత వరాహంబులుం గమఠ పరివృఢుండు భూభారంబు నిర్వహింపమిం గ్రుంకు

నభంబు చంద్రసూర్య తారకాది శూన్యంబై భువనంబునకు నిరవకాశంబైన
యంధకారం బొసంగునట్లు జగంబంతయు నడంగి సర్వశూన్యంబైన నీ వొక్క
రుండవై యుండుమని ధర్మరాజు ధర్మనిష్ఠురంబులాడి వెండియు. 204

క. అసమర్థుఁడ త్వత్కరుణా, రసహీనుఁడ నైన నాకు రజితాహార్యా
వసథ యికేటికి మీకై, వసమునకుం గొండు పిదప స్వాతంబునకున్. 205

క. వచ్చిన వారికి నిన్నియు, నిచ్చెదు ప్రాభవముతోడ నిదె యనుచుం దాఁ
జెచ్చెర ముద్రా దండము, లచ్చనటుల విధి విధంబు లమరిన పటముల్. 206

వ. అయ్యాభవు పురోభాగంబున నునిచిన సభనుండు సభ్యులందఱు నివ్వెఱగంది స్వ
జీవనంబులందును సందేహంబు నొందమి భయభ్రాంతులై వడంకఁ జూచి యీశ్వ
రుండు విస్మితుండై యందఱువినఁ గృతాంతున కిట్లనియె. 207

చ. ఎవనికిఁ జెల్లి వచ్చు నిటు లేపున నాడఁగ నిట్టినీకు ని
క్కువము పరాభవంబు సభఁ గూడినవారి మనంబులెల్లఁ గా
కు వడఁగ నివ్విధమ్ము ననఁ గూడునె మిత్రజ సర్వరక్షణ
ప్రవణుఁడ నే నిటుండ విధు రంబెటు లోకము సత్య సంభృతిన్. 208

క. విలయం బెటులగు కాలముఁ, గలయక సత్యంబు నేనుఁ గడచితి నెటు ని
ట్టలము వచింపుము నీ వి, మ్ములఁ సాధనములను దలగు మూలముతోడన్. 209

క. నావుడు వైవస్వతుఁడ, ప్పావకనయనునకు నిట్లు పలికె నఖిల సం
భావిత యిప్పట్టునఁ గల, యావద్విధులకును భంగ మైన విధంబున్. 210

వ. భవదాజ్ఞానువర్తులగు ప్రమథులవలనం గలిగెనది నీ వెఱుంగకుండినదే యయిన
నెఱింగింతు వినుము. 211

—(*) యముం డీశ్వరునితో నాత్మానుచరుల పరాభవముం జెప్పుట. (*)—

చ. బ్రదిమిఁగలంత కాలమును ప్రాణులఁ జంపి తదామిషంబుచే
నుదరము పోసికొన్న వృజినోత్కటుఁ డక్కటికంబు లేనివాఁ
డెద నొకవేళ పుణ్యమని యెంచక యుండిన తద్విధం బిడి
ట్టిద యను వార్తనేని నొకటిన్ వినియుం డనివాఁడు వెండియున్. 212

క. సర్వజన దూషకుండుం, గర్వాంధుం డనుచుఁ జెప్పఁ గరణము నేనో
శర్వ నియోగించితి న, క్షర్వుని నిటఁ దెండటంచుఁ గడఁకం భటులన్. 213

క. వారుఁజని తెచ్చుచోటం, జేరి త్వదీయానుచరులు చెచ్చెర శిరముల్
దారించి పరిఘములమా, వారల విడిపించి యిందు వైళముఁగాఁగన్. 214

ఆ. వ్యోమయానమునను పూనిక దివ్యరూ, పునిఁగఁ జేసి యుంచి కొని కడంక
మీరవచ్చి రిందు మీరు వీరలె కనుం, గొనుఁడు రక్తసిక్తతనుల భటుల. 215

వ. ఇట్లు నివ్యాధుం డప్సరోంగనాపరివృతంబైన విమానంబునందు తేజోమయంబైన
మండలంబున వెలుంగు సూర్యునిభంగి విలసిల్లుచుండుటకు. 216

ఆ. పురబహిర్జలములఁ బూనికతో మాఘమ, జ్జనము సలిపినాఁడొ జన్మముల స
దక్షిణలుఁగఁ జేసి ధన్యత నొందిన, వాఁడొ తెలియరాము వీఁడు మదికి. 217

క. పాపులయెడ నీవిటుకృపఁ, జూపఁగ నేఁ గార్యమునకు సాలయుక శిక్షా
ప్రాపకుఁడఁగాఁగ నేటికి, నీపదములఁ గొల్చుచిందె నివసింతు నికన్. 218

వ. నాకు నీ యధికారంబుతోడఁ బనియేమని ముద్రాదండ పటంబులం జూపిన
శివుండు నవ్వి యమున కిట్లనియె. 219

చ. వనమృగ సంహతిం జదిమి వానితనూపిసితంబు చేతనే
మొనయఁగ జీవనంబు దినముల్ వెనుపుచ్చెడుబోయ కాననం
బున నొనరించి నట్టియురుపుణ్యమెఱుంగ సుచిత్రగుప్తుఁడీ
యనశివరాత్రిఁ బస్తుఁగసి యామ చతుష్కము నిద్రలేకయున్. 220

—(*) శివుండు యమునకు శివరాత్రిమహిమం బెఱింగించుట. (*)—

క. మాలూర దళములను నత, లోలు ననుం బూజసలిపె లోకస్తుత్యం
బై లలినొప్పిన తత్ఫల, మేలాగునఁ బోవు భవ్యమీయక వృథఁగాన్. 221

తే. అవి రుధిరమాంస శుక్లమేదోస్థిమజ్జ, వసలునను సప్తధాతు ప్రవర్తితంబు
నైనతను కల్మషముఁ గాల్చి యమలహేము, సురుచిరాంగ మొసంగ విశుద్ధి నెరపి.

వ. అనిన శంకరునకుఁ జిత్రగుప్తుం డిట్లనియె. 223

సీ. అఖిలేశ వీఁడరణ్యమ్మున నున్నవాఁ, డదిశివరాత్రిఁగా నాత్మ నెఱుఁగఁ
డంతికమ్మున నున్న యదిశివలింగమ్ముఁ, గా నెఱుంగడు మృగగణముఁ ద్రుంప
దృష్టికడ్డంబైన త్రెంచి వాల్గొమ్మల, పత్రముల్ ధరవైపఁ బడియె సందు
పూజాప్రయత్నమెప్పుడు లేదు తన్మతి, మృగహననేచ్ఛఁ దామేల్కసంగ
గని యెజాగారమని కాదు తిననగమాంస, మింతదొఱకమి పస్తుండె నిది వ్రతోప
వాసమని కాదు వీఁడట్టివాఁడుగాక, పరమనియతుల కందనిపదముపడసె. 224

వ. అనిన మగుడ నీశ్వరుండు. 225

ఆ. వ్రతముతలఁపు లేమి వడినింతఁ గలిగిన, తలఁపుఁగలిగి నియమతంత్రులగుచు
భక్తినాచరించువారికి మోక్షంబు, కరతలామలకముగాక యున్నె. 226

ఉ. కావున పెక్కుదానములు గైకొని సేయుటకంటె జన్మముల్
పావనతం బొనర్చుట తపంబులు సల్పుటకంటెఁ జాలభ
ద్రావహమై తనర్చు శివరాత్రిమహావ్రత మెక్కుడయ్యె నో
ధీవరులార సంశయము దీర నిజంబని నమ్ము డింతయున్. 227

వ. వేదప్రసిద్ధంబులైన మీమీయధికారంబులనుండుఁడీ కింకరులు ప్రమథులచేఁ బరా
భవింపవడితిమని శంకింపం బనిలేద హంకారులు నల్పమతులగువారికి దుఃఖావ
మానంబులు బలవంతులై నిరహంకారులగువారికి సుఖగౌరవంబులు నే నొసంగు
చుందునని శంకరుం డానతిచ్చుటయు నందఱు సాష్టాంగంబు లిడిరందు. 228

మ. భయహీనస్వమనోంబుజాతుఁడగు చున్ వైవస్వతుం డప్పు డెం
డియు ముద్రాపటపండ ముల్గొనిహితాస్వీతంబుఁగా మున్నుదాఁ
బయనంబై చనుదెంచియున్న పథమున్ భవ్యస్థితిం బట్టిపో
యియథాస్థానమునం బ్రభుత్వమును హాయింజేయుచుండెన్ నృపా. 229

—(*) యముండు నిజస్థానంబున కరుగుట. (*)—

మ. అటనబ్బోయ మహేంద్ర వైభవముల న్గనాత్మందనుం గోరున
చ్చటికిం జేరు విమానమామర వధూసందోహ సంసేవ్యము
త్కట తేజోయుతమైన దానిఁగని వేడ్కన్నిత్య సంచారియై
దిటమారం జిరకాలముం డెరజతాద్రిం దేవలోకంబులన్. 230

వ. అట్లు మహాభోగియు ప్రమథగణప్రధానియునై యుండెనని మఱియు నీశివరాత్రి వ్రతంబెఱుంగకయ జాగరణోపవాసంబులు వానిపూర్వ సుకృతంబునం గలుగ నంతఁ గృతార్థుఁ జేసి శివసాయుజ్యంబు నందించిన నీవ్రతప్రభావంబు వింటేఁ గదా యింకనధిక శ్రద్ధయుం గలిగి భక్తినాచరించు వారిఫలంబ సదగునే యనివశిష్ఠుండు దిలీపునకుం జెప్పి వెండియు. 231

క. శివరాత్రి యివ్విధంబున, శివపదమందించె వ్యాధుఁ జెచ్చెరమాఘం
బవుననభీమైకాదశిఁ, శివరాత్రిం గూడి నెలల శ్రేష్ఠంబయ్యెన్. 232

క. ఇమ్మాసమ్మున దానము, లిమ్ముగఁ బాత్రులకు నిచ్చి యెలమి న్మఖముల్
సమ్మతి సదక్షిణలుఁగా, నిమ్మహిఁ జేసినను ఫలము నెక్కుడొ సంగున్. 233

వ. అనిన దిలీపుండు వశిష్ఠుం జూచి మునీంద్రా. పరమ పుణ్యాత్ముండగునం కిలు చరిత్రంబు వినినామనంబు సంతసించె లోకంబునం గలుగు వ్రతంబు లన్నియు నుత్తమంబులై యభీష్టంబు లొసంగుచున్నను బునర్జన్మ కారణంబులై యుండె నీవ్రతం బట్లుఁ గాకుండి హరిమేధఫలంబున కన్నమిన్నయై దీనిప్రభావంబ వాఙ్మనసగోచరంబై యున్న యదిదీని నాచరించు తెఱంగు సవిస్తరంబుఁగా నెఱుంగఁ గోరెదనని నమస్కరించినం గరుణామయుండగు గురుండు వినుమని రాజున కిట్లనియె. 234

—(*) వశిష్ఠుండు దిలీపునకు శివరాత్రీ వ్రతవిధానము జెప్పుట. (*)—

క. జననాథవర త్రయోదశి, ననువార నిరశనుఁడయ్యు నతివకు వెలియై
యనురాత్రి జాగరించియు, దిననాథో దయమునందు తెఱగొప్పంగన్. 235

వ. నిత్యకృత్యంబుం దీర్చి చండాల దర్శన స్పర్శనాలాపదూరుండై పుణ్యవాహినీ నిమజ్జనంబుఁ గావించి పరిశుద్ధాంబర ధారియై సూర్యోపస్థాన దేవతార్చనాదులు సలిపి మహేశ్వరాలయంబు సొచ్చి యదియు. 236

క. కలయంగ గోమయంబున, నలికిల తాంతములుఁ జల్లి యమలాం బువులి
మ్ములఁ బ్రోక్షించియు నటని, ర్మలమతిఁ బంచామృతమున రహిలింగంబున్. 237

తే. అమర నభిషేక మొనరించి యంతమఱివి,
శుద్ధజలములఁ గావించి సురభి చంద
నంబుఁగుంకుమయుం బూసి పంబియున్న,
భక్తిత్రిదళంబు లగుబిల్వ పత్రములను. 238

క. పూజించి యవలమొల్లలు, జాజులు సంపెఁగలు మున్న సద్భక్తి మెయిన్
బూజకుఁ గైకొని యివ్విధి, నాజగదారాధ్యుపేరు లన్నియు వరుసన్. 239

వ. శర్వోగ్ర భీమ శంకర శివేశాన మహేశ భూతేశ్వర యనుచు నుడువుచు స్నానసంబున సముపార్చించి యగరు ధూపంబువైచి యాజ్యతైలాదుల దీపంబులు వెలింగించి యన్నంబును శివప్రీతికరంబులైన ఫలంబులు నైవేద్యంబు వెట్టియో యీశ్వరా మదర్పితంబులైన గంధపుష్ప దీపనీరాజనాన్నఫలాదులఁ బార్వతీయుక్తుండవై యారగించి సంతసింపు మనునర్థంబుఁగల మంత్రంబులతోడ సంకల్పముం జెప్పి యనంతరంబ నానావిధ వస్తుదానంబు లొసంగి యంత. 240

ఆ. వివిధ నృత్తగీతవీణామృదంగాది, వాద్యయుక్తి నాశివప్రభావ
కథనములను ద్విజనికాయంబు తోడనీ, రాజనంబు లిడుచు రాత్రిమఱియు. 241

క. నియమమున మంత్రపూర్వక, మయియుండఁగ నాల్గుజాలు నటవేర్వేరన్
బ్రియమున జలదూర్వాంకుర, చయగంధ ఫలప్రసూన సర్షపములచేన్. 242

వ. అర్ఘ్యంబు లిచ్చుచు నాయాయర్ఘ్య కాలంబుల శుభంకరా పార్వతీ మనోహరా సర్వపాపవిచ్ఛేదకా భక్త జనశుభ ప్రదా భవ్యస్వరూపా శాంతవిగ్రహా సృష్టిస్థితి సంహారాత్మ కంబులగు త్రిగుణంబులకుఁ గారణుండ వగుమహాత్మా నీవ కానియితఃపరంబెఱుంగ మదర్పితంబులైన యీయర్ఘ్యంబు లన్నియుంగొని దుఃఖ దారిద్ర్య రోగాదులం గుందునమితపాపాత్ము నన్ను సర్వ పాపంబుల వలనం బాపిరక్షింపు మనునర్థంబుఁ గలమంత్రంబులనుడువుచు సంస్తుతించి రాత్రికడచని సూర్యోదయంబుఁ గానప్పుడు. 243

చ. కడువడి సేయుకార్యములఁ గైకొని శంభుమనః ప్రియంబుఁగాఁ
దడయక భూమినిర్జరవితానము తృప్తిసనంగ భోజనం
బిడియటు వెన్కవెండియును నెల్లజనంబుల కన్నమిచ్చియున్
గడకధనాధికుం డయినఁ గాదన కయ్యవనీసు రాలికిన్.

క. గోభూశతాంగ హయకన, కేభగృహాదిక ములున్ మహీవర రుక్మ
త్మాభృచ్ఛాపుమనః ప్రియ, మాభంగి నతండు సేయ నౌ దానంబుల్. 245

వ. అని మఱియు. 246

క. ధనవంతుఁ డధికదానముఁ, గొనకొని చేసినను పేద గురుభక్తి మెయిన్
జనవరయొక సుమమిచ్చిన, నెనయు ఫలంబొకఁ డటందు రిలవిద్వాంసుల్. 247

ఆ. అట్లు విప్రజనుల కన్నంబు వెట్టితాం, బూలదక్షిణాదు లొలినొసంగి
వ్రతసమాప్తిఁజేసి వ్రతి పారణము మాన, మునఁనొనర్ప వలయుఁ గొనితదాజ్ఞ.

ఉ. ఈనియమంబుఁ దప్పక మహీస్థలి నేనరుఁ డాచరించుఁ జు
మ్మానరనాథ యీ వ్రతమహోత్తమ పుణ్యఫలంబు కల్గి వాఁ
డానగధన్వి మందిరమునందును పాపములెల్లఁ బాసి యా
నానితన్ను మెచ్చి ప్రమథాదులు నిత్యము గౌరవింపఁగన్. 249

వ. మఱియు నతని వంశంబున నుద్భవించువారు సూరూపులు భోగపరులు మనోవ్య ధవ్యాధి హీనులునై యుండి తుదిఁ గైవల్య మందుదురని వశిష్ఠుండు దిలీపునకుం జెప్పనతండు వెండియు గురునింజూచి. 250

తే. అనఘ మంత్రాది నియమంబులెల్లఁ దెలియఁగ
నున్న యమ్మాఘులీ వ్రతమూని సలిపి
లేనివారికి తత్ఫలమింతఁబోక
చిక్కు నెవ్విధి యింతయుఁ జెప్పు మనుడు. 251

తే. గురుఁడు ధరణీవరునకుఁ జాకు చ్చెనిట్లు, లవనినాయక యతిరహస్యంబు శివమ నఃప్రియంబును జ్ఞానంబునకును మూల, మైనయివ్విధ మడిగితి వారవినుము. 252

ఆ. నియమ మెఱుఁగనున్న నిలుకడతోనమ, శ్శివహరా యటంచుఁ జేతులార
భవునిపూజ సల్పు పదఁపడి యెవ్వఁడు, య్యనఘుఁ డన్నివిధుల నంది నట్లు. 253

వ. ఏవిధంబుననైనను శివరాత్రి దినంబునం దుపవసించి రాత్రిజాగరణం బొర్చిన సర్వ పాపవిముక్తులగుదు రిట్లువిధవయు నాచరించిన మరుజన్మంబునందు చెడనిమైదు వయుగుఁ గన్యయుంగుమారి యాచరించిన వారికనువగు ఫలంబుఁ గలుగుమఱియు నందఱికిం దుదిశివ సాయుజ్యంబు లభించునిట్లు. 254

ఆ. వేయుఁ జెప్ప నేల విమలమాసీ వ్రత, మధిక భక్తిసలిపి నట్టివారిఁ
బాపములకుఁ బాపి పాయక యీశాను, పదముఁ జేర్చు మిగుల ముదముఁ గూర్చు.

వ. మఱియు నీశివరాత్రి మహిమంబుం జదువుచోట శివుండు ప్రసన్నుండై యుండు వినువారును వినుపించువాని పరమ శివునింగా భావించి పూజించిన హయమేధ శతంబొనరించిన ఫలంబుంగని యిహంబున యశస్సుఖంబులం బొందియంత్యంబు నందు శాశ్వతంబైన శివసాయుజ్యంబునందువారు వక్తయు నట్టి పదంబుం బ్రాపిం చునని వశిష్ఠుండు శివరాత్రి ప్రభావముం జెప్పి వెండియు దిలీపున కిట్లనియె. 256

క. విను కృతవీర్యాత్మజునకు, మును దత్తాత్రేయమౌని ముదమున వినుపిం
చినమాఘ మహిమ మేనీ, కనఘాత్మక తెల్పువాఁడనని మౌనియనెన్. 257

—(*) దత్తాత్రేయుండు కార్తవీర్యార్జునునకుం జెప్పిన మాఘప్రభావము. (*)—

సీ. భూపాల మాహిష్మతీపురాధిపుఁడర్జు, నుం డొక్కనాఁడుఁ దానిండు వేడ్క
రథమెక్కి సహ్యాగోత్రావనిం జేరి త, దాశ్రమ వాసుఁ బ్రత్యక్షవిష్ణు
మూర్తి దత్తాత్రేయు మొగిఁ గాంచి తత్పాద, వనరుహంబులఁ వ్రాలివడి తదాజ్ఞ
నుచితాసనమ్ముపైనుపవిష్టుఁడై యమ్మ, హామహుఁ దిలకించి యధిక భక్తి

ననియె మునినాథ మీదయనఖిలధర్మ, ములను వింటిని వెండి సన్మోదమమర
మాఘమజ్జన ఫలమును మానకేను, వినఁగఁ గోరుదు నొగి జెప్పవే యనుటయు.

తే. పలికె నమ్ముని యినవంశతిలకమున్న, కమలజుని నారదుండడుగంగనతఁడు
చెప్పినది యంతయును నీకుఁ జెప్పువాఁడ, సావధానంబుగా వినుమీవు నృపుడ.

వ. భరతఖండంబన కర్మభూమియై యెసంగు నీ భూమిం బుణ్యక్షేత్ర తీర్థాదులందు చితభంగి స్నాన దాన ధర్మక్రియ లెన్ని యాచరించినను మాఘస్నానంబు సేయని మనుజజన్మంబు నిరర్థకంబట్టి వాని పుణ్యమ్ము సూర్యుండు లేనినభంబు చాడ్పున చంద్రుండు లేని నక్షత్రమండలంబు వడువున నప్రకాశంబై యుండు వెండియుం. 260

క. హరి మాఘస్నానముచేఁ, బరితుష్టుం డైనయట్లు వ్రతదానతప,
శ్చరణాదులఁ బరితుష్టుం, డరయంగా డింతఁ దెలియుమవనీనాథ. 261

తే. మాఘమజ్జన మొనరింపమఱపకున్న, బలిసి బలమునఁ బొల్చి శాశ్వతముఁగాని
మాంసమేదోస్థ్యసృక్స్నాయుమహితచర్మ, గతకళేబరమిది వృథాగాదెమఱియు.

మ. అతిదుర్గంధ పురీషమూత్ర యుతమై యాధారమై రోగసం
హతికిన్ దుఃఖ మనోవ్యథా కరమసత్యంబైన యీదేహ మ
న్యతనూ సంతతికిన్ నిరంతరము నానాదుఃఖముల్ గూర్చు నీ
క్షితిఁ గామాదులఁ జిక్కిదీని గతిఁ జర్చింపంగ మున్నొప్పదే. 263

వ. మఱియు నిక్కళేబరంబు తాపత్రయాది బాధితంబును వార్ధకంబున బలహీనంబై యునాయాసం బొసంగునదియుఁ జంచలంబును నరకద్వారంబునై క్రిమియుం బోలె చర్మభస్త్రికంబడి తుది పక్వంబగుచు శ్వానవంచక కంక గృధ్రాదులకుం భక్ష్యంబగు నిట్టి జలబుద్బుద ప్రాయంబైన దాని మాఘస్నానంబునఁ బవిత్రంబు సేయకున్న నొండు గతిగలదేయని చెప్పి మఱియు నిట్లనియె. 264

సీ. ఆచారరహితమైనట్టికులం బధో, ఋజు భక్తిలేని ద్విజాన్వయంబు
కడఁగి దక్షిణ లొసంగని శ్రాద్ధ కర్మంబు, శ్రౌతక్రియలులేని సత్పాత్రమదియు
వంచనా సక్తమైవరలు ధర్మువుకోప, సంయుక్తుఁడొనరించు సత్తపంబు
పతిభక్తి లేనియప్పడఁతి సద్వర్తన, మలవాటు సేయనియట్టివిద్య
సత్యహీనుని వచనంబు శాస్త్రసమితిఁ, జదువ కుండినవాని విజ్ఞానసరణి
ధర నిరర్థకమైనట్లు తలఁప మాఘ, మజ్జనము లేని జన్మమిమ్మహిని వృథయ. 265

సీ. సందేహి మంత్రమ్ము చలితాత్ము జపమనా, రత దాన జీవనస్థితుని బ్రదుకు
ప్రజకు విరోధమౌ పార్థివ ప్రాభవ, మనుజీవి కిడిన కన్యా స్థితియును
బ్రదిమికై చేయు తీర్థాచరణ వ్రత, తతిశూద్ర దత్తార్థకృతమఖంబు
భస్మమ్మం దిడినహవ్యము ప్రమాది ధనమ్ము, ధనికిచ్చు దానము తానొకండు
కుడుచు కుడుపును లుబ్ధుని విడి ముడియును,
నాస్తికు మతమ్ము శ్రద్ధఁ బూనని పనియును

ధరనిరర్థకమైనట్లుగ తలఁప మాఘ,
మజ్జనము లేని జన్మమిమ్మహినివృథయ. 266

వ. ఇట్లగుటం జేసి. 267

ఆ. మకరరాసిగతుఁ డుగ్రమహికారి యగుచుండ, మాఘవేళ నుదయ మజ్జనంబు
సలుప కుండునట్టి జనుఁ డెట్లు పాపసం, హతికిఁ బాసి స్వర్గ మందఁగలఁడు. 268

క. పంచమహాపాతకులుం, గించిత్సంశయము లేక కిల్బిషములఁ దా
రించియు దీనసురాలయు, మంచితగతిఁ జేరువార లవనీనాథ. 269

ఆ. అధిప మాఘవేళ నరుణోదయంబున, నధికపాపుఁ డెవ్వఁ డైనమమ్ము
సేరి క్రుంకఁ బుణ్యుఁ జేయమె యనిమ్రొయు, చుండు నెల్లప్రొద్దు నుదకములును.

క. పెనుపాపం బులువానిం, బెనసిన పాపములు మాఘవేళం గల్యం,
బున మజ్జన మొనరించిన, ఘనునందుం భస్మమగుచుఁ గడువడిఁ బోవున్. 271

ఆ. అన్ని కిల్బిషమ్ములనఘ మమ్మాఘంబు, రాగ మాకు నుండ రాదటంచు
తన్ని మజ్జనమున తపనాగ్ని హోత్రుల, భాతి వెలుఁగువారి వంకఁ దొలఁగు. 272

వ. అని చెప్పి మఱియు నమ్మాఘస్నాతలు మనోవాక్కాయ కర్మంబులనైనవియు బుద్ధిపూర్వకంబుగా నొనర్పనైనవియు నగు పాపంబు లధికాల్పంబు లన్నియుం బాసి మేఘవిముక్తంబైన చంద్రమండలంబు భాతిఁ బ్రకాశింతు రిదియుంగాక యనధికారులును విష్ణుభక్తిని స్వర్గభోగాధికారులైన య ట్లమ్మాఘస్నానంబున నెట్టివారలైనఁ బరిశుద్ధాత్మకులై స్వర్గంబునందు దురిది యెల్లపాపంబులకు ముఖ్యం బగు ప్రాయశ్చిత్తంబునౌ వెండియు సర్వమంత్రంబుల నుత్తమమంత్రంబును తపంబున నుత్తమతపంబునునై యుండు నీ స్నానంబునకుం బ్రయత్నించుటయు జన్మాంతర సంస్కారంబునౌ నింతయేల సంసార పంక నిర్మగ్నుల కుద్ధరణ సాధనంబు నిదియ యీ స్నాతలు ధన్యులై సూర్యచంద్రాగ్నులం బోలి వెలుంగుచు నమిత భోగంబుల స్వర్గాది లోకంబుల ననుభవింతు రిమ్మాఘస్నాన ప్రభావం బెఱుంగ నయ్యొక్క పురాతన కథనంబొండుఁ గలదు దాని నెఱింగింతు వినుము.

## —(*) వృషకాంగనా చరిత్రము. (*)—

ఆ. జవ్వనంబు మిగుల సౌందర్యముంగల, వృషకాభిధేయ భృగుకులప్ర
భూత బాల్యమందె పాలుపడి వైధవ్య, మునను సౌఖ్యమునకు మొదలఁ గాక. 274

ఆ. అప్పొలంతి మనికి నటుఁ బాసి వింధ్యభూ, ధరము డాసి నర్మదా యుదక్త
టోర్వి నిల్చి నియమయుక్తాత్మయై రమా, ధవునిఁ గూర్చి తా ముదంబుతోడ.

సీ. మితవాక్యజాల సూనృతసదాధార యసంగ జితేంద్రియ సత్స్వభావ
దానతాత్పర్య జితక్రోధ వల్కలాంబరధారిణి విరాగ గురు ధృతియుత
సంతుష్ట చిత్త కృచ్ఛ్రాది నానావ్రత, సంశోషితాంగ నిశ్చలత రాత్రి
దినమష్టభాగ కాల నియమితాశన వృ, త్త్యాత్మైక పోషణయై యదియును

కపిలనర్మద లొక్కచోఁ గలియు చోట, వరుస నఱువది మాఘములరుదుఁగాఁగ
నుగ్ర తపమూని సేయుచు నోడకట్టె, తనువు విడనాడి తత్సుకృతమునఁ బోయి.

తే. యుగచతుష్కము వేమారు లొగినిగడచు, నంతవరకంబు జాతాయతాత్ములోక
మున ననేకవయస్యలు మొనసి కొలువ, నపరిమిత భోగములనుండి యంతమీఁద.

క. దినమణి లోకంబునఁదా, ననుపమభోగముల నంబుజాత్మునిలోకం
బున నుండి సంతకాలము, చనియుండిన యవసరమున జనలోకేశా. 278

క. సుందోప సుందుల నెడపు, రందర వైరులకు వెఱచి క్రతుభుజు లెల్లన్
బృందములుఁ గట్టియాయర, విందాసనుఁ జేరి సలిపి వినతులు మఱియున్. 279

చ. సకలమునీంద్ర సంస్తుత లసద్గుణజాత సరోజనేత్ర నా
భికమల జాతదీనజన బృందభయాపహరైకచింతన
ప్రకటమనోంబుజాత సచరాచరజంతువితాన విష్టప
ప్రకరవిధాత మమ్మసుర భాధలకుం దలఁగించి కావవే. 280

వ. అని వేడుకొనిన నంతయు నెఱింగి.

—(*) బ్రహ్మ సుందోపసుంద వధార్థమై తిలోత్తమను సృజించి పంపుట. (*)—

చ. సురుచిర రూపసంపదలఁ జూడ్కికి నివ్వెఱఁగా వహిల్లనం
బురుహభవుండ యోనిజగఁ బూని తిలోత్తమ నాని మజ్జనం
బరయఁగ మాఘషష్టి మొగినైన మహాఫలయుక్తి నెప్పున
ద్ధరణిసురాంగనామణిని తప్పక సృష్టియొనర్చి పెంపునన్. 282

తే. అచ్చరల లోననవ్వి కచాబ్జముఖిని, ముఖ్యురాలినిఁ గావించి ముదితతోడ
నమృతరసగుంభనంబులై యమరువాక్య, ములఁ జతుర్ముఖుఁ డిట్లని పలికెనపుడు.

ఉ. ఓ యువతీలలామ వి బుధోత్కర మెంతయు నిన్ను మెచ్చన
ట్లీ యదనన్ మదుక్తి మహి కేగియు నయ్యుప సుందసుందదై
త్తేయుల నీదుగాన ఘనతీలస మాన విలాసవైఖరిన్
బాయక చూపి యయ్యసమబాణుని బారికిఁ ద్రోయు మేడ్తెఱన్. 284

క. వారన్యోన్య విదారితు, లై రూపఱఁగలరు నీకు నగు సద్యశమం
భోరుహ నయనా దివిష, ద్వారముఁ గొని యీడుజగతి వారికి మేలౌ. 285

వ. ఇప్పరమహితంబు సేయుమనిన వల్లెయని యప్పల్లవాధరి మెల్లన నొక్కవిపంచి కేలనంది బ్రహ్మలోకంబున నుండి వియన్మార్గంబున భూలోకంబునకరుదెంచి పావనంబులగు నర్మదోదకంబుల నిమజ్జనంబుఁ గావించి యయ్యసురవరులు విహరించు పుష్ప ఫలభరిత నానాతరుస మంచితంబైన వనంబు సొచ్చి యందొక్క యశోకతరుమూల వితర్దింగూరుచుండి విపంచిక మ్రోయించుచు. 286

ఉ. దారువులంకురింప వినుతస్వన మాధురి బర్హి శారికా
కీరవన ప్రియోత్కరము క్రేవలఁ గేవలమాలకింప నెం

తో రహివ్యోమ యానములనుండి విహారము సేయు కిన్నరీ
వారము ప్రాణవల్లభుల పైఁగడు సోలి వసింపఁ బాడెఁదాన్. 287

వ. అట్లు షడ్జంబుఁగాఁ బాడునప్పుడు. 288

క. మహికిండిగి చనుదెంచిన, మిహికాకర కళయొనాగ మెఱయుచుఁ గానం
బహహా యన నొనరించెడి, యహిరాణ్ణిభ వేణిఁ గాంచి రయ్యసురభటుల్. 289

ఆ. అట్లుఁ గాంచి సమ్మదాశ్చర్యమానసు, లైవనాంతి కాంబుజాకరమున
యువతులోలిఁ గొల్వ నోలలాడుచునున్న, యసురవరులఁ జేరి యనిరి యిట్లు. 290

క. సుందోప సుంద దైత్య పు, రందరులారా వినుండు రహి నాకచోపీ
ణందవిలి పాడు నా పూర్ణేందునిభాననను గంటిమే మని చెప్పన్. 291

సీ. రంభా విలసనంబు రహి నూరువుల గెల్చి హేమాభిరుచి మేన నేవగించి
హారిణీ విలాసమ్ము నిరసించి చూడ్కులఁ జిత్రరేఖం జెల్వు చే జయించి
మంజుఘోష నెలుంగు మాత్ర నాజ్ఞకుఁ దెచ్చి, నుదుటిచే శశిరేఖ నుదుటువాపి
చికురమ్ములనెసు కేశినిఁ గ్రిందుఁగావించి, నునుమోవి రుచి ఘృతాచి నిహసించి
తతకకుద్ధృతిఁ బుంజికస్థల నదల్చి, మొనరు నాసిక సౌష్ఠవమ్మునఁ దిలోత్త
మయెయనం బొల్చుచున్న యమ్ముగువ చంద, మరసి వర్ణింప శేషాహికైనఁ దరమె.

సీ. పూర్ణేందు బింబము బురుడింప నగుముఖం, బునకు లాంఛనమింత గనకయున్న
నపరంజి గిండ్లఁ బోలుప నౌను పాలిండ్ల, నగ్ని శిఖావాప్తి నవియకున్న
సముమెన్న నగుమృణాళములంగరంబుల, కంతర్వివరములై యురకున్న[న్న,
సంశయాస్పదమధ్య సామ్యమూన్పఁగఁ బొల్చు, మిను మేఘభృతి సాంద్ర మనకయు
పసకు నెడఁబాసి మధురమె ప్పట్టునందు, లేక యవి సెడు దొండపండే కరణిని
చెప్పనౌ నింక సరియని చెలినిరంత, రారుణానూన మధురమౌ యధరమునకు.

ఉ. పున్నమ నవ్వెలంది ముఖమున్ సరిఁ బోలమిచేఁ గృశించియున్
దిన్నఁగ శుక్లపక్షపు ద్వితీయదినంబున భ్రూలతాకృతిన్
జెన్నయి కాక వెల్కలయి చెచ్చెర నష్టమ వాసరంబునం
దున్నదు రందముం గొనఁగఁ నోచెనె కాని విధుండటొప్పనే. 294

ఆ. నారి కెడసి తూలు నా రాచములు లేళ్లు, కనినయంత నెగసి కదియ రావు
మీలకెంత యుదుటొ మిడిసి వడి వడినేగు, నైన బాలచూడ్కి కౌనె సమము. 295

క. కనమే ముజ్జగములఁగల, వనజాయత నేత్రలం దివౌకసులందున్
మనుజోరగ యక్షామర, జనములలోఁ జూడమిట్టి చాననుమున్నున్. 296

తే. దంటయై యింగలపుఁ గంటి తొంటి వేళఁ, దుంటవిల్తుని కోడక మంటఁ గలిపె
కంటి కానాడు నివ్వాలు గంటిపడమి, నుంటఁ జూచినఁ బడు వెడ వింటిబలిమి. 297

తే. అతను సామ్రాజ్య లక్ష్మి భవ్యంపు మూర్తి, నందివనమున విహరింప నాస్థవొడమి
వచ్చెఁగాఁ బోలు నాఁ దోచు వనితనింక, నెన్ని యో వర్ణనలఁ జేసి యేల చెప్ప. 298

వ. అవ్వేలందియు. 299

సీ. పూఁచిన సంపంగి పూపొదరుల చెంత గొజ్జంగినీటిచా లుకాల్వలమునను
గుజ్జులేమావిమ్రాకులజుట్టి మల్లికావితతి వేల్లితమయి వేడ్కమీఱ
లలిత సుగంధగంధిలమంద పవమాన మొలయింప శశికాంతములవినిర్మి
తంబైన మూలవితర్దినొప్పుగునశో, కము క్రిందతద్వేదికాస్థలమునఁ
బొలుచు చెంగావిచీరనింపలరఁగట్టి, సురుచిరాభరణంబులు వరుసవెట్టి
హస్తకంకణరుతికాలమనుసరింప, వీణ వాయించుచుం బాడు వీనులలర. 300

క. ఇలఁగల రత్నంబులలో, లలనారత్నము దాని లావునమీఱి
మ్ములఁగొనఁదగదే చేరువఁ, గలదానింబోయి యంచుఁగనితద్విధముల్. 301

తే. అనుచు సేనాను లెఱిఁగింప నద్దనుజులు, జలవిహారము సాలించి సత్వరముగ
వారిజాకరముం బాసి వడికృతాంత, దండసదృశగదాదండధారుగుచు. 302

చ. పొరిపొరి వేచితమ్ముఁ గొనిపోనరు దెంచిన మృత్యురూపమై
సురుచిర వేషమై యలరు సుందరిఁ జూచి మనోజ బాణజ
ర్జరితహృదబ్జులై యటుత్వరంజని తత్పరిరంభణార్థమి
ర్వురుఁగదియంగ జూచిరదరుం బెదరించుక లేక క్రూరులై. 303

వ. అట్లు హాలాపాన మదవివశాత్ములు మోహార్తులు నైడగ్గఱియందు సుందుండు
పసుందున కిట్లనియె. 304

క. తమ్ముఁడ సతిఁబోయినసౌ, ఖ్యమ్మునకుం బాసియింత కాలంబును నే
నిమ్మెయిఁ బుచ్చితిదినములనిమ్మానినిఁ గొందునాకు నింతియుఁ గాగన్. 305

క. అనను పసుందుఁడు సుందుం, గని నేనిప్పొలఁతిఁ జాయఁగాఁ గైకొంటిన్.
వినుమింకఁ బలుకకిమ్మెయి, ననవాఁ డత్యంతకుపితుఁడై యిట్లనియెన్. 306

ఉ. తమ్ముఁడ నీవు నాకనుచుఁ దాలిమిఁ జెప్పిన నానటంచుని
క్కమ్మకు సమ్మనింప కిటుఁగూడునె నేఁ గయికొంటి నింకనీ
విమ్మెయిఁ బల్కకుండు మన నీయెడ నీకసదైతి నొక్కనా
సమ్మతిఁగాక యివ్వికచసారసలోచన నీకు నెట్లగున్. 307

క. నావుడు నీసమ్మతినా, కేవలనంగలుఁగ వలయు నీయింతికి నే
నేవల్లభుండ ననవాఁ, డావిలయానలునిఁబోలి యటు మండి వెసన్. 308

—(*) సుందోపసుందు లన్యోన్య విదారితులై కూలుట. (*)—

క. హాలామదమున గడఁగొని, కేలన్నినుఁ గూల్తు దీనిఁ గింబతి నొదున్
బ్రేలకు మనవుడు వాడా, లీలం గద గేలఁబూని తే రమ్మనుచున్. 309

వ. వాఁడుం దొడరుటయు నిరువురుం గదిసి. 310

క. మదమెత్తిన దంతులవలె, మదిశాత్మికీఁగాఁ బెనంగి మఱిమఱి గదలన్.
జదుమంబడు చొండొరుబె, ట్టిదముఁగఁ బోరాడి రూహటింపక యంతన్. 311

వ. అన్యోన్య గదాప్రహారణంబుల నేలందూలిపడి విగతాసువులై రంత నవ్వేలందియు దేవకార్య నిర్వాహణముదావహమైనిజాంగదీధి తులనల్దిక్కుల వెలుంగింపుచువిను న్మార్గంబున బ్రహ్మలోకంబునకుంజని యందజునింగాంచి నమస్కరించుటయు.

ఆ. సంతసించి నలువ చాననీ చేసిన, పనికి మెప్పువచ్చె భవ్యమయ్యె
భానురథమునందు బాయక వర్తింపు, మతివయాతఁడుండు ననంతదాక. 313

క. అనివన జాననుఁడయ్యుం, గనకచ్ఛద వర మొసంగి గ్రహపతి లోకం
బునకనిచె మాఘమాసం, బునన ర్కోదయమునందు ముదమలరారన్. 314

ఆ. స్నానమాడఁ జేసి జనవరయింత స, న్మహిమ మొప్పె సంగ మతియునాస్తి
కులనకాని కోర్కెగల లోకములఁ జేర్చు, నఖిలపాప వితతి నణచి యిదియు.

వ. వెండియు నట్లునియమంబున నిమజ్జనంబు గావించు వారికి సద్గతి లభించుటకు దేయదియు నదుల మహాత్మ్యంబగు నీలోకంబున మాఘస్నానంబున కన్న సద్గతికి సులభంబైన మార్గంబు లేదనితలంపుము. 316

క. అనికార్తవీర్యభూపతి, కినిదత్తాత్రేయమౌని కృపతో వినిపిం
చెననివశిష్ఠుండు దిలీ, పునకెఱిఁగించెముని శాంతపూర్ణాద్యుతితోన్. 317

—(*) ఆశ్వాసాంతము. (*)—

క. మునివిసరావన భూభృ, జ్జనపావన పవనతనయసంపూజితపా
దనలినయుగళా శుభకర, జనపాలన శీల సత్యసౌజన్యనిధీ. 318

క. హరికాండ ధర్మఖండన, హరికాండోపేతకదన హరిసద్వదనా
హరికాండ సదృశ సుందర, హరికాండామోదచర్య హరిసమశౌర్యా. 319

సుగంధి. భూసతీసుతాకళత్రభూభృదాత్మజాంచితా
వాసవాద్య మర్త్యవర్గవంద్యమాని సన్నుతా
భూసురావనా సుమేరుభూధ్రతుల్య సద్ధృతీ
కౌసలేశ పుత్రరాజకుంజరా కృపామతీ. 320

మాలిని. ఖలదనుజవిదారీకామినీ శూర్పకారీ
కలితగుణవిసారీకంధిగర్వాపహారీ
జలదనిభ శుభాంగాశర్వకోదండభంగా
కలుష హనన సంగాకమ్రసౌమ్యాంతరంగా. 321

గద్యము.

ఇది శ్రీరామచంద్ర కరుణాకటాక్ష వీక్షణావాప్త కవిత్వ విద్యాప్రాభవ పసుపర్తి పిన శేషమరాజాగ్రతనూభవ సుధీజనవిధేయ సుబ్బరాజాభిధేయ ప్రణీత శ్రీమన్మాఘపురాణంబునందు పంచమాశ్వాసము సంపూర్ణము.





శ్రీరస్తు.

---

# శ్రీమదాంధ్ర మాఘ పురాణము.

## షష్ఠాశ్వాసము.

---

కందపద్యము.



శ్రీ కమనీయ యశోధన,
నాకాధిప విభవవినత నాగేశ్వర వే
ష్టీకృత భాస్వత్కోటీ,
రాకంజ హితాన్వయేశ రామ మహీశా. 1

తే. అవధరింపుము సూతమహర్షి చంద్రుఁ, డాదరమ్మున శౌనకాద్యఖిల మౌని,
శేఖరులఁ జూచిపలికె వసిష్ఠుఁడట్టు, లద్దిలీపావనీ పతికనియె నిట్లు. 2

వ. అత్తెఱంగున వృతుకాంగనా చరిత్రంబు కార్తవీర్యార్జునునకుం జెప్పి వెండి
యు దత్తాత్రేయుం డిట్లనియె. 3

చ. నరవర మాఘమజ్జనమునందన పొందిన సత్ఫలంబుచే
ధరనొక కోమటీడుమునుఁదా నరకంబుననున్న వాని ను
ద్ధరణ మొనర్చె నగ్రజు నితాంత దయామతిఁ జేసిచూచిని
ర్జరు లరుదంద పాపజనసంహతికింతకు మేల్గుగల్గునే. 4

తే. అనిన మునిజూచి నృపతి యిట్లనుమహాత్మ, దీనినాద్యంత మెఱిగింపుమౌనినాకు
నెవ్వఁడయ్యార్యభవుఁడతఁ డెందునుండె, మున్ను తద్వర్తనంబును మొదలుఁగాగ.

వ. అని యడిగిన దత్తాత్రేయుం డిట్లనియె. 6

—(*) హేమకుండల చరిత్రము. (*)—

సీ. పృథివీశ వినుతొల్లి కృతయుగంబున నిష, ధంబను పురమున ధనమునందు
రాజ రాజనఁగ నూరవ్యుఁడు హేమకుం, డల నాముఁ డుండు సత్కులజుఁడ గ్ర
జన్మాగ్ని హోత్ర పూజాపరుండు నిజైక, వృత్తి వాణిజ్యముం గృషియుఁగాగ
పోషించు నాతఁ డొప్పడు గోమహిష్యశ్వ, సంఘంబు మఱియనిశంబు విక్ర

యమ్ము సేయు క్షీరమాద్యము దధిశర్క, ములును గోమయమ్ము నెలమినింధ
నములుఁగసవు నూనె నానావిధాంబర, ములును మధుగుడాదు లిలఁ బ్రజలకు. 7

వ. మఱియు సతంబు ఫలమూల లవణేక్షు రసాదివస్తువులును శాల్యాధి ధాన్యంబులు జాజి పిప్పలాదులగు నఖిలసామగ్రులు విక్రయించి కోట్యష్టక హేమంబుం గడించి తన్ను నిశంబు లోభులతిలోభియనం బ్రవర్తింపుచుండి కొంత కాలంబునకుఁ దనలోఁ దాను ధర్మంబు విచారించి తద్ధనంబునందు షష్ఠాంశంబు సద్వినియోగంబు గావింపం గడంగి. 8

సీ. భవనముల్ గట్టించెఁ బవన భుగ్భూషున, కతు లార్చనము లిచ్చె నర్థిహారికి
వాపీతటాక కూపాదులు త్రవ్వించె, వేయించె వనములు వివిధతరులు
పుష్పనికుంజములొబ్బాలు పారునటు వెండి, పెట్టిచె నన్నముల్ పేదలకును
పథముల నుంపించెఁ బానీయశాలలు, హితయుక్తిశాస్త్ర సమ్మతములగుచు
ధరఁ బ్రసిద్ధిఁగనిన దానము లొనరించెఁ, దొంటియఘములెల్లఁ దొలగునట్టి
విధులు సేసె దేవవి ప్రాతిథుల పూజ, నములఁ దుష్టి సలిపె క్రమముతోడ. 9

క. తలఁగక యివ్విధమున ని, ర్మలమతి సత్కార్యములు నిరంతర మతఁడున్
సలుపుచు నుండఁగ శ్రీకుం, డలుఁడు వికుండలుఁడు నాగ నందను లెలమిన్. 10

క. ఇరువురు జనింప వారిం, గరమను రాగమునఁ బెంచి గార్హస్థ్యమునన్
జరగుండని సర్వంబ, వ్వరగుణుఁ డాత్మజుల కొసగి వనమున కేగెన్. 11

చ. అతఁడు వనంబులోన నియతాన్నముఁ దంటఁ గృశాంగుఁడై సమం
చిత గతిభక్తసంఘ పరిసేవితు నాత్మగురున్ హరిన్ శ్రియః
పతిని భజించి తత్కరుణ భవ్య తమంబగు తన్నివాసమున్
హితమతిఁ గాంచెఁ దన్ను నిశమెంచఁగ దేవమునీంద్ర బృందముల్. 12

తే. తండ్రి పోయిన పిదపఁ దత్తనయులధిక
ధన మదాంధులు రూప యౌవనమదాంధు
లగుచు దుర్వృత్తిఁ దవిలి పరాంగనార
తీదురోదరములఁ బ్రవర్తింపుచుండి. 13

వ. బుధజనంబుల నుడువు లాలింపక ధర్మకార్యవివర్జితులయి గీతవాద్యాను మోదులగుచు వీణామృదంగ తాళాది వాద్య కుశలులై విటులం గూడి వారాంగనా సంగమంబులఁ గాలంబుఁ బుచ్చుచుఁ దన్నిమిత్తంబునం గొంతయు గంధాంబర భూషా స్రగ్వితానంబులకుం గొంతయు తూలికాది కల్పిత నానావిధ తల్పంబులకుం గొంతయు నారోహించి విహరింప దంతిరథాశ్వశకటాదులకుం గొంతయు హీన సహవాసంబున నభ్యాసంబై యామిషాసవంబులకుం గొంతయు విటగాయకాద్య పాత్రులకు దానంబు లిడుటయందుఁ గొంతయు నుపయోగించి యూషరక్షేత్రంబునం బోయు బీజావలిచందంబున కలధనంబంతయు నిరర్థకవ్యయంబు కడు శీఘ్రకాలంబున గావించి రిట్లుంగాక. 14

తే. అనఘ యొకపరినైన ప్రియంబుతోడఁ, బాత్రదానంబు దేవవిప్రార్చనంబు
కడఁగి సత్కృతు వొక్కటిఁగాని సేయ, రైరి యేమని చెప్ప నయ్యల్పమతులు. 15
క. అటువలె నిర్ధనులైయు. త్కటదారిద్ర్య ప్రపీడితాత్ములుఁగా జం
గటివారు బంధుమిత్రులు, తటుకున రోయుటయు లేకతగ నన్నాదుల్. 16
క. చోర ప్రవర్తననుఁ బురి, వారికి రాజునకు వెఱచి పాసి పురంబుల్
బోరన ఘోరారణ్యా వి, హారాత్మకులై యహరహమయ్యారవ్యుల్. 17
చ. శబరులఁగూడి క్రోడరురుశల్యశశాదులఁ బక్షిసంహతిన్
బ్రబలత వాగురాశర పరంపరఁ ద్రుంచి తదీయమాంసమున్
గబగబ వహ్నిఁగాల్చితిని క్రమ్మఱ వన్యమృగోత్కరమ్ము వే
డబములు పన్ని చంపుమతడంబడ కుర్విఁజరింపుచుండియున్. 18
క. ఒకనాఁడొకఁ డొకఁడైయొం, డొకకొండకు నొక్కఁ డొక్కఁడు గ్రాటవిలో
నికి వేటకేగ బులి కొం, డకుబోయిన వానిఫణి వనాటునిఁ జంపెన్. 19
క. అటుల ప్పాపాత్మకుల, య్యటవిని నొకదినము నందె యసువుల నిడఁగా
నట కేతెంచిరి యముచం, గటిదూతలు త్రాళ్లఁ బెనచి కట్టిరి వారిన్. 20
ఆ. కట్టిపట్టి తెచ్చి కాలుని ముందట, నునిచి యేమి కృత్యమనినఁ జిత్ర,
గుప్తువలన నెఱిగి ఘోర రౌరవమునఁ, గూల్పుఁడనియె జ్యేష్ఠుఁ గుమతి యనుచు.

—(*) శ్రీకుండల వికుండలులు యమసదనంబున కేగుట. (*)—

క. అనుజు వికుండలు వీఁడ, త్యనుపమభోగముల నందనాఁద్రి దివంబుం
బనుపుఁడు పొండనియప్పన, మొనరించిన దండధరనియుక్తులు తోడ్తోన్. 22
వ. శ్రీకుండలుం గొంపోయి రౌరవాదినరకంబులం ద్రోసిరందొక్క కింకరుండు వికుం
డలుం బ్రియోక్తుల గారవింపుచు. 23
క. రమ్మోహో పుణ్యాత్మక, సమ్మదమున స్వర్గసౌఖ్యసౌభాగ్యము లీ
విమ్ముఁగఁగొని సుఖియింతుఁగ, రమ్ముఁగనన సంతసించి క్రమ్మఱ నతఁడున్. 24
వ. అయ్యామ్యుననుగ మించియతని కిట్లనియె. 25
చ. ఇరువుర మన్నదమ్ముల మెయేర్పరుపంగుల వర్తనంబులున్
వరుసఁగనొండె జీవములవాసితి మొక్కదినంబునందె మీ
యిరవునుఁ జేరవచ్చితి మఱదెట్లు మదగ్రజుఁడయ్యె నారకుం
డరుదుఁగ నేను స్వర్గసుఖమందెడు వాఁడనైతి చెప్పుమా. 26
క. ఎఱిఁగిన దాచకు నాకల, తెఱఁగనుటయు యమభటుండు తెలియఁగ నేన
క్కఱఁ జెప్పదగుదు నీకును, వెఱపిడి వినఁదగుదు వీవు వినుమని యనియెన్. 27
క. జననమునజంతు వితతికి, జననీ జనకులును బంధుజనములు భ్రాతల్.
తనుజన్ములాలు నేర్పడు, ననఘా తత్కర్మఫలము నందరు వారల్. 28
వ. అదెట్లన ననేకపక్షికదంబం బొక్క భూరుహంబునందు రాత్రినంతయు నివసిం
చియుండి సూర్యోదయంబుఁగా నెద్దాని త్రోవనదిపఱచు నట్లొక్క కుటుంబం

బున ననేకు లుద్భవిల్లియున్నను వారివారి పూర్వకర్మాను భూతి సుఖదుఃఖంబు
లనుభవించి పాపపుణ్యంబుల నొండేనియాచరించి తత్ఫలంబుల యమామరలో
కంబుల దుఃఖసుఖంబు లనుభవింపం జనువారు నీసుకృతంబు పేర్మి స్వర్గంబుఁ
గలిగె శ్రీకుండ లుండు భవదగ్రజుండైనను పూర్వంబునం దమిత పాపరతుండగు
ట నరకం బనుభవించు వాఁడనుడు మగుడ నయ్యమభటునకు వికుండలుం
డిట్లనియె. 29

ఆ. చిన్ననాఁట నుండి వృజినాను రక్తచి, త్తమ్ము కలిమిసంతతమ్ము పాప
ములనకాని సుకృతములఁజేసి యెఱుఁగనా, చేసియున్న పుణ్యసిద్ధియేదొ. 30

వ. అనిన నంతయునే నెఱింగింతు వినుమని వికుండలునకు యమానుచరుండిట్లనియె.

—(*) యామ్యుండు వికుండలున కతని సుకృతం బెఱింగించుట. (*)—

సీ. యమునా నదీ దక్షిణ మహాతటం బాశ్ర, మముఁగాఁగ వర్తించు విమల తేజుఁ
డంచిత వేదశాస్త్రార్థ విజ్ఞానుండు, హరి మిత్రుఁడు బ్రాహ్మణాన్వయుండు
కలఁడు సుమిత్రుఁడా కాననంబున కొక్క, దినమున వేటకై చనియు నీవు
నమ్మహాత్మునిఁ గాంచి యతఁడు నీపూర్వపు, ణ్యమ్మున సంగడీడై నటింప
సలిపితతనిగూడి సద్భక్తి మాఘ ద్వ, యంబు మజ్జనంబు యముననందు
నొకఁట నీయఘంబులో గివాయ రెండవ, దానఁగలిగె సురపదంబునిపుడు. 32

క. ఆయమునాంబువులే యిలఁ, బాయంజేసెడు నశేషపాపంబులన
ట్లాయెడ మాఘనిమజ్జన, మాయెంగాక నిన స్వర్గమదియీయకున్నే. 33

క. అనితన సుకృతోదంతం, బనువందఁగఁ జెప్పి వెండియనె నతిపాపం
బొనరించిన కతమున నిం, కనువినుమీయన్న వడెడు ఘనదుఃఖంబుల్. 34

క. అసిపత్రంబుల ముద్గర, ముసలాదులనొంపఁబడు సమున్నతితాలా
నుసిఁ గావింపఁగఁబడు నొడ, లసురుసురన నగ్నివేల్పనగు భస్మముఁగాన్. 35

వ. మఱియు నమితబాధలం బొరయుననినవిని నిజాగ్రజవ్యథలకు మనంబున
దిగులంది మొగంబున విన్నదనంబుఁదోప వెండియు వికుండలుం డంతకాను
చరున కిట్లనియె. 36

తే. ఓదయామయ నీవు నన్నాదరించి, పరమహితమిప్డు సేయఁగావలయు సర్వ
విదుఁడ వీవాదువారి కొన్నివిషయముల నె, ఱుంగఁ గోఁతివానిఁ జెలంగునట్లు.

వ. ఎఱింగింపు మని యిట్లనియె. 38

క. మనుజుండే కర్మంబులఁ, గనకుండును దండధరనికాయ్యము దానిం
గనఁజేయు నెట్టికర్మము, లను వారఁగ వీనినాకునానతి నీవే. 39

ఆ. అనిన వైశ్యతనయుఁగని ధర్మరాజాను, చరుఁడు సంతసించి పరమమైన
యర్థమడిగి తిప్పుడనఘాత్మ నామనం, బునకుఁ దోఁచినంతవినువచింతు. 40

క. పురుషుండు మొదలనిర్మల, తరచిత్తుండయ్యె నేనిఁదగ సత్కార్య
స్ఫురణంబున వర్ధిల్లును, వరుసమెయిన్ సజ్జనానువర్తనుఁ డగుచున్. 41

ఆ. అతని విశ్వసించి హితయుక్తి సత్పురు, షాలి వినఁగఁ జేయు నఖిలధర్మ
చయము నీవు నట్టి సజ్జనుండవు వినఁ, దగుదు వేను చెప్పఁ దగుదు నీకు. 42

క. తనరమనో వాక్కాయము, లను సర్వావస్థలందు లాతికి నహితం
బొనరింప నెంచఁ డెవఁడా, యనఁ జూడఁగ రాఁడు దండి యావాసంబుల్. 43

ఆ. చదివెఁ గాక వేదశాస్త్రంబు లెల్లను, దానజపతపో వ్రతాదికముల
నాచరించెఁ గాక యతఁడు హింసాపరుఁ, డయ్యె నేని పొందఁ డయ్య సుగతి. 44

క. వరమగు తపమును దానము, గురుధర్మ మహింస యనుచుఁ గొనకొని మానీ
శ్వరులెల్లఁ బల్కుచుందురు, ధరణీస్థలి దానిఁ దక్క ధర్మముఁ గలదే. 45

తే. ఆత్మవత్సర్వ భూతాని యనిశరీర, బాధకంబుల మైనను పరగ మశక
దంశ మత్కుణ యూకసంతతి వధింప, కుండు నప్పుణ్యుఁడు దయార్ద్ర్యుండు సుమ్ము.

క. ప్రేతతరంగిణి వెండియు, నాతఁడ యశ్మల్య యుతము నంగారక సం
ఘాతమయంబగు నట్టి ప, రేతాధిపపురి పథంపుఁ బ్రక్కేవఁ జనఁడుముల్. 47

వ. మఱియు నెవరు భక్షణార్థులగుచు జల స్థల చరంబులగు మీనమృగాదుల హింసింపుదు రట్టివారు కాలసూత్రంబను నరకంబునంబడి శునకమాంసంబుఁ దినుచు పూయరుధిర ఫేనంబులం ద్రావుచుం గ్రొవ్వరొంపి మునింగి యధోముఖంబులగు కీటకంబులు మేనులం దొలువ నతి భయావహంబగు నంధకారంబు నందుండి కనుంగానకొండొరులఁ బట్టి భక్షింపుచు ఘోరంబుగాఁ రోదనంబు సేయుచు నొక్క కల్పంబుండి యవల నప్పాపులందు విముక్తులై భూరుహంబులు మొదలగు స్థావరజన్మంబుల నంది తద్దుఃఖముం గొంతకాల మనుభవించి యట సింహ వ్యాఘ్ర వృకాది దుష్టతిర్యగ్యోనులం బుట్టి యందుఁగలుగు బాధలంబడి యనంతరం బంధ కాణ పంగు బధిర వామన మహోదర దరిద్ర భాగ్యహీనావటీటాదులుంగా మఱియుఁ బ్రాణిహింసాపరులగు శబర పుళిందాది వంశంబులం జనించి తత్తద్దుఃఖంబు లనుభవింతు రట్లుఁగావున. 48

క. ఇహపర సౌఖ్యంబులఁ దా, మహరహముం గోరువార లవనీ స్థలిలో
మహితాత్ము లగుచుఁ ద్రికరణ, సహితాహింసాగుణులుఁగ జనువర్తింపన్. 49

తే. ప్రాణిహింసాపరుం డిహపరములందు, సుఖముఁ గానఁడు హింసావిముఖుఁ డమ్మఱియు
నందు నిందును సౌఖ్యములందు ననిశ, మతని కెన్నఁగ సాటి రారవని నెవరు. 50

తే. మొగిని నిర్వక్రములు వక్రములు తరంగి, ణీ చయమ్ములు వన్నియు నీరధినిఁ గ
లియు తెఱంగున ధర్మ నిశ్చయము హింస, యందుఁ జేరెడి నదిముఖ్యమైనకతన.

వ. ఇంతయు నిశ్చయమ్ము మఱియు నెవండు లోకంబునంగల ప్రాణికోటి కభయం బొసంగు నతనికి సర్వతీర్థ స్నానఫలంబును సదక్షిణలుఁగ నఖిల యజ్ఞంబు లొనరించిన ఫలంబును లభించునని చెప్పి వెండియు వినుమని యిట్లనియె. 52

తే. శాస్త్రవిహితాన్వయాచార సంహితప్ర, వర్తనుండు నిజాశ్రమప్రకటధర్మ
వర్తనుండును త్రిదివ నివాసులగుదు, రరయ వారలు చూడరు నిరయ మెందు. 53

(*) యమభటుండు వికుండలునకుఁ బాపపుణ్యంబులుం దత్ఫలంబులుం జెప్పుట. (*)

క. వెండియు నింద్రియజయమున, ఖండాశ్రమ వర్ణధర్మ ఘనవర్తనముల్
నిండారఁ గనినయప్పు, ణ్యుం డేగును బ్రహ్మలోకమూరవ్యతుదిల్. 54

తే. అగ్నికార్యము తపము సత్యమ్ము వేద, పఠన మతిథుల పూజయు వైశ్వదేవ
మొగిని సేవిప్రు నందులఁ దగుచునుండు, నతఁడు ప్రాపించునాశతధృతిపదంబు.

క. దేవాలయములు నూతులు, బావులు సత్రములు వివిధవనములు చెఱువుల్
గావించు నతఁడుచూడక, వైవస్వత నిలయ మేగు స్వర్గంబునకున్. 56

తే. బ్రహ్మ పితృదేవ భూత మర్త్యంబులనెడి, పంచయజ్ఞము లాసక్తిపరిఘవిల్ల
సలుపునాతండుదయతోడ వెలయునతఁడు, కనులఁజూడక నిరయంబు గండ్రుసుగతి.

తే. వేదవాదులు వినిహతవిషయులాహి, తాగ్నులందుదు రాత్రి దశాలయంబు
కనులఁ జూడక నిరయంబు ఘనతమెఱసి, యూరుజాన్వయ దుగ్ధాబ్ధి కైరవాక్ష.

క. ఆయోధనమున యోజన, సేయక పిఱు తివక వైరిచేఁ బోరియనిం
గాయము వాసినశూరుడు, పాయకరవిఁ జొచ్చిచేరు స్వర్గంబునకున్. 59

క. శరణాగతులను విప్రులఁ, దరుణుల గోవులను బ్రోవఁదమప్రాణములం
బొరిపోరిఁ బుచ్చినవారా, సురనిలయముఁ గండ్రుశమనుఁజూడకసుఖులై. 60

ఆ. పంగు సంధు వృద్ధ బాలు దారిద్ర్య పీ, డితుని యోగ్యు నెవఁడు హితవుమెఱసి,
పోషణమ్ముసేయు భూమి నప్పుణ్యుఁ డ, ప్పకమె తురగమేధ ఫలముపొందు. 61

క. గురు దైవ తాగ్నిపూజా, పరతంత్రులు సర్వహితులు వ్రతనియతాత్ముల్
పరిపోషించినవారు, ర్వరగోవులఁ ద్రిదివధామ వాసులువీరల్. 62

వ. వెండియు సర్వప్రాణుల కుదకంబు ప్రాణాధారంబుఁగావున నట్టి యుదకం బొక్క
గోవు దప్పిదీరునంతయైన నిల్చు జలాశయంబు నిర్మించిన యతండు స్వర్గనిలయుం
డగు నతనికి స్వప్నాదులయందైన యమసదనంబు దృష్టిం బడకుండునట్లగుటం
జేసి జలాశయంబులు త్రవ్వించిన నరులు తదుదకంబునఁ జరించు జలచరంబు
లుం దజ్జలంబులం దుష్టిఁబొందు స్థలచరంబులు నెంత సంతుష్టిం బొందు నంత
సంతుష్టి స్వర్గంబునం దనుభవించువా రయ్యనఘులు సర్వజీవ జీవనదాతలై
యుండుకతన వారిధర్మం బపరిమితంబై వర్ధిల్లుచుండు నిట్లగుటంబట్టి వాపీకూప
తటాకాదు లేర్పరచిన వా రమితపుణ్యాత్మకులై బహుకాలం బమరావాసంబు
నం దఖండ సౌఖ్యంబు లనుభవించువారు మఱియు వినుము. 63

సీ. అలరఁగ నామ్రభూరుహము లైదు ద్విపంచక మాద్మికంబులున్
వెలగలు బిల్వవృక్షములు వెండియు నామలకమ్ము లిన్ని యి
మ్ములనొగి మూడుమూడువట భూరుహమొక్కటి నింబ పిప్పలం
బులునొకఁ డొండుఁగాగ వనముల్ నరుఁడెవ్వఁడు వేయునాతఁడున్. 64

క. నిరయము కన్నులఁజూడక, సురపదముం జేరఁగలఁడు సుమహిత మతియై
యరయంగ నించు కేనియు, నరుణాతప తాపమందకరిగియు త్రోవన్. 65

తే. అర్క కిరణాలిఁ జొరనీని యధికశీత, లానిలచ్ఛాయ నమరిన వైదునొండె
పదియు నొండేనిపథమునఁ బాదపములు, నాటిపెంచిన నరుఁడందు నాకపదము.

తే. మఱియు ఫలమూలములను సమంచితచ్ఛ,
దముల సంతృప్తిఁ గనుముని సముదయంబు
తత్ఫలంబున పితృదేవ తలునుఁ దృప్తిఁ,
గం(డు)ఁ గావున ఫలవృక్షగణమునుంచి. 67

వ. పెంచిన యతండు సమిధాజ్యాది వస్తుతతి హోమంబు లొనరించిన ఫలంబును
సతతముం భూజనులకన్న వస్త్రంబులిచ్చిన సార్థక్యంబును వివిధదానంబు లిడిన
సుకృతంబును ననేక మఖంబులు సలిపిన పుణ్యంబునుందప్పక పొందునట్లుఁగాక.

క. వెలయఁగ సుచ్ఛాయాన్విత, ములునయిఫల పుష్పవితతి మొనయుచుత్రోవన్
గలవృక్షంబులనఱికిన, ఖలులందుదు రమితనిరయ కష్టంబులొగిన్. 69

వ. ఇదియునుంగాక వెండియు వినుము. 70

## —(*) తు ల శీ వ న ప్ర భా వ ము. (*)—

సీ. అఖిల పాపహరమ్ము నఖిలేప్సితప్రదమెయ్యది, యెయ్యంట నెద్దిగలుఁగ
నదిపుణ్య తీర్థము ఖాస్పదమై యమ, కింక రావలికి భయంకరమగు
నెద్దాని పరిమళమేపార ఘ్రాణించి పితృదేవ తోత్కరమతిముదమ్ము
నంది తార్క్ష్య యానమైవిష్ణు లోకమ్ము, నను విహరించు ననారతమ్ము
నేనిస్పర్శ యుంపనినజగంగానదులను, నింగినంతటి ఫలమబ్బునిక్కువముఁగ
దేనిదళబీజవితతిధాత్రీస్థలమునఁ, జెడకయుండెడు నందాకకడుముదమున. 71

ఉ. ఎంతయునుండు వారుకమలేశ్వరలోకనివాసులైనిర
భ్యంతరమైహృదీప్సితచయంబటుఁ జెల్లఁదదుప్తి కుల్ నిజా
త్యంతత్రిపూర్వకాఘ నిచయంబులఁ బాసి యెలర్చిదానిని
శ్చింతత నొప్పువేయఁదులశీవనముల్ ముదమారనూరుజా. 72

వ. మఱియు నత్తులశీవనంబునందుం బద్మవనంబునందును వైష్ణవానీకంబునందుం
బద్మలోచనుండు సన్నిహితుండై యుండునత్తులశీదళంబులచే బ్రహ్మాది దేవతలుం
బ్రతిపక్షద్వాదశీ తిథుల నమ్ముకుందు నారాధింతు రద్దళంబులం బూజించినం
బరితుష్టుండైన యట్లు సువర్ణరత్ననిర్మితంబులైన పుష్పంబులం బూజించినం
బరమాత్ముండగు నారాయణుండు పరితుష్టుండుఁ గాడందుఱట్టి తులశీవనంబుం
చి పెంచిననరు లంతకు నెన్నండేనిఁ దిలకింప రింకను వినుము. 73

క. చెలికాండ్ర పగఱ సమరీ, తులఁజూచెడు వారలింతఁదొలఁగని కులని
ర్మలధర్మయుతుల హింసకు, లిలఁబరధనలోభరహితులిందఱుఁగూడన్. 74

వ. విష్ణుదేవునకుఁ బరమభక్తులు వీరెన్నండు యమసదనంబుఁ జూడరారిమ్మహాత్ము
లు సతతంబుం దులశీవనంబునుంచి హరిం బూజింపుచుండు రిత్తులశీ ప్రభావం
బమేయంబు. 75

తే. మఱియు నొకనూఱు బోధిద్రుమంబులారు
భూజములు వేయి మొలవైచి పోషణంబు
సేసెనేనియుఁ గల్గునే శ్రేయసంబుఁ
గలుగుఁ దులసీవనంబు నొక్కండు వెంప. 76

తే. శ్రీధవార్చనకై తులసీవనంబు, బాగుఁగానుంచి పెంచినవారలంత్య
కాలమేగియు నద్దివిఁ గడక నూఱు, వేలసంవత్సరంబులు వెలయుచుంద్రు. 77

క. తులసీదళముల హరునిం, జలజాక్షుని పూజసలుపు సత్పురుషుని దా
యిలుసేర రారు యమదూ, తలు చెప్పఁగ నేలయింకఁ దద్మహిమంబుల్. 78

ఆ. పుష్కరాది తీర్థపూగమ్ము గంగాది, నదులుఁ దులసిఁ జేరి నొదవి యుండు
నవ్విధమున నీరజాక్షాది దివిషద్వ, తానముండు దాని దళమునందు. 79

ఆ. విత్తునాటి పెంచియ త్తరూత్తమదళ, నిచయమున నెవండు నిత్యమంబు
జాక్షుపూజనంబు సలుపు నమ్మహానీయుఁ, డందు నంత్యమమ్మునందుపదము. 80

వ. అని చెప్పి వెండి వికుండలునకు దండధర భటప్రకాండుం డిట్లనియె. 81

—(*) శివారాధన ప్రభావము. (*)—

మ. ఒనరిన భక్తినొక్కపరి నొండె దినంబున మూడుమారులొం
డెను శివపూజనంబు ధరణీస్థలిఁ జేసెడు వాఁడు నర్మదా
జనిత సులింగ మొండె మఱి స్ఫాటిక మొండె స్వయంభవంబు నొం
డెను మణిసిర్థితంబొగి వరణిగ్వరమృణ్మయ మొండె వెండియున్. 82

తే. తివిరి సుక్షేత్ర తీర్థ ప్రతిష్ఠితంబు, నొండె నెందేనిఁ గలిగిన దొండె "ఓంన
మశ్శివాయ" యటంచు సమంత్రపూర్వ, కముగఁ గావించెనేని నిక్కముఁ గనతఁడు.

క. యమలోక వర్తమానము, లమరం జెవినైన వినకయ య్యభవునిలో
కమునంది పదునలువురా, నముచిద్విషులేగనుండ నంతసు ఖాప్తిన్. 84

క. ఖండేందుధరునిభక్తులు, కొండలనుఱు మాడదప్పి గొనకొని త్రాగన్
గాండధి జలమంబరభూ, మండలములఁ గ్రిందుమీఁదు మార్పసమర్థుల్. 85

వ. మఱియు నయ్యసమాక్షు భక్తులు కమలాసన పాకశాస నాద్యమరులనైనఁ దృణ ప్రాయంబుఁ గానవలో కింతురట్టివారిక సాధ్యంబుఁ గలదే సర్వంబు వారికిం గరతలామలకంబై యుండు నింత ప్రభావం బొడఁగూర్చెడు శివారాధన మహిమ నింకను వినుపింతు వినుము. 86

క. కలిగించును సౌభాగ్యం, బలర సురూపంబొసంగు నత్యమలోకస్థుల్
వెలయఁగ సత్య త్యాగో, జ్వలకీర్తి స్థైర్యములును శర్వార్చనముల్. 87

వ. అని చెప్పెనని సూతుండు మగుడ తా నిట్లనియె. 88

సీ. కమలాసనుఁడు సృష్టికర్త యయ్యె సరోరుహాంబకుండు సురసంహారి యయ్యె
బలి వదాన్యుండయ్యె భానుసూనుఁడు దానవీరుఁడయ్యెఁ గార్తవీర్యవిభుఁడు

శౌర్యాధికుండయ్యె జక్కులఱేఁడతి ధనవంతుఁ డయ్యె నా ద్రౌపదియును
గుణవతీమణి నాఁగఁ గొనియాడఁబడె ధ్రువుఁ, డున్నత స్థితికిఁ దా నొప్పె విజయుఁ
డాలమున గెల్చె గిరిశు నెనోలిఁ గృష్ణుఁ, డందె నధిక మహత్వము నయ్యమర మంత్రి
యఖిల విద్యల కధికారి యయ్యెఁ గృత్తి, వాసు సంతత పూజా ప్రభావమునను. 89

వ. మఱియు. 90

సీ. అబ్ధిపాన మొనర్చె నక్కుంభసంభవుఁ, డంబుధి లంఘించె నాంజనేయుఁ
డంభోధిఁ గట్టె నయ్యాజితనూజాతుఁ డటు బ్రహ్మ తేజస్వి యా వశిష్ఠుఁ
డయ్యె మార్కండేయుఁ డయ్యె దీర్ఘాయుష్కుఁ, డఖిల మునీంద్రు లట్లతి మహత్వ
మందిరాత్తి పురసంహారి పూజా ప్రభా, వంబునఁ దన్మహత్వంబు నెన్న
నలవిఁ గాదేరికిం దదీయార్చనంబు, మహిసమంత్రక మైన యమంత్రకంబు
నైనఫల పుష్పపత్ర తోయాద్యలంకృ, తమ్ము లింగముఁ గావింప ధన్యమతము. 91

వ. తత్పుణ్యంబు త్రిభువనంబుల నసమానంబై యఖిల పాపవిచ్ఛిత్తి నొనరించి మనో
భీష్టసంసిద్ధి గావించునని చెప్పి వెండియు యమభటుండట్లు వైశ్యునకు నొక్క
రహస్యంబుఁ గల దెఱింగింతు వినుమని యిట్లనియె. 92

చ. ప్రవిముల మైన శౌరిపద భక్తి గలారగు వైష్ణవోత్తముల్
తవిలి వికుంఠధామము ముదంబునఁ గాంచుదు రాశుభృత్సుతా
ధవు మతభేదులై యొకవిధంబునఁ జూడక యున్నన ట్లుదా
రవగుణులై తలంప నిరయంబును తప్పక వచ్చువారికిన్. 92

తే. హర సమర్పితమైన యన్నాదికంబు, చేతనంటఁగ రాదటు శివుని పూజ
సలిపి కడఁదీసి యుంచిన యలరులాది, యవనిఁ బడవైవ రాదు తోయములగాని.

తే. ఈగ కాలంతమైన మహేశు స్వత్వ, మెఱుఁగ కొండేని నాశతో నెఱిఁగి యేని
నపహరించిన నరుఁడతఁ డపరిమితమ, హావ్యథలఁ బొందు నొక యుగ మరుగనిందు.

తే. దారువులనైన శిలలచేఁ దనర నైనఁ, బూరినైననుఁ ద్రిపురసంహారి కాల
యమ్ము నిర్మించి నాతఁ డాయభవుతోడి, సంతతానందలీలలఁ జరుగుచుండు. 95

వ. అని చెప్పి మఱియు నయ్యంతకానుచరుండు వికుండలున కిట్లనియె. 96

తే. జలజగర్భాంబు జేశు ణేశ్వరులయందు, నేరిఁ గొల్చినఁ దత్తత్కృపారసముల,
కలిమి తల్లోకములనంది ఘనసుఖంబు, లందఁ గలవారు చిరకాలమందు నరులు.

క. ధర్మాత్ములయ్యు నరులిలఁ, జేర్చిని మఠ గోష్ఠ పథిక విశ్రమగృహముల్
నిర్మలయత్యాశ్రమములు, నిర్మించినఁ గాంతు రింద్ర నిలయంబు తుదిన్. 98

క. దీనానాథజనంబుల, కై నిలువఁగ నాలయంబు లవనీదివిజుల్
పూనివసింపఁగ సత్రము, లీనిన్ నిర్మించు జనము లింద్ర పురస్థుల్. 99

తే. వసుధ నివిజీర్ణమై యున్న వలసితోఁటి, విధి సముద్ధార మొనరింప వెలయు పుణ్య,
మదియుద్విగుణంబు నొనటు వదలి కూల్చి, పరగ నద్ధాత్రి వేరొక పనికిఁ గాఁగ.

క. కొనినట్టినరులు బహుహా, యనములు తామధిక దుఃఖ మందుదురు కృతాం
తుసి పురినధికారము గై, కొని నారనవీనఁ నారు గొండ్రు నిరయమార్గ. 101
వ. మఱియు నిమ్మతామరాల యసత్రాదులందుఁ గల పుష్ప పత్ర తోయాన్నాదుల
య్యేతులు మున్న గువారికిం బాపిచేకొనునరు లతిఘోరంబులగు నేకవింశన్నరకం
బులంగూలి బహుదుఃఖంబు లనుభవింపుదురు వెండియు వినుము. 102
క. నరునొకని పుత్ర బంధూ, త్కర పశువర్గంబుతోఁ గృతాంతునిపురిఁ గా
పురముంపఁ గోరసురమం, దిర సత్రాదులకు నధిపతిం జేయనగుఁ. 103
క. అరయక సన్యాసులదా, సరసాన్నముఁ గుడిచి రేని చాంద్రాయణముం
బరిపూర్తి సేయనగుమఠ, వరునంటిన స్నానమాడవలయు సపటుఁడై. 104
తే. ఇందిరావర పద్మగర్భేశ్వరాధి, దేవపూజోప యుక్తమౌదివ్యపుష్ప
వాటిఁగల్పించి నాతఁడు వరసుఖంబు, లనుభవించెడు వాఁడ మరాలయమున. 105
తే. అఖిలలోకోత్త మంబైన యజునిలోక,
మునవసించును సంతత మను సుధా,
నాతిథుల్ పితృగణము ప్రియంబుతోడఁ,
దనివిఁబొవనింటఁ జెందుదు రనఘ యతఁడు. 106

—(*) అన్నదాన ప్రభావము. (*)—

సీ. అనఘ మధ్యాహ్న వేళ గృహస్థునింటి, పజ్జవచ్చిన నతిథి విద్వాంసుడైన
పామరుండైన మూర్ఖతఁబరగు వాఁడ, మైననొప్పును బ్రహ్మసామ్యముఁగఁజూడ.
. కడుదూరభూమిదానడచి యాకలి దప్పి, బడలిక గొన్నట్టి బ్రాహ్మణుండు
మఱియేద్విజుండైన నెఱినాకలిం గొన్న, వాఁడు మున్నెన్నండు వాని నెఱుఁగ
కుండినవాఁడు నీయుర్విని గృహపతి, మందిరంబునఁ దృప్తిఁ బొందఁగుడుతు
రతిథులై చనుదెంచియయ్యజమానుఁడ, త్యంత సౌఖ్యములందు నద్దివమున
నెవనియింటికిఁ జనుదెంచి యేయతిథియు, నన్నమించుక లేదన్న నన్న మోము
తోడఁజను వానితోడన తొలఁగ కేగు, నాగృహస్థుని సుకృతసంహతియు నెల్ల.
. కావున గృహస్థునరు నతిథింబోలిన చుట్టంబులేడ తిథిపూజామహిమం జేసి మున్న
వనీశ్వరులు మునీశ్వరులు బ్రహ్మలోకంబుఁబొంది చిరసుఖంబుల నింతకు నున్న
వారతిథియసి యెఱింగియుండె నెఱుఁగక యొండెనన్న సంతృప్తి నందించిన
యతండు యమునిందిలకింపఁ డట్టియన్నదాత దివ్యమణి ధగద్ధగితంబైన విమా
నంబునంగూరుచుండి యమృతపానంబు సేయుచు నధికసుఖంబునఁ దిదివమునంది
చ్ఛావిహారంబు సేయుచుండి యప్పుణ్యంబునసింపుడు వెండియు భూమినవతరిం
చినను భారతవర్షంబునాఁ బ్రసిద్ధంబైన యిప్పుణ్యక్షేత్రంబున కధిపతియైయవత
రించు మఱియుందదీయాన్న దాన ఫలంబునం జేసి యతండు దీర్ఘాయుష్కుండై
యుండు నన్నంబు సర్వప్రాణులకుఁ బ్రాణంబుఁగావునఁ దత్ప్రదాత ప్రాణదాతయని
సర్వమునులుం బలుకుచుండు రిదియునుంగాక పూర్వకాలంబు నందొక్కనాఁడు.

తే. పుణ్యలోకంబు నందుండి భువిజనింప, వచ్చునొక రాజుకేసరిధ్వజసమాఖ్యుఁ
జూచి మాయధిపుండిన సూతి వలికె, నేమునందఱు వినుచుండ నివ్విధమున.

క. అనఘా త్త కర్తభూమిం, జనియింపఁగ బోయెదీవు స్వర్గము మరలం
గనెదేని యన్నదానం, బొనరుపు మొనరుపు మొనర్పుమున్నని వరుసన్. 111

క. ముమ్మారు పెద్దయెలుగున, సుమ్మాయూరవ్యయీవ సుంధరఁగడు శ్రే
ష్ఠమ్మన్న దానమనినీ, కిమ్మెయి నెఱిఁగించి తింత యెఱుఁగుము మదిలోన్.

క. వేసవినుదకంబులు హిమ, వాసరములనింధనములు పాయక యన్నం
బేసుమతి యిచ్చునీయమ, వాసమునకు రాడతండు వైశ్యకులేశా. 113

వ. అనిచెప్పి మఱియునిట్లనియె. 114

ఆ. అల్పపాపమొండెనధికాఘమొండెను, తెలిసి తెలియకింత సలుపనైన
తద్వినిష్కృతియును తలఁగ కాఱాఱుమా, సముల కొక్కమాటు సలుపఁబాయు.

వ. అట్లుఁగాక యిచ్ఛారతి మెలంగిన నిరయంబుఁ బ్రాపించు మనోవాక్కాయమ్ములు నాబడు త్రికరణంబులం గలిగిన వైననుఁ దత్కాలుమంబులకు బ్రాయశ్చిత్తంబులు వెట్టికొనంజను నట్లు సర్వపాపంబులకుం గృతప్రాయశ్చిత్తుండై పరిశుద్ధుండైన వాఁడు దేవగంధర్వ కిన్నరాదులు పొందు పుణ్యలోకంబుం బొందిసుఖించు మఱియు. 116

తే. అనఘ! గాయత్రి మొదలుఁగా నఖిలవేద, విహిత మంత్రములెల్ల సద్విధిఁబఠించు
వారువేదాధ్యయన పరుల్ వలసినాయ, ముదయములనగ్ని కార్యాదిముఖ్యవిధుల.

క. అనుకూలస్థితి జరపెడి, వనజాత భవాన్వయులను వారక వ్రతులై
దినములఁ బుచ్చెడు వారుం, జనువారలు స్వర్గమునకు సౌఖ్యములందన్. 118

వ. వెండియు. 119

చ. సతతము తీర్థసేవనల సన్నియతాత్మకులైన వారుసూ
నృతనియముల్ జితేంద్రియులు నిత్య పరాన్న పరాఙ్ముఖుల్ కులీ
నతకను వైనవర్తనము నంజెలు వారెడువారు స్నానముల్
హితమతి మూడు వేళలలలిం బొనరించెడు వారునిమ్ములన్. 120

వ. ఇందఱు స్వర్గలోకంబునం దనంత సుఖంబు లనుభవించెడు వారు మఱియు వినుము. 121

ఆ. దాన భోజన ప్రధాన పాత్రత్వంబు, తనదటంచుఁ బఱువుఁ గొనఁగఁ జనదు
పుడమి వేలుపన్ని కడలనుం జర్చింపవలయు నఘదమగుట వాని తెఱఁగు. 122

—(*) నిత్యస్నాన విశేషము. (*)—

క. దినమున్ స్నానము సేయక, మనుజుడు మునుఁ గుడిచెనేని మల భక్షకుడం
చనిమిషులు చూడరోయుదు, రెనయుం బాపంబు నిరయమెంతయుఁ గలుగున్.

వ. మఱియు నతండు భూలోకంబునందుద్భవించినను చండాలాది నీచజాతుల యందుం బొడము దీనంజేసి నిత్యంబును సుస్నాతుండై కులనియతి వడసి భుజిం

పవలయు నాస్నానంబునందునుఁ బ్రాతస్స్నమయ స్నానంబుత్తనుంబదియు నదుల యందైన మహోత్తమ స్థితిం బొలుచు దానదుస్స్వప్న దుర్గోషాదుల వలనిదుఃఖంబులు వాయు మరుజన్మంబునందుత్తమకులజుండగు మఱియు సర్వవిధంబుల నిత్యస్నాత శ్రేష్ఠుండనం బఱగు నిదియునుం గాక. 124

క. ఏనరుఁడైనను మానక, తానొకనింటం భుజింపఁ గ దన పుణ్యంబ
మ్మానవున కొసఁగి వెండియు, మానుఁగఁ దత్కాల్మమను సోమ స్తముఁగొనెడుఁ.

క. తిలలుండిల పద్మంబును, తిలలుంచిన పాత్రయుఁ విప్రదిస్థితి దానం
బిలఁ జేయు నరుఁడు యమునిం, దిలకింపక పొందునతులదివ్య సుఖంబుల్. 126

వ. వెండియుగోభూ హిరణ్యాది షోడశమహా దానంబు లిడినవారును సంక్రమణ వ్యతీపాతాది తిథుల దానంబు లిడిన వారును సూనృతంబులుం బ్రియంబులై యుండు మితభాషణంబులాడువారును నక్రోధనులు నుదారశుమాగుణులు నసూయారహితులు దాక్షిణ్య శీలురు దయాన్వితులు పరమర్మ ప్రకటనా దూరులై తత్సుగుణంబుల మాత్రఁగైకొని ప్రకటించుచుండు సజ్జనులునుం బర స్వముం దృణ ప్రాయంబుఁగాఁ జూచియద్దాని మనంబునందైన నభిలషింపకుండు వారును వీరు యమసదనంబుఁ గనులఁ జూడక స్వర్గంబునకుం జనియందఖండ సుఖంబు లనుభవించి పునర్భవంబునందు పుణ్యభాగ్యులై యుద్భవిపం గలవారు మఱియు. 127

తే. పరులనిందించు వారును పాపమతులఁ, గూడియుండెడు వారును కుమతులగుచు
విలయమగుదాఁ కనరకంపు విసరమునను, ఘోరదుఃఖము లందెడు వారుసుమ్ము.

తే. పరుష వాక్యాలు వలుకును పర్వులైన
నరకగతులు కృతఘ్నులు సారిదిస్నాన
సత్క్రియా వార రహితులు శమనపురని,
వాసులగు వారలూరు జాన్వయులలామ. 129

ఆ. అఖిల తీర్థవితతియందును స్నానంబు, సలుపు వాఁడు విమయసమితితుత్తు
నడఁచు నాతఁడరు గరయ్యామ వాసంబు, నూరుజాన్వయాబ్ధి కైరవాప్త. 130

చ. గొనకొని పుణ్యతీర్థములకుంజని యయ్యెడఁ బాపకార్యముల్
పెనువడ సేయరాద వని వెండియుఁ గూలికిఁ దీర్థయాత్ర సే
యనుఁదగ దెవ్వరేవిడిన నయ్యావి చేకొనరాదు దానముల్
తనకును ధర్మవిక్రయ విధంబును చెల్లఁదదెన్నఁ డేనియుఁ. 131

వ. ఇవి యన్నియుం బ్రాయశ్చిత్త విధులంబోని పాపంబులిట్టి పాపులనిశంబును యమయాతనలం బొందు వారు వెండియు వినుము. 132

ఆ. అధిక పాపసహితుఁడై యున్న నొకపరి, స్వర్ణదీజలముల స్నానమాతఁ
డాచరింపఁ దన్మహత్వంబునం బరి, పూతుఁడయ్యు నరకమునకుఁబోడు. 133

## —(*) గంగాజలప్రభావము. (*)—

సీ. ధరణిచాంద్రాయణాది వ్రతములు భూమి
దానమాది మహాదాన తతులు జపత
పోమఖంబులు వెండియుఁ దీర్థభూమినఘవి
ఛేదనాంచిత కృత్యముల్ వెలయఁ గలవొ. 134

వ. అగ్నియు నాచరించినను గంగాజలసంబంధంబగు నొక్క బిందుమాత్రంబునంద డియఁగలుగు సార్థకంబు నీయఁజాల విదిశ్లాఘంబనియుఁ బురాణంబనియు హేళనంబుఁ గావించుచు సాధారణ జలమాత్రంబుఁగా నెన్ను వా రిరువదియొకతరంబుల తమవారితోఁ గూడి రౌరవంబను నరకంబునం గూలి బహుదుఃఖంబు లనుభవింతు రగ్గంగాతరంగిణి. 135

చ. మొనరు సమస్త ధర్మములకు మూలము వారికి మూలకారణం
బనఘ సరోరుహంబకుని జాంఘ్రివి నిర్గతముం గిరీశమ
స్తనివసనమ్ము నిర్మలము దారమునై విలసిల్లుచు న్కదా
నినవచియింపఁగాఁ దగదె నిర్గుణమై యలరారు నాత్మగాన్. 136

తే. కానవివ్వర్తు లాకారకాండజోద, రాండమున దానికన్న మహాత్మ్య మొప్పి
యఖిల పాపనిబర్హణ మభిమతార్థ, సిద్ధియొనరింపఁ గలుగునె యిద్ధరిత్రి. 127

ఆ. నరుఁడు నూఱుయోజనంబుల దూరంబు, నుండియైన మదిని నిండుభక్తి
గలిగి గంగయంచుఁ గడఁక తో నొడివిన, వానిపాపసమితి వాసిపోవు. 138

క. గంగానదీజలంబుల, మంగళమని స్నానమాడు మనుజు నఘంబుల్
భంగంబులగుచు వేపో, వుంగలుగును విష్ణుపదము పుణ్యవిచారా. 139

ఆ. దానపాత్రుఁడయ్యె తనర గంగానదిఁ, దానమెవ్వఁడేని తనకు నియ్యఁ
గొనక మజ్జనంబుఁ గురుభక్తిఁ గావించు, నట్టిద్విజుఁడు పొందు నమరపదము. 140

## —(*) ప్రాణాయామప్రభావము. (*)—

క. ప్రాణాయామపరుల్ మఱి, పోణిమిఁదను పాతకములఁ బోఁదోలియు గీ,
ర్వాణు ల్తేల్తేలన ని, ర్వాణపదం బందఁగలరు వైశ్యకులేశా.

క. తనరం బ్రాణాయామము, దినము పదార్తార్లుఁగాగ ధృతిఁ జేసిన యా
మనుజుఁడు భ్రూణఘ్నుండై, ననుమణ్మాసంబుల వృజినమునం బాయున్. 142

తే. దాని నిరతం బొనర్చెడు ధన్యతముఁడు, పొందు వివిధైక యజ్ఞతపోజపవ్ర
తాధికుల్ గోసహస్రము దానమిచ్చి, నట్టివారలు పొందని యట్టిఫలము. 143

వ. వెండియు నిరంతర ప్రాణాయామ పరునకు మాసంబున నొక్కమారుఁ గుశాగ్ర బిందుమాత్రంబగు జలంబుఁ ద్రావుచునట్లు శతవర్షంబు లుగ్రతపంబు గావించిన ఫలంబును నుదుట గోపీచందనంబును సిగఁ దులశీదళంబుం ధరించి యానియమంబున నన్నియబ్దంబులు తపంబు సలిపిన సార్థకంబును బజిక్కు నిట్టియసమాన ఫలదంబగు ప్రాణాయామమహానియమంబుచే నల్పంబు లధికంబులైన పాతకంబు

లును వాని నాశ్రయించిన యుపపాతకంబులును నన్నియుదగ్ధంబులై పోవుఁ బాప నివారణంబున కింతకన్న మంచిదగువిధానంబు లేదు దీనంబట్టి. 144

క. ఇంతయు నిజమునికాదె ని, రంతర మయ్యోగివరులు ప్రాణాయామం బెంతయు సలుపుచునుందుర, నంతుని కారుణ్యమునకునై యూరవ్వా. 145

వ. అని యెఱింగించి మఱియు యమభటుండు వికుండలున కిట్లనియె. 146

క. పరసతులఁ గన్నతల్లుల, వరుసం దిలకించునట్టివారలుయమ మం దిరమేగరిహపరంబులఁ, బరిపూజ్యులు పుణ్యులయ్యె భవ్యచరిత్రా. 147

క. ఇరువది యొకనరకంబులఁ, బరితప్తులు పరసరోజపత్రేక్షణలన్ మరుకేళిఁ గూడువారలు, గురుపాపులు వారుగాన గుణరత్నఖనీ. 148

క. పరుల ధనంబుం గోరక, పరులను నిందింపకుండు భవ్యులుయమ మం దిరముం గన్నులఁజూడక, హరినిలయముఁ గంద్రుసుగుణులైన కతమునన్. 149

క. ఏవిమలాత్ములు రేలం, దేవాలయ మఠములందుదినదినముపురా ణావలులఁ బొద్దుగడపుదు, రావారలు చూడనరుగరయ్యమపురమున్. 150

ఆ. అధిక కోపుఁడైనవాగ్య జనంబుల, యందు శాంతుఁడైనయతఁడు విజిత కోపుఁడార్యనుతుఁడుపాప విదూరుఁడై, యమరలోక సౌఖ్యమందుచుండు.

క. వృద్ధులఁ దలిదండ్రులను ప్ర, బుద్ధాత్మత దైవములుగఁ బూజించునతం డిద్దరసుగతింబడయు సు, బుద్ధిం గురుఁ గొల్చునతఁడుహొందునజపురిన్. 152

చ. అబలల కుర్విశీలమె సుగావసథప్రదముంజనుఃఫలం బు బుధచరిత్ర దాని విధముం దిలకింపని వారికయ్యెడన్ బ్రబలతమంబులైన యమబాధల జన్రముదానఁ జేసివే డబములఁ జిక్కిపూరుషులడాయక శీలముఁగావఁగాదగున్. 153

తే. వైశ్వదేవము మొదలుఁగాఁ బాకయజ్ఞ,ములను శూద్రార్థముల సేయుభూసురుండు దివిమధాలయ దూరుఁడై యవనిఁదాన, ధోగతింబొంది పడునతి దుఃఖసమితి.

వ. అధ్యయన పరాయణు లఖిలశాస్త్రంబు లెఱింగి తత్ప్రణీతధర్మాను వర్తనులై యుండువారు పౌరాణికులు వేదాంతవిదులు మున్నుఁగాఁగల సత్పురుషులు గలు గుటంజేసి యిప్పుడమి సుస్థిరంబై యున్న దమ్మహాత్మకులు దారెఱింగిన విధంబుల నడుచుచుండి తన్మహిమంబుననఘులై బ్రహ్మలోకంబునందుదురు మఱియు. 155

క. అజ్ఞానులైనజనులకు, సుజ్ఞానము నొసఁగినట్టిసూరులుజగతిన్ విజ్ఞులుతమ్మానన స, ర్వజ్ఞుం జేరంగలారు వారని భక్తిన్. 156

వ. మఱియు. 157

## —(*) వి ష్ణు భ క్తి ప్ర భా వ ము. (*)—

క. అతివిస్మయము కృతాంతుని, మతికి నిహితమఖిల లోకమంగళ మమృత స్థితి సంప్రదము రహస్యం, బతివేడ్కం జెప్పవాఁడనదవినుమనఘా. 158

వ. అది యెట్టిదం టేని విష్ణుభక్తులు వారెవరైనను ఘోరాకారులగు యమభటులం జూడ రిదిముమ్మాటికి నిజంబింతయ కాకయముం డాత్తభటులంజూచి. 159

తే. విష్ణుభక్తులు పుణ్యులా విమలమతులు, మనకునంటఁగరాని వారెనసిమీఱ లెన్నఁజేనియు నాకడ కేఱుకదప్పి, చేర్పడాసితిరన్న నుచేటుమూడు. 160

ఆ. ధరకృతఘ్నులైన ధర్మేతరాసక్తు, లైనదుష్టశీలురైనగాని యొగిఁ బ్రసంగవశత నొకమాటు శ్రీహరిఁ, దలఁచినంత ధన్యతములువారు.

క. హరిభక్తు లెవరియింటం, బరిపూజ్యులు వారిగూడి పరగెడువారు ర్వరనెవరు వారువారును, సరినొక్కఁడు వారిచక్రిజనఁజూడకుఁడీ. 162

వ. అని చెప్పుచుండు మఱియుఁ గలుషాత్ములగు మానవులు దుర్వార కలుషార్ణవముం దాటఁ గోరిన విష్ణుభక్తియను నావ సంపాదించిన సాగాని మఱియొకటం గానే రదా విష్ణుభక్తి రహితుండు విప్రుండైనను కుక్కురామిష భక్షణంబుసేయు చండాలునకన్న నధముం డనంబడు విష్ణుభక్తుండు హీనుండయ్యు నతండు త్రిభు వనంబులఁ బవిత్రంబు సేయంజాలువాఁడగు వినుము పూర్వకాలంబునందు. 163

క. మృతివేళ నయ్యాజామిళుఁ, డతనిజనూజాతుఁబిలువ నతిపతితుండై హితమగు నారాయణ వి, శ్రుతనామం బగుటముక్తి చూరంగొనియెన్. 164

తే. కాన భగవంతు గుణగణ కర్మ నామ, రూపముల నెంచి పొగడిని రూఢభక్తి పూజ సలిపిన పుణ్యుల పూర్వులెల్ల, నరకమునఁ బాసి కండ్రు నిర్జరపదంబు.

క. హరిభక్తులైనవారును, హరిభక్తులొసంగినట్టి యన్నంబునుఁదాఁ, బరమప్రీతినిఁ గుడిచిన, నరులేగుదు రాబలారినగరంబునకున్. 166

వ. మఱియు నట్లు వైష్ణవాన్నాహార నియముండగుఁవా డది యొక్క సమయంబున లభింపకున్నను నీరు పానంబుఁ జేసియైన నూరకుండు నది యొదవునట్లున్నఁ బ్రార్థ నాదులనైన సంపాదించి భుజించు. 167

క. ఎందేని నేసరుండయి, నందనమృతి కాలమున జనస్తుతుహరి గో, విందుని గోవిందాయను, చుందగనొడివిననుముక్తి సులభతఁ గలుగున్. 168

తే. ద్వాదశాక్షర మంత్రము తనరుమంత్ర, రాజ మష్టాక్షరమ్ము ధరాతలమున, నేకమానసమున జపియించు నెవ్వఁ, డామహాత్ముఁడు స్వర్గసౌఖ్యములఁ గనును.

వ. మఱియు నా మహామంత్రంబుల సాంగన్యాస దీక్షాధ్యాన చ్ఛందో దైవతర్షి ముద్రాదివిధుల నేకమానసంబున జపియించు నాతనిఁజూచినం బ్రహ్మఘ్నుండైన పరిశుద్ధుండగు నతని ధన్యతఁ జెప్పనేల మఱియు. 170

ఆ. వసుధ శంఖచక్ర వనమాలికాధరు, లగుచువిష్ణుభక్తి నమరువార లమ్మురారి రూపమిమ్ములఁదాలిచి, తత్పదంబునందుఁ దగవసింత్రు. 171

చ. ప్రతిమల నొండెసీరములభాస్కరునందుల నొండెఁగాక హృ ద్గతమున నొండెస్థండిల సుధారిణి నొండె సరోజనేత్రు సు

స్థితిఁగని పిల్పుమంత్రములఁ జీరి ప్రతిష్ఠితుఁ జేసి పూజనం
బతిముద మారసల్పిన మహాత్ములకయ్యెడు తన్నివాసముల్. 172

వ. ఇక్కారణంబున మోక్షంబొండె విష్ణులోకంబొండెఁ గోరువారు పురాణపురుషుండు కరుణామయుం డవ్యయుం డాదిమధ్యాంతశూన్యుండు మనోవాగతీతుండుఁ బ్రకృతి విదూరుం డఖిలకలుష నిధనుండు భక్తవత్సలుండు నగు పుండరీకాక్షు నారాధింపవలయు వెండియు. 173

—(*) సాలగ్రామ పూజాఫల ప్రభావము. (*)—

తే. వజ్రకీట కృతంబయి వరలి విష్ణు, మందిరంబును బాపప్రమాపణంబు
పుణ్యదము మోక్షదంబయి భువిఁ దనర్చు, చుండు దానిని నాపదల్ జెందు దాని.

క. సాలగ్రామంబును వన, మాలియుతం బర్చనంబు మానక చేయన్
జాలిన చాలును సత్క్రితు, జాలం బంతయును పూని సలుపఁగ నేలా. 175

క. చాలంగ రాజసూయము, లాలలితములై పొసంగు హయమేధములున్
గ్రాల నొనర్చిన సుకృతము, సాలగ్రామాచ్యుతుండు సతత మొసంగున్. 176

క. వేదాంత వితతి యెవ్వని, నాది పరబ్రహ్మమనుచు నమృతాత్ముండం
చూది నిరూపించెడు నా, శ్రీదయితు ననుగ్రంబు చెందు తద్విధిన్. 177

క. అఖిలేంధనములయందున్, శిఖి వెలిఁగెడు నట్లు భక్తసేవితుఁడు చతు
ర్ముఖనుతుఁడు వెల్గు శ్రీహరి, సఖుఁడా తచ్చక్రమున నెసంగెడు దయతోన్. 178

ఆ. పాపజాతులగుచుఁ బదఁపడి సత్కర్మ, ములకు నర్హులైన మొనసి తద్వి
ధార్చనమున యమునిధామంబునకుఁ బోరు, వైశ్య సందియంబు వాయుమిందు.

క. శ్రీలలనా వల్లభుఁడా, సాలగ్రామాంతరోల్లసచ్చక్రమునం,
బోలె వసింపఁడు తాఁ బ, ద్మాలయతోఁ గూడి ముఖ్యధామమునందున్. 180

క. నేమమున నగ్నికార్యము, లీమహిఁ గల దానవితతులెల్లను సేయం,
బ్రేమించు నరుఁడు సాల, గ్రామాంతర్విష్ణునొప్పు రహి సేవింపన్. 181

వ. తత్ఫలంబంతయుఁ గొఱంత వడకుండ నొదవు వెండియు సాలగ్రామంబులు ద్వాదశవిధంబులై యుండు నవ్వానియందుఁ బ్రకాశించు నారాయణు నాగమోక్తిం బూజించిన నరులు కల్పద్వాదశమేగ దినంబుం ద్వాదశకోటి లింగంబుల సువర్ణ పద్మంబులం బూజించి నంత ఫలం బొక్కదిన పూజనంబునన చేకొంద్రు మఱియు వార లంత్యంబున నా శ్రీహరిలోకంబునకుం జని యందు చిరకాలంబుండి పునర్భవంబున నీ భూమిం జక్రవర్తులై జన్మించువా రగుదురు మఱియు. 182

క. కామాద్యరిషడ్వర్గ, భ్రామితులై యుండితు దినిరాజీవాక్షున్
బ్రేమింతు రేని సాల, గ్రామార్చనమున నకాని కనరిం కొకటన్. 183

క. సాలగ్రామ స్థితువన, మాలిం బూజించునట్టి మనుజులు సుయశ
శ్శ్రీలలిత భోగులై దివి, జాలయమున నుంద్రు ప్రళయమయ్యెడి దనుకన్. 184

క. దానములు పుణ్యతీర్థ, స్నానములును ముఖములిన్ని సలుపకయున్నన్
దానవివేకియ యైనను, మానవుఁడీ విధినిఁ బొందు మఱి మోక్షంబున్. 185

వ. మఱియు. 186

సీ. ఊరుజాన్వయ దుగ్ధవారాసి రాకాసు, ధాకర విన్ము భూలోకమునను
లలితమహాభక్తి సాలగ్రామ మర్చింపఁ, బాపుఁడైనను పునర్భవమునందఁ
డదికారణతనందనైనతిర్యగ్యోను, లంగాఁడు వెండి చెలంగి మంత్ర
దీక్షావిధానముల్ దెలిసిన తచ్ఛిల, నావాహనాది మంత్రాన్వితముఁగ
కడఁగి పూజింప విష్ణులోకంబుఁగలుగు, దీనసందేహ మొప్పదు ధీవరేణ్య
లెల్లనివ్విధి విష్ణు లోకేశ్వరేశు, గాంచి తల్లోకవాసులై కనిరి ముదము. 187

తే. రహి దదభిషేక పూతతీర్థమ్ము శిరము,
నందుఁ బ్రోక్షించు కొనఁగ గంగాదిమోక్ష
దముల నదులందు విధియుక్తిఁ దానిమజ్జ,
నంబు సలిపిన ఫలమందు నరుఁడు వైశ్య. 188

వ. మఱియు సదక్షిణలుఁగ నఖిలయజ్ఞంబు లొనరించిన ఫలంబునుం జెందు నిదియుం
గాక యయ్యధోక్షజునందలిభక్తిని నానావిధనైవేద్యంబులు పుష్పధూపదీపతాం
బూల చందనాదులు గీత వాద్య స్తోత్రమ్ములుం దనర నాసాలగ్రామమ్ము నారాధిం
చిన కోటికల్పంబులు సనునంతకాల మప్పద్మలోచను సన్నిధానంబున నివసించు
నిట్లొక్కపరి యర్చించినను గోటిలింగంబుల దర్శించి పూజాస్తవంబులు చేసిన
ఫలంబుఁ గలుగు నింత మహాత్మ్యంబా సాలగ్రామ శిలకు రాఁగారణం బేమన నందు
సరోజాక్షుండు ముఖ్యంబుఁగా నధివసించుటం జేసి యది సర్వదేవతా నిలయంబై
యొప్పెసంగె వెండియు నట్టిసాలగ్రామంబు మున్నిడుకొని. 189

క. పితృకార్యమ్ముల నెవ్వం, డతివేడ్కను సేయగలుగు నాతని పితరుల్
హితమతిఁ గల్పశతం బం, చితగతి దివినుండ్రు తృప్తచేతోంబుజులై. 190

క. దినదిన మభిషేకోదక, మునుభక్తిం గొనిన వారు మొనరఁగ వేమా
ర్లును పంచగవ్యమునుఁదాఁ, గొనఁజేకుఱు తత్ఫలంబుఁ గొందురు పుడమిన్. 191

చ. అనఘ తదీయ తీర్థమున కామడలున్ మొగినూడుచుట్టు ప
ట్టునుఁగల భూతధాత్రి యుఁగడుంగడు పూతము తద్ధరిత్రిఁ జే
సిన మఖహోమ దానములఁ జేకుఱు పుణ్యము మిక్కుటంబు త
ద్ఘనరసమొక్క బొట్టియునఁ గ్రైకొనఁ లేదు పునర్భవంబిలన్. 192

వ. మఱియు నాసాలగ్రామంబుండు సుస్థలంబునకుఁ గ్రోశదూర భూమింగల ప్రాణులు
క్రిమికీటకాదులైనను మృతిఁజెందిన విష్ణులోకంబుచేకూరు నిట్టి మహాప్రభావంబుఁ
గల సాలగ్రామంబును దానంబుఁ జేసిన నరుండు గిరివనారణ్యంబులతోడి భూభాగం
బంతయు దానంబిడి నంత ఫలంబునందు నట్లుగాక. 193

ఆ. విక్రయించు నతఁడు విక్రయనిర్ణేత, విక్రయమునఁ గొనిన వక్రజనుఁడు
తత్పరీక్షకుండు తన్మోది యుండఱుఁ, ప్రళయముండ్రు నరకబాధలందు. 194

ఆ. దానమిచ్చు నతఁడు దానంబునం గొను, నతఁడు హితముఁ జెప్పు నాతఁడిర్వు
రకును బూజసేయు సుకృతాత్ముఁడిందఱ, య్యబ్జనాభు పదము నందఁగలరు.

ఆ. వేయుఁ జెప్ప నేల వృజినౌఘములకును, వెఱచు నతఁడు సర్వ విధములందు
విష్ణునంబుజాక్షు విబుధలోకేశ్వరుఁ, గొలిచి పొగడుచుంట గురుశుభంబు. 196

తే. విషయ నిర్జేతయై ఘోర విపినములను, తపమొనర్చినఁ బొందు తత్ఫలము విష్ణు
వందనంబునఁ బొందెడువాడు సువ్వె, యూరుజాన్వయ దుగ్ధాబ్ధి కైరవాప్త 197

ఆ. అమిత పాపవితతి నజ్ఞాన వశమునఁ, జేసియున్న నైన శ్రీనివాసుఁ
గలుష హారునిఁ గొల్చి ఘనభక్తి మ్రొక్కిన, వాఁడు నారకుండుఁ గాఁడు సుమ్ము.

క. అవనిఁ గలతీర్థ సంహతి, నవగాహన మాచరించి యాయతనంబుల్
సవరించు కంటె సుకృతము, లవలీలం బొందు విష్ణు నభివర్ణింపన్. 199

వ. వెండియు నాశార్ఙ్గకోదండపాణి నేసు ప్రసన్నులా శ్రయింతు రవ్వారెన్నఁడేనియు యమలోకంబు కనులఁ జూడకుందు రవ్విష్ణుభక్తులై శివుని దూషించిన దుర్గతిం గాంతురు వెండియు నొక్కరహస్యంబెఱింగింతు ను మొకానొకదినంబున యముండు మమ్ము కారుణ్యంబునం జీరి యిట్లనియె. 200

—(*) ఏకాదశీవ్రతమాహాత్మ్యము. (*)—

క. అనుజీవులార వినుఁడే, మనుజుండేనియును మాట మాత్రం బేనిన్
వనజాక్షు దినము భక్తం, బునుమానెద ననిన నరకముం బొందఁడు దాన్.

క. తెలియక మానవుఁ డెవ్వఁడు, సలుపడు విధియుక్తముఁగను సతతము వానిన్
గలుషములు వాయకుండును, తలఁగున్ సలుపంగడంగ తత్క్షణమాత్రన్. 202

క. హరివాసరోపవాసము, వరమతిఁ గావింపనట్టి పాపముఁ బోలెన్
దురితంబు మూఁడు జగముల, నరయంగాఁ గలదె యూరుజాన్వయతిలకా. 203

క. హయమేధ రాజసూయము, లయుతంబు లొనర్పనైన నా ఫలముం దా
రయషోడశాంశమైనను, నయమారఁగ నీదుపుడమి నయసంచారా. 204

క. ఏకాదశేంద్రియంబులఁ, గైకొని సేయంగఁ బడిన ఘనకల్మషముల్
బోకార్చు నితరపుణ్యము, లేకాదశి యనువ్రతమున కేల సామ్యములే. 205

తే. అట్టి యేకాదశీదిన మనఘ యితర, కారణంబులనైన భక్తంబు మాని
యున్నవారలు గంద్రు సురోదవసిత, మో హృషీకేశుమందిర మో ముదమున.

వ. మఱియు నయ్యేకాదశీవ్రతపరులు మరుజన్మంబుల నారోగ్యవంతులు సద్భార్యాయుక్తులు దీర్ఘాయుష్కులు సుపుత్రవంతులై యుద్భవింతు రా వ్రతఫలంబు గంగాదిపుణ్య వాహినులఁ మునింగిననుఁ గాంచీపురాది విష్ణుక్షేత్రంబుల దర్శించిననుఁ గలుగు ఫలంబునకన్న మిన్నయగు నేకాదశి నుపవసించి రాత్రిజాగరణంబుఁ గావించినవారు దాము స్వర్లోకముం జేరుటయ కాక తండ్రి దెసఁ బదితరంబులవారి

దల్లిదెసఁ బదితరంబులవారి నిజాంగనామణిదెసఁ బదితరంబుల వారిఁ గృతార్థులం జేయుదు రింతియకాక సతీసుతులతోడ సుఖదుఃఖాదు లనుభవించు స్థూలశరీరధారు లెందునుంగాక వైకుంఠనిలయులై గరుడధ్వజులు స్రక్చందనాద్యలంకృతులు పీతాంబరధారులు నై విహరింతు రివ్వ్రతంబు బాల్యంబునందైన యౌవనంబునందైన వార్ధకంబునందైన నాచరణీయం బెట్టివారికైన నగు నట్టివారు పాపాత్ములైయుండి నను దీన నరకంబునకుం బోరు మఱియు 207

క. ఏకాదశీ త్రితయముఁ, గైకొని స్నానోపవాసకర్తలు గోచా
మీకర తిలదానంబులు, జోకం గావించువారు సురపురనిలయుల్. 208

ఆ. పుణ్యతీర్థ వితతిఁ బోలుపార మునుఁగక, దాన ధర్మములను దలప కెందు
తప మొనర్పకుండి తా నైహికాముష్మి, కైక సుఖములకును గాక పోవు. 209

వ. మఱియు నరకంబునకుం దొలఁగించునట్టి పుణ్యంబులు సంగ్రహంబుఁగా నెఱిఁగింతు వినుము. 210

క. మనమున వాక్కున దేహం, బున చయ్యల సతతమితర భూతంబులకున్
బనిఁగొన కుంకుటకీడుం, దనవర్ణాశ్రమ విధము వదల కుండుటయున్. 211

క. హరి పూజనమ్ము సలుపుటఁ, బరిమారుచు టింద్రియములఁ బరిపాటిమెయిన్
జరుపుటయు శాస్త్రధర్మము, లురువగు దానంబు లిడుటయున్ విప్రులకున్. 212

క. తన దాన ధర్మ తపముల, మనమునఁ గొని యాడకుంట మానక త్రిదివం,
బునుఁ గోరి యథోచితముగ, నొసఁగొని దానంబు సేయఁ గోరుట మఱియున్. 213

వ. పాదరక్షలు వస్త్రంబులు గొడుగులు ఫలాన్నోదకంబులు యథాశక్తి నసంబు వృథపోకుండ వీననొండేని దానంబిడుచుఁ బ్రవర్తించు నరుండిహపరంబులఁ గొఱంతలేని వదాన్యుండయి యుండు నిందెద్దియొసంగక యదియుండియు లేదనునో దాన గొఱంతవడి దుఃఖించు వెండియు నట్టిధర్మాత్ములిహంబున దీర్ఘాయుష్కులు ధనవంతులు నైయుండి సుఖింతు రింతనేల ధర్మాత్ములు సుఖవంతులు నధర్ములు దుఃఖాత్ములు నౌదురిట్లగుటం జేసి యెవ్వరేని ధర్మసంగ్రహపరులై యుంట మేలని చెప్పి యమానుచరుండు వికుండలునకు వెండియు నిట్లనియె. 214

క. వినఁగోరి యడుగ సర్వం, బునుఁ జెప్పితి నింక నీకు సమునుకొని మఱియున్
విననిచ్చ యేది దానిం, బనివడి యెఱిఁగింపు నాఁగ వైశ్యుం డనియెన్. 215

చ. సునయవిచార నీవు వినసొంపుగఁ జెప్పిన పుణ్యపాప వ
ర్తనములు తత్ఫలంబులు తిరంబుఁగ నేఁడుఁ జేసి తాపముల్
మునుఁదలఁగెన్ ముదావహములు ర్వీఁగ దావి బుధోక్తు లెందు న
య్యనిమిష వాహినీజలము లట్లతి పాప హరంబులై కదన్. 216

ఉ. కారణమింత లేక యుపకారములం బ్రియభాషణంబులన్
వారక తేర్చుచుందురు జనంబుల నంచితధర్మ బుద్ధి స

త్పూరుషులా సుధాకరునిఁ బోలికడుంగడు శైత్యభావులై
యారయనీవునట్టి విమలాత్ముఁడవై దయఁ గొంటినాపయిన్. 217

క. ప్రియమారనింక నడిగెద, నయమార్గప్రవర యిపుడు నా యగ్రజుఁడా,
రయనరక నిర్గతుండగు, క్రియగలిగిన దానినాకుఁ గృపఁ జెప్పఁగదే. 218

చ. అనవిని కాలుదూతహృదయంబుఁ గఱంగి వచించె జ్ఞానదృ
ష్టినిగని వానితో మఱియుఁ జెచ్చెర నీవిటుల గ్రజుం గృతా
ర్థునిఁగ నొనర్చెదేని వినుతొల్లిఁటి దాభవదష్టమంపు బా
మున దొరకొన్న నీసుకృతముందయనిమ్మటు వానివచ్చెడున్. 219

క. అనిన వికుండలుఁడిట్లను, ననఘా నా తొంటిజన్మమది యెట్టిదియం
దొనరించి యున్న సుకృతం, బన నెట్టిదిదానినాకు నానతినీవే. 220

తే. అవల నాయన్నకిడుదుఁ బ్రియంబుతోడఁ, దత్సుకృతమని పల్కినఁ దండధరుని
భటుఁడు నీపూర్వజన్మముం బాయకందుఁ, గనిన పుణ్యంబు వినుమని యొనరవలికె.

—(*) యమభటుండు వికుండలున కతనిపూర్వజన్మస్థితిం జెప్పుట. (*)—

చ. అధిక తపోధనుండు సుజనాంచితుఁడొక్క తపస్విపూర్వ ను
మ్మధువన భూమిఁ బద్మజసమప్రతిభావిభాసమానుఁడై
యధిగతవేద శాస్త్రచయుఁడై నివసించు నతండు రేవతీ
విధు ముఖియందుఁ గాంచెను వివేకులఁ దొమ్మిదిమంది సూనులన్. 222

వ. అవ్విశాలాఖ్య ఋషిపుంగవుని తనూజులందు ధ్రువుండు శశియు బుధుండు తారుఁ
డు జ్యోతిష్మంతుండు నను వారేవురు నౌపాసకులై యగ్నికార్యంబుల శ్రద్ధాభ
క్తిగలిగి యొనర్చుచు గృహస్థులై యుండి రక్కడమనలువురు నిర్మోహుండు జిత
మాయుండు ధ్యానకాష్ఠుండు గుణాధికుండు నను వారు వైరాగ్యులై చతుర్థాశ్ర
మంబగు సన్న్యాసముం గైకొని. 223

చ. దినమొక యూరువాసముఁ గద్రిమ్మరుచున్ విజితాభిలాషులై
గొనకొని యెవ్వరేమయినఁ గొమ్మనినం జెయి సాపకాత్మలోఁ
గనకము లోష్ఠమశ్మ మొకకై వడిఁ జూచి శిఖోపవీతముల్
గొనక బుభుక్షు కేమయినఁ గొంచు సహించియు శీతవాతముల్. 224

క. వసనముల మానియేదే, సెసఁజిక్కిన నొడలఁ గప్పి దివసాంతంబే
వసమైనఁ జేరియువ్వా, రొసఁగిన భిక్షంబుఁ గుడిచియున్ సతతంబున్. 225

వ. చరాచర జంతు సంయుతంబైన లోకంబంతయు విష్ణుస్వరూపంబుఁగా నెంచి
స్వేచ్ఛమై దిరుగుచుఁ దత్త్వవిదులు నిస్సందేహులు యకృతకర్ములు విజ్ఞానవంతులు
నగు వారొకానొకదినంబునందు నీవీ జన్మంబునకు పూర్వంబైన జన్మంబు నందు. 226

తే. మహితవిప్రాన్వయుండవై మత్స్యదేశ, మునఁ గుటుంబంబుఁ బ్రోచుచు మనువసించు
కాలమున మిట్టమధ్యాహ్నవేళ నీదు, వైశ్వదేవంబు ముగియఁడు వచ్చిరటకు.

వ. అంత నీవు. 228

సీ. ఆనంద బాష్పపూర్ణాంబకంబులతోడ, గదిరిన కంఠ గద్గదతతోడ
నతిశయామోద సంగత సంభ్రమముతోడ, సమధికరోమ హర్షములతోడ
నెదురేగి దెంచితత్పదముల పైవ్రాలి, సముచితాలాప విస్తరత నెరపి
యిలు సేరఁ దెచ్చి యుగ్ములసుఖాశీనులఁ, గావించితత్పాదకంజయుగము
గడిగి జన్మసప్తకాఘాపహంబైన, తజ్జలంబునతిముదంబుతోడ
శిరమునందుఁ దాల్చివరగంధ పుష్పధూ, పాక్షతాదివిధులనయ్యతులను. 229
క. పూజించి షడ్రసాధిక, భోజన సంతుష్టమతులఁ బూర్ణప్రీతుల్
రాజిల్లఁ జేసితివిబుధ, రాజిసమారాధనంబు గాలకయున్నే. 230
ఆ. సర్వభూతవితతి సప్రాణములు శ్రేష్ఠ, మందు తెల్వి గలవియధికములగు
నందులోన మనుజులత్యుత్తములువారి, యందు బ్రహ్మకులజులెందుఁ బెద్ద. 231
క. వారల లోపలనుత్తము, లారయ విద్వాంసులందు నధికులు సుకృతో
దారులు వారలలోపల, వారని సత్కర్మపరులు వరముగువారల్. 232
తే. తలఁపనందుల బ్రహ్మవేత్తలు ప్రధాను, లర్చితులువారు సర్వలోకాంతరముల
వారి సాంగత్యమనఘ మవ్వారునీదు, నింటనిలిచిన క్షణకాలమేమిచెప్ప. 233
క. ఉదయం బాదిఁగనీచే, వదలక కావించినట్టిపాపములెల్లం
బదఁపడి విదళించెను ము, న్నదియట్టిద కాదెయారుజాన్వయతిలకా. 234
క. ఒనరించి తింతపుణ్యము, పనివడినీ యష్టమంపు బాముననున్నీ
వునిపుడది యన్నకొసఁగినఁ, గనుయమబాధలవిముక్తిఁ గాంచుదివంబున్. 235
—(*) వికుండలుండు తన సుకృతం బగ్రజునకిచ్చి తనతోడి దివంబందించుట. (*)—
క. అనితన పూర్వోదంతము, వినిపింప వికుండలుండు వేడ్కమెయింజ
య్యనిచ్చెఁ దత్సుకృతమా, యనవీడ్కొని నరకముం బ్రియానుజుఁ జేరెన్.
క. అంతట వారిరువురు సుమసంతతిఁ గురియింపదేవసంహతియామ్యుల్
వింతఁగఁ బూజించిరిచని, రెంతయుదివి భటుఁడునిజపురేచ్ఛంజనియెన్. 237
వ. అని చెప్పి వెండియు. 238
ఆ. ఎల్లధర్మనిచయమెఱిగించు నీపురా, వృత్తమెవ్వరేనియింపుతోడఁ
జదివినట్టివారు చదువంగ వినినట్టి, వారు పాపవితతిఁ బాయువారు. 239
వ. మఱియు నప్పుణ్యులకు గోసహస్రదాన ఫలంబు లభించునని యెఱింగించిన కృత
వీర్యాత్మజుండు జగద్గురుండగు దత్తాత్రేయునిం గనుంగొని. 240
చ. గురుకరుణాపయోధియతికుంజర నాకొక కారణంబుఁగా
నరుదగు మాఘమజ్జన మహత్వముచే నొక కోమటీడు దు
స్తరకలుష వ్రజంబునకుఁ దామునుఁ బాసి నిజాగ్రజుం గృపా
కరుఁడయి సత్వరంబన రకంబునఁ బాపిన యా కథాస్థితిన్. 241
క. వినుపించి తిపుడు వెండియు, వినవలతును మాఘమహిమవిమలాత్ముదం
బునవిస్తరించి చెపుమా, యనఁగృత వీర్యాత్మజునకు నమ్మునియనియెన్. 242

-(*) కార్తవీర్యార్జునునకు దత్తాత్రేయుం డెఱింగించిన మాఘప్రభావము. (*)-

మ. ధరణీ పాల పవిత్రమైయమల మైసదాశుభ్రమై పాపసం
హరమై యన్య జలానుషంగరహితంబై సర్వ భూతాలికిన్
బరగం బ్రాణపదంబునైన జలమే నారాయణాభిఖ్యచే
హరిరూపం బని వేదముల్ వలుకు సత్యంబింతయున్ భూస్థలిన్. 243

వ. అట్టి యుదకంబునందు. 244

చ. ఉడువితతిన్ సుధాంశుఁడు పయోరుహ బాంధవుఁడుం గ్రహంబులన్
గడనకు నెక్కుడైన గతి క్ష్మాతలి మాసములందు మాఘ మె
క్కుడుఁ గడు నెక్కుడై పఱగుఁ బో మకరంబున సూర్యుఁడుండఁ జొ
ప్పడిన నహర్ముఖంబున నుపాయక స్నానము సేయనొప్పగున్. 245

తే. అల్ప కుల్యాదులందైన నమలమాయు, షస్నమయమున నుదకంబు సర్వపాప
హరము పాపాత్ముసైన సురాలయంబు, సేర్చు వెండియు వినుము విశేషమీవు. 246

తే. అవనిప! చరాచరాత్మకమైనయీ జ, గత్రయమ్మున మాఘమాఘమ్ము స్నాన
మాడవలెనన్న దుర్లభమందు మూడు, దినములైనను చేసియోపినకాలంది.

క. పేదరికము తడవక పర, మాదరమున దానమొసఁగి రాయన వారే
పోదీర్ఘాయురు పేతులు, మోదాత్ములు ధనికులయ్యుఁ బుట్టెదు వారల్. 248

తే. అయిదునాళ్లైన దినములేదైననేని, తన్నిమజ్జన మాడిన తత్ఫలంబు
శుక్లపక్ష క్షపాకరుసారిదిదినది, నక్రమంబునఁ బెరుగు నిర్వక్రమగుచు. 249

వ. అట్టి మాఘస్నానవిధంబు విశదంబుగా నెఱింగింతు వినుముత్తములైన జను లిది యొక వ్రతంబుగాఁ బూని కతిపయనియములై జరుపుదు రట్లయిన తత్ఫలంబు విశేషంబగునది యెట్లనినఁ దత్స్నాతకించిద్విషయసాంగత్యరహితుండై భూశయానుండును త్రేతాగ్నులుంచి హోమంబు సేయువాఁడును సనాతనుండైన వాసుదేవు దినదినంబు మూడువేళల నొండె నొకమాటు నొండెఁ బూజించు వాఁడునై యథోచిత దానంబు సేయుచుండవలయు మఱియు. 250

క. కోలములుం గార్పాసము, తైలంబింధన చయంబు దగఁగుంకు మయున్
దూలానోష్ణ పానహములు, చేలంబులు గొంగళులు సుశేముషి తనరన్. 251

క. మోదమున దానమిడనగు, వైదికులకు మఱియు నీయవలయును వృషమున్
గాదనక పాడి మొదవును, సాదరమున నిట్లొనర్చు స్నాత ఫలంబున్. 252

వ. సముద్రంబు భాతి నపారంబై యెందునుం గొఱంత లేకుండు మఱియు నాస్నాత యన్యగృహంబులం భుజించుటయు భూసురాన్వయుండైనను దానంబుఁ గొనుటయు మానియుండవలయు నిట్లుండి మాసాంతమున నేకాదశీ వ్రతవిధి నుద్యాపనంబుఁ గావింప వలయు వెండియు నుత్తమపదంబుం గోరి గోవిందు నానావిధంబుల మనోవాక్కుల స్మరించి సూర్యుండు మకర రాసిగతుండై యుండ మాఘస్నానంబే నొనర్చిన ఫలంబు ననుజెంద ననుగ్రహింపు మను నర్థంబులుఁగల మంత్రంబు

లుచ్చరించి మౌనమ్మున స్నానంబుసలిపి జగదంతర్యామియు నఖిలపాప నిబర్హణుం డును లక్ష్మీప్రియుండునగు విష్ణుమూర్తిని మరల ధ్యానింపంజను నివ్విధంబునం దదీయ స్నానంబు. 253

క. తనగృహమునవే నీళ్లను, ఘనివడి కావింప నాఱువత్సర ములుదా నొనరించి నట్టిఫలముం, గనునూరికి వెలినిదీర్ఘికాదుల నైనన్. 254

సీ. పార్థివాధీశ తత్ఫలమగు ద్విగుణమ్ము, నది తటాకాదులయందునైన తద్విగుణితముఁగాఁదనరు తత్పుణ్యమ్ము, నాల్గంతలయ్యెడునదులనైన నదిదశాధిక మగునమర ఖాతములయం, దైన మహానదులందునైన నద్దాన నూఱంతలయ్యెడుఁ దచ్చతు, ర్గుణితమౌనవియునుఁగూడుచోట నంతకన్నను వేయంతలతిశయించు, నమర వాహినిఁ మాఘమాసమునస్నాన మాడినంతట తత్స్నాతయవనిఁగక, నాల్గుయుగములు నివసించునాకమునను.

క. గంగా యమునాసంగమ, ముంగలిగిన తావునందుముదమున నరుఁడు ప్పొంగుచు మజ్జనముం జే, యంగలుగును నూఱువేలయంతఫలంబున్. 256

వ. అని యిట్లు ఋషులందఱు వలుకుచుందురు మఱియు నాసురాపగయందు మాఘ స్నానంబుఁ గావించిన నరుండు వేయిసువర్ణ దానంబులు వేయివృషభ దానంబు లు పదివేలు కపిల గోదానంబులు చేసిన ఫలంబుం బొందు నిదియునుంగాక ప్రయా గమను క్షేత్రంబు దురితేంధన సంచయంబునకు దవాగ్నియై యొప్పునని చెప్పుదు రమ్మహాక్షేత్ర ప్రభావంబట్లు భగవంతుండగు చతుర్ముఖుండుఁ గల్పించె నందు రందు పశువిసరంబు సైతము జలావ గాహనంబునఁ బాపంబులం బరిహరించు నట్టిది మాఘస్నాతల కొప్పదే మఱియు నా ప్రయాగ మహిమముం గూర్చి యచ్చతురాననుండె మున్నిట్లు వాక్రుచ్చియున్నవాఁ డదియును వినుము.

—(*) దత్తాత్రేయుండు కార్తవీర్యునకు ప్రయాగ మహిమం జెప్పుట. (*)—

తే. అవని బ్రహ్మఘ్నులాది పాపాత్ములెల్లఁ, దారొనర్చిన పాపసంతతికిఁదాప మందఁ బనిలేదు కడుపుణ్యమైనమాఘ, వేళ మకరస్థుఁడయ్యె సవిత్రుఁడెలర్ప.

తే. అతిపవిత్రంబులగు ప్రయాగాంబు వులను
గ్రుంకఁ సుకృతాత్ము లగుదురుకువల యమున
సుజన సాంగత్య మబ్బిందుసూ వెయొందు
పాయఁ జేసెడు నధికంపుఁ బాపవితతి.

వ. మఱియు. 260

క. ఏయెడ నసితసితంబులు, పాయక నదులొక్కచోటఁబా ఱెడు నందుం జేయంగలుగునొ స్నానం,బాయనఘుం డందుఁ ద్రిదివమందతి సుఖమున్. 261

క. అసితసితాపగ లెంతయు, వసుమతి విభజించి తెలియువారగు విద్వ ద్విసర శిఖామణు లెనకం, బెసఁ గగమోక్షంబుఁ గందురిదిసత్యమగున్. 262

వ. మఱియు నాసితాసితోదక ధారలు సరస్వతి మొదలే పుణ్యవాహినుల నంతర్గతం

బులై యుండు నయ్యువియ బ్రహ్మలోకంబునకు మార్గంబులంచు శ్రుతిప్రణీతంబై యిట్లు చతురాననుండును బలికెఁ గావున. 263

క. అసితసితోదకముల నిం, పెసఁగ న్మాఘమున స్నానమెవ్వఁడు సేయు
వసుమతి బాపౌఘంబులఁ, గసిమసఁగించియును ముక్తిఁ గైకొను నతఁడు. 264

ఆ. మకరరాసిగతుఁడు మహికారి గాఁ బ్రయా, గాంబువులను మాఘమందు మునుఁగు
నతఁడు రాడుమరల నవనికి జన్మింప, శాశ్వతంపుఁ బదవిఁ జనుట జేసి. 265

మ. దివిషత్సంతతి కేని పాయనిది యై దీపించు దైత్యారిమా
యవినాశం బగు తన్నిమజ్జనము భవ్యస్ఫూర్తిఁ గావింప మా
నవలోకేశ్వర! వెండియు న్వినుము తత్స్నాతల్ నితాంతోల్లస
ద్భువనంబుల్ గనిసౌఖ్య వంతులగుచుం బొందంగలా రాహరిన్. 266

వ. మఱియు. 267

క. మకరమున నర్కుఁ డుండఁగ, నకలుషమగు మాఘమునఁ బ్రయా గాంబువులన్
సుకృత మతిస్నాన మాడిన, నకలంకుని పుణ్యవితతి నహరహ ముందున్. 268

వ. చిత్రగుప్తుండు నానావిధంబులం దెలిసి గణింపుచుండు వెండియుఁ గురుక్షేత్రంబునందు సూర్యగ్రహణ వేళ వేయి బారువుల సువర్ణంబు దానంబిడిన ఫలంబును రాజసూయాధ్వరంబులు సదక్షిణలుఁగా వేయి నొనరించిన ఫలంబును మాఘమాసోదయ కాలంబునం బ్రయాగా నిమజ్జనంబాడిన వారికొదవు నింకను నీప్రయాగ క్షేత్ర మహిమం బెఱింగింతు వినుము. 269

ఆ. అవని నఖిల తీర్థనివహంబు లపవర్గ, దాయకంబులున్న నపాయ కెపుడు
నా యయోధ్య మధుర మాయ కాశియుఁ ద్వార, వతియవంతి కాంచి సహితవు దనర.

వ. ఈయేడుం బుణ్యప్రదంబులైన సుక్షేత్రంబులయ్యుఁ గామరూపంబులం బ్రతిమాఘతిథులఁ బ్రయాగోదక స్నానంబునకు విచ్చేయుచుండు నందలి యుదకంబు కలుషాత్ముల సంగ దోషంబున నసితంబును పుణ్యక్షేత్ర తీర్థాదులును మునీంద్రులు సత్పూరుషులు మాఘదినంబుల నవగాహనంబుఁ గావించుటంజేసి సితంబును నై యసితసితంబై యొప్పె నందు. 271

తే. జన్మజన్మాంతరముల నెసంగఁ జేసి, యున్న పాపము లన్ని యు నుక్కడంగి
పోవుభస్మంబులై వెస భూపవర్య, మాఘమజ్జన మొనరించు మనుజులందు. 272

తే. వాఙ్మనః కాయ జనితముల్ ప్రబలతమము,
లఘుములన్నియుఁ బాయుఁ బ్రియంబుతోడ
మొగి దినత్రయ మమ్మాఘమున మునుంగ,
నింతయును నిశ్చయంబని యెఱుఁగుమీవు. 273

వ. మఱియు నా దినత్రయ మజ్జనంబునఁ బన్నగంబు కుబుసంబునూడ్చు భాతిఁ బాపౌఘంబుం బాయఁ ద్రోసి తదీయస్నాత దివంబున కేగు నిదియుంగాక స్వర్నది

కురుక్షేత్రతుల్యంబై దాన నెచ్చోటనైన నిమజ్జనంబుఁ గావించినవారిఁ బుణ్యులం జేయు నానదియందు మఱియు. 274

తే. వింధ్య సంగతమై యయ్యది వెలయుచోట, దోఁగఁ జేయుఁ ఫలము చతుర్గుణంబు
చెందు నాల్గంతలందు గాశీపురమున, నుత్తరాభిముఖంబుఁగా నున్నచోట. 275

క. యమునా నదీయుతంబ, య్యమరాపగ యైనచోట నవగాహనముల్
క్రమమునఁ జేసినతత్ఫల, మమరు న్నాఅంతలందు నైయుర్వీశా. 276

క. వేణీ సంగతమై గీ, ర్వాణాపగ పశ్చిమాశఁ బ్రవహింపంగా
రాణించు చోటస్నానము, క్షోణీధవ తత్సహస్రగుణమహాఫలముల్. 277

వ. ఇంతయకాక మొదలప్పుణ్యవాహినీ సందర్శన మాత్రంబునన బ్రహ్మహత్యాది పాతకంబులు వాయు మఱియు. 278

తే. అమరవాహిని పశ్చిమాశాభిముఖగఁ, బాఱుచోనెందుఁ గలియునో భానుతనయ
తోడ మాఘమ్ము నందందు దోఁగ నడఁగు, కల్పపర్యంతకృతము లౌకలుషములును.

వ. అదియ వేణియను పేర జగద్విఖ్యాతంబై యొప్పు నందు మాఘస్నానంబొండు ముహూర్తకాలంబేని నిలిచి సేయ బృందారకులకును నరిదియందు. 280

తే. బ్రహ్మవిష్ణుమహేశ్వరుల్ ద్వాదశార్కు, లాపదునొకొండ్రు రుద్రులు యక్షులుంది
శాపతుల్ గుహ్యకులు సిద్ధసాధ్యకిన్న, రామరీ సుర సంయమీంద్రావలియును.

చ. సరసిజగర్భరాణియును శాంకరిలక్ష్మి బిడౌజుదేవి శం
బరరిపు పత్ని మేధసుర మాతతదన్య సమస్తదేవతా
వరవరవర్ణినుల్ భుజగభామలు మేనక రంభ యూర్వశీ
తరుణి ఘృతాచి హేమయు మొదల్ త్రిదశార్ధ వధూటులందఱున్. 282

క. పితృదేవతాలి సంతత, మతిముదమున మాఘవేళలందా వేణీ
హితమజ్జనంబు కోఱకా, గతులై యెద రవనిపాలకా వినుమట్లున్. 283

వ. వారు చనుదెంచి కృతయుగంబునందు స్వస్వరూపంబులతోడను త్రేతాదులఁ గామరూపంబులతోడను మునింగిపోవుచుందు రట్లు మిగులఁ బ్రయత్నంబున మూఁడుదినంబులు ప్రయాగాసంగమవేణీస్థానంబునందు స్నానంబు సేయంగలిగిన.

క. వెలయంగ నశ్వమేధము, లిలవేయి నొనర్పఁగలుగు నెంతటి సుకృతం
బలరంగ నట్టి సుకృతం, బలవడు సత్యంబు సూవె యవనీనాథా. 285

చ. కరుణఁ దలిర్ప పూర్వమున కాంచనమాలిని తాఁ బ్రయాగయం
దరిగి నిమజ్జనంబు ప్రియమారఁగఁ జేసిన సత్ఫలంబులో
నరసి దినత్రయావగతమైన ఫలం బొకఁ డియ్యఁ బూని య
బ్బురముగ రాక్షసుండొకఁడు ముక్తిని చేకొనె పాపదూరుఁడై. 286

క. అనుటయు దత్తాత్రేయుం, గనుఁగొని కృతవీర్యసుతుఁడు కౌతుక మొదవన్
వినుపింపు మీకథాస్థితి ననఘాత్మక నాకు నాఁగ నాతఁడు కృపతోన్. 287

—(*) ఆశ్వాసాంతము. (*)—

సీ. హారకోదండ విఖండన ప్రబలభాహాదండ సర్వంసహా
వరసంస్తవ్య గుణప్రకాండ కలుషధ్వాంతైక మార్తాండసం
భరితార్తాశ్రిత కాండకాండ నిధిదంభాధిక్య విచ్ఛేదన
స్ఫురదుద్యత్కరకాండ సూరిజన సంస్తుత్య ప్రభావోదయా. 288

తే. పుండరీకాక్ష! క్రూరకర్బురవృషాగ్ర, పుండరీకాక్షపాపాస్య భువనపూజ్య
పుండరీకక్షయాకర భూపచిహ్న, పుండరీకాక్షయప్రభా స్ఫురితవిభవ. 189

మాలిని. సురముని నుతనామా సూర్యవంశాబ్ధిసోమా
స్ఫురదురు రణభీమా భూమిజా చిత్తకామా
గురుతర గుణధామా కుంభినీ భృల్లలామా
దురితజన విరామా ధుర్యతా స్థానభూమా. 290

పంక్తివృత్తము. సూరి జనావన శోభనదా, కారణమానుమ కంజపదా
భూరికృపారస పూర్ణమతీ, మారరిపుస్తుత మావసతీ. 291

గద్యము.

ఇది శ్రీరామచంద్ర కృపాకటాక్ష వీక్షణా వాప్త కవిత్వ విద్యాప్రాభవ పసు
పర్తి పిన శేషమరాజా గ్రతనూభవ సుధీజనవిధేయ సుబ్బరా
జాభిధేయ ప్రణీత శ్రీమన్మాఘపురాణంబునందు
షష్ఠాశ్వాసము సంపూర్ణము.







## శ్రీరస్తు.

---

# శ్రీమదాంధ్రమాఘపురాణము.

## సప్తమాశ్వాసము.



### కందపద్యము.



శ్రీ
మద్భక్త చకోరక,
సోమా సుగుణాభిరామ ! సురసన్నుత స
న్నామా విమల కృపారస,
భూమా కోదండరామ ! భూపలలామా. 1

తే. అవధరింపుము సూతమహర్షి చంద్రుఁ, డాదరమ్మున శౌనకాద్యఖిలమౌని
శేఖరులఁజూచి పలికె వసిష్ఠుఁ డట్టు, లద్దిలీపావనీపతి కనియె నిట్లు. 2

వ. నృపాలా వినుమత్తెఱంగునఁ గృతవీర్యాత్మజునకు దత్తాత్రేయుండు కాంచనమా
లినీ చరిత్రంబుఁదెలుపం బూని యిట్లనియె 3

—(*) కాంచనమాలినీచరిత్రము. (*)—

సీ. కంజాతదళనేత్ర కమనీయశుభగాత్ర, భాస్వత్కపోల సద్భవ్యశీల
రాకేందుజిన్ముఖరమ్య కోరకనఖ, యలినీలవేణి నూత్నాబ్జపాణి
శ్రీకార కర్ణయంచిత కళాపరిపూర్ణ, కుంభికుంభస్తనకుందరదన
గళవినిర్జిత దరలలిత బింబాధర, చంపకోపమనాససద్విలాస
యగుచుఁదనరారు నొక్కసురాంగనామ, శీలలామము కాంచనమాలినియన
నవ్వెలందుక యొకసమయంబునందు, త్రిదివముననుండి వచ్చి ధాత్రీతలమున.

మ. అవనీపాలక మాఘవేళను బ్రయాగాంభః కృతస్నానయై
దివిఁబోవన్ మిహికావనీధరధరిత్రింగల్గు కుంజాంతరం
బవలంబించి వసించునాతఁడురు ఘోరాకారుఁడౌ వృద్ధదా
నవుఁడొక్కండటుఁ జూచి సాద్భుతమహానందాత్ముఁడై యంతటన్. 5

వ. అత్తన్వితోడ మంద మధురాలాపంబుల నిట్లనియె. 6

క. అమ్మా స్వాశ్రిత దేవకు జమ్మా బంగారుబొమ్మ సమధిక మగు తే
జమ్మాని యెందునుండెం, దిమ్మెయిఁబో యెదవొ చెప్పు మింతయుఁ గరుణన్. 7

క. బడలం గట్టిన చీరెయుఁ, డడిసెం గచ బంధమంబు ధారల చేనో
యుడురాజవదన యిదినా, యెడద కుచోద్యంబు నయ్యె నెంతయు మఱియున్. 8

చ. తెలియఁగఁ గోరువాఁడ సుదతీమణి యీసుషమావిశేషమై
యలరిన మేన దేసుకృత మందిన దాన లభించె నేమనం
గల భవదంబరస్థ ముదకం బొక బిందువు మత్శిరంబునం
దొలికిన యంతఁ గ్రూరమయి యుండిన మన్మతి పొందె శాంతతన్. 9

ఉ. ఈయమిత ప్రభావ మది యెట్లు లభించె త్వదాకృతిం గనన్
దోయజపత్ర నేత్ర మదిఁ దోఁచెడు సాత్త్విక భావగాగనా
కామెల దెంట్లు తాపిఁ దెలియంగల రీతిని సత్సమావలిం
బాయక లోకమాకృతినిఁ బట్టి కనుంగొనుఁ గాదె చిత్తమున్. 10

వ. భవదీయస్థితి నంతయుం జెప్పుమనిన సంతసించి యవ్వికచారవిందేక్షణ రాక్షసు
నకిట్లనియె. 11

క. ఆలింపు మేను కాంచన, మాలినియను సురవనిత మద్వసతియగుగ్
గైలాసశిఖరి మఱియా, వేళ బ్రయాగమున మునిఁగి వెడలిన దానన్. 12

ఆ. ఆనదీసమంచితాంబుపూర్ణార్ద్రిత, మైన మత్పటంబు నందు జారి
జలకణం బొకండు తలఁగక త్వచ్ఛిరో, పతితమగుడుఁ గంటి భవ్యమీవు. 13

వ. అవ్వేణీజలప్రభావం బనుపమం బేను కామరూపంబునం బరఁగు దాన మజ్జనకుం
డు సుమేధసుండను గంధర్వ రాజగు నిట్టి మనోజ్ఞరూపప్రభావంబులుఁ గలదాన
నగుటకుం గారణంబు మున్నుగా మత్పూర్వజన్మ వృత్తాంతంబంతయు నెఱిఁగింతు
వినుము పూర్వంబునం దేను. 14

—(*) కాంచనమాలిని బ్రహ్మరక్షస్సుతోఁ దన పూర్వజన్మం బెఱిఁగించుట. (*)—

క. పుడమిని వేశ్యాన్వయఁ గాఁ, బొడమి కళింగావనీశు భోగాంగననై
కడుచక్కఁ దనమునం బురి, పడతులనందఱ జయించి బహుభోగములన్. 15

వ. అనుభవింపుచు నానావిధ శృంగారంబుల మెలంగుచుండు నప్పుడు. 16

ఉ. ఆనగరీనివాసు లగు యౌవనపూరుషు లెల్ల మత్కళా
నూన విలాసవైఖరిఁ గనుంగొని పుష్పశరాసనోగ్ర బా
ణానల తప్తచిత్తులయి నందమిఁ డాసిన వారితోడ మే
లైన విభూషణాంబరము లంచిత వస్తుచయంబు లన్నియున్. 17

ఉ. చేకొని కూర్చితెంతయు విశేషధనౌఘమునట్లు యౌవన
శ్రీకమనీయనైన ననుఁ జెందిన మోహలతా నిబద్ధులుం

గాక తలంగువారొకరుం గానిపురంబున లేరుసంతతం
బే కడకేగ కింటంబను వెల్లను వారలు సేయందీరెదుర్. 18

సీ. కురులు నున్నంగదువ్వి కొప్పు వెట్టికడంక, తోంగమ్మ విరిసరుల్ దురుముకొందు
ఘనసార చందనాగరు గంధములుం బూసి, యలికంబునం దిద్దు తిలకమొకండు
వెరవారంగా మల్లెవిరులతో సవరైన, సెజ్జనింపలరారం జేర్చునొక్క
డేలా లవంగపూగాలిచూర్ణముం గూర్చి, మెచ్చిచేవిడ్య మందిచ్చునొక్కం
డద్దమిచ్చునొక్కండొడ్డికం బాదము, లొత్తునొకండు మూఢచిత్తుండగుచు
మోహవశత తెలివిమోసమై యొకనిని, మెఱగియొకండుంగాగ మొనసియెపుడు.

వ. మఱియు నాయెడంగల మోహాతిశయమ్మున నొండొరు మత్సరించి పోరి యన్యో
న్యనిహతులై రిట్లు నందరివలపించి నానావిధంబులగు మోసంబుల నపారధనంబు
గూర్చి కాలంబుం గడపుచుండునంత. 20

క. దంతంబులూడె మైమెరు, గంతంతకుం దక్కవళులనమరెంగా సం
బెంతయుం బొడమంజొచ్చెని, తాంతంబై నట్టిముదిమితడబడిరాగన్. 21

ఉ. అంతట నేనునాదుహృదయంబుననిట్లని సంశయించి తి
ట్లంతటి దాంక తెల్వింగన నేమియొనర్పక యుంటిబుణ్యా మ,
త్యంతముం బాపకార్యములయందె మనంబొక యించుకేని వి
శ్రాంతికిం బాపిపుచ్చియవురాయికనెట్టులం గల్గు సద్గతుల్. 22

క. వ్యర్థముంగ నింతకాలము, సార్థక మొకండైన లేకచనంజనె నిపుడే
యర్థమున సుగతిగలుగు కృ, తార్థతం గననట్టి జన్మమదిజన్మంబే. 23

సీ. తిలకించి సద్విజావలిం బిల్చిపూజ లి, మ్ములంజేసి దానముల్ సలిపియెటుంగ
హితయుక్తిమైసమాహితబుద్ధి సత్క్రతు, వ్రతతులన్నియొనర్చి బ్రతికియెటుంగ
ధరణింజతుర్విధపురుషార్థములనిచ్చు, హరుపూజనమ్ములేజరపియెటుంగ
దోసంబులకుం బాపి వేసంతసముంగూర్చు, శ్రీసతీశ్వరుపూజంజేసియెటుంగ
సర్వశుభసంప్రదాయినీశర్వరాణిం, గొలిచియెటుంగను బ్రాహ్మణావలికె గాక
యితరులకునైన నన్నంబునిడియెటుంగ, నేవిధంబునం గలుగునాకింకసుగతి. 24

మ. అని చింతించి యధీత వేదనిచయుండైయున్న తద్భూమి పా
లుని యాచార్యునిం జేరి మ్రొక్కి కరుణాలోలాత్మ నా చేసియుం
డిన పాపంబులం బాసిసద్గతికి నేరేవం జనంగాంతు సూ
చన సేయంగదె నాగనాతండు హితస్వాంతంబుతో నిట్లనెన్. 25

చ. తెలియు సమస్త మీవుసుదతీమణి చేసిన సేతలెల్లనీ
యుల వడియున్న వార్థకమునందయి నందగ నిట్టిబుద్ధియున్
గలుగుట పెద్దవీనికెడగాగ బ్రయాగము నన్నిమజ్జనం
బెలమి నొనర్పు మద్దిదురితేంధన సంహతి కింద వాగ్నియూ. 26

వ. ఆబ్రహ్మక్షేత్ర స్నానంబున కన్నం బాపనిబ్బర్హణ విధియొండు లేదు శీఘ్రంబు
నం జనుమందుల స్నానంబునం బరిశుద్ధాత్మక వాదువింతయు నిశ్చయంబు పలికి
మఱియు. 27

—(*) గౌతముం డింద్రునకు శాపం బిచ్చుట. (*)—

చ. హరిహయుఁ డొక్కనాఁడు నలినాయతలోచన లందుఁ రూపవి
స్ఫురణ నహల్యమిన్న యనియుంద్రుహిణాత్మజు తోడవిన్నవాఁ
డరిగి మనోజ తాపమున నయ్యెల నాగ బహిష్ఠయై మునీ
శ్వరు నెడ బాసియున్న యెడవచ్చి రమించె రహస్య వర్తనన్. 28

వ. అట్లు రమించుటయు. 29

క. ఆపాపంబున గౌతమ, శాపంబునఁ జేసి యోనిజాలంబులచే
రూపింప రానిదైన కు, రూపము గనె చూపఱులకు రోఁతయుఁ గాఁగన్. 30

వ. అయ్యహల్యయుం బతి శాపంబున శిలారూపంబై పడియె. 31

ఉ. అవ్విధి కప్డు వజ్రిహృదయంబునఁ దాన్వకృతాపరాధమున్
ద్రవ్వి పరాభవంబు నిటు దాపక చెప్పెడు మేనితోడ నిం
కెవ్విధిఁ బోదు నాత్మపురికే మనువాఁడ సురాలితోడ నీ
సవ్వడి నాత్మలోఁ దెలిసి శాంతి వహించెడి నేగురుండె దన్. 32

క. అనివజ్రి మిక్కుటఁపువగ, పున వేయట నుండి మేరుభూధరమునకున్
జనియందుఁ గల్గుశతయో, జనవిస్తృతమైన మానసాబ్జాకరమున్. 33

క. కనిడాసి తజ్జలాంతర, మున నుండు సువర్ణ నళినముఖ కర్ణికన
య్యనిమిష పతి డాగినిజా, త్మనసంగుని గూర్చియిట్లు తానన దోడఁ గెన్. 34

చ. అకట నిశాశ్రయుండు దురితాత్ముఁడు గర్వియు తోషశూన్యుఁడు
త్సుకుఁడు పరాపచారముల దుశ్చరితుండు మరుండుగాక యొం
డొకరుఁడు శాత్రవుండుఁ గలఁడో కలలోకము లందు చూడ నీ
నికి నితఁడౌ నసాధ్యుఁడన నేరమయారె త్రివిష్టపంబులన్. 35

క. తుంటవిలు పూవ్వుములికియు, నొంటిఁబలం బదియు శూన్యమొగినారియు వె
న్వెంటన తెగునిట్లుండియు, గెంటండివి యన్ని ద్రఢిమఁ గీల్కొన నెట్లో. 36

మ. అని దూషించి సురాధినాథుఁ డతి సూక్ష్మాకారుఁడై యందెయుం
డిన స్వారాజ్య మరాజకంబగుచు రాణింగూడి సర్వామరుల్
చని వాచస్పతిఁ జేరి మ్రొక్కి యని రక్రాంతంబునిం గొల్చి నీ
ఘనకారుణ్యముఁ గాంచువార మిది చక్కం జేయు మాకార్యమున్. 37

క. గురువర్య సర్వదేవో, త్కరమునకధి నాథుఁడైన ఘనవాహనుఁడీ
వరకిందుఁ జేరఁ డెందే, నరిగిన మార్గంబుఁ దెలియదయ్యెం గాదే. 38

చ. అరయ నుపాయశాలిసుగుణాంచితుఁడై యిరవొందు సూనుఁడో
క్కరుఁడును లేని యన్వయము కైవడి కాంతికిఁ బాసెనయ్య ని

ర్జర భువనప్రచారము విచారముఁ బూనక యున్నమీరలి
ప్పురుసున రాజ్యముండెడునుబాధలఁగుందును దేవసంతతుల్. 39

క. అనియిటు వలికిన దివిష, జ్జనముల మొఱ నాలకించిచర్చించిమదిన్
ఘనవాహను వృత్తాంతం, బునుసర్వము నెఱిఁగిసుర సమూహమునకనెన్. 40

క. సురలార యేనెఱింగితి, హరిహయుఁడపరాధియై నితాంత ప్రీడా
భరమున నుండెడుచోటిం, తరయక దుష్కృతముసేయనదితప్పెడినే. 41

చ. త్రిభువన రాజ్యగర్విత మతిన్ జరియించి యకృత్య కృత్యముల్
విభజన లేకచేసివెరవేది మహాదురి తాతి దుఃఖముల్
ప్రభుతకుఁ బాసిపూనె తలఁపంగ నదట్టిద పాపులెల్లరా
సభపురసూకరావలులసంభవమంది భుజింపరేవెతల్. 42

క. అనివలికి మనమునిందఱు, మునిపుడ యచ్చోటికరిగిపురుహూతినిఁ దో
డ్కొనివత్త మిటకురండని, యనిమిష వర్గములతో బృహస్పతియంతన్. 43

చ. రయమునఁ బోయిమేరుకు ధరాంబుభవాకర తీరభూమిఁ జే,
రి యురుదయాపరుండయి హరిందగఁ జేరి యి కేలరమ్మిటన్
భయమున నీవడంగిననుపాపముఁబాసెనె పాయనోనె చేఁ
జెయినోన రింపఁబడ్డయదిచేడ్పడదాని భుజింపకెంతయున్. 44

చ. అనితనుఁ బిల్వనప్పుడమరాధిపుఁడంబురుహాంతరస్థలం
బునువిడ నాడిఖిన్నతనుఁబూనినమోము వికారవిగ్రహం
బానర సరోవరాంబువులనుండి వినిర్గతుఁ డయ్యుతీర భూ
మినిగురు పాదపద్మములమీఁద శిరంబునుఁ జేర్చిభక్తితోన్. 45

వ. పలువిధమ్ములఁ బ్రార్థించి యిట్లనియె. 46

శా. ఓ కారుణ్య పయోనిధీ గురువరాయోదీన మందార సు
శ్లోక శ్రీనిధి నీవకాక యితరుల్ లోకింప నాకైన యీ
యాకారంబు సపాపమై పరిహారంబాభంగిఁ గావించియున్
నాకశ్రీ విభవంబుల న్మనుపనున్నా రెకృపన్ బ్రోవవే. 47

క. అనివేడ నతనిఁదోడ్కొని, చనిబ్రహ్మ క్షేత్రమై యొసంగు ప్రయాగం
బునముంచి గురుఁడు జిష్ణు వృ, జినముక్తునిఁ జేసెతత్ప్రసిద్ధజలములన్. 48

వ. మఱియు. 49

—(*) ఇంద్రుండు గురునను మతి ప్రయాగంగ్రుంకి పునీతుండగుట. (*)—

చ. తడయక వజ్రియట్లనఘతంగనినంతన మేనియోనులన్
గడఁక ననుగ్రహించె నవికన్నులుఁగాగ గురుండు నాఁడ
ప్పుడుముద మందెమేను పరిఫుల్లసరోజ వనంబుభాతిఁ జొ
ప్పడివిలసిల్లఁబత్నియు సుపర్వులుమోదము నందిరంతటన్. 50

వ. ఇంద్రుండు గురుదేవ మునిగణ పరివృతుండై యైరావతంబు నెక్కి సుఖంబునం జని
యథాస్థితిం ద్రివిష్టపంబు నేలుచుండె నట్లు పరాంగనయు బ్రాహ్మణియు నైన గౌత
మపత్నిం బొందిన పాపంబునం బాసి సహస్రాక్షుండు ప్రయాగస్నానంబునం దొల్లి
పునీతుండయ్యె నీవునుం బ్రయాగస్నానంబున సర్వపాపంబులఁ బాసి స్వర్గసౌ
ఖ్యంబు లనుభవింతు పొమ్మని యిప్పురాతన కథనంబు వినిచి యనిచిన నేను. 51

సీ. కడుభక్తి నవ్విప్రునడుగులపై వ్రాలి, పెంపుమైనతఁడు దీవింప వెడలి
చెలులఁ జుట్టముల దాసీదాస జనగృహ, క్షేత్రార్థవస్తు విశేషములను
శబ్దాది విషయసంసర్గంబు గరళప్లు, తాన్నముం బోలె చయ్యనత్యజించి
క్షణభంగురమ్ము శాశ్వతకళేబరమని, తలఁపోచి తృప్త చిత్తముతోడ
తడయ కేను ప్రయాగసితాసితాంబు, పులనిమజ్జనముం భక్తి సలుపునంత
రాక్షసోత్తమ తత్తీర్థరాజమహిమ, మేమనంగల వినుపింతు నింతవినుము. 52

చ. క్రమమున మూడునాళ్లుకడఁకం బొనరించిన మజ్జనంబుచే
రమణిఁ దలంగెమత్కలుషరాజి సమస్తము నిర్వదేడు నా
ళ్లమర నొనర్చినట్టి సుకృతాతిశయంబునఁ జేసియయ్యెనీ
యమర భవంబునుం గడుఁ బ్రియంబగునాకృతి యింపెలర్పఁగన్. 53

తే. ఆప్రయాగాంబు మజ్జనాత్యంతమహిమఁ,
జేసి యిమ్మెయి పూర్వసంస్మృతియుఁ గలిగి
రజత గిరియందు పార్వతీరమణితోడఁ
గూడి క్రీడింతు సతతంబు కోర్కులొదవ. 54

వ. అట్లు తన్నిరుపమ మహాత్త్వంబు నేను. 55

క. తలపోసి మాఘమాఘం, బల బ్రహ్మ క్షేత్రమౌ ప్రయాగకుఁ జని యి
మ్ములఁ జేయు దిట్లు మజ్జన, మెలమిని మతి వింటె రాక్షసేశ్వరనీవున్. 56

క. అని రాక్షసుఁ గాంచనమా, లినికని యొక్కింతఁ గొఱత లేకతి మోదం
బున నాయు దంతమంతయు, వినిపించితి నింక నీదు వృత్తాంతంబున్. 57

వ. ఈ భయంకరాకారంబుఁ గలుగు కారణంబు మొదలుగా నెఱింగింపు మనుటయు
గాంచనమాలినికి రాక్షసుం డిట్లనియె. 58

క. పుడమిని సాధుజనంబులు, తడయక యిష్టంబులర్థితతికిత్తురుతా
రడుగుదురు గైకొనంగా, నెడద నసంశయులుగాగ నీసుగుణంబుల్. 59

క. నీయందుఁ గానుపించెడు, నోయమ్మా వినుము సద్గుణోత్తమ వగు నీ
శ్రేయంబుఁ బొగడఁ జాలుదు, నేయిది యట్లుండె నాకు నీ గారవమున్. 60

వ. లభించుట మహాభాగ్యంబు జువ్వె క్రూరకలుషంబునఁ గిరాతుండై జన్మించిన
వానికిం బ్రాయశ్చిత్తంబు లేమున్న సజ్జనులతోడ నతం డాత్మీయదుఃఖంబుం జెప్పి
కొని పరితపించినఁ దద్దుఃఖంబున గొంతశాంతి గలుగుఁ గడుపుణ్యాత్మురాలివగు

నీకు నా పూర్వస్థితిసంతయుం దెలుప నాకుం గొంత శాంతియొదవు విన్నవించెద
వినుమని యిట్లనియె. 61

ఉ. తొల్లి వినిర్మలంబయిన తోయరుహోద్భవు నన్వయంబునన్
దెల్లమిగా జనించి వినుతింపజనంబులు వేదశాస్త్రముల్
గొల్లలుగాఁ బఠించి ధనలోభతఁ గాశికిఁ బోయి గంగలో
నెల్లఱుఁ గ్రుంకవారి కడకేగి విమర్శన మింత లేకయున్. 62

క. కలుషాత్ములొలి క్షత్రియు, లలయూరవ్యులును శూద్రులాదిగనియ్యన్
బలుదానంబులు కుత్సిత, ములు ఘోరము లున్నిషిద్ధములు బహువిధులన్. 63

క. పలుమారుఁ గైకొనంగాఁ, గలిగితి చండాలునై నకడఁ బోనీకేఁ
బలుకంగ నేలతద్విధిఁ, దలకొనకేనున్న దుష్కృతము లేదుర్విన్. 64

ఆ. ఇదియ కాకయందు నెఱిఁగి యెఱుంగమి, నైనసుకృతమొండె నఘమొండె
సేయఁగలుగ మేరుశిఖరిచాడ్పున నభి, వృద్ధి యగుచునుండు సిద్ధచరిత. 65

—(*) బ్రహ్మరక్షస్సు కాంచనమాలినితోఁ దన పూర్వజన్మస్థితు లెఱింగించుట. (*)—

క. ఈపగిది పాపమేగా, కేపుణ్యము సేయనందునింతయు నేన
ట్లేపాసి మత్శరీరము, నో పద్మదళాయతాక్షి యొకకొన్నాళ్లన్. 66

క. అందొదవిన కలుషావలి, యందేనశి యించుఁగా నయమవాసంబున్
బొందక యప్పటిపాపము, లంది పునర్భవములందు నతిసంకటముల్. 67

క. పడవలసి రాక్షసుఁడనై పొడమి హిమాగమున నుండి భూతంబులకుం
గడునలిగి పెక్కుపాపము, లుడుగక కావించి వెండియును ధారిణిపై. 68

తే. వ్యాఘ్రజన్మంబు నందియు వారకమఱి, రెండుమాఱులు గృధ్రంబు రెండుమార్లు
భువి సరీసృపమయ్యు సముద్భవించి, మఱియు నొకమాఱు ఘూకమై మహిఁ జనించి.

చ. గొనకొని యాఱుమారులురు ఘోణియుఁగా జని యించి యిప్పుడీ
ఘన వికృతాకృతిం గని కర్బురయోని సముద్భవించి తిం
దుననొక వేయిడెబ్బదియు నున్మగి నైదు సమంబు లేగనే
మనఁగల నొక్కనాడయిన నాత్మకు లేదు సుఖంబొకింతయున్. 70

క. ఈకొండ నుండియాకటి, కైకదలియ నేకచేతనావలిఁ దినఁబో
రాకల మూఁడామడఁగల, లోకము పాడయ్యె వినుము లోలాక్షి కడున్. 71

వ. ఇట్లు కారణంబుఁగా నఖిలప్రాణిహననంబొనరించిన పాపంబు మనంబునకు ఘన
తాపంబుఁ బుట్టింప నాపై నిప్పుడు భవదీయసందర్శనామృతవృష్టి గురియుటం
జేసి శాంతింబొందితి నిక్కారణంబునన కాదె సత్సాంగత్యం బొక్క క్షణకాలం
బైనను పుణ్యతీర్థావగాహనఫలం బొందించునని బుధులు వలుకుదు రిది యస
త్యంబగునే యని మఱియు నయ్యసురుండు. 72

క. విశదముగ నీకు జెప్పితి, శశివదనా నావిధంబు సర్వము నేనే
వశమున దుఃఖాకరమీ, దశనీగుదు ననుచు మఱియుఁ దానిట్లనియెన్. 73

ఉ. సజ్జనాలిముదము౯సజ్జనులకె గాక, యితరనరులకేరికిఁకీయదొక్క-
దుగ్ధవార్ధితనదు౯దుగ్ధమూహంసము, లకును బోలెనడవొ౯బకములకును. 74

తే. అని వచించినయతని స౯మంచితోక్తి, కలరి బర్హిర్ముఖాంగనా౯తిలకమిట్టు
లనియె వెండియునతనికి౯నతికృపార్ద్రి, చిత్తమెయెంత యును మేలు౯సేయఁదలఁచి.

చ. సుకృతముఁ గోరిదానమువ౯సుంధరనియ్యఁ దలంచి యాక పే
దకు ధనికిచ్చె నేనియది౯ధారిణి గుర్వ కపోయియవ్వలా
హకము పయోనిధింగురిసి౯నట్లు నిరర్థక మాను దానెఱుం
గకతల కొన్న సార్థకముఁ గాంచఁడు తత్సుకృ తాభిలాషియు౯. 76

తే. కానదార్తుఁడ వగునీకుఁ౯గడఁగిసుకృత, దానమేనిచ్చి తత్సుకృ౯తంబు వడయు
దాన మానుము వగవు స్వాం౯తమున నేని, శాచరత్వమునకుఁబాసి౯చనెదుదివికి.

వ. అది యెట్లంటేని. 73

చ. విడువక మాఘమాఘమతి౯వేగ బ్రయాగకు నేగియందుల౯
దడయక స్నానమాడినని౯తాంతవృషంబని యేరికైన తె
క్కిడఁగ నసాధ్యమాత్మ కృత౯మెంచఁగ రాదటు లుండువానియం
దిడిన నొకండు నీ యఘము౯లెల్లనుఁ బాపి కృతార్థుఁ జేసెడు౯. 79

క. ఆర్తున కిడుదానము వి, స్ఫూర్తిఖ్యాతిదముస్వర్గ౯భూతిదమంచుం
గీర్తింతు రట్లునీకుం, గూర్తుం దత్సార్థకంబుఁ గొందట నేను౯. 80

వ. అని పలికి తా నొనర్చియున్న బహు మాఘస్నానఫలంబులలో నొకం డొసం
గిన నాక్షణంబ. 81

చ. అవనిప! తన్మహత్త్వమున౯నయ్యలివేణి వచించినట్లుదా
నవవికృతాంగముందొఱఁగి౯నవ్యరుచిందనరారు నిర్జర
ప్రవిమల విగ్రహంబటన౯రాక్షసుఁడంది విమానయుక్తుఁడై
దివి భువి దిక్చయంబుతన౯దీప్తివితానము నిండఁజేయుచు౯. 82

క. సంతోష సంయుతుండై, కాంతామణిఁ బొగడిపెక్కు౯గతులను మఱియా
యింతికి నిట్లనునతఁడుహృ, దంతరమున నున్న కోర్కు౯లన్ని యుఁదీర౯. 83

ఉ. మానిని నీనుపుణ్యమహి౯మంగళుమంబుల వాసిదేవసం
మానిత మూర్తిఁగైకొని యమ౯ర్త్యపదంబున కేగఁగంటి నెం
తేని కృపాంబురాశివయి౯యీవిధిఁబ్రోచిన నీ హితంబు నే
మానక సంతతంబమర౯మండలిలోపల సన్నుతించెద౯. 84

వ. ఇంక నాయం దనుగ్రహించి మేలైనదియు నీతిస్వరూపంబై యఖలధర్మంబులకు
మూలంబైనదియునైన మార్గం బుపదేశింపు మదియు నీవలన నెఱింగి యనుమతి
వడసి దివంబునకరిగెద ననుటయు వాని భక్తిభావంబులకు సంతసిల్లి ధర్మోప
దేశంబు సేయందలంచి యయ్యమర్త్యకాంత యిట్లనియె. 85

క. ధర్మవు సలుపఁగనీకుం, బేర్మినిమదిఁ బొడమెనేని వినుముముదమునన్
నిర్మలమతి గైకొనిదు, ష్కర్మములకుఁ దలఁగుపరగు కారుణ్యమునన్. 86
ఆ. జంతుహింసమాను సత్పూరుషులఁగొల్వు, మాత్సర్యమదియువిడుము మనుజునొకని
గుణము దోషసమితిఁ గొనియాడకుండుము, సూనృతంబువలుకు చుండుమెపుడు.
క. హరిఁబూజింపుము సతతము, జరుపకు సాహసములెందు సరివైరాగ్య
స్ఫురణమునఁ బరగుతనువ, స్థిరమనితలపోయుయోగ సిద్ధింగనుమీ. 88
ఆ. మాంసరక్తపూయ మస్తిమజ్జాయుతకళే, బరమునందుమాను దురభిమాన
మంగనాత్మజాదులందునుపాయుని, మోహటునుపకదియు మోసమనుచు. 89

—(*) బ్రహ్మరాక్షసుండు కాంచనమాలిని యనుగ్రహంబున దివికేగుట. (*)—

క. తెలియంగఁ జెప్పితింతయు, నెలమిన్నీ విట్లుమెలఁగి తేనియునదిని
ర్మలధర్మ వృత్తిదానం, బొలుపొందున్ గీర్తిసుఖము భూనాకములన్. 90
క. అనిబోధించిన వినికాం, చనమాలిని కపుడతండు సద్వినయంబుం
బెనఁగొనఁగ మ్రొక్కివెండియు, ననియెందన మానసమున హర్షంబెసఁగన్. 91
క. సంతత సంతోషంబున, నెంతయుఁజిర కాలముండుమీశ్వరినిన్న
త్యంత ప్రీతింజూడని, తాంతాధిక ధర్మబుద్ధివై రజతగిరిన్. 92
వ. అని యాశీర్వదించి వినుతించి యమ్మగువవలన శెలవంది సురగంధర్వాది సేవితుం
డగుచు దివంబున కరిగె నంత నమరీజనంబు లా కాంచనమాలినిపైఁ బుష్పవర్షం
బు గురుపించి పొగడి యిట్లనిరి. 93
క. సలిపితివిమేలు పాపం, బులతోరక్షస్తనూ విముక్తుఁగాని
ప్పులలాసిఁజేసి యవనిం, గలయందిరు గాడనింక గలుగదు భయమున్. 94
క. అనిపలికి వారొనర్పుడు, ఘనసత్కారంబు లవియుఁ గైకొని యుకాం
చనమాలిని కైలాసం, బున కేగెం గాఁగొలిచి ముదమున నుండన్. 95
వ. అనిచెప్పివెండియుఁ గార్తవీర్యార్జునునకు దత్తాత్రేయుండిట్లనియె. 96
క. ఈదేవకన్యకాసం, వాదంబగుపుణ్య కథను వారక విను వా
రాదటవినుపించెడి వా, రాదివ్యపదంబు ముక్తినందుదురెలమిన్. 97
క. అనివినిచె ననివశిష్ఠుఁడు, జనపతికింజెప్పి మఱియు చనువెనయంగా
వినుపింతు మాఘమజ్జన, ఘనసుకృతఫలంబు విందు గాకనియనియెన్. 98
క. అఖిలవ్రత దానంబుల, నఖిలతపోయజ్ఞవితతి నమరెడు ఫలమున్
సుఖలీలఁ గూర్చునెంతయు, నఖిలావనిపాల మాఘమది స్నానమునన్. 99
వ. మఱియు నమ్మాఘమాసోదయ స్నానంబు. 100
ఆ. జనకుతరమువారి జనయిత్రితరము వా, రినిపితరుల స్వర్గమునిచియతని
ద్యుమణి దీప్తికామ గమనంబుఁ గలవిమా, నమునఁగొంచునేగు నాకమునకు.
వ. ఇదియునుం గాక. 102

సీ. అనఘాత్మ పాపకార్యాసక్తుఁ డనృత వా, దియు దుష్ట వర్తనఁ దిరుగువాఁడు
జననీ జనక బంధు జన దూషకుండగు, వాఁ డోర్పు లేకున్న వాఁడు శాంతి
హీనుండు ధర్మపుం గానకున్నట్టివాఁ, డుండాంబికుండు హీనుండుఁ బతితుఁ
డగువాఁడు వీరుఁగా కఖిలహీనాశ్రయు, లమ్మాఘమజ్జన మతిముదమున
సలిపి రేని భుజంగమా మెలమిఁ గుబుస, మూడ్చు చాడ్పున కలుషము లొకఁట నూడ్చి
సజ్జనోత్కర మేగెడు చక్కి స్వర్గ, మరిగి యందులఁ గనియెద రధిక సుఖము. 103

వ. మఱియు నమ్మాఘమాసంబునం దొనరించిన జపతపోవ్రత స్నానాదులు విష్ణుపూ
జనంబు లెన్నండుం గొఱంత వడని సంపూర్ణ ప్రభావంబు లొసంగు కృతార్థంబులై
యక్కాలంబున స్నానంబుఁ గావించి యథాశక్తి ధనవస్త్రాది దానంబు లిడిన వార
మరలోకంబు నంద నంతసుఖంబు లనుభవించు వారగుదు రందన్నదాతలమృతపా
నంబు సేయువారును సువర్ణదానంబు లొనరించినవా రమరవిభుచంగట సదృశా
సనులై యుండు వార లంబరదాత లర్యమలోక నివాసు లయ్యెడువారు నగు
దురు వెండియు. 104

క. దానవ్రత జపతపములు, మానగు యజ్ఞములు యోగ మహితస్థితులుం
బూని యొనర్చిన ఫలమా, స్నానంబునఁ బొందియుండ్రు సౌఖ్యమున దివిన్. 105

ఆ. పుణ్యతీర్థములను పూషోదయంబున, మాఘమజ్జనంబు మనుజుఁ డెవఁడు
సేయు నతఁడు పాపచిత్తుఁడైనను నిర, యంబునంద కేగు నమరపురికి. 106

క. గురుభక్తి నెవఁడు విస్ఫుర, దరవిందాప్తుం భజించు నాస్నానానం
తర మతఁడు దివి సుఖించియు, ధరపై రాజుఁగ జనించు ధరణీనాథా. 107

క. అని చెప్పి మఱియు నిట్లను, మనుజులు భూలోకమునఁ బ్రమాదాత్ములై
ఘనకిల్బిషంబు లేమై, నను జేసిన మాఘమజ్జనంబునఁ బాయున్. 108

వ. ఇంతయు నిశ్చయంబు మున్ను గంధర్వకన్య లేవు రేని వలనం బాయని దురంతం
బగు శాపానుభవంబు రోమశుని యోగంబునఁ బ్రయాగ మాఘస్నానం బొనరించి
పాసిరనుటయు దిలీపుండు వశిష్ఠునకు నమస్కరించి యిట్లనియె. 109

చ. పరమ మునీంద్ర యింతయుఁ గృపామతి నాకెఱిఁగింపు కన్యలే
వెరవున శాపమంది రవివేక మదేమి యొనర్చి రట్టులా
తరుణుల పేరు లెవ్వి తలిదండ్రు లెవ్వరు ప్రాయ మెంతయె
వ్వరు శపియించినారు విన వాంఛ మనంబునఁ దోఁచె నెంతయున్. 110

వ. అనవుడు వశిష్ఠుండు దిలీపున కిట్లనియె. 111

తే. అరయ ననల వృషాన్వితమైన యరణి, రెండువిధముల మేలు సంప్రీతి సేయు
నట్లు చిత్తప్రియంబు మోక్షాప్తి సేయు, నిష్పురావృత్తమెంతయు నినకులేశ. 112

——(*) వశిష్ఠుండు దిలీపునకు గంధర్వకన్యకల వృత్తాంతముం జెప్పుట. (*)——

వ. ఇట్టిదీని సవిస్తరంబుఁ గా నెఱింగింతు వినుము మున్ను గంధర్వులలో సుఖసంగీ
తుండును సుశీలుండు స్వరవేదియుం జంద్రకాంతుండును సుభగుండు ననువారే

పురుం బ్రసిద్ధులైయుండి రమ్యోపురకుం గ్రమంబున ప్రమోహినియు సుశీలయు సుస్వరయు సుతారయుఁ జంద్రికయు ననువారే పురాత్మజలై సమానవయోరూపవిలాసవైఖరుల నలరియుండొరుఁ బాయకేకోదరోదితలవడువున మెలంగుచుండి రయ్యంగనాలలామంబులు. 113

సీ. నెఱిమించు క్రొంకారు మెఱుపుఁ దీవలు నింపు, ప్రాణంబుఁ గైకొన్న పైడిబొమ్మ
లలరారఁ బూసిన యెలమావిగున్నలు, జగతిం జరించెడు చంద్రకళలు
అసమాస్త్రుఁ డేలు నెయ్యంపు రాచిల్కలు, తీరైన యొసంగు ముంగారు మొలక
లలికాక్షువైరి మేల్ములుకు లారతిచేతి, గొనబైన యచ్చనగుండులంగ
ములఁ జరించెడునతను సమ్మోహవిద్య, లనఁగ దనరారి రత్న భూషాంబరాది
శోభితాత్మీయతను రుచిస్ఫురితలగుచు, నమరివీణలచేఁ గూర్చియందముఁగను.

క. ఆరోహణావరోహణ, లారూఢిగఁ బొల్పఁ బాడుచతి మోదమునన్
వారక వేణువు లూదుచు, సారెకు నృత్యములొకట సలుపుచు మఱియున్. 115

వ. వివిధ వినోదంబు లంగ్రీడింపుచుఁ గైలాసశిఖరి నుండునంత. 116

చ. అలరె వసంత మంచిత లతాంతసమస్తవనాంతరంబుని
ర్మల కలకంఠ పంచమవిరావవికాసితమున్ నియోజిత
స్థలగతజారిణీరతినితాంత సుతాంతవిటప్రచారమ
త్యలసనుగంధ గంధవహహారివిహారదిశానిశాంతమై. 117

తే. అంత ప్రముదిత నిజహృదయాబ్జలగుచు, మగువలేవురు వైశాఖమాసదినము
లందునొకనాఁడు వనవిహారాభిలాష, మలరనాత్మీయమందిరంబులనుఁ బాసి,

సీ. ఏలాలతాతుంగమాలూరక లవంగ, సాలామ్లికాలుంగజాలములను
కేతకీపిచుల భల్లాతకీ మందార, చూతకీచకనింబజాతములను
పనసవంజుళకుందతినిశద్రుపిచుమంద, ధనుపటద్రుమ చందననగములను
నారికేళ తమాలపారిభద్రక తాల, శారదీతక్కోలవారములను
లలిఁ దనర్చిన వనులఁ బల్లవఫలప్ర, సూనకలికోత్కరశలాటుశోభితముల
నఖిలఖగబృంద కోలాహలాతినినద, కలితములఁ జూచి సంతోషకలితలగుచు.

క. వనముల స్వాశ్రితజన పా, వనముల విహరణము సేయువాంఛామతిజ
వ్వనములఁ దనరిన చెలువలు, వ్వనములలోఁ జేరి రధికవైదగ్ధ్యమునన్. 120

వ. అట్లుచేరి విహరించు నప్పుడు. 121

సీ. పక్వబింబాధరపజ్జఁ జేరిన శుకి, తొలఁగుసాంకవగంధితో డునడువ
కలహంసయానయిక్కకు నేగి రాయంచ, కడకేగు ఘనకచఁ గాంచి పిరుఁద
కంజాస్యఁ డాసి భృంగావలి మగిడెడుఁ, గాంచి చంపక నాస కదిసియుంట
కలకంఠిఁ జూచి పికంబంతి కంబయ్యె, రామాంగి నెఱిఁగి దూరంబునుఱుకు
వరుసఁ బన్నగవేణి క్రేవం జరించు, వనమయూరము శరదిందువదనతన్మ
మీపఁగానంతఁ బాఱెడు మిడిసికినిసి, కలఁగియున్ననిమదివానిఁ గానివయ్యె. 122

క. పాటలగంధుల కటులే, కాటంకం బాత్మ నలరి యవ్వనిబల్ స
య్యాటములం దిరిగి యెల్లెడం, బాటవమున విరులం గోయు పనిం గొనునంతన్. 123
సీ. చూచినంతనె కూర్చె సుమనః కదంబంబు, తిలక మర్పింపనా చెలుల కెలమి
పల్కు విన్నంతం బున్నాంక మయ్యెనో నంగం, గైకోలుం గాకర్ణి కారకుజము
వదనమ్ము జూప సంపగిము న్నె తాం దాల్చె, చేరం గాం రాంబుమ్ప వార మొనంగ
కడం జేరినంత నిక్క పుం కూర్మి నిడం గాంచె, కురవకో ర్వీజమ్ము కుసుమవితతి
మఱియు నవ్వనిఖల మ్మమా ళులొసంగ, బూనె ఫలసుమతతి తత్ప్రభూతదుస్స
హైక భారానతోరు శాఖాకరముల, వెలందులంతిక మునకు రా వేడ్కలూర.
తే. అట్లు పుష్పాపచయమున కై కడంగి, యవ్వ రారోహ లొండొరు లధికవివిధ
వివద సమ్మోదములనున్న నీడజములం, గోదమతు మ్మెద పిండుల చదలం దోలి. 125
సీ. కడుక్రోధ మునవింతక న్నెఱ్ఱ జేసెనం, గా కేమి కోకిలల్ కూకలిడుచు
ముక్కు పై కోపంపు మురువరుణమ్ముగాం, బలికెడుంగా కేమి చిలుక లెల్ల
మొగమెల్ల నల్లంబో నెగసి కాటులుం గూయుం, గా కేమి శారికా గణములు దుట
తలదిమ్ము వారు మ్రోగుల పెక్కు మొఱలిడుం, గా కేమి కూడి భృంగమ్ము లెసంగి
కొండు గైకొండు గారికి గోదువగాక, యుండ నర్పింపననుచు న య్యువిద లెల్ల
నలరు విరులునుం గిసలయంబులు విపక్వ, ఫలచయమ్ములుం గొనిరి యిమ్ముల మహీశ.
వ. అట్టి సమయంబునందు. 127
తే. విమల సౌందర్యరూప విభ్రమవిలాస, సంపదల కాత్మ వనలక్ష్మి సంతసించి
సరవిం దనలో గిటం జేర్చి వరఫలాది, కములవడినించె నో యనం గారహించె. 128
తే. అట్లు ఫలపుష్పవితతి న య్యులరుం బోండ్లు, కోసి వడినించి వనమునం గొంతం దలంగి
యంతికమ్మున నొకకొంత యరిగి చంద్ర, కాంత సందోహరచితమార్గంబు పట్టి.
క. మోదమునం గాంచిరా శా, తోదరు లేవురును నవ్య తోయజ మధ్వా
స్వాదన ముదిత మధువ్రత, నాదం బచ్ఛోదమ నెడి నలినాకరమున్. 130
ఆ. అది శనైశ్చరాబ్జ సదనంబు కుజయుక్త, మాత్త శింశుమార మమరుమీన
కర్కటాన్వితంబు గాహంసమండల, మయ్యొహంసమండలాప్తిం గలిగి. 131

—(*) గంధర్వకన్యక లచ్ఛోద సరోవిహారంబు సేయుట. (*)—

క. అన్నాళీ కాకరమున, నున్నకన త్కనకనీరజోత్కరము సము
ద్యన్నీల నీరదాభవి, భోన్నత చికురలు గ్రహించి యుత్సాహమునన్. 132
వ. అన్నియు విదూరమణీ స్ఫాటికాది రమణీయంబగు తత్తీర ప్రదేశంబునందునిచి.
చ. లలితమణీ విభూషలు చెలంగు దుకూలము లాణిముత్తియం
బులపనిం బొల్చు కంచెలు ముమ్నుం గవిప్పియుం దీరభూమిని
మ్ములనిడి పావడల్ జిలుగు పుట్టపు కంచుకముల్ ధరించి త
జ్జలముల డిగ్గియేవురతి సంతసముల్ వెలయంగ నొండొరుల్. 134

లయవిభాతి. వడివడిఁ ముంచుచును జడజములఁ ద్రెంచుచును
తుడుముఁగొని ఖగవితతి కడువడిఁ బాఱన్,
గడకబెద రించుచును నడుగుఁదిల కించుచును
జడజనాళములు చిమ్ముచుఁ గ్రోవులుంగా,
నిడిజలము నించుచునుఁ గడువిజృంభించుచును
పడతులొం డొరులుపయిఁ బడఁజిమ్ముకొంచున్,
బడిబడిఁ గలంచుచును మడుగునల యించుచును
తడవుఁగొని జలకేళి నడిపిరి చెలంగన్. 135

క. ఆలీల నా సరోవర, కీలాలము లన్నిఁ గిరికన్యాపూ
జాలోల చిత్తలైత, త్కూలముప్రాపించి కట్టికొని చేలంబుల్. 136

ఆ. మూనమూనిదర్భ లోనగుకడుపూత, వస్తువితతిచేఁ బ్రశస్తమైన
ధారిణింబసిండి సీరునఁ బిష్టంపు, ధృతహారిణసతీప్రతిష్ఠఁజేసి. 137

క. ఆవాహనం బొనర్చియు, దేవినివివిధోపచారతృప్తాత్మకఁగా
గావించి భక్తియుతలై, యావనితలు ముదితమానసాంబుజలగుచున్. 138

క. సరిగమ పధనీత్యాది, స్వరజనిత నిషాదకాది పంచమవిల స
త్స్వరమంత్యంబుఁగ గాంధ, ర్వరుచిరసరణులనుఁ బాడి రక్తులు గులుకన్. 139

తే. భరతశాస్త్రోక్తి నాట్య విస్ఫురదనూన,
హావభావాభినయవిలాసాదికములఁ
గొంత నటియించి రతివలు సంతసంబు,
వెలయ మృగపక్షు లతిమోద ములువహింప. 140

క. అటుల యచ్ఛోద సర, స్తటమున వా రతివినోద తాత్పర్యములన్
నటియించుచుండుతఱి న, చ్చటికిని వేదనిధి సుతుఁడు స్నానార్థియునై. 141

——(*) గంధర్వకన్యక లగ్నిపుంజూచి మోహించుట. (*)——

క. వేంచేసె నాతఁడభినవ, పంచశరుం బోలియధిక భాస్వత్తనురు
క్సంచయశోభితదిక్చయుఁ, డంచిత సత్కర్ముఁడగ్ని పాభిఖ్యుండున్. 142

తే. నాట్యగీతాది సమధికానందలీల, లమరనట్లగ్గ రీశుని రమణిచెంత
ప్రొద్దుఁబుచ్చుచునుండు నప్పొలఁతులప్పు, డతనిఁజూచిరి మదిమహాద్భుతముఁదోప.

వ. అట్లుఁ జూచి యమ్మగువ లాత్మగతంబున. 144

ఉ. ఎక్కడ నుండివచ్చె నితఁ డిందుఁడొ కంతుఁడొ యాజయంతుఁడో
జక్కులఱేనిసూనుఁడొ వసంతుఁడొ వారల కైననిట్టిసొం
పెక్కిన రూపసంపద లనేమువినంగన మున్నయట్లు నీ
చక్కనివాఁడెవండొ జల జాకరమీయది సేరవచ్చెడున్. 145

ఉ. చందురు నిందసేయు విలసన్ముఖ మొప్పగు రూపమంబు జా
త్రుం దెగడుం గడుంగనులు తోయరుహంబుల మీఱు తమ్మి తూం

డ్లెందును సాటిరావు పొలుపెత్తినబాహు యుగంబుతోడఁ గా
నందము గానరాదు కురులాయెల దేటుల బారుగేరెడున్. 146

సీ. కైటభాంతకుఁడెయీకంజాక్షుఁడందమా, యురమునశ్రీవత్సముండవలదె
శూలాయుధుండెయీశుభ్రాంగుఁడందమా, యొగిలలాటాంబకముండవలదె
నలువయే యీకమండలుధారియందమా, నలుదిక్కులాస్యముల్వెలయవలదె
రోహిణీప్రియుఁడెయీరుచిరాస్యుఁడందమా, సకళంకుఁడై యుండఁజనగవలదె
అనుపమాకారుఁ డీతఁడాయాశ్వినేయు, లందునొకఁడన్న నమళ విహారులెంగు
చెప్పనేటికి నితరులసిద్ధకిన్న, రామరాదుల నెవఁడుఁగాఁడమ్మయితఁడు. 147

వ. అని మఱియు వితర్కించి, 148

తే. ముంజి కృష్ణాజినము దండమును జెలంగ,
యజ్ఞసూత్రము కుండియునమరఁజేసి
యితఁ డొకానొక ఋషిపుత్రుఁడేయటంచు,
తలఁపు నకుఁదోచు చున్న దెంతయు గణింప. 149

ఉ. చక్కని వారిలోమిగులచక్కనివాఁడు మరుండ టంద్రు ము
న్నిక్కమ నీయరూపుఁ దుదయించి కనుంబడ కుంటఁజేసి తా
నెక్కడనంగుఁ డీసుతనుఁడెక్కడ పల్కిన నూత్ననౌనె య
మ్మక్క యి కెట్లుకన్గొనినయంతనెముమ్మర మయ్యె మోహముల్. 150

క. అనిమఱియు చెలులుతమలో, వనజజుఁడు సృజించిపుచ్చెఁ వైళమమనకీ
యనుపమ రూపునుమాసతి, పనిచినమన భక్తిమెచ్చిపరమప్రీతిన్. 151

క. కాకున్న నిప్పుడితఁడే, కాకిగనీ యెడకురాఁగఁగారణమేమాఁ
గాకయని పూర్వసుకృతము, లీకరణి ఫలించెననియునింతులుమఱియున్. 152

క. చింతింప నేలయికనీ, కంతుసమా నాంగుఁగూడికడుసౌఖ్యంబుల్
సంతత మందెదమనవటుఁ, డంతయువిని యిట్లులనియెనపుడునిజాత్మన్. 253

క. ఇదియొక విఘ్నమునాకుం, గదురంగా నున్నదిందుఁగాలూనఁగ నె
ప్పుడు మాధ్యాహ్నికమే నీ, యుదకంబులఁ దీర్చివెడలనొప్పగుత్వరగన్. 154

సీ. అంగనాసితకటాక్షాశుగాఘముపార, కూలదేధైర్యంపుకోటసడలి
కామినీస్పర్శజంఝూమారుతమువీవఁ, దూలఁగదే వైరాగ్యతూలవితతి
అలివీల కచమందహాసచంద్రిక బర్వ, కరుగదేచిత్తాబ్జకాంతచయము
భామినీనర్మసంభాషణాభ్రముఁగప్పి, మాయదేజ్ఞానేందుమండలంబు
హరిహరాంభోజ గర్భాదులందునైన, మునులనైనను నెంతేనిఘనులనైన
మనుజసామాన్యులంజెప్పఁజనునెయింక, నాత్మఁదలపోసిచూడనీయవనియందు.

తే. కామినీభ్రూలతాదృఢకార్ముకమున,
తత్కటాక్షాశుగాలిసంధానపరచి

మదనుఁ డనుధన్వి వైవనేమమజుచిత్త,
మృగము తప్పించుకొనియును మొలఁగఁ జూచు. 156

తే. అంగనేక్షణ మద్యపానాతిమత్త, చిత్తులుంగాని వరకుశీస్థిరసభయులు
నయులచంచలులములులన్వయమునందు, గౌరవఖ్యాతు లందెదువారునరులు.

చ. రమణి విలాసవైఖరిఁ గరంగి ప్రమోద విమత్తచిత్తుఁడై
క్రమముఁగ మూఢుఁడయ్యెడినికాముకుఁడౌర ధరిత్రి నాత్మ మాం
సమహిత రక్తచర్మమలసంగతగాత్ర మటంచుధీర స
త్తముల నుపాశ్రయించి విదితం బొనరింపమిచే విచారమున్. 158

—(*) అగ్నిపుండు గంధర్వకన్యకల కదృశ్యుండై చనుట. (*)—

క. అనిసతులు తన్నుఁ జేరక, మునుమాధ్యాహ్నికముఁ దీర్చి మొగిహరిభక్తిం
గనిన మహత్త్వముచేఁ జ, య్యనతఁ డంతర్ధియై ప్రియంబున నేగెన్. 159

ఆ. అట్లు యోగమహిమ నాతండు వోవఁ బ్ర, త్యక్షముఁగనుఁ జూచి యాత్మ లందు
వెఱఁగు దోఁపఁ దెసల నఱిముఱి నరయుచుఁ, గుఱుఱులట్లుఁ జెలులు మొఱలిడుచును.

క. నిలిచిన చోటనవార, గ్గలఁపుఁదమిం దిక్కుఁ దెలియకయె నిలిచి మొగం
బులఁ దిలకింపుచు నొండొరు, లలివేణులు పలికిరిట్లు లాతనివిధికిన్. 161

ఆ. అకట యింద్రజాల మాదిమాయోపాయ, విద్య లెఱిఁగి మనల విడిచిచనియెఁ
జూచుచుండ మొఱఁగి యేచందమున నింకఁ, గాంచువార మతనిఁ గన్నులలర. 162

క. అనితద్వియోగమునతమ, మనములు కార్చిచ్చుఁగొన్న మహితాటవుల
ట్లును మండుడంబు జాంబకు, ఘనతాపం బనకు నోర్వఁగాలేకార్తిన్. 163

వ. అమ్మగువ లతని నుద్దేశించి. 164

ఉ. అక్కట మమ్ము మన్మథున కగ్గముఁ జేసి దయావిహీనతన్
జిక్కక జాలవిద్యలనుఁ జేకొనిపోవఁగఁ బాడియౌనె యే
మెక్కడఁ జేరువారమిపుడిందుఁ బ్రియంబునఁ గానుపింపవే
నిక్కము ప్రాణముల్ నిలువనేరవు తాల్ప కృపామయత్వమున్. 165

క. నినుమరల నిప్పుడిందుం, గనులారఁగఁ జూచువేడ్కఁ గైకొనితనువుల్
గనియున్నవి ప్రాణంబులు, చనుదెమ్మా జీవితేశ సరగున లెమ్మా. 166

క. అనిమఱియు నప్పొలంతులు, మనసిజతాపమునఁ జాల మల్లడిఁ గొనియా
యనఁ గూర్చి యివ్విధంబునఁ, బనవింపఁగ సాగిరొకట భ్రాంతాత్మకలై. 167

—(*) గంధర్వకన్య లగ్నిప వియోగంబున దుఃఖించుట. (*)—

ఉ. అయ్యయొ యింతమావలపు లారఁడిబుచ్చి కృపావిహీనుఁడై
చయ్యనఁ ద్రోచిపోయె సుమసాయకు బారికి చావుఁడంచు మే
మీయ్యఱ నోముల్ సలిపి, యింతకుఁగాక సుఖంబుఁగాంచఁగా
నయ్యెడి వారమే తన భుజాంతరసీమ వసించి పేర్మిమై. 168

ఉ. ఏమను వారమిందు విధినేమనువారము క్రూరమారునిం
కేమను వారమింతవలపెత్తికలంగెడు మానసంబులన్
నేమముఁ దప్పెనిండ్లజననీ జనకుల్ గతమేమి యింతదా
కేమర నంచనంగ మఱియేమివచింతు మదెట్లు తాళఁగన్. 169

వ. అని దుఃఖించుచుఁ గొంతఁదడవున నతండు మగుడ నచటి కరుదేఁడని నిశ్చ
యించి నిరాశలై తద్వియోగంబున దీనాత్మకలయ్యుం జననీజనక బంధుజనంబుల
వలని భయాపవాదంబులకు వెఱచి యుంచుక ధైర్యం బవలంబించి నిజస్థానంబు
లకుం జేరి యుపాయాంతరంబులం దమవారికిం గాలవిలంబన హేతువులు పలికి
సౌధాంతరంబులం జేరి వివిధ రత్నస్థాపితంబులై రమణీయంబులగు వితర్దికాదుల
మేనులుఁ బడవైచి తదేకధ్యాన పరవశలై పొరలును. 170

సీ. కలకంఠ కంఠియొక్కతె నీలకంఠమ్ముఁ, గాంచి నృత్యంబింతఁ గఱపకుండె
శుకవాణి యొర్తుచిల్కకుఁ గూర్చి పద్యమొ, క్కటియైనఁ జెప్పఁగాఁ గడఁగకుండె
కలభాషిణి యొకర్తుగాదిలి శారికఁ, దిలకించియొక్కింతఁ బలుకకుండె
నకలంక చంద్రబింబాస్య యొక్కర్తుక, లేచి ముంగిసను లాలింపకుండె
పడఁతియొక్కర్తు సారసపక్షితోడి, క్రీడ బూనకయుండె నీక్రియఁ బొలంతు
లేవు రత్యంతదుస్సహభావజాత, శరవినిర్భిన్నచిత్తలై జాలిఁగుంది. 171

వ. మఱియు నవ్వేలందు లవ్విప్రకుమారానురాగ సంజనితాంగ భవతాప ప్రకం
పిత హృదయలై మైమఱచి యింటనాడకయుఁ జుట్టంబులఁ జూడకయు విపంచి
కలం గూర్చి పాడకయు నెచ్చెలులఁ గూడకయుఁ బదార్థంబు లెవ్వియుంగోరక
యు గృహారామాదులం జేరకయు నూరక యొంటిమై యుండి శయనించుచు
శయనించి దిగ్గనలేచుచు లేచి నలుదిక్కులరయుచు నరసి నిట్టూర్పులు పుచ్చుచు
పుచ్చితలలూఁచుచు నూచి హాయనుచు నని కూర్చుండి యోగాభ్యాసినుల వడు
వున నాసాగ్రంబులం దృష్టులిడి తిలకించుచు మఱియుఁ దమయంతన తా మూ
కొనుచు నిట్లనేకవిధంబులగు విరహవేదనలం బడి యప్పవలంతయుం గడపు
చుండు నంత. 172

—(*) సూర్యాస్తమయాది వర్ణనము. (*)—

చ. తివిరి మహాహ్వాద్యదంశు వితతింజలజాత భవాండమెల్ల నే
నవిరళ కాంతిఁబర్వితి మహాంధతఁ బాయఁగఁ జేసిలోక బాం
ధవుఁడన వారివాహుఁడు ఘనాఖ్యనునందనుఁ గొంతఁగప్పఁ జే
సి వెలసెనంచుఁ జింతిలియొ చేకొనె మాంద్యము భాస్కరుండొగిన్. 173

చ. రమణులు కన్యలంగజునిరాయిడులంబడి కుందబల్విరా
గమునఁ దలంగిపోయె నటుత్తౌసురుఁడెట్టులఁ జూడనంచుఁ బ
శ్చిమదిశ కేగెనో యనఁగఁ జిత్రగభస్తి చనంగ సాంధ్యరా
గమువిల సిల్లెనచ్చెలులఁ గ్రమ్మినరాగముఁ దోఁచెనాయనన్. 174

క. సమయాశ్వ సారకారకుఁ, డమరఁగ నత్తరణిపిండ మటుఁగాఁచియు బ
శ్చిమవార్ధిద్రోణినిసిడు, డమితంబుగ వెడలెధూమ మనఁదమ మెగసెన్. 175
తే. గగనశైవలినీసూదకావసేక్త, వర్ధితాంబర తతపుష్పవాటికా ప్ర
ఫుల్లకుంద ప్రసూన సమూహమోయ, నంగనక్షత్ర తతిమించె నభమునందు.
ఉ. మ్రొక్కుల తేడు కాలగతిమూడిచనంగననంతసుస్థితుల్
తక్కినఁ జేయుఁజిక్కి యిలఁదత్ప్రజలన్య గృహప్రవర్తనన్
జిక్కియుఁ దొంటి మ్రొక్కులకుఁ జెల్లెఁగదాయనఁ బొల్చిదీపముల్
చక్కవెలింగెనైజరుచిసంహతిధ్వాంతముఁ గొంతవాపియున్. 177
ఆ. రాజు వెడలుఁ బ్రాగిల్లి శీతల, పవనఘాత్రి కుందుపట్టియున్న
వెల్లగొడుగొనాగ వెలవెలఁ బ్రాగ్దిశ, దోఁచెధవళిమంబు తోరమగుచు. 178
తే. పంకభవ సంహతులునిజప్రభలుడింప, సద్గణావేశితుండయి చల్లఁగాను
కువలయము నేలఁ బ్రాగ్దిశా కుధరసింహ, పీఠిఁగొలువయ్యె రాజు సంప్రీతితనర.
ఉ. అప్పుడజాండమెల్లఁ గలయంగ సితచ్ఛవి మించి చంద్రికల్
గప్ప మరుండు పుష్పశరకాండము వీపుల దుస్సి పోవఁగా
గుప్పన వైవ వక్షములఁ గొమ్మలు మూర్ఛిలి చేరి నెచ్చెలుల్
తప్పని కూరిశైత్యవిధిఁ దన్నినలేచి యనేకభంగులన్. 180
క. ఘనతాప కరులహిమకర, వనజాంబక మలయగంధవాహులనుప శాం
తినిఁగోరి వేఁడి నెమ్మదిఁ, గనుపింపమిఁ దిట్టిరిటుఁ బ్రకాశోక్తులచేన్. 181
ఉ. ఏమిరచంద్ర భక్తినుతియించిన మానవునీగుణంబు పెన్
బాము చలంబుతోడ వినుఁబట్టుక మ్రింగఁగటారిఁ గండిగా
నీమహితోరముం బొడువనీమెయి కండలుఁ బాల్లువైవ యి
ల్లేము మహార్తిఁ గుందనెనయించినఁ దాపము మేలుఁగల్గునే. 182
ఉ. ఎన్నఁడుసేయు నీదు ధనువింతలు తున్కలు ఘోటకంబునుం
బన్నుఁగఁ జెట్లపాలు నిజబాణసమూహము నీటిపాలు ద
ర్పోన్నతమైన నీదుతను వొక్కట దగ్ధముఁగా వియోగినీ
ఖిన్నత నిన్ను వెందవిలి కేవల మీజగతిన్మనోభవా. 183
తే. ఏరపలుమారు పెనుతాపమినుమడింపఁ, బైపయిన్ వీనఁదొడఁగితి పాపమనక
మలయపవమాన నీరూపుమాపుసేయ, కేగు నేపాంథ జనదుఃఖ మెగిచిపట్టి. 184
క. అనితిట్టి చెలులు వెన్నెల, కును మరుతాపమునకుదుటుఁగొని పీచు ప్రభం
జనమున కధికంబగు నా, ర్తినిఁబొంది భరింపలేక దీనాననలై. 185
ఉ. కాటుకకంటి నీరుఁదొరుఁగంగ కుచోపరి హా యటంచు న
ప్పాటల గంధులేడ్చిరి విపంచికఁ బాడినయట్లు తాలుఁదా
గాటపు కర్కశంబుడిగి గ్రైకొని మార్దవముం గరంగియు
చ్చోటిహిమాంశుకాంతములఁ జొప్పడు నీటికి మీరి పాఱఁగన్. 186

క. అంతట సఖులిది వెఱగని, సంతాపంబంది ప్రొద్దు జరపెడు కొరక
య్యింతులఁ దోడ్కొనిచని ర, త్యంతరములు కొన్ని నెరపి యలరించుటకున్.
వ. ఇటుల నయ్యేవురనతి విశాలంబులగు నిజోద్యానవనంబులకుఁ దోడ్కొని 188
పోయి యందు.
సీ. ఇదెమన సహకారమింతి మారుని, తూపుకేమి సేయఁగఁజాలునిందునుపికి
నిదెమన పున్నాగమెలనాగ నీకింత, వలవంతయేటికి వలనఁజూడు
మిదెయింతమెల బాలేందుఫాలా తాప, మొనరె బ్రహ్మణ్యంబుమనకునిందు
నిదెసర్వతోభద్రమొదవె నీకుంగూర్మి, నింపదే తిలకింపు నీరజాక్షి
మొనయఁజూడు మిదిగోమునిసుమనోయుక్తి, రాగమెసఁగి కానరానిటంచుఁ
బలుకఁగూర్మి చెలులభాషావిదగ్ధత్వ, మునకుఁ గొంతమోదమునఁ జెలంగి. 189
చ. కొమిరెలనుంగు నెచ్చెలులఁగూడి సుధాంశుమణీ విరాజమా
నమహిత వేదికాస్థలుల నవ్యమణీరచితోరుదీర్ఘికా
ప్రముఖములం గొలంకుల నిరంతరపుష్పరసప్రవర్షిస
ద్విమల నికుంజదేశముల వెండియు రమ్యతరస్థలంబులన్. 190
వ. విహరింపుచుండి యందొక్కరమణీయస్థలంబునం గూరుచుండఁ దత్సఖీజనంబు 191
లందఱధికోత్సాహంబునం బొదలి.
తే. లాంగలీఫల సలిలామలమువిచిర్మ్మ, లైకఘనసార వాసితమంచి తేకు
సారమాధుర్యమైన యాసవముకోర, లందుఁ గైకొని యొండొరులానియాని.
తే. అంత నుదయార్కబింబ రక్తాంబుజములఁ, దెగడుముఖ నేత్రకాంతులఁ దేజరిల్లి
మగువలున్మత్తచిత్తలై మానకధిక, భాషణానూనగాన సంభ్రమత మెఱసి. 193
క. నటియింపుచుండి యందొక, కుటిలాలక పానపాత్రకుండికగా న 194
చ్చుటి తీవజన్నిదముఁగా, నటుదాలిచివచ్చి యగ్నిపాఖ్యుఁడననిన్.
చ. తరుణి యొకర్తువిత్తువు నుదగ్రసుమంబును హస్తయుగ్మమం
దుర వడిఁబూనివేణి కుసుమోత్కర బంధురగంధలుబ్ధబం
భరనిన దాత్మకంబగుచు మారుఁడనేనట వెంటనంటియి
ప్పురుసునఁ దెచ్చితీతనిఁ గృపామతినిందని పల్కెఁ దత్సఖిన్. 195
ఉ. పుష్పొడి భూతిఁబూసితురుముంజడవైచి సరోజనాళపుఁ
సప్పఁవుహార పంక్తినిడిచాన యొకర్తుమరుండ నన్నుయా
యొప్పుల కుప్పఁజూచినినునొక్కఁట భస్మముఁజేసి లోకపుఁ
దెప్పరమాంతు నంచలికదేశపుఁ గుంకుమఁజూపె చూడ్కిగన్. 196
వ. ఇటులయ్యేవురుకన్యకలకు సంతసంబుఁగా వినోదింపుచునుండు నవసరంబున.

—(*) ప్రభాతవర్ణనము. (*)—

చ. తలఁకకుఁ డీరుపుష్పశరతాపమునం జలజాప్తుఁడింక ని
మ్ములఁ జనుదెంచు మీకడఁక పూర్ణముఁగా నెరవేరునంచు న

చ్చెలులకుఁ దెల్పవచ్చెనన జెచ్చెర వేగురుఁజుక్క దోఁచెనా
బలరిపు దిక్కునందధిక పాండువిభాత్త దిగంతరాళమై. 198

చ. నిరతము పాంథులందొడరి నీరజవైరి రమాకుమారకుల్
బరవసమెల్లఁజూపెదరు పౌరుషమే రణభూమిగట్టిని
బ్బరమున కత్తికాల్వడిని పైఁబడువైరికిఁ గాకయుంచు వే
గిరమునఁ గూశెనోయన మొగిన్ మొఱసెం జరణాయుధౌఘముల్. 199

చ. మనచెలియాతమస్వినికి మంచిప్రియుండగు చందురుండెతా
మనలఁ దలంగ ద్రోచెనిక మార్తుడినుండు మనంగనిచ్చునే
గొనకొని దిక్సతీమణులు కూరిమిఁ గాంతము రండటంచు యా
మిని చెలులేగి రన్నటుఁ దమిస్రము లేగ దిశాముఖంబులన్. 200

ఉ. వేయికరంబు లన్నిగుల వేడిమిఁజూపఁగ వచ్చెనీయి నుం
డోయిపదేను నీకరము లోపవు పొమ్మనివేఁగుఁ జుక్కచేఁ
జాయనె తెర్వుఁజూపుటయు జారఁగ రాజు కళావిహీనమై
పోయెని జాప్తవర్గముఁ బోయె నుడూత్కరముం దలంగియున్. 201

మ. ద్విజరాజాంచిత సంజ్ఞఁ జేఁదగిత మీ బింబాధరా యుక్తుఁడై
ప్రజలన్ మ్ముఁ జరింపకుండని డె నీ క్రౌర్యంబుఁ దేకున్నె నీ
రజ విద్వేషణుకాంతికిం గొఱఁతెఁ గూరంగొంతకొంతంచొగిన్
ద్విజముల్ వల్కఁగసాగె నాగఁజటకాది ధ్వానమయ్యేంగడున్. 202

తే. ప్రాగ్దిశాగర్భిణీ కాంత భానుఁ బ్రసవ, మందుచుండంగ గట్టిన యట్టిమహిత,
శోణరుచిమించునవనిక సొంపుఁదనర, నరుణిమముఁ దోఁచెనైంద్ర దిగంతరమున.

చ. సమయముఁగామినీన్నటు శాంతము సంజనుచుండ వీపునం
జమరిన యట్లుఁగప్పికొన సాగె మదాంధము లీమహాంధముల్
తెమలక నిల్చునే మొపగఁదీర్చెదనంచు తమశ్చయంబుపై
నమరి బియున్న కోపరుచి యాయనఁ దోఁచెనినుండు శోణిమన్. 204

వ. ఇత్తెఱంగున నబ్జబాంధవుండు దయించుటయు నతిసంతసంబున నచ్చేడియలవ్విప్రకుమారావలోకనాయత్తచిత్తలై గౌరీపూజామిషంబున నిజాప్తజనంబులతోడ కలవంది యాతుణంబయ్యచ్ఛోద సరస్తీరంబు సేరి తదీయోదక స్నానంబున యథావిధి గౌరినర్చించియతని రాకనరయుచు నృత్యగీతాదులం బ్రొద్దుఁబుచ్చుచుండు నంత. 205

ఆ. జనకు నాశ్రమంబు స్నానార్థియై పోసి, యాభినవాంగభవుని యనువు దోఁప
వచ్చెనగ్నిపుండు చెచ్చెరనచ్ఛోద, మునకు దినము వచ్చి పోవునట్లు. 206

వ. అయ్యవసరంబున. 207

ఆ. రజనిగడువ సూర్యు రాకవికాసమ్ము, పొందుకమలచయము పోల్కిఁగన్ను
లలరనతనిఁజూచి యంతికంబున కేగి, మొండొరుంగరంబు లొాగిఁ జెనంచి. 208

—(*) గంధర్వకన్యలు విప్రుంజూచి భాషించుట. (*)—

క. అరికట్టి నిలిచియపుడ, క్కరియానలు నిన్న మోసఁగారీమమ్మా
మరుబారిఁ ద్రోచి వేగిర, మరిగితి వీనాఁడునట్టులగునే యనుచున్. 209

ఉ. చిక్కితి వింక నెక్కడకుఁ జేరఁగఁ జూచెదు మమ్ము కౌగిటన్
జిక్కఁగఁ జేర్చి పూవిలుతుఁ జివ్వలఁ బేర్చి మనోనురాగముల్
మిక్కిలి పొంగ నేరుపులఁ మీరిన మాయుపభోగముల్ మదిన్
జొక్కఁగ సేయ సౌఖ్యములఁ జూరఁగొనందగుఁ గాక యింకిటన్. 210

ఆ. నాగయులఁతి నవ్వఁ నవ్విప్రకుమారుఁ, డంగనామణులకుఁ నని యెనిట్లు
మీరు వలుకు మీటఁ మేలనవచ్చున, కైనఁ గాదు సమయఁ మరయ నాకు. 211

వ. అది యేమనిన నేను బ్రహ్మచర్యంబునం గురునింట వేదాధ్యయనంబు సేయుచు
న్నవాఁడ నాకు నింక నదియు పరిపూర్తిగాకున్న యది విజ్ఞులగువారే యాశ్ర
మంబునం బరగుదు రా యాశ్రమధర్మంబుం దప్ప కనువర్తింపఁ దద్విజ్ఞతకు
సార్థకంబగుఁ గావున నాకిపుడు వివాహంబున కుచితకాలంబుఁ గాదనుటయు నవ్వి
కచారవిందేక్షణలు మధుమాససమయ కలకంఠ నినాదంబుల ననుకరించు కంఠ
స్వనంబులతో మృదుమధుర వాక్కుల నిట్లనిరి. 212

క. ధర్మంబు వలన నర్థము, వేర్మిఁ దదర్థంబువలనఁ బెంపగు కామం
బర్మిలి దానన యర్థపు, నిర్మలఫల మొదవు ననిరి నీతి విధిజ్ఞుల్. 213

వ. ఇదియునుంగాక. 214

క. ధర్మార్థ కామకలిత సు, కర్ములు స్వర్గంబునందుఁ గడు సౌఖ్యంబుల్
పేర్మిం బొందెదర దినీ, ధర్మువునం గలిగెనింకఁ దలఁగఁగ నేలా. 215

ఆ. అకట స్వర్గభోగఁ మాసక్తి నిచ్చెదు, వారమేము మున్న వచ్చి నిలువఁ
దలఁగి సంసరణపుఁ దారి వ్రాయొదు వెల్గుఁ, గనిన గూబ మబ్బుఁ జనువిధమ్మున. 216

క. అనుటయు వెండియు విప్రుఁడు, వనజాస్యల కని యెమీరుఁ బలికిన పలుకుల్
చనునైన నా వ్రతాంతం, బున గురునను మతి వివాహఁ ముంగైకొందున్. 217

తే. అంతపర్యంత మీత్రోవఁ నాదరింప, ననినవిని ఛాందసుఁడవె నీవైన వెనుక
చిక్కఁగలవారె మా బోటిఁ చెలువలిప్పు, డున్న ఛాందసమే చాలఁ కున్న దొక్కొ.

క. అనితూలఁ బలికి వెండియు, వనితలు బ్రహ్మజ్ఞులైన వారికి శ్రో
త్రికినిఁ బరిణయమునఁ గొనుసతి, యనుపమ సిద్ధౌషధంబుఁ నౌ సద్గతికిన్. 219

వ. పుణ్యఫల సంధాయకంబైన దైవంబునకు మంత్రంబువోలె భార్య భర్త కను
కూలినియై సర్వకార్యంబులం బ్రవర్తింపుచుండు నింత యెఱింగి విద్వాంసులు
విషయానురాగులు గాకున్నను సుశీలలగు కన్యలం బరిణయింతు రట్టి సతులు
దైవికంబునం జేకూరుచుండ మూఢులై వదనిన మఱియుఁ జేకూరుటంగలదే
యెట్టిదైనను దుర్లభంబు లబ్ధంబుఁగా విడిచి వెండియుఁ గావలయునన్న లభిం
చునె యిదియుంగాక. 220

ఆ. విషమువలననైన వెలయంగ సుధయమే, ధ్యంబువలననైన హాటకంబు
హీనువలననైనఁ బూనికసద్విద్యఁ, గొనఁగనొప్పుసుసతి కులమైన. 221

ఉ. ఈవిధమైన ధర్మవు మహీస్థలి వర్తిలు చుండసత్కుల
శ్రీ విలసిల్లి రూపగుణశీలములంద సమానమైన రా
జీవ సుగంధియాత్మఁదనుఁజేకొనఁగోరిన వానిభాగ్యమిం
కావన జోద్భవాదులకునైనసాధ్యము గాదెయెంచఁగన్. 222

ఉ. ఏము సురాంగనామణులమీపృథరామరుఁ డౌదునీకు నీ
బాముననేమునిల్లు సులభస్థితిఁజిక్కుట నీదుపుణ్యమై
తామర చూలినేర్పుమెయిఁదార్చెవిలంబన మింకనేలగో
త్రామర మానిసంశయముతప్పకమమ్ము వరింపుశీఘ్రమున్. 223

క. సర్వులకు శాస్త్రవిధిమై, యుర్వర నొప్పెసఁగుచుండునుద్వాహముగాం
ధర్వంబు నాగదానసు, పర్వస్తుత చరితయిపుడుపరిణయ ముంగాన్. 224

క. ఇటునీవు సేయకుండిన, పటుతరకుసు మాస్త్రబాణభగ్నాత్మలమై
కటకటపడి చావంగల, మటులైనం గలుగు నీకునతిదుష్కృత ముల్. 225

చ. అనవిని బ్రాహ్మణుండు సలినాక్షుల కిట్లను పూరుషార్థముల్
జన వినుతంబులీ యిల నెసంగును నాలుగునందు ధర్మవ
ర్తనమున నామనంబు వితతంబుగఁ బ్రీతివహించె నిట్టి వే
శను చెలులార మీరుమిగులందెలు పంగనె వీడ నెట్లగున్. 226

క. అని మూట్టనాడనాతని, మనమిటులని తెలిసియంతమదవతు లన్యో
న్యానిరీక్షణాలై యితడిం, కనుమాటల మెత్తవడఁడుగాయని తమిచేన్. 227

క. పెనవైచిన కరములు చ, య్యన వదలి యొకింతయైననుకంప మదిం
గనవైతి వెట్లుతాళిమి, గను వారము మనసిజుండుకడుబాధింపన్. 228

వ. అని ప్రమోహిని పాదంబులఁబడి విడువకుండె సుశీలా సుస్వర లిరువురు హస్తం
బులం బట్టిరా సుతారయనునది యుపగూహనం బొనరించె జంద్రిక ముఖంబున
న్ముఖంబు గదియించి యధరంబునొక్క సిట్లయ్యేవు రతనింబాధింప నతండు నిర్జి
తేంద్రియుండును దృఢవ్రతుండుంగాన ననురాగంబునందక ప్రళయాగ్నింబోలి
మండి వారిం జూచి. 229

—(*) గంధర్వకన్య లగ్నిపుండును నన్యోన్య శప్తులగుట. (*)—

క. వెయ్యి విధంబుల వలదనఁ, జయ్యన ననుడాసి వెతలుసలిపెదరిటు పెం
దయ్యములఁ బోలిమీరలు, దయ్యంబులుఁ గండటంచుతలఁగి శపించెన్. 230

ఆ. అట్లుఁ గినుక శాపమతఁడీయ్య నయ్యేవు, రమరనారు లాకటనాథరామ
రావతంసు వదలియంతంత నిలవడి, చూచిపుల్కు పుల్కుచూపుగముల. 231

చ. చదివితి నంటి వేదములశాస్త్రములం గడుపుణ్య గాథలన్
గొదవల నింకనుం జదువఁగోరెద నంటివి ధర్మబుద్ధిమై

బోదలేదనంటి వార్తలయిఁకఁపువ్విలు కానికి నొచ్చివచ్చినన్
గోదగోదఁ జేసితంగనలకఁకూరిమి నీతెలి వింతయేకదా. 232

ఆ. తప్పులేమిఁ దిట్టఁగఁదగదంచు సర్వుల, కెఱుఁగ వచ్చుతప్పుకనిదియ యఁకప్రియము కృత్యముగ్రిఁకఁబ్రియమె ధర్మ్యపుదాని, గోరువారిఁ దిట్టఁగోరఁ దగునె.

చ. తెలియఁగ నీదుశాస్త్ర వితతింబలుకంబడలేదె యెక్కుడున్
జెలిమిఁ గలారిభక్తులనుఁకఁజిత్తమునం దనపైని కూరిమిన్
గలిగిన వారిపేరిమినిఁకఁగాంచక ద్రోహ మొనర్చునట్టి యా
తులువకు నిందునందు కనుఁకఁదుర్లభమా సుఖమున్న సూక్తియున్. 234

క. పాపం బనక శపించితి, బాపురె మమ్మిట్లుఁగానఁకఁపదఁపడి నీవున్
మాపగిది పిశాచంబై, యీపుడమి వశింపు కఠినఁకఁహృదయా యింకన్. 235

చ. అనియిటు దేవకన్యలు మహాగ్రహ మూని శపించి వారు న
వ్వనజ భవాన్వయుంబుఁ గనుఁకఁపట్టఁగమున్నిడు పైన కోరలున్
ఘన వివృతాస్యముల్ హరితఁకఁగార రుచిస్ఫురి తాక్షి యుగ్మముల్
పెనువడు జుంజురుం దలలుఁకఁపెద్ద పిశాచములైరి చయ్యనన్. 236

వ. అట్లు నిట్టూర్పులు నిగుడ దుస్సహ తృష్ణా బాధా పరిపీడ్య మానంబులైన దేహంబుల నయ్యచ్ఛోద సరస్తీరంబునందె నివసించి యుండిరని చెప్పి వెండియు వశిష్ఠుం డిట్లనియె. 237

ఆ. అధిప యేనికై నఁకననుభవం బుంగాక, పోదుపూర్వ పాపఁకఁపుణ్య సమితి
పుట్టువునకు నదియెఁకఁమూలంబునై మేని, నీడపోల్కి వెంటఁకనాడుచున్కి. 238

క. అటులయ్యచ్ఛోదసర, స్తటమున వర్తింపుచుండఁకఁననగొన్నాళ్లం
తట నొక్కపువ్వ బహుళ, స్ఫుటపక్ష చతుర్దశిం బ్రఁకమోద మెలర్పన్. 239

క. భూమీధవ శమదమగుణ, ధాముండు తపోవ్రతాదిఁకఁతాత్పర్య సము
ద్దాముఁడు మజ్జనమునకై, రోమశుఁడను మౌనితత్సఁకరోవరమునకున్. 240

ఉ. వచ్చిన మౌనివల్లభు విఁకఁభావసు తేజు క్షుధార్తిమై తినం
గ్రచ్చరఁ జేరవచ్చి లయకాల మహాగ్నియుఁ బోలెనూష్మతన్
హెచ్చిన భీతిఁ బాఱివెరఁకవేదిపిశాచము లోరనిల్వఁగా
నచ్చట వచ్చివేదనిధిఁకయంతయుఁ జూచి సవిస్మయాత్ముఁడై. 241

వ. అమ్మునికి నమస్కరించి యిట్లనియె. 242

క. మునినాథమిమ్ము బోలిన, ఘన పుణ్యుల దర్శనంబుఁకఁగాదువృథగ శో
భన మూలముశ్రేయస్కర, మనిమిషతటినీ నిమజ్జఁకనాదుల కంటెన్. 243

తే. ఉత్తమంబయ్యు జన్మరోఁకగోత్కర మున, కౌషధంబును స్వర్గమోఁకక్షప్తిదంబు
నగుచు సత్తపమున కన్నఁకనధికతమము, నగునటంచిటుఁ బ్రియములఁకనాడియాడి.

వ. అప్పిశాచంబులం జూపి యిట్లనియె. 245

—(*) రోమశ వేదనిధుల సమాగమము. (*)—

ఆ. అనఘ తలఁగి నిలిచినట్టి యీ యాఱ్వుర, యందు నొక్కఁడా మదాత్మజుండు
కడమ యేవురనిన గంధర్వ కన్యల, నన్యోన్య శప్తులగుచు నైరి యిట్లు. 246

చ. అమిత తమశ్చయంబు జలజాప్తుఁడు వచ్చినఁ బాయునట్లు మీ
సుమహిత దర్శనంబున విశుద్ధతఁ గైకొని స్వీయ శాపముల్
క్రమమునఁ బాసి తొంటి విధిఁ గ్రాలఁగఁ బోలదె యో మహాత్మ యో
విమలతపః ప్రభావ యని వేఁడిన రోమశుఁ డాత్మ నెంచియున్. 247

క. తనసూను విధికిఁ జాలన్, మనమునఁ బరితాపమందు మానికిఁ దా ని
ట్లను నయ్యా మాయనుగ్రహ, మున వీరలు తొంటిభంగి మొనర గలారల్. 248

వ. ఏ నొక్కవిధం బెఱింగింతు దాని నాచరింపవలయు ననిన వేదనిధి మహాత్మా యది
యెట్టిదంతయు నెఱిఁగింపుమనిన రోమశుండు మగుడ నిట్లనియె. 249

తే. వినుము బ్రాహ్మణ నాతోడ వీరు విధివి, ధానమున మాఘమజ్జనమూని సేయ
నగును తద్విధినైన మాసాంతమునకుఁ, వీడఁగలుగుదురీ శాపవిధము లెల్ల. 250

ఉ. ఒండువిధంబునం దలఁగ నొల్లవు వీరలకైన శాపముల్
పండిత సన్నుతంబు నఘభంజనమై చనుపుణ్యవాహినీ
మండలియందు మాఘమున మజ్జనమాడక యింతనామదిన్
నిండుగ నమ్మినాఁడ నవనీసుర శేఖర దీనవెండియున్. 251

ఉ. ఇంతకుమున్ను సన్నవగు నేడుభవంబుల లోనిపాపముల్
క్రంతల నేగుఁ జెప్పకయ గైకొని యిప్పటి పాపపుంజ మ
త్యంతము పాఱఁదోలదె ప్రియంబొనరంగను దీనిఁ గాన ని
శ్చింతతనుండు మివ్విధికిఁ జెందినదుఃఖము నాత్మ వీడియున్. 252

ఆ. ఎల్లపాపములకు నిదియ ప్రాయశ్చిత్త, మింతకన్న నొక్కఁ డెద్ది యెఱుఁగ
రే మునీంద్రులవని భూమిసురోత్తమ, మాఘమజ్జనంబు మహితమెందు. 253

వ. అని చెప్పి మఱియు. 254

సీ. అఖిలాఘములఁ బాపు నమ్మానసమునన స, రస్వతీనది నిచ్చు బ్రహ్మపదము
నదివిశాలాపగ నమరలోకమ్మొసం, గును జాహ్నవీతోయ మునభవంబు
లకు బాపి లక్ష్మీవిలాసినీ వల్లభా, మృత పదంబుల నిచ్చు హితవుఁ దనర
గండకీ చంద్రభాగా కౌశికీపయో, ష్ణీసరయూ భీమసింధువులను
రమణగోదావరీ గవేరజలఁబు న్యా, లోక సౌఖ్యంబులొసగు నీలోకమునను
మాఘ మజ్జనముం జేయు మనుజపితతి, కదియుమించినలేదు విప్రాన్వయేశ. 255

తే. నైమిశారణ్యమున మజ్జనంబు సేయు, వారు హరిరూపులగుదు రవ్వనజభవుని
కెలనవసియింత్రు పుష్కరక్షేత్రమునని, మజ్జనము సేయువారలు మాఘమునను.

వ. మఱియుఁ గురుక్షేత్రంబున మాఘమజ్జనం బొనరించువా రింద్రలోకనివాసుల
గుదురీ యెఱింగించిన తీర్థంబులకన్నను గంగాయమునా సంగమంబైన ప్రయాగ

యందు మాఘస్నానంబుఁ గావించువారు నిరుపమాధిక మహత్వంబునంది యేలో
కంబునసైన నివసింతు రాజలప్రభావం బెఱింగింతు వినుము అమరులు సర్వసుఖా
స్పదంబైన స్వర్గంబునందుండియు మానవులెద్దాన నిమజ్జనంబు గావించి జన్మరాహి
త్యంబును నిత్యానందంబును నగు విష్ణులోకంబునందు నారాయణుసాన్నిధ్యంబున
నుండు రట్టి ప్రయాగోదకంబుల స్నానంబు మాకు గలుగవలదే యని యనవరతంబు
నా స్రవంతీ స్తుతిసంకీర్తనంబులు సేయుచుండు రట్టి ప్రయాగస్నానంబు వెండియు
మనుజులకుం దినత్రయంబున నఖిలపాపంబులఁ బాపి సురలోకంబొసంగు. 257

ఆ. మున్ను పద్మజుండు తపోవ్రతజపదాన, తీర్థయజ్ఞధర్మసార్థకంబు
లన్ని యొక్కదెసఁ బ్రయాగమాఘస్నాన, మొక్కదెసను తులనయునిచితూఁప.

క. ములుసూపె మాఘమజ్జన, మెలమిఁ బ్రయాగోదకముల నెంతయు సేయం
గలిగిన సార్థకమున ని, మ్ములననియె బుధాలి యదియె ముఖ్యంబయ్యెన్. 259

క. ఈవిధిఁ దనరిన కతమున, నావిపినము లందు తపము లంచితలీలం
గావించువారు యోగులు, కేవలమందనిపదంబుఁ గీలించువెసన్. 260

వ. మఱియు వినుము. 261

చ. అనఘ ! తదీయతీర్థసముదంచితమాఘ దినోదయైక మ
జ్జనఘనసార్థకుల్ భువిని సంభవమందిన స్వర్గవాసులై
యొనరమదేభ ఘోటక రథోత్కర సేవక సేవకీసమే
త నివసనాధికారులయి ధాత్రి నొనర్తు రనేక మేధముల్. 262

వ. వెండియు నా ప్రయాగోదకంబుల స్నానంబు సలిపిన వారమిత పాపాత్ములైనను
దత్పాపంబు వాసి రాజసూయాశ్వమేధంబు లొనరించిన వారిగతికిఁ బోవుదు రట్టి
మహా ప్రభావంబుఁగల ప్రయాగమహత్వం బింతయని వర్ణింపఁదరమె వినుము
పూర్వకాలంబునందు. 263

—(*) వీరసేనభద్రకుల చరిత్రము. (*)—

సీ. మేదినీసుర ! యవంతీదేశ భూభర్త, వీరసేనుండు నా వెలయు నొక్కఁ
డబ్భూతధాత్రీశుఁడమర రేవానదీ, తీర భూమిని మహోదారమతిని
రాజసూయాఖ్యాధ్వరము పేర్మిఁ గావించి, వలనొప్ప షోడశవాజపేయ
ముల స్వర్గలోకమిమ్ములనిచ్చువానిను, దృఢహైమ యూపపాత్రాదికముల
శాస్త్రవిహితముఁ గాఁ జేసిత్స్వాధరోప, ములుఁ గ ధనధాన్యరాసులు మొనయ నునిచి
సద్ద్విజాలికి దానముల్ సరవి నిచ్చి, యంచితప్రీతి మోదించి యతఁడు మఱియు.

క. హరిసర్వాత్మ ననంతుని, నిరతము మది నిలిపి విప్రనివహంబునకున్
వరమతి నిడుచుం జామీ, కరగోభూదానములనుఘుఁడతఁడుండెన్. 265

తే. అట్టికాలంబునను భద్రకాఖ్యుఁడొక్క, భూమినిర్జరుఁడధముండు మూర్ఖచిత్తుఁ
డతిదురాచారుఁడాగమాధ్యయనదూరుఁ, డాత్మబంధువివర్జితుఁడతఁడు మఱియు.

వ. ఆత్మపోషణంబునకై భూమి దున్నుచు హీనకర్మంబులం బ్రవర్తించు వాఁడునై

యుండి తీరని దారిద్ర్యంబున నిందునందుఁబరిభ్రమించుచు దైవికంబునఁ దైర్థికు
లంగూడి ప్రయాగకుం జని యందు దినత్రయంబు మాఘస్నానంబు సలిపి సర్వ
పాప విముక్తుండై యుత్తమ బ్రాహ్మణత్వంబు నంది. 267

క. వెండియు నొకపరి నతఁడొకఁ, డుండ ప్రయాగకును దానికరూఢింజనియం
దుండియు మాఘస్నానము, నిండు ముదంబున నొనర్చి నెలవుం జేరెన్. 268

ఆ. అంతఁగొంత కాలమరిగినవీరసే, నాధిపుండు భద్రకాఖ్యుఁడిరువు
రేకసమయమునన యేగిరిస్వర్గంబు, దేహయాత్రలుడిగి ధీవరేణ్య. 269

మ. అట నేనొక్క దినంబునం జనియమర్త్యావాసమం దిమ్ములన్
బటుతేజోయుత మూర్తులం దనరి దేవాధీశు మ్రోలన్ సము
త్కటమాణిక్య విరాజితాసనములందా ముండి తద్దేవతా
నటినీలాస్య వినోదులై దివిజసూనానల్ప హారావళిన్. 270

వ. ధరియించి దేవతావర్గంబు సేవింప నిరుపమసుఖంబు లనుభవింపుచు నిరువురు
సర్వవిధంబుల సమానులయి యుండఁజూచితి నాప్రయాగమాహాత్మ్యంబు నింత
ని చెప్పఁ దరంబగునె యని చెప్పి మఱియు. 271

తే. క్షితిధను స్త్రిశతైక విస్తీర్ణమైన, తాసితాంబువులంగూడి తడసిపాఱు
సుస్థలంబగు నాప్రయాగస్థలంపు, మాఘమజ్జన మదిసమస్తాఘహరము. 272

తే. రాజసూయాశ్వమేధాదిక్రతుఫలములు, క్షీణమగునంత మరలఁ క్షితిఁజనింప
వత్తుదివినుండి యటురారుపాపులైన, నాప్రయాగా తపోమజ్జనాభిరతులు. 273

వ. ఇందునకొక్క పుణ్యేతిహాసంబుఁ గల దది పిశాచమోచనంబు నాఁ బ్రసిద్ధివడసె
దాని నావలన విని యా యేవురుం బిశాచత్వంబులం బాయుదురుగాక యని రోమ
శుండు వేదనిధి కిట్లనియె. 274

—(*) దేవద్యుతి చరిత్రము. (*)—

క. దేవద్యుతి నామునొక్క, భూవిబుధుఁడ ధీతవేదపుంజుండనుకం
పావరమతిఁ దానొక్కని, వేవాపి పిశాచతను విమలుని జేసెన్. 275

తే. అనిన నతఁడెందు వర్తిలె నతనిజనకుఁ, డెవ్వఁడాతఁడు విడిపించె నెట్టులప్పి
శాచతను నాతఁడెవ్వఁడు సరవినింత, వాయకయుఁ దెల్పు వినఁగడు వాంఛ వొడమె.

ఆ. అనిన వేదనిధికి నరోమశుండు స, రస్వతీజనుర్ధరాస్థలంబు
పరమపుణ్యభూమి ప్లక్షప్రవణమను, పేరనొప్పుచుండు విప్రవర్య. 277

వ. దానికి ననతిదూరంబున నొక్క పర్వతంబుం దు నద్ధరాధర నికటంబున నతని
యాశ్రమం బొనరునదియు సాల తమాల బిల్వ వకుళ తింత్రిణీ చూత చంపక
కరంభ కోవిదార కేసర కుంజరాశన తిలక కర్ణికార కుంభీ ఖదిర తిందుక పనస
నారికేళ సహాఫలాది వృక్షనివహ ఫలపుష్ప పల్లవాలి శోభితంబును నభినవా
మోద మంజరీ పుంజరంజితోరు నికుంజాంతర పరిభ్రామ్యమాణ మత్త మధుప
స్వననినాదితంబును శుకపిక శారికామయూరాది నానాఖగకుల ధ్వానధ్వానితం

బును ముహుర్ముహుశ్చంక్రమణక్రియాప్రకంపిత వివిధ తరుశాఖాప్రకాండ ప్లవంగ కదంబంబునుం జాతివైర విహీనంబులై యన్యోన్యమైత్రి మెలంగు బహుమృగసందోహంబులుం గలిగి చైత్రరథంబునుం బోలె మనోజ్ఞంబై యొప్పెసంగుచుండు నవ్వనంబునందు. 278

క. అతిధర్మాత్ముఁడు దేవ, ద్యుతిహారికరుణారసంబుతోడ సుమిత్ర
క్షితిసురున కాత్మజుండై, హితమార జనించి ద్విజకులేంద్రుండగుచున్. 279

తే. నిర్జితక్రోధగుణుఁడు వినిర్జితేంద్రి, యుండు ననసూయుఁ డతిసూనృతుండునై ని
రంతరంబునుఁ దా నిజాత్మాంతరమున, నిరుపమాధిక నియమవిస్ఫురణమెఱసి.

సీ. అత్యుష్ణవేళఁ బంచాగ్నిమధ్యస్థుఁడై, సొలయక దివినర్కుఁ జూచుచుండి
వర్షాగమమునను వర్వరఁ గ్రమ్మి వర్షింప, గొనకొని మింటఁ జూడ్కులు నిగుడ్చి
శిశిరర్తువున వినిశ్చితబుద్ధి హిమశైల, ముం బోలి మడువులో మొనయ నిలిచి
తపముఁ గావించె నత్తపనీయగర్భాన్వ, యాంభోధిరాకాశశాంకమూర్తి
వేయిసంవత్సరంబు లీక్షిధిఁ జనంగ, నంతఁ దత్తేజమెసఁగి వియత్తలంబు
దరికొనఁగ సాగెఁ బ్రాణిసంతతి సహింప, లేక ఘోరార్తిఁ గుందె నలీకదూర.

వ. మఱియు నయ్యతులతపంబున నగ్నికల్పుండగు దేవద్యుతి యొనర్చిన నియమంబు లితరులకసాధ్యంబు లింకను వాని నెఱింగింతు వినుము. 282

క. ప్రతివాసరము త్రివేళల, నతిసురభిళకుసుమవితతి నంబురుహాక్షున్
హితయుక్తి సహస్రార్చన, మతఁడొనరుచు శాస్త్రవిహితమగు మంత్రములన్.

క. ధ్యానించు నతఁడు నిశ్చల, మానసమున వేదవచితమహితాఖ్యల ని
త్యానందరూపు నవ్యయు, శ్రీనిలయు నధోక్షజుం గుశేశయనేత్రున్. 284

క. ఏతాదృశ నియమంబులఁ, బీతాంబరుఁ గొల్చుచుండి పృథివీవిబుధుం
డాతతమతి నొకరాధా, యాతైకాదశినిఁ దా సమంచితనిష్ఠన్. 285

క. హరినారాధించి మనో, హరమత్యనఘంబునౌ మహాస్తవమెలమిన్
ధరణీవిబుధుఁడొనర్చిన, కరమధికము సంతసంబుఁ గైకొని యాత్మన్. 286

—(*) దేవద్యుతికి శ్రీమన్నారాయణుండు ప్రత్యక్షమగుట. (*)—

ఆ. వైనతేయునెక్కి వైళంబ దేవదే, వుండు నతజనప్రియుండు దీన
కల్పకుండు పీతకౌశేయవాసుఁ డ, వ్యయుఁ డజుండు కానవచ్చె నెదుట. 287

వ. అట్లు పురోభాగంబునందు సాక్షాత్కరించిన, 288

సీ. హరినీలముల సొంపు నిరసించు రుచి పెంపుఁ, దనరారు మేని సత్కాంతివాని
రాకాసుధాభాను గైకొని మిసజానుఁ, దులకించు నెమ్మోము తళుకువాని
ప్రత్యూషసంఫుల్లపద్మసామ్యము మెల్ల, రహిఁ గ్రిందువరచు నేత్రములవాని
కౌస్తుభాంచన్మణినిస్తులోద్యద్ఘృణి, ప్రచయాతిభాసురోరంబువాని
శుంభదిభరాజతుండోరుదంభ మెసఁగు, ఘనతరాజానుదోశ్చతుష్కంబువాని
సురుచిరామేయభూషణస్తోమభూషి, తాంగు శ్రీహరిఁ జూచి యయ్యవనిసురుఁడు.

తే. అతిశయానంద బాష్పపూర్ణాంబకుండు, పులకితాంగుఁ డుఫుల్లహృజ్జలజుఁడగుచు
పుడమి సాగిలఁ బడి మ్రొక్కి యొడలనంటఁ, నట్టిధూళి నెనసి శౌరి యతఁడుఁ దనరి.

క. నిలిచినఁ జూచి కృపారస, మొలుకం బొంగార నారమేశ్వరుఁ డను ని
ర్మలచిత్త మెఱిఁగితిని త్వ, త్సలలిత భక్తిప్రపత్తితాత్పర్యంబుల్. 291

క. కోరుము కోరిక లేన, వ్వారిఁగనీ కొసఁగు వాఁడ వైళమ నాగం
గారుణికుని శ్రీయావి, ద్వ్యారుచిరాకారుఁ జూచి యనియె నతండున్. 292

క. వనజాక్ష నీదుదర్శన, మనవరతముఁ గలుగ నలినజాది సుపర్వుల్
సనకాది యోగులుం బ్ర, ధ్వని కపిలాద్యఖిల సిద్ధబృందము కోరున్. 293

వ. అట్టినీవు నాకు దర్శనం బొసంగితివి. 294

ఆ. ఇంతకన్న వరము లేమున్న వింక నా, యదియు నేను నను మహాభిమాన
బంధమదియె పో శుభాశుభస్థితులకు, మూలకారణంబు నోలినదియు. 295

వ. పరాత్పరుండవగు నీవలన సహేతుకంబుగా దగ్ధంబగు నిదియుంగాక జన్మకర్మంబులం బుద్ధినింగలిగిన ఫలంబంతయు నీవరయుము వింతకన్న వరంబొండుఁ గలదే మొదలఁ బరిశుద్ధుండనై నీపదధ్యానంబు నిరంతంబు సేయుచుండునట్లుఁ గోరినినాత్మం జపియించితి పుడిదితప్ప నితరంబుఁ గోరువాఁడ నే యనుటయు నారాయణుండు సంతసించి యట్లకానిమ్ము నీతపంబు నీకోరినట్లు నిర్విఘ్నంబుగా నెఱవేరుంగాక యని వరం బొసంగి మఱియు నిట్లనియె. 296

ఆ. నన్నుఁ గూర్చినీ వొనఘ చేసి నట్టియీ, స్తవము పేర్మి నెవరు చదువు వారు
వారికొదవు భక్తి వారక నాయందు, సందియంబు లేదు జగతియందు. 297

వ. అని మఱియు నిట్లను నాత్మకర్మంబుల వలనం గలిగిన జ్ఞానంబది యించుకయైనఁ బరిపూర్ణంబై యుండు దాన సర్వోత్తమంబగు మనస్థిరత్వంబునుం గలిగియుండునని వాసుదేవుండు పలికి యంతర్ధానంబు నొందె నది మొదలు దేవద్యుతి విష్ణుభక్తుండై వెలసెనని రోమశుండు వేదనిధికిం జెప్పిన మఱియు నతం డతనిం జూచి 298

తే. రోమశమునీంద్ర నీవిప్డు ప్రేమతోడ, వినఁగఁ జెప్పిన సత్కథ వినుల లర
వినికృతార్థత నందితి వెండియమ్మ, హాత్ముఁడొనరించి యున్న భవ్యస్తవంబు. 299

క. వినవిచ్చగింతు దానిం, గొనకొని వినిపింపుమయ్య కూరిమిచే మి
మ్మునుఁ బోలుఘనుల సంగతిఁ, గనినంతన కాదె తెలియఁగావలె నెల్లన్. 300

ఆ. అనినరోమశుండు మునినాథ కడురహ, స్యంబు జప్యమిది మహాత్ముఁడైన
గరుడువలన నేనుఁగైకొంటి వేదాంత, సారముత్తమంబు సౌఖ్యదంబు. 301

వ. మఱియు నిది సర్వపాప హారంబును పూజ్యంబును నై యొప్పు దీనినే నా దేవద్యుతి జపించిన విధంబునం బలుకువాఁడ వినుము. 302

—(*) దేవద్యుతి ప్రణీత యోగసార స్తవరాజము. (*)—

సీ. దేవుజగన్నాథు భావింపఁ బొగడిక, పొగడందువాఁడును పొగడువాఁడు
సర్వమ్ము విష్ణునా జగదాత్ముఁ గాఁ జూచి, సలుపు సంస్తవమునఁ జనె శుభక్తి

యెవ్వనిచేనొచుక్కనీప్రజావలికి భ, వ్యంబుల నిచ్చునోక్కయంగసూత్ర
కలితమ్ములగు వేదకములు నగునే మహాత్ముని యూర్పులెవ్వనికగనఁగజాల
వరయనవ్వేదములును మకదాత్మసైత, మెఱుఁగజాలద దెవ్వనికనేనుఁబొగడి
చెప్పఁ జాలకయుండుదుకనప్పరేశు, మదినిసేవించి యిడుదు నకమస్కృతులన.

ఆ. బ్రహ్మ మొదలు ప్రాణివర్గస్వరూపుఁడ, విష్ణుఁడజుఁడు సృష్టివిధికిమూల
కారణంబనఘుడుకఘునపరబ్రహ్మంబ, ఎవ్వఁడతనిఁ దలఁతుకనేమదాత్మ. 304

వ. అనిమఱియు మహాత్మా నీవుసర్వ మయత్వంబున దేహంబులు దేహధారులు తద్దేహధారులయందు స్త్రీపురుషాంగాంగీ భావంబుల నొందుదేహధారి నంటు నాఁడవునునై దేహసంబంధంబులగు యాతనాదిదోషంబులఁ బొందని వాఁడవై క్లేశాక్లేశస్వరూపంబుల స్థూలాది త్రివిధదేహంబులఁ దనరియుందెవ్వాడేని మఱపునందని బుద్ధియనీవై యుందు వదెట్లన నీయందు మహదాదులెట్లో యవ్విధంబున జననప్రవర్ధనాదులగు షడ్వికారంబుల వలనిగుణంబులేర్పడి యుండునంతయు నీవకానియితర మొకండులేదట్టియైక్యంబైన విషయంబున భిన్నంబులుఁ గల్పించుట మూఢత్వంబగు నట్లొకండవైన నీవుపురుషుండు ప్రజలంగల్పించునట్లు బ్రహ్మాభిధేయుండవై లోకంబులం గల్పింతువట్టిరాగాది గుణరహితుండవు నిర్దోషుండవు జ్ఞానస్వరూపుండవునైన నీవుసుధీవరుల యజ్ఞంబులకై సర్వజగంబు నీవకా వెలుంగుచుందువా సర్వవ్యాపకుండవు త్రిగుణరహితుండవునైన నీకునమస్కరించెద.

ఆ. తెలివిగలిగి మిగులకధృతిఁ బ్రసిద్ధములైన, కర్మములఁజరించుకఘనుల నితర
జనుల నొకఁటనెమ్మిఁకగనువిశుద్ధ బ్రహ్మ, మైన నీకుఁబ్రణతుకలేనొనర్తు. 306

తే. ఎవని సచరాచరాత్ముఁగాకనెఱిఁగి యీష,
ణములఁజిక్కియుఁ బ్రజకుజకన్నములఁజేయు
చుండిభువనంబె బ్రహ్మమంకజూక్కినైన
నరసి స్పర్శేంద్రియమునఁ దుకల్యముఁగనైన. 307

వ. జనులు వీక్షింతురో యట్టి లక్ష్మీప్రియుండవగు విష్ణునిన్ను నీదేహంబుతోడ నమస్కరింతు మఱియు నీవు జ్ఞానప్రదంబయినట్టియు విలక్షణం బయినట్టియు నుపనిషదర్థంబునుం బోలియున్న వేదాంత విదులు పరబ్రహ్మంబుఁగాఁ దలంతురట్టి నిన్ను దేవప్రభు నిరంతరంబుం ద్వదాశ్రితంబైన నాయంతరాత్మ నారాధించి పరిశుద్ధుండనగుదు నిదియునుంగాక నీపాదారవిందంబుల యందుంగల భక్తియే నాకు వరంబుఁగాఁగోరి. 308

క. జనులగు నత్యాశ్చర్యమై, యనువదు నీమాయనగునకహంకృతి యెవనిఁ
గనఁబొయునట్టి నీకును, మనమిచ్చి నమస్కరింతుకమాయాతీతా. 309

క. ఇంటనుండి యెటకుకనేనియుఁ బోవుచో, నింటనుండుచో మఱెవనినామ
చింతనంబు సేయకశీఘ్రము యన్నరు, పాపసమితివదలికపరువువెట్టు. 310

వ. అట్టి జ్ఞానస్వరూపుండవైన నీకు వందనంబు లాచరించెద. 311
తే. అవని నెవ్వని సన్నామ నివహచింత, నాంబుభృచ్ఛయ సుచ్ఛాయనాశ్రయించు
నరులు నిర్గత మోహులైపరితపింప, రధికతాపత్ర యాగ్నికీలాళివలన. 312
క. ఎవ్వనిఁ జింతించుటచే, నెవ్వడి మోహంబు రోగనికరము నరకం
బవ్విపుల దుఃఖముం గడు, దవ్వయ్యెడు నట్టినిన్నుఁదలతుననంతున్. 313
తే. అవని నెవ్వఁడు శబ్దార్థమరయఁగోరు, నతఁడు నీనామములయందునాస్థసేయు
నింత నిజమీ నిజంబునసేరమేశ, నన్ను సంసారమంట కణంగుగాత. 314
తే. అఖిలలోక ప్రపూర్ణుఁడై యమరుసీవు, నాగమ ప్రతి పాదితుఁడైతివేని
యీనిజంబునత్వద్భక్తియిందు విష్ణు, మింతఁ గలుగక నాకొప్పుసంతతంబు.
తే. ఏజగద్ధేతువగువిష్ణువెలమివిశ్వ, కారణుండును మఱియట్లుఁగామినేని
వలన భావింప నగునట్టిపరమమైన, కారణంబగునిను విష్ణుఁజేరికొలుతు. 316
క. ఆకారణంబుచేతనే, గైకొని నన్నిష్టమాయగప్పిననేనిన్
జేకొను కారణమీవే, గాకనుచును మ్రొక్కులిడుదుకడుభక్తిమెయిన్. 317
తే. ఏమహాత్ముఁడు విద్యతోనెనసి త్రిగుణ
కలితుఁ డగుచును మూడు మూర్తులఁ దనర్చి
సృష్టి సంస్థితి విలయ సత్కృత్యములను
సేయు నాహరి నాపయిసేయు కరుణ. 318
క. అనిమిషులు తమ్ము ముఖ్యత, గొనకొని రక్షింప వినుతిఁగోరి యొనర్పన్
బనిఁబూని యదితి సుతుఁడై, జనియించిన చక్రినాదెసంజూచుకృపన్. 319
తే. అబ్జగర్భాది స్తంబ పర్యంతముఁగను
గలుగు ప్రాణుల హృదయాబ్జముల నొకండుఁ
గా నివాసంబు సేయునేఘనుఁ డతండు
ఘనతరంబగు కృపనుగాచుఁగాత. 320
క. గగనమున వెలుఁగు వాఁడును, గగనాద్యుఁడు గగనమునకుఁగడునెక్కుడునై
తగువాఁడు గగనముంబలె, నగువాఁ డఖిలాప్తిచేఁ గ్రియారహితుండున్. 321
క. గగన బ్రహ్మము వెండియు, గగనాద్యశనుండు శాంతిగగనతనుండున్
దగ గగనగాసనుఁడుగా, నగునతఁడున్నీవ నీకునభివందనముల్. 322
తే. ఎలమి నెవ్వని తేజమైవెలయుమట్టి, చేత నెవ్వని సత్తయంబాతతముఁగ
భాజ్యమగు నట్టిదియు దుఃఖభాజనంబ, సత్యమైనదియైన యీజగముదనరు. 323
వ. అట్టి యీలోక వికారంబునందనర్చు భగవంతుండవు నీవ లోకంబు నీతోడం
గూడి సంతసించు నీచే విముక్తంబయి దుఃఖించు నీవు లోకబంధుండవయ్యుం గా
నివాఁడవగుట తద్వికారంబు నీకులేదు మఱియు నీలోకంబునం గొందఱు పరుం
డవైన నీయందుఁ బ్రాణ మనోహంకారంబులను నంతరంబుల నారోపింతురు
వెండియుఁ గొందఱు నీచులు నిన్ను రూపచేతనంబులుఁగల శరీరమాత్రుంగఁ

జూతురింకం గొందఱు వేదపురుషుండవగు నిన్నుఁ బురుషుం డనియుఁ గొందఱు శబ్ద బ్రహ్మమనియుఁ గొందఱు శివుండనియుఁ గొందఱు జ్ఞానస్వరూపుండనియుఁ జింతింపుదు రిదియునుంగాక కొందఱు కుత్సితాధ్వగులగువారు నిన్ను తీర్థవిషయుంగాఁ దలంతు రీవిషయంబునఁ బరస్పరవాదంబులకుంగడంగి పెనంగుచుందు రిదియునుంగాక. 324

క. సంతాన రక్షణం బిల, నెంతయు నీవనుచుఁ గొందఱ్ శేర్వరుపంగా
వింతగఁ జార్వాకులు నిను, సంతతముం భౌతికంపుఁ జైతన్యముగాన్. 325

క. చింతింతురు బౌద్ధులు వా, రంతం దర్కమున నిమిషమంతటఁ జెడుధీ
యింతియ యందురుఁ గొందఱు, స్వాంతంబున మఱియుమఱియుఁ జర్చించినన్.

వ. శరీర పరిమాణంబుఁగానుండు దైవంబుఁగానెంతురు వెండియుం గొందఱు ప్రకృతికిఁ బరుండవగు పురుషుండవనియు జన్మాది రహితుండవనియు సంపూర్ణుండవనియు సచ్చిదానంద లక్షణుండవనియుఁ దలంచెదరు మఱియు నీయందు మనంబుఁగల నీభక్తు లుపనిషత్ప్రతిపాదితంబైన పరబ్రహ్మంబు నీవయని ధ్యానింతురు చర్చింప గగనాది భూతపంచకంబును మనంబు బుద్ధియు త్వక్చక్షురాదీంద్రియంబులు విద్యావిద్యలు నీవ యగుదు నీకంటె నితరం బొక్కండును లేదు వహ్నియు వహ్నియం దమరగణంబులఁగూర్చి వేల్చెడు హవిరాదులు తద్హోతయుఁ దత్ఫలంబును ఫలంబుఁగలదు లేదను విషయంబును నీవ యిట్టి నీశరణంబు నాకగుంగాక.

తే. అరయ యజ్ఞాంచిత వ్రతోద్యముల కెల్ల, నమరఁ దత్ఫలవితతి తదంత్యమునను
ప్రీతి నిచ్చెడి వాఁడవుం భూత నివహ, కారణుఁడవైన నీవ రక్షకుఁడు నాకు.

క. యువయువతీ జనములమది, పువ్విలుతుని కేళినెట్లు భువినన్యోన్యం
బవుఁ బ్రీతి నట్లుమన్మతి, యవిరతముం బ్రీతిసేయు నయ్యా నీపయిన్. 329

క. అవని దివాంధంబర్యము, నవలోకింపంగ లేనియట్లు మహాపా,
పవశుం డైనను నీభ, క్తవరుం జూడంగ లేడు కాలుండెపుడున్. 330

తే. అధిప! యెందాక త్వచ్చరణాంబుజములఁ
గొలువకుండెడు ప్రజ యంతకును విశేష
బాధలొనరించుఁ బాపతాపత్రయంబు
లంతమందెడు త్వచ్ఛేవనమరనవియు. 331

ఆ. అంబరావనీంద్రియంబులు వానివా, పనము లెవనిఁ జెందవడప్రెయోగు
లావిరాగులేమహాభాగునాత్మల, నంటియుండు వారోయనుదింబు. 332

వ. అట్టిషడ్గుణైశ్వర్య కలితుండగు విష్ణు నిన్నుంగూర్చి నమస్కరింతు నాకుఁ బ్రసన్నుండవగుము. 333

ఆ. యతులు సాధనాంతరాపేక్ష లేనట్టి, మూలకారణమున మొనయుపాధ
నమ్ము దానికారణమ్మైన వాఁడని, యెన్ని మానసముల నేకభక్తి. 334

వ. అట్టిసాధన కారణరహితుండగు నెవ్వానియందుఁ బ్రవేశింతురా నిర్మల జ్ఞానప్ర
దుండగు శ్రీహరినైన నీకునమస్కరించెద. 336

తే. కడఁగియెవ్వాని చింతనైకాతిమోహ, పూర్ణమునదృశ్యునిం జేయుఁ సుఖసుఖాప్తి
దీనపవర్గేందిరం గూడి మొనరియైహి, కాత్మసుఖశాయియయ్యె నాయమరనుతుని.

వ. నినుంగూర్చి నమస్కరింతు మఱియు జననాది భావవికారంబులను వంచనా స్వ
భావంబున నొప్పియుండు క్షుత్తృష్ణాశోక మోహావార్ధక మరణంబులను షడూర్ము
లేనియందు నశియించు మలినాది దోషంబులేని బాధింపకుండునట్టి పరిశుద్ధుం
డును సప్రేముండునగు వాసుదేవునినుంగూర్చి వందనంబులాచరించెద వెండియు.

ఆ. అరయ నెవనివలననిరుపమజ్ఞానోద, యమునడగు మూఢతాంధకార
మెవని తేజమునెడియునరశ్మిచేవిష్ట, పంబుదాహమందుపరగ మఱియు. 338

వ. మదీయ స్వాంతం బెవనిందవిలసత్ప్రకాశంబై యసంశయాదికంబయి యుండు
నట్టి జగద్గురు శ్రీహరి నినుం గూర్చి నమస్కారంబుఁ గావింతు నన్ననుగ్రహింపు
మని మఱియు. 339

తే. చరములచరంబులగు జంతుసముదయంబు, లన్నిటినివిష్ణుదేవు దేహంబుపొందు
నీనిజంబుననే నాకునిందిరేశుఁ, డిప్పుడుఁ బ్రత్యక్ష మగుగాక యింపుతోడ. 340

వ. మఱియు స్థావర జంగమాదికంబగు ప్రపంచంబంతియు శ్రీమన్నారాయణుం
డగు సూనృతంబుచేతనజ రుద్రాదులకు జన్మస్థానంబు నగునట్టి జగత్స్వరూపంబు
చేత తనరూపంబు నాకిటం జూపుఁగాక యమ్మహాత్మునందు భక్తినాకెవ్విధంబునం
గలదో యవ్విధంబున నిష్ఠయునధికంబై యుండెనేని నాకావిష్ణుదేవుండు సందర్శనం
బిడుఁగాకయని యివ్విధంబున శపథరూపంబులగు సత్యంబులచే భక్తివెలయంబ
లుమారు స్మరించుచున్నం బరమపురుషుండగు నారాయణుండు సంతోషచిత్తుం
డై యట్లుసాక్షాత్కరించి మనోభీష్టంబులొసంగి యతండొనరించిన సంస్తవం
బునకలరి చనియెనంత నాధన్యతముండగు దేవద్యుతి నారాయణునెడగల భక్తివి
శేషంబున శిష్యగణపరివృతుండై నిరతంబునీస్తవంబుం జపించుచు నప్పర్వతంబున
నయుండెనని చెప్పి వెండియు రోమశుండువేద నిధికిట్లనియె. 341

—(*) యోగసారస్తవప్రభావము. (*)—

క. ఈసంస్తవంబు నెవ్వరు, వాసింబఠియింతురట్టివారికి మఱితా
మాసక్తివిన్నవారికి, భాసురమగు తురగమేధఫలములభించుఁ. 342

ఆ. అపవిసురుఁడు విన్నసతినిమ్మజదివిన, నాత్మవిద్యవడసియతనిబుద్ధి
పాపములకుఁజొరదుసదఁపడి యశుభంబు, లతఁడుగాంచఁడెన్నిగతులనైన. 343

వ. మఱియునీస్తవంబుఁ బఠించినం బుద్ధిస్వాస్థ్యంబును మనస్స్వాస్థ్యంబును నింద్రియబ
లంబునుంగలుగు నెవండు దీనిశ్రద్ధాభక్తిఁ బఠించునతండు విష్ణుపదంబునందు దీని
నెల్లకాలంబుం జపువుచుండిన నిష్టార్థంబులందనుపు దీర్ఘాయువొసంగుసుపుత్రావా
ప్తినిచ్చు బలవీర్యాదులనిడు వెండియునీస్తోతకు సహస్రతిలపాత్రదానంబు గావిం

చినఫలంబులభించు ధర్మార్థకామంబులందునేని౯ గోరినవదిసిద్ధింపజేయు వెండి యుం బంచమహాపాతకంబులును నితరపాపంబులు సలిపియున్నవాఁడైనను వా నిందలఁగించి పరిశుద్ధుఁజేయు నిదియగ్నిచోరాది భయంబులకు వాపుదుర్గమమా ర్గంబులనొంటిఁ బోవుచుండి పఠించినతద్భయంబు వాపుగ్రహనక్షత్రాది పీడలంద లఁగించు రాజులవలని భయంబును క్షుద్రదేవతోపద్రవంబునుఁ బాయంజేయు సింహవ్యాఘ్రాదులవలని సంత్రాసంబు వీడించు నభిచారభయంబును భూతప్రే తపిశాచాసురపూతనాది గ్రహంబులవలనియు జృంభకాద్యస్త్రప్రయోగంబుల వలనియు విఘ్నంబులవలనియు భయంబు పరువువెట్టించు మఱియు నీ స్తవంబు నె వ్వండు విష్ణునారాధించి పఠించునతనికిం బద్మపత్రంబు నీరంబులనుండియు వాని నెట్లంటకుండునట్లుఁ బ్రపంచధర్మంబున నుండినంబాపంబులంటకుండు మఱియు వినుము. 344

ఆ. ఇలఁబవిత్రమైనయీస్తోత్రరాజము, చదివినంగ మొదలుసత్రవంతు లన్నిటనుమునింగినంతటి ఫలమును, బొందు మానవుండుభూసురేంద్ర. 345

ఆ. ఒకరనొక్కమారునొగి రెండు మూడుమా, ర్లైననెవఁడుచదువుపూనిదీని నతఁడు సర్వకార్యవితతియందునుఁగడు, సౌఖ్యములనుఁబొందుసచ్చరిత్ర. 346

వ. మఱియు 347

చ. వెలయ షడంగయుక్తమగువేదచతుష్టయముంద్రివారమి మ్ములఁ జదువంగఁ గల్గుఘనపుణ్యము నీస్తుతినొక్కమాటుఁగే వలమును భక్తితోడఁ జదువంగలభించెడు నక్షయార్థముల్ గలుగు సరోరుహాక్షులకుఁగాయజునట్లుమనఃప్రియుండగుౘ. 348

క. దేవద్యుతి ప్రణీతం, బై వెలసిన యోగసారమనునీ స్తవమా శ్రీవిష్ణుమూర్తి కింప్రియ, మైవిదళిత పాపపుంజమైమేలయ్యె౯. 349

క. పావనమా నీస్తోత్రము, నేవిబుధుఁడు చదువుభక్తినెక్కొని యతని౯ శ్రీవల్లభుండు చూచెడు, నావిమలాత్మకసదనమందు వసింప౯. 350

తే. వసుధ నీయోగసారస్తవంబు నొక్క, మాటుఁజదివిన యెడఁగల్గుమహితమాఘ మజ్జనాత్యంత ఫలముని మ్మహిజనులకు, నిట్టిపరమ రహస్యంబునెలమితోడ. 351

వ. నీకుంజెప్పితి నింకపిశాచమోచనం బెఱింగింతు వినుమనిరోమశుండు వేద నిధింజూచి. 352

—(*) ఆ శ్వా సాం త ము. (*)—

చ. అమరవితానవంద్య విమలాత్మ మహామహ దీనపోష భూ రమణలలామ చారుమణిరాజిత దివ్యకిరీటకుండ లా ద్యమలవిభూషభూషిత నిజాశ్రితవారహృదీప్సితప్రదా సమదసుధాశనారిగణసారసమండవిమత్తవారణా. 353

క. తారాధిప సదృగురుధీ, తారాధిపజయ దయారసతా రఘుమూర్తీ
తారాధిప తారాధర, తారాధిపధర శతారసధవళసుకీర్తీ. 354

తరల. వరకృపాపరిపూర్ణవీక్షణసభవ్యనతసంరక్షణా
దురితపల్వలలోకవీక్షణసదుష్టజనతాశిక్షణా
సరసిజోదరశూలిసన్నుతసంతతామరసేవితా
ధరణిజాహృదయేశ సంతతసదానవేంద్రసమర్చితా. 355

మాలిని. నిరుపమగుణహారీసనిర్జితాశేషవైరీ
నరవినుత విహారీసవ్యశోభాప్రసారీ
సురవిమత విదారీసుందరీ శూర్పకారీ
పరిచిత హితసూరీసభక్తసంతోషకారీ. 356

గద్యము.

ఇది శ్రీరామచంద్ర కృపాకటాక్ష వీక్షణావాప్త కవిత్వ విద్యాప్రాభవ పశు
పర్తి పినశేషమరాజాగ్రతనూభవ సుధీజనవిధేయ సుబ్బరా
జాభిధేయ ప్రణీత శ్రీమన్మాఘపురాణంబునందు
సప్తమాశ్వాసము సంపూర్ణము.







# శ్రీమదాంధ్ర మాఘ పురాణము.

## అష్టమాశ్వాసము.

---

కందపద్యము.



శ్రీ నిగమ వారసన్నుత,
మానవపతితిలక విమతమర్దన కరుణా
మానసవందిత దివిజేం,
ద్రానవ్యవిభాది నేంద్రరామనరేంద్రా. 1

తే. అవధరింపుము సూతమహర్షిచంద్రుఁ, డాదరమ్మున శౌనకాద్యఖిలమౌని
శేఖరులఁ జూచిపలికె వశిష్ఠుఁడట్లు, లద్దిలీపావనీపతికనియెనిట్లు. 2

వ. అవ్విధంబునరో మశుండువేద నిధింజూచి. 3

—(*) చిత్రసేనుండను రాజుచరిత్రము. (*)—

చ. వినుమవనీసురేంద్రమునివీరుఁడు ద్రావిడదేశ భర్త స
జ్జననుత కీర్తిశోభితుఁడు చంద్రకులుండుని జోరువిక్రమం
బునఁదగదక్షిణాబ్ధితటభూపరిపాలన మాచరించుచుం
డెను కడురత్న సంహతులనిండిన బొక్కసముల్ దనర్పగాన్. 4

సీ. రహి నొప్పు మారటరత్నాకరుండు నా, భాసిల్లి చతురంగబలయుతుండు
భర్మహర్మ్యోన్నతప్రాకార గోపురా, గార మంటపసముత్కర విరాజి
తుండు నిజాంగనామండలీ పరివృఁతు, డఖిల పురాణ శాస్త్రార్థ విదుఁడు
స్వధర్మ వర్తనాచారశీలుఁడు యజ్ఞ,దానాది సత్క్రియా యాత్మకుఁడు సూనృ
తవ్రతుండును గురుభక్తితత్పరుండు, నతిథి పూజాను రక్తుఁ డయ్యంబుజాక్షు
విధి లలాటాంబకుల యందుభేదబుద్ధి, సేయకుండెడు వాఁడునై క్షితిఁ దనర్చి. 5

వ. అతండు నిజపురోహితు మున్నిడుకొని సదక్షిణలుంగ ననేకయజ్ఞంబు లొనరించు
చువివిధ దానంబులిడుచు నుండియుండి యొక్కనాఁడు. 6

తే. అలరు కౌతూహలంబుచేసరిగి జటిలు,
రమల భస్మావలిప్త సర్వాంగులగుచుఁ

దనరు పాషండులింటవాదములు నెఱపు,
చుండనా వేదబాహ్యులయ్యెడయనికిని. 7

తే. శైవధర్మ ప్రభూత ప్రభావములను,
కడఁక వినుపింతు మింతనిక్కంబు వినుము
రాజచంద్రమ త్రోయఁగారాదు పీని,
ననుచు వినుపించి రీవిధంబున నెసంగి. 8

క. కేశము లుంచిన తోడనె, యాశాపాశముల శ్వపచుఁడైనఁద లఁగువి
శ్వేశునిదయ సంస్మృతియం, దాశయొకించుకయు లేకయవనీ నాథా. 9

ఆ. శైవదీక్ష దుఃఖసమితిఁ బోనడఁచును, శైవబుద్ధి శివుఁడు సంతసించు
శివుని సంతసమునఁ జేకూరు స్వర్గంబు, నతని యాజ్ఞ లేమి నమర దదియు. 10

క. వర్ణాశ్రమంబు లనియెడు, నిర్ణయములు బొంకు వేదనివహము మొదలా
కర్ణింపరాద సత్యము, నిర్ణీతము సేయుకతనఁ జమవనీశా. 11

క. దానవ్రతాధ్వరాదుల, నూనికఁ గావింత్రు నిష్ప్రయోజనములుగా
గాణాపత్యము భస్మము, పూనంగ నెగలుగుఁ బో ప్రభూత్తమ నెమ్మిన్. 12

క. జటియైన ముండియైనను, పటుతరముగ శిఖియునైన పదఁపడి భూతిన్.
నిటలమున నలఁదెనేనియు, నిటలాంబక భక్తుఁ డతఁడు నిత్యసుఖుండున్. 13

వ. మఱియు నతండు శివునిం గూడి మహానందంబునం బొదలుచుండు వెండియు. 14

ఆ. ఒకటి రెండు మూఁడు నొనరంగ నాలుగు, నైదు జడలుఁ గలుగనైననింత
భూతిఁ బూయకున్న పుణ్యమ్ము గలుగదు, భూతినలదు తపము పుణ్యమున్నె. 15

వ. కావున జటాభస్మధారులందఱు శివయోగులై యుండ్రు మఱియు నంధులుంగుబ్జులు మూర్ఖులు మొదలగు వారునింకనుఁ దక్కిన శూద్రజాతులును హీనులుం జటాభస్మధారణంబున నీశ్వర భక్తులై పూజ్యులై యుందు రింతననేల బ్రాహ్మణత్వంబు తపంబునన వచ్చుంగాని కులంబునం గాదయ్యనుపమతపః ప్రభావుండగు విశ్వామిత్రుండు క్షత్రియుండైయును వాల్మీకి పతితుండయ్యునుఁ దపంబున సద్బ్రాహ్మణులై రత్తపంబున కన్నశైనంబు మిన్నయై యుండుటంబట్టి శైవులు బ్రాహ్మణు లనిన మెచ్చరిట్లగుట సర్వజనంబులకు శివపూజనంబు కర్తవ్యంబై యుండు దానసందఱును శ్రేష్ఠత్వంబువహింతు రీమతంబునకు నింకనుఁ గొన్ని నియమంబులు గలవు వాని నెల్ల నెఱింగింతుము వినుము. 16

ఆ. అన్యదైవతముల నర్చింప రాదుమ, నంబు నందునైన సంబు జాతుఁ
దలఁపరాదు దైత్యదమన విగ్రహమును, చూడరాద ఘంబు చూచినంత. 17

క. సర్వవిధంబుల శ్రీహరి, శర్వార్చకులకును విడువ జనువాఁడగునో
యుర్వీశ యుదితపంబగు, నుర్వర శైవులకు నింత యొప్పగవలయున్. 18

ఆ. ఇంతజంకు లేని యీశ్వరభక్తిచే, నున్న భవుఁడు ప్రీతి నొందునతని
కరుణఁబడఁయవచ్చు కైవల్యపదమును, జనులు సందియంబుఁ గొనకుడిందు. 19

క. భూతేశ్వరునకు హితమగు, భూతిం బూయఁగనె శైవపుంగవుఁడఁగునీ
రీతిం జనునీ ధర్మువు, భూతలపతి నింద్యమనిన ముసుకొను నఘముల్. 20

క. భవములకు భయమునందెడు, శివభక్తుఁడు విష్ణుపేరుఁ జెవిసోఁకఁగ నీ
డబితరయిఁ గాన నవ్వై, ష్ణవుఁడుర్విన్ వధ్యుఁడెందు శైవుల కెపుడున్. 21

వ. అని యిట్లు పాషండులు బోధింపఁ జిత్రసేనుండు తద్బోధనంబునకు లోనై యమ్మ
తగ్రంథంబుల నాదరించి తద్వచోవిధి వేదోక్త కర్మంబులం బరిత్యజించి బ్రాహ్మ
ణుల నిందించె నంత నతని గృహంబునం దగ్నిహోత్రాదులుడిగె నారాయణు
నిందించుట విశేషంబయ్యె మఱియు. 22

—(*) చిత్రసేనుండు పాషండ మతావలంబియై వైష్ణవుల బాధించుట. (*)—

ఆ. దైవికమునఁ దనకు తావరమైన య, జ్ఞానమునను బేర్చి శార్ఙ్గధరుని
యందుఁ బగగడించి యనిశంబు శాసింపఁ, దొడఁగె వైష్ణవాలి నుడుఁగకయును.

వ. అది యెట్లనిన. 24

మ. ధరణిన్ లేదను విప్రజాతి శ్రుతి నింద్యంబంచు వాదించు త
త్పరకర్మంబులు నిష్ప్రయోజనము లద్దాన వ్రతాదుల్ వృథా
చరణంబుల్ క్రతువుల్ నిరర్థకము లీచందంపువాడైన శ్రీ
హరియే పూజ్యుఁడు గాఁడనున్ మఱియు నత్యంత క్రుధావేశుఁడై. 25

ఆ. తన్నుఁబోలు కతిన తములందియిచ్చిన, లగుడములను మోదు లావుకొలఁది
వైష్ణవాలినెల్ల వైవఁగ హరిహరీ, యనుడు మఱియు మఱియుఁ గినుకఁదవిలి. 26

వ. ఇట్లు బాధించుచు డిండిమాది వాద్యధ్వనులతోడ పురంబునందును స్వపాలితం
బైన దేశంబునందు హరిం బూజించువారు దండార్హులని చాటఁబంచెనంత. 27

తే. వెరవెఱుంగక వైష్ణవుల్ పరువులిడుచు, తమకుటుంబంబు లుండారు తరలి యన్య
దేశములఁ జొచ్చి రితరులు ధృతిఁగలంగి, యతని యాజ్ఞానువర్తనులై రియిట్లు. 23

తే. అంగనాసక్తుఁ డతిలుబ్ధుఁ డధికకోపుఁ, డాత్మసములగు జటిలుర కతఁడు నూళ్లు
గజతురంగమ మణికనత్కనక భూష, ణాంబరాదుల నిచ్చి ప్రియంబు నెఱపి. 29

క. ఉండఁగ నదిమొదలా దు, ష్టుండేలెడు ధాత్రి వానశూన్యంబయ్యెన్
మెండుడిగెఁ బసికి కఱవున్, నిండారఁగఁ దోఁచెఁ బ్రజలు నీటికి బాయన్. 30

క. ఆవఱపుఁ నందు షడిఁగొని, ద్రావిడు లందఱు నదీహ్రదాదుల నీటన్
జీవనము సేయఁ జొచ్చిరి, భూవిబుధులు బ్రదుకులేమి భూమీజములన్. 31

ఆ. నాటిపెంచి జీవనము సేయుచుండిరి, వెండికొందఱు చటి విప్రవరులు
గౌరవములఁ దక్కి కప్పంబులమ్మి హా, పతికి నిచ్చి కొలిచి బ్రతికిరెలమి. 32

వ. ఇట్లు వీరశైవంబు నవలంబించి నిజాచారంబులై శ్రుతిప్రణీతంబులై యున్న
యగ్నిహోత్రంబులును దానధర్మవ్రతక్రత్వాదులును మాని రెండవ దండ
ధరుండు నాఁ గ్రూరుండయి ప్రజాపాలనంబు సేయుచుండఁ గొంతకాలంబున

కద్దురాత్మునకుఁ జావునూడ నందు వేదవిహితంబులగు నుత్తరక్రియలును లేక పోయె నంత. 33

ఉ. అయ్యము నాజ్ఞనందిన నిజానుచరావలి కాలు ప్రోలికిన్
జయ్యన సేర్చు చోపథము నంబలు వేండ్రముఁ జూపు నిప్పులన్
గుయ్యిడనీడ్చి దారి నుపకొమ్ములు కుల్ డిగ నంఘ్రులందు వేఁ
జెయ్యిడి త్రోఁచియుం గుపితచిత్తులునై మఱియుం భటుల్ వెసన్. 34

వ. ఉగ్రకిరణ తప్తంబులయిన సికతాతలంబులం ద్రొక్కించియు నయోముఖంబుల యిన కాకంబులం బొడిపించియు ఘోరవృక శ్వానాదులఁగఱపించియు మఱియు నమిత బాధలం బొరయించుచుం గొంపోయి రౌరవాది నరకంబులంగూలి పాపు లమిత రోదనంబుసేయ ఘోరంబగు సంయమనీ నగరంబుసేర్చి వరుసమెయి నా క్కొక్క నరకంబు ననుభవింపఁ జేయువారై యప్పుడు. 35

మ. అతిరౌద్రంబగు నంధకారము మహారౌద్యద్భిమతామిస్రముల్
క్షితిదేవోత్తమ యంత రౌరవము దుఃఖంపన్మహారౌరవం
బతనిం గూలఁగఁద్రోచి కష్టముల కాహాయోర్వనా వీడకు
ద్ధతి బాధించిరి యామ్యులచ్యుత రిపుత్వాంహో విశేషాప్తికిన్. 36

—(*) చిత్రసేనుండు పిశాచంబై జన్మించుట. (*)—

క. ఇరువదియొక యుగముంజన, బరువడి నీరీతి బాధపడియు యమాజ్ఞన్
బొరిని పిశాచంబై యు, ర్వర జన్మంబంది యొకధరాధర గుహాయున్. 37

వ. ఆశ్రయించియుండి యధికక్షుత్పిపాసాలంపటుండై యరణ్యంబున నెందేని యుదకో దనంబులకు సంచరించుచుంగానక దుఃఖించుచు నమ్మెయి నొకానొకదినంబునందు.

క. ప్లక్షుస్రవణం బనువని, నాక్షుధితుఁడు సొచ్చియందునక్షుద్రచ్ఛా
యాక్షితినిల్చి మహాధిక, మా క్షుద్బాధన్ హతోస్మియనిపలుమారున్. 39

వ. మహారవంబుఁగా నేడ్చుచుఁ దన్ను నుద్దేసించి. 40

తే. క్షుత్పిపాసలఁగుంది యీక్షుద్రమైన
జన్మమే నెట్లుఁ గడపుదు సకల జంతు
సంహతికి ద్రోహమెంచి యశ్రాంత దుఃఖ
జలధి మునిఁగిన నను లేఁపఁగలుగు నెవఁడు. 41

చ. అనిమొఱ వెట్టుచుండిన తదార్త నినాదము వీనులార స
జ్జననుత కీర్తిశోభితుఁడు సత్కరుణా గుణవారిరాసి య
మ్మునివిని చెచ్చెరంజని నభోముఖుఁడై విలపించునట్టి వా
ని నురుతరోర్ధ్వ మూర్ధజు వినీలతనుం గృశుఁ బింగళాక్షునిన్. 42

వ. కాలసర్ప ఫణసదృశంబై వివృతవదన గహ్వరాంతరంబునం జలించు దీర్ఘజిహ్వు ని లంబోష్ఠుఁ దీర్ఘజంఘు ధమనీవితానవ్యాప్తదీర్ఘపాదుఁ గృశోదరు నతిభయం కరాకారు నప్పిశాచ జన్ముంజూచి దేవద్యుతి యిట్లనియె. 43

క. ఓరీ వెరపించెదునీ, తీరైన కళేబరమున ధృతివీడ్వడి యా
ర్తారావ మొనర్చెదవేవఁ, డారయ నీవీయవస్థ యమరెనదెట్లున్. 44

క. నాయాశ్రమంబు సేరితి, వీయెడ నీకోహితంబు నేఁ బూనికమై
సేయంగ వలయు చెపుమా, పాయక నీదైన దుఃఖభారం బెల్లన్. 45

క. ఇది విష్ణులోకముం బలె, ముద మొసఁగు వసింప నిరతముం బ్రాణులకున్
మది గొంకుఁ దక్కి నీయం, గద చెపుము సకారణంబుఁ గామాతోడన్. 46

ఆ. మేలుగల్గునప్పు మేదిని ధీరులు, పుచ్చఁగలరె వ్యర్థముఁగను కాల
మనుచుఁ బ్రీతినడుగ నమ్మాటలకు దుఃఖ,ముడిగి యప్పుడింతముదము నెనసి. 47

వ. అమ్మహాత్మునకు వందనంబుఁ గావించి సవినయంబుగా నప్పిశాచం బిట్లనియె. 48

మ. అవనీ దేవకులోత్తమా వినుత్వదీయంబైనవాక్యంపు వా
స్తవమట్లుండగఁ గ్రీష్మదావ జనితోద్యత్తాపమున్ వార్షికా
భ్రవిశేషం బచలేంద్ర మందణచు ఠేవన్ మత్తనూ తాపమున్
భువనఖ్యాతముఁ గాగఁ బోవనడిచెం బో చెప్ప నింకేటికిన్. 49

క. ఏకారణంబు చేతనొ, నాకీ పుణ్యంబుఁ గల్గినందున నిన్నా
లోకించి తిందు సుకృతము, లేకుండిన సజ్జనావలిం గననగునే. 50

—(*) దేవద్యుతీ పిశాచముల సంవాదము. (*)—

క. అని పలికి తనకథాస్థితి, వినిపింపఁగఁ బొడఁగె నిట్లు వినయముతోడన్
జననుతుఁడగు దేవద్యుతి, కిని మోదం బాత్మనిగుడఁ గేలు మొగిచియున్. 51

సీ. వసుధామరేశ యెవ్వనిపేరు భక్తిమై, బలికిన మనుజుండు పాపవితతిఁ
బాసిచేరును విష్ణుపదము నెవ్వఁడు ముజ్జ, గంబులలోన ధర్మంబు నిలిపి
రక్షించు నెవఁడు సర్వప్రాణులకు నంత, రాత్మయై విలసిల్లు నరయ నెవ్వఁ
డిలకర్మ ఫలదుఁ డిమ్ముల వేదముల నెల్లఁ, జదువంగఁబడు మహావిదితకీర్తి
యేమహాత్ముని ద్విజులు మునీంద్రులెలమిఁ, బూజలొనరింతురెవని సంపూర్ణభక్తి
నావిరాగు లరణ్యంబులందునుండు, ఖచరయోగులు వేదాంతనిచయములను.

క. ధ్యానింతురెవని నజగీ, ర్వాణులు సనకాది యోగివరులు న్మోక్ష
శ్రీనివసనమున కైమది, లో నిరతం బెవని సద్విలోకనమునకున్. 53

క. వితత ప్రపంచ సృష్టి, స్థితి సంహారములు గల్గు తెలియఁగ నెవఁడో
సతతాది మధ్యనాశర, హితుఁ డా హరియందు నాక హితభావంబున్. 54

వ. జనించి తద్విరోధాగ్నిచే మత్పూర్వజన్మసుకృతౌఘంబు భస్మంబుగాఁ బాపా
త్ముండనైతి. 55

ఆ. ఇంత యెఱిఁగియున్న నేనన్య దేవతా, పూజనంబు సేయ పూని విష్ణు
నఖిల పాప హరణు నవ్యయు వీడి యీ, యఘమువలన నరకయాతనలను. 56

క. చిరకాల మనుభవించియుఁ, బరువడి నీభవమునంది బాధిలు నేనో
కరుణామయ యేసుకృత, స్ఫురణముననొ యిందు వచ్చి చూచితి మిమ్మున్. 57

క. అనఘా! మీదర్శనమును, వనజాప్తోదయమునాకుఁ గవడిఁగా మద్దుః
ఖనిబిడ తమమది పాసెం, ఘనపుణ్యులరరయమీరుఁ గారే తలఁపన్. 58

వ. కర్మానుసరణంబునం గలుగు బంధనంబొండె సుఖదుఃఖ సంపద్దారిద్ర్య మరణ
వియోగాదులొండె నెవ్వఁడేని ననుభవింపకుండ సాధ్యంబుగా దిదియట్లుండె
మీరు కరుణామయులరై యడిగితి రిప్పిశాచత్వంబునం బాయు నుపాయంబు నా
కునెఱింగింపుడు మిముంబోలు సజ్జనులకుఁ బరహితంబు ముఖ్యకర్తవ్యంబుఁగదా
యనుటయు కరుణించి దేవద్యుతి వెండియుం బిశాచంబునకిట్లనియె. 59

—(*) దేవద్యుతి పిశాచంబునకు హితోపదేశం బొనర్చుట. (*)—

శా. ఈ యజ్ఞానము నిన్నుఁ గాదమరమర్త్యేంద్రాదులన్ ముంచు నో
హో యాదేవ విరోధమే తలఁగఁ జేయుంబుణ్యముల్ సౌఖ్యముం
బాయం జేయును లోకజాలము సృజింపం బెంపనొంపంగ ని
ర్మాయుం డా హరియా జగన్మయుఁడు వైరంబొప్పదా శౌరిపైన్. 60

తే. అఖిలకర్మంబు లెవ్వనికర్పణంబు, సేయఁగలిగిన ఫలసిద్ధిఁ జెందునట్టి
యచ్యుతునియందు భక్తిసేయనినరుండు, నిరయమున కేగకుండు నేధరణియందు.

ఆ. శ్రుతుల ధర్మశాస్త్రవితతులఁ జెప్పంగ, నైన పనులు బ్రాహ్మణాదులైన
నాల్గువర్ణముల జనంబులు నిరతంబు, హరినిఁ గూర్చి సేయనానుభక్తి. 62

వ. అట్లుఁగాక తద్విరుద్ధంబులయిన మార్గంబులం దెలుపు నితరదేవతా పూజావిషయి
క గ్రంథంబుల ననుసరించినం బాపంబుఁగలుగు గాన వేదవిరుద్ధంబులైన మార్గం
బులంజూపు శాస్త్రంబులలోని కర్మంబులు విసర్జనీయంబులనియెఱుంగనగుఁ గొం
దఱు తమయిష్టప్రకారంబుల విరచించిన గ్రందంబుల వలన జనులమోహాత్ములం
గావించి శ్రేయస్కరంబులయిన మార్గంబులకుం దప్పించి వారిం జెరుతురా శా
స్త్రంబులనమ్మి వేదబ్రాహ్మణామర నిందఁగావించి పాపాత్ములై నిరయంబునుఁబొందు
వారువినుము. 63

క. ఈవిధమున మునుకేరళుఁ, డా విబుధేశ్వరుని విష్ణునఖిలాత్ముహరిన్
సేవల వైరమునంగని, యావరదునిఁ గొల్చు బ్రాహ్మణామరులందున్ 64

వ. అక్రమంబులు పెక్కులొనరించి నరకప్రాప్తుండయ్యె గావున. 65

క. సుకృతేచ్ఛులైనపండితు, లకలుషమతి వేదబాహ్యమయ్యెడికర్మ
ప్రకరంబు విడిచి తన్మార్గికముగు కర్మౌఘ మనుసరింతురుభక్తిన్. 66

ఆ. అవని సాధుమార్గులై ప్రవర్తించెడి, వారికైన దైవవశత దుష్ట
మనుజసంగమమున జనియించు కుత్సిత, బుద్ధి యాపదలకు మూలమనుము. 67

వ. పతితునంటిన విశుద్ధుండును నపవిత్రుండగు నండ్రు గాన దుష్టజనసంగతిం బాసి వే
దోక్తంబులగు సత్కర్మంబుల కులధర్మం బెఱింగి యొనరింపుచు పాపజనకృతంబుల
యి హరిహరులకు భేదంబు నిరూపించు క్షుద్రగ్రంథంబుల నవలోకింపకుండనగు
నట్లు వానివిధంబునం బోయి యయ్యిరువురందు భేదమొనరించువారు వారిపితృవు

లగు నేకవింశత్తరంబులవారి తోడంగూడి నరకంబునం దమితబాధలం బడువారింత నిశ్చయం బిది యెఱింగి త్రికరణంబుల నయ్యుసమనయన బిసరుహాక్షులయందు భేదంబుగా వించి ద్వేషింపక వేదబాహ్యంబులైన మార్గంబులం బోకుండుటొప్పు ననియిట్లు దేవద్యుతి యాపిశాచంబునకుం బిశాచతవాయు విధం బెఱింగించి మఱి యునిట్లనియె. 68

ఉ. ఏలవిచారమింతకు నగేశ్వర మాఘమునం బ్రయాగకీ
లాలములన్మునింగినఁ దగులం గెడు నీదుపిశాచరూపముల్
బోలఁగనట్లునల్వెడు జనుల్ దివికేగెదరంచు వేదముల్
జాలవచింపుచుండు జనసంహతి యట్లులఁ జేయుచుండెడున్. 69

ఆ. ఆప్రయాగమజ్జనాత్యంత పుణ్యము, నకునుమించి కలదెయొకటిజగతి
పూర్వజన్మపాపపుంజంబులోఁ బ్రక్కు, తాఘములనడంచియనుచుదివికి. 70

వ. మఱియు నాప్రయాగావగాహనంబు తపోదాన ధర్మంబులకన్నను హయమేధ రాజసూయాది సవనంబులకన్నను యమనియమాది యోగంబులకన్నను నధికం బై స్వర్గాపవర్గప్రదంబై యుండు నది కలుషాత్ములకుఁ దత్కాలుమప్రాయశ్చిత్తవిధు లందు ముఖ్యంబునా నిట్టి భూమిందనరిన త్రివేణీసంగమంబునుమించిన తీర్థంబొ క్కండు లేదు. 71

తే. పాపనిగళావబద్ధ దుష్పారదుఃఖ
భువననిధి మగ్నులగు మిముఁబోలువారి
కంచితోడుపమగ్ని సూర్యాచ్యుత ప్ర
దీప్త తేజోమయంబై యదియును మఱియు. 72

వ. గంగా సంగమస్థితిందనరి యతిశ్రేష్ఠంబయి శీతలంబై పాపనీరసతృణోత్కరంబున కుంజటులాగ్నియై భవాంబు భృన్మండలికిఁ జండప్రభంజనంబై శరత్కాలచంద్రి కం దిరస్కరించు స్వచ్ఛస్థితిందనరి యెయ్యెడనాయమరాపగవెలయు నట్టి త్రివే ణీసంగమంబునందలి స్నానంబుఁగావించినవారాజలంబునట్లు సర్వపాపవిముక్తి విమలులై ప్రకాశింతురట్లుఁగాన. 73

క. ధారిణి కేరళవిప్రుం డారసి యాజలములందునవగాహనముల్
బోరనఁగావించి మదివి, చారంబునుఁదక్కి మోక్షసంగతిఁజెందెన్. 74

వ. అట్టి సితాసితోదక భాసురంబైన ప్రయాగమహిమంబే వర్ణింప సమర్థుండనే యను దేవద్యుతివచనంబులువిని ముక్తభేదంబు సంసక్తమోదంబునై పిశాచంబు వినయవాక్కుల వెండియు నతని కిట్లనియె. 75

క. కేరళభూసురుఁడే దు, ష్పారాంహో వారిరాశినడిదాఁటఁ బ్రయా
గారచిత మజ్జనప్లవుఁ, డై రూఢిందాఁటె చెప్పుమదివినవలతున్. 76

క. అనియడిగిన దేవద్యుతి, గొనకొని తత్కథనమెల్లఁ గోరికమీరన్
వినుమంచుఁ జెప్పెనిప్పరు, సునను పిశాచంబులోడసులలితఫణితిన్. 77

—(*) కేరళ బ్రాహ్మణుని చరిత్రము. (*)—

సీ. వినుతొల్లి కేరళవిప్రుండు వసువను, వాఁడొక్కరుఁడు వేదపారగుండు
తనదుమాన్యక్షేత్రధనవస్తుసంహతి, నపహరించినజ్ఞాతులంతఁ బేద
యయ్యునేకాకియైయధికదుఃఖమున దే, శాటనముం జేయుచనవరతము
నటనొకానొకసమయంబున నొక్క పు, ణ్యక్షేత్రముం గూర్చియరుగుచుండి
క్షామకాలంబు మార్గముకాననంబు, కాయమారోగ్య రహితంబుఁగాగ క్షుద్బ
రార్తుఁడై వింధ్య పర్వతమందతండు, ప్రాణములఁ బాయనేమని పలుకనింక. 78

ఆ. దహనమాదియూర్ధ్వదైహిక క్రియలును, లేనికారణమున వానగాలి
యెండచలులదప్పి నిండాకటుల బాధ, లందెనటఁ బిశాచమయ్యుఁ బెలుచ. 79

వ. అట్లు దిగంబరుండును బాదరక్షావిహీనుండునునై నిరంతరంబు హాయని మొఱ
వెట్టుచు స్వకృతకర్మఫలం బనుభవంబుఁగా వాయుభంగి నిందునందుఁ బరిభ్రమిం
చుచు నొక్కగిరి కందరంబు నివాసంబుఁ గావించుకొని తనదుఃఖంబునకు సంతా
పించుచు నిట్లుఁ దలఁపోయం దొడంగె. 80

సీ. దానంబులొనరింపదైవతప్రీతిఁగా, హోమముల్ సేయఁ బయోరుహాక్షుఁ
బూజింపనధ్యాత్మముం బరిశోధింపఁ, బుణ్యతీర్థములనెప్పుడు మునుంగ
తాంబూలవసనాన్నతపనీయమణిరూప్య, తోయఫలాదులార్తులకు నియ్య
జపతపోవ్రతధర్మసంహతి నొకఁడైనఁ, గావింపనిందుఁడఁగట్టమతిని
నాకుఁగలుగునె నిత్యసుఖైకదివ్య, భవనమైనట్టి స్వర్లోకమవని శునక
మునకు రాజ్యాభిషేక సంపూర్ణవైభ, వంబుఁగలిగెడు నన్న నెవ్వాలనఁగలుగు.

సీ. బ్రహ్మస్వముం బరస్వముపఘాటిస్వత్వ, మపహరించినవార నాదరమున
నొరులవంచించుకాపురుషులు జూదరుల్, దాంబికుల్ చోరవర్తనులు క్రౌంచ
వృత్తులుస్త్రీబాలవృద్ధాదులనుఁగృపఁ, జూడకుండెడువారు సూనృతంబు
బాయువారును వృద్ధబాలామయులధన, మపహరించినవారలాలయములు
కాల్చియున్నట్టివారును గరదులనృత, సాక్ష్యవాదుల గమ్యానుషంగులూరి
యాజకులుపితృ జననీస్నుషాత్మజాంగ,నలవిసర్జించియున్న వారలునుమఱియు.

సీ. పిశునులత్యాశాప్రపీడితుల్ నాస్తికుల్, ధర్మదూషకులు యుద్ధంబునను ని
జాధిపుందొలఁగినజనులును శరణాగ, తునిఁ బ్రోవకుండిన మనుజులవని
యును ధేనుసందోహమును రత్ననిచయమ్ము, నాచికొన్నట్టియన్నరులుపుణ్య
భూములంచనుదానములనుఁ జేకొనునట్టి, వారును వెండియు బలసియొరుల
జెరుపఁజూచువారు చేతనహింసకు, లొకరియందు నిందలును చువారు
గురుసురాదినిందకులు కుదానంబులు, గొనినవారు వీరు కుతలమునను. 83

క. పలుమఱు ప్రేతంబులు ప, క్షులును పిశాచములు రాక్షసులు పశువులు పా
ములు మున్నగు తిర్యగ్జ, న్తులుగాఁ గుయోనులందుఁ బుట్టుదు రెపుడున్. 84

వ. వారికి నిహాపరంబుల రెంటను సుఖంబు లేమిఁ గడుదుఃఖంబు లనుభవించుచుందు రే నట్టివాఁడ నగుటంజేసి యిద్దురంత దుఃఖం బనుభవింపుచు నిట్టి రూపంబున నున్నవాఁడ. 85

చ. అవని నిషిద్ధకర్మములఁ గన్నిటఁ బాసి వ్రతాధ్వరౌఘవి
ప్రవిబుధ పూజనంబులు ధర్మరంగలదానములుం బొనర్చి తీ
ర్థవిసరముం గనుంగొని ముదంబున మజ్జన మాడి ధన్యులై
యు వెలయు వారుగా దె సుఖ మొందు పరిందును నందుపూజ్యులై. 86

వ. మఱియు నట్టి సత్కర్మపరాయణులగు సజ్జనులు చెడుకార్యంబుల నాత్మలందైన జింతింపక యాత్మీయభవంబుల నెఱింగి వర్ణాశ్రమానుకూలంబులగు సత్కార్యంబుల నాచరింతు రవియును ఫలంబుఁ గోరక శ్రీహరి ప్రీత్యర్థంబుఁ గా సేయుదు రవియుం బాపంబులొనరించు పాపాత్ములు తత్పాపంబులు తమ కనుభవంబులు గావలయునను తలంపున నొనరింపకున్న నవి యెట్లుపొందెదు నత్తెఱంగునం బదఁ పడి సఫలంబులై సుఖప్రదంబులగు నందు సరోరుహాక్షుండు మోక్షప్రదుండుగాన నతనిం గూర్చి కావించిన కార్యంబులు విశేషంబులై యుండునని యా కేరళ విప్ర పిశాచంబువలికె నని పిశాచజన్ముండగు చిత్రసేనున కిన్నియుం బిశాచతకు మూలంబులగునను భావంబుఁ దోప బలికి దేవద్యుతి వెండియు. 87

తే. ఇటుల కేరళ భూతముత్కటములైన, తృష్ణ పాసలచేఁ గుందిసాలయుచగ్గి
రీంద్రముననుండ బహుకాలమే గునంత, నొకదినంబునతనపూర్వసుకృతమునను.

క. రెండుంగడ వలవేఁ కాండము పూరించియున్న కావడిభుజమం
దుండ ముకుందునిఁ బాడుచు, నిండుమదిం జనెడుపథికునింగనెనొకరిఁ. 89

తే. కాంచి గ్రక్కునతనినికడకు నేగి, భయముఁ జెందకు మయ్య కృపాపరుండ
వైతృషార్తుఁడ నగునాకునంబులిన్ని, బోయు పోయమిప్రాణముల్ బోవుననిన. 90

క. అతనిం గార్పటి కోత్తముఁ, డతి కారుణ్యమునఁ జూచి యనియె నెవఁడ వీ
వతి దుఃఖాత్మకమగునా, కృతి నీకేటికినిఁ గలిగె కేవల మిట్లుఁ. 91

వ. ఈరోగ వితతింజిక్కి కడువికారంబైన మేన ప్రాణంబు లొక్కండుఁ గలిశి దుర్గ బరత్వంబుతోఁ జావనిచ్చగించు వాఁడవుం జపల దృగ్భావంబులు నుర్వీస్పర్శ రహిత పాదంబులు నిర్మాంసోదర బాహు యుగళంబునుం గలిగియున్న నిన్నుం జూడ భయాద్భుతంబులు జనించుచున్నవి నీ యుదంతంబంతయు నాకెఱింగింపు మనినఁ గార్పటికునకుఁ గేరళపిశాచం బిట్లనియె. 92

—(*) కేరళ పిశాచ కార్పటికుల సంవాదము. (*)—

తే. వినుము పుణ్యాత్మ కానేను విప్రకులుఁడ,
లోభ మోహాది గుణవిశాలుండ దాన
హీనుఁడను మున్ను మృష్టాన్నమెలమిఁ నొంటిఁ,
దిన్నవాఁడను మఱియుఁ బరాన్న మెపుడు. 93

క. భూతబలి వైశ్వదేవము, లేతఱినేఁ జేయుభిక్షమిడ నేనికిఁ దృ
ష్ణాతురున కియ్యనుదకము, పైతృక మే నెఱుఁగ నిందుఁ బడి గర్వమునన్. 94

క. అవనీ పర్యటనం బా, ప్పువ్రత సంహతియు దేవతార్చన మును నేఁ
దవిలి యతిథికిని భిక్షం, బివి యెఱుఁగను చేసి యెన్నఁడేనియుఁ జగతిన్. 95

క. ఘోణిమి వర్షాతపములఁ, ద్రాణములగు నట్టిపాదరక్షలు గొడుగుల్
రాణ న్మధురాంబువులీ, క్షోణిన్పథములొరులకు నిడి యెఱుంగన్. 96

క. ఏనాద రింప నెన్నఁడు, పూనిక బీదలను గ్రుడ్డి ముదుసలి దిక్కుం
గానని వాఁడార్తుఁడు మొద, లైన జనంబులఁ బటోదకాన్నముల చేన్. 97

ఆ. ఎఱుఁగ ధేనువులకు నింపగు మేతయు, నీరునరసి తెవులుఁ గూరదానిఁ
దొలఁగు నౌషధములఁ దోడ్తో నొసంగియు, పోషణంబొనర్చి పుడమి నేను. 98

తే. దానహోమాదికంబులు తవిలి సేయ, కున్న తిలదాన మొనరించియున్న వారు
పుడమి పలుమారు జనియింపఁ బోరటందు, రమ్మహాదాన మైన నేనాచరింప. 99

వ. మఱియు నల్పంబులైనం జెడక యభివృద్ధినంది సుఖంబొసంగు వ్యతీపాత సంక్రమణాదుల దానంబు లొసంగకయు పర్వదినంబులం గార్తీకతిథుల వ్యర్థంబుగాఁ బుచ్చియుఁ బితృదేవతాప్రీతియగు నష్టకలందును మఖాదులందు మన్వాదియుగాదులందు తిలదానంబు సేయకయు నొకకార్తీకంబునం దైన భగవత్ప్రీతిఁగా దీపారాధనంబు లిడకయు రూపబలైశ్వర్యంబు లొసంగు మాఘస్నానంబు సలుపకయు నట్లు పుష్యమాఘతిథుల స్నానంబుఁ గావించిన పుణ్యులధికంబగు చలివణకుచుండఁ దత్సన్నిధి నగ్నిఁ గూర్చుట మున్నగు నుపచారంబులనైన నొనర్పకయు వైశాఖాది మాసంబుల శ్రాంతులకు శీతలోదకంబులైన నియ్యకయు వటాశ్వత్థాది వృక్షంబులనైన నాఁటిపెంపకయు బంధన ప్రాప్తినందిన ప్రాణులఁ దద్బంధవిముక్తిఁ గావించియైన రక్షింపకయు ప్రాణార్తులై శరణుఁ జొచ్చినవారిఁ గాపాడకయుఁ ద్విరాత్రోపవాసాదుల శ్రీహరిం బ్రీతి నందింపకయు కృచ్ఛ్రకృచ్ఛ్ర పరాక చాంద్రాయణాష్టాంగ తప్తకృచ్ఛ్ర సాంతప నాదులైన వ్రతంబుల నింద్రాది దేవతాప్రీతిఁ గా జుష్టుండనై యజ్ఞాదుల నొనరింపకయు నివ్విధంబున సర్వపుణ్య కార్యవివర్జితుండనై కాలంబునంతయు వ్యర్థంబుగాఁ గడపి పాపానురక్తిం బూర్వభవంబున నుండుటం జేసి యేనిప్పుడు. 100

తే. బ్రాహ్మణోత్తమ యిమ్మహాక్రౌర్యజన్మ, మందియున్నాఁడ నిట్టి నా యందు కరుణ
సలుపఁగా నొప్పు సజ్జన సంహతికిని, పరహితంబులు ముఖ్యము లరయఁగావె.

క. అనిమఱి విప్రపిశాచం, బనునా కార్పటికుతోడ నయ్యాయిా శై
లనికటమున వృకశార్దూ, లనిహతశశకాదిమృగపలలములు మఱియున్. 102

క. పరిమళ కుసుమంబులు వివి, ధరుచిర ఫలమూలములును దరుగని తేనెల్
సురనిమ్నగాంబు సమని, ర్ఝరతోయము లును సమృద్ధిఁ గ్రాలెడు నెపుడున్. 103

తే. దైవవిధి యెట్టిదో కాని తలఁపరాదు, తనివి సననిన్నియును నమలిననితాంత
వేదనంబిడు క్షుద్బాధ విప్రవర్య, యెన్నిసిధులున్న నగమున నెచటఁ జన్న. 104

క. అనవరతమనిల భక్షుణా, మునఁ బాముల యట్లుజీవమున్నిలుపుదునీ
తనువునకిది నైసర్గిక, మునగు ప్రభావంబుఁగాఁగ భూమీదివిజా. 105

క. అనిపలికి మఱియునిట్లను, మనుజునకు సుశీలమును మతిమంత్రముచే
తనుపౌరుషమునవిక్రమ, మునను సహాయమునను సువుఁబోలిన చెలిచే౯. 106

వ. దుర్లభంబులైనవియు సులభంబులగు వెండియు. 107

తే. కలిమిలేములుసుఖముదుఃఖంబుఁ బరిణ, యంబుమరణంబుఁ బ్రదిమిరోగంబుభోగ
మొగిసి వీనివియోగంబుతగనదృష్ట, కారణంబులు నయ్యెతాఁగలుగుచుండు.

తే. కుత్సితాచార నిందితుల్ కుకలులుంగు, రూపులునుమూర్ఖులుంబధిరులును కాణు
లుంబరాక్రమ హీనులు దాంబికులును, కుబ్జులుంగ్లీబు లనయులు కుటిలమతులు.

క. ఏతాదృశు లైననునీ, భూతలమున రాజులై విభూతి నదృష్టో
పేతత నందిసుఖంచెద, రాతతముగఁ భాగ్యహీనులైననుకలదే. 110

వ. కావున నింతకుమూలంబు ధర్మంబు సేయవలయు. 111

క. తిలలుం గోవులువసనం, బులుగంధ ద్రవ్యభక్ష్యభోజ్యపదార్థం
బులువనితలు కనకంబును, నెలమింగరు లశ్వములును నిన్నియుమున్నా౯. 112

క. దానంబు సేయుమానవు, లానగమున నున్ననున్న నడవినియింట౯
దానంత దానవచ్చియ, నూనాధిక విభవమందు నూల్కొనివారి౯. 113

క. అనిపలికి మఱిపిశాచం, బనునిగ్గరి నన్నుమించి నట్టిబలిష్ఠుల్
జనదృగ్భీషణ కాయులు, మునుకొనియుం డ్రసురయక్షభూతాదికుల౯. 114

వ. వారివారి ప్రాప్తంబులకొలంది నొక్కసమయంబునందేని తగు నాహారంబు లభించు నిట్లు నేఁజెప్పుటం జేసి నీమనంబున భయంపడవలదు నీవు విష్ణుభక్తుండవుం బరిశుద్ధ మనస్కుండవగుట నిన్నుఁ దేరిచూడ నేరైన నసమర్థులు వినుము. 115

క. నగధరుని భక్తిరక్షితుఁ, డగు వైష్ణవు నుర్విం బూతనాదిస్త్రీభూ
తగణము బేతాళాదిక, మగుపూరుష భూతగణము యువనగ్రహముల్. 116

వ. మఱియు రాక్షస ప్రేత గంధర్వ ఢాకినులు గన్యకా మండలికా యక్షమాతృకా భీమవినాయక కూశ్మాండకాది గ్రహవిశేషంబులు నితర దుష్టగ్రహ క్రూరగ్రహంబులు సర్పవృశ్చికాది దుష్టజంతువులు శ్రేష్ఠంబగు విష్ణుభక్తిం దనరి బ్రహ్మనిష్ఠాగరిష్ఠుండును మహావ్రతుండునై పొల్చియున్న విప్రోత్తముఁ దేరిచూడనైన వెఱచు వెండియు నిన్నియు నతని రక్షించు సిదియునుంగాక గ్రహనక్షత్ర త్రిదశులనవరతము మహాత్ములగు భవాదృశుల రక్షించుచుండుట స్వాభావికంబై యుండు సిట్లగుటం జేసి. 117

ఆ. అంతరంగమునను ననిశంబు రసనాగ్ర, మునను మాధవుండు మొనసియుండి
పలుకఁబడుచునున్న పరిశుద్ధ మతివినీ, కేనివలనభయము గానుపించు. 118

క. ఏనిట్లు స్వకృతకర్మ ఫ, లానుభవంబున యుండియట నొకనాఁడున్
వానరమునకును సారస, మూని వచించినవిధంబు నొగి వినియంతన్. 119

వ. మదీయ దుష్కృతంబుఁ దలంచి పలుమారు దుఃఖింప కిందున్న వాఁడ నది యెట్లన నెఱిఁగింతు వినుము. 120

క. ఈపర్వతమున దృహారా, ఖ్యాపగ గల దొకటి శీతలామలతోయ
ప్రాపకము కూలగత జం, బూపాదప వర్గమిభసముత్కరహితమై. 121

చ. అడవుల సంచరించుచు ద్విజాధిప నేనొక నాఁడు డస్సి య
కడకును బోయి తద్విమలకాండములందు మునుంగఁ గోరుచు
న్నడదన వెంటితోడుత ననేకవిహంగమ జాతికొల్వఁగాఁ
దడయక వచ్చి పుష్కర పథంబున నున్నది సైకతస్థలిన్. 122

ఉ. సారస పక్షిరాజము తృషన్ వెనవాలి జలంబులాని యిం
పార నిజాంగనాయుత విహారము సల్పి యొకింత సేపు చే
కూరిన నిద్రఁ బక్షములఁ గూర్చి శిరంబు ముదంబు నంగనుం
గూరికి యున్న వేళ నటకుందట భూరుహ శాఖనుండియున్. 123

క. అరుణాననాతుముం దృఢ, తరదీర్ఘ నఖమ్ము వ్యాపితాధికరోమో
త్కరదీర్ఘ వాలవిచల, త్స్ఫురదోష్ఠము వచ్చి క్రోతి పులుగుం బట్టెన్. 124

ఉ. పట్టిన నివ్వెఱంబఱచె పక్షికదంబము మింటికిన్ వగం
దొట్టి నిజాంగనామణి తనుం బెడబాసి చనంగలేమి నా
పట్టునఁ గూయుచుండె నిటు భంగముగాఁగ సుషుప్తికిం గనుల్
నెట్టన విప్పిచూచి తరుణిం దను బట్టిన యప్లవంగమున్. 125

వ. అనునయోక్తుల సారస పక్షి వానరంబున కిట్లనియె. 126

—(*) కపిసారససంవాదము. (*)—

ఉ. నేరము లేనినన్నిటు వనీచర బాధఁ గలంప నేల
యీతీరునఁ బట్టి యెందు జగతీవిభులైనను తప్పు లేనిచో
గోరరు బాధలం బరప క్రూరుల దండన సేయు భంగి కీ
వారయఁ జాలవింతటికి నయ్యవిచారముఁ దక్కి తాత్మలోన్. 127

సీ. అని వెండి సారసమ్ము నహింసకముల, న్యాపకృతిపరాఙ్ముఖాత్మకములు
సాధువృత్తములంబు శైవలాహారముల్, స్వాంగనాసంగవిహాయసాంత
రాదివిహారవన్యావాసములు పర, నారీసమాసక్తిదూరగమ్ము
లన్యాపవాద క్రియారహితమ్ముల, యాచకమ్ములన చౌర్యకములు మఱి
వర్జితోద్వృత్తి సంగమవ్యాప్తులైన, మాదృశులఁ బక్షి వితతుల మర్కటేంద్ర
వలబాధింప ఫలము నీకేమి గల్గు, నెఱుగు దేనిను పూర్వ ప్రవృత్తి నెల్ల. 128

క. ఎఱుగవు నీవనమనమున, వెఱఁగంది వలీముఖంబు విహగంబునకీ
తెఱఁగెట్లు పక్షివగునీ, కెఱుగంగా నయ్యె చెప్పుమింతయు నాకున్. 129

వ. ఏనుతిర్యగ్జాతిని నీవుఁ బక్షివి మనమిరువురము జ్ఞానశూన్యులము పూర్వజ్ఞానంబు మనుష్యులకుం దుర్లభంబిది నీకెట్లుఁ గలిగెననిన సారసంబు వానరంబున కిట్లనియె. 130

క. సర్వమెఱుంగుదు నాకుం, బూర్వజ్ఞానంబుఁగలదుశ్రమునువిద్యాధిపుఁడన్
బర్వత దేశోర్వీశుఁడ, వుర్వర నీవేఁ బురోధసుర్వీసురుఁడన్. 131

ఆ. కాన నింతవట్టు కపినాథ యెఱుఁగుదు, నట్టురాజవై నయంబువాసి
యాత్మద్రవ్యసంచయముఁ గోరి భూప్రజ, నవిరతంబు బాధనందఁజేయ. 132

వ. అప్పాపంబువలన మహాఘోరంబులగు కుంభీపాకాంధకూపాదులం బడి తపించుచు దశలక్షవత్సరంబులుండి యనంతరం బత్తీవ్రాగ్ని జ్వాలాభీలంబైన వానివలన విముక్తుండవై తత్పాపశేషం బనుభవింపఁ బునర్భవంబున నివ్వానరంబవైతి విప్పుడు నన్ను బాధింపఁజూచెదు మఱియు నీకీ జన్మంబునుం గొండొక కారణంబునం గలిగె దాని నెఱింగింతు వినుము. 133

ఉ. మున్నిటి గ్రామమునందు ద్విజపుంగవునింటి యనంటిపండులన్
గ్రన్నన విప్రునానతిని గైకొనకుండి యెచోరవృత్తిమై
నన్నిటిఁ దేనొరుఁబనిచి యాతఁడుఁదే భుజియించి తన్నియున్
మిన్నక పోనె తత్ఫలము మీఁదట నీకిడె నీకపిత్వమున్. 134

క. అనుభవము సేయకయపో, వునె సురలకు నైనఁదొంటిపుట్టువులం జే
సిన మేలుఁగీళ్లునీకీ, వనచర జన్మంబునంతవట్టునఁ గలిగెన్. 135

వ. ఇట్లు నీజన్మంబును సకారణంబుఁగా నెఱుంగుదు నాయీసారస జన్మంబును మదీయజ్ఞానంబున వీడఁగలుగుదుననిన వెండియు వానరంబు సారసపక్షిం జూచి నీకీ భవంబుఁ గలుగు కారణం బదియేమనుడది నేనెఱింగింపం జనుదు నీవు వినఁదగుదు వినుమని పక్షి యిట్లనియె. 136

సీ. వానరోత్తమ పూర్వభవమునందే నర్మ, దా నదీ తటపవిత్ర స్థలమున
నుర్వీశ్వరుండు సూర్యోపరాగమునందు, వివిధ ధాన్యంబులుర్వీధరోప
మానంబులుఁగ విప్రమండలి కియ్యరా, సులు వోసియిమ్ము విశుద్ధ ఫణితి
సంకల్పముం జెప్పి సత్వరమనిపురో, ధసుఁడనౌ నా కాజ్ఞ ధరణినాథుఁ
డిడినలుబ్ధతవాని నట్లీక కొన్ని, కొన్ని భూసురులకునిచ్చి కొంటిసర్వ
ధాన్యరాసుల నేనట్లు ధరణి సురుల, కనిన ధాన్యంబుఁ గొన్న మహాఘమునను.

ఆ. కాల సూత్ర రక్త కర్దమ పూయమే, నిలమహోగ్ర నరకములఁ దపించి
యొక ముహూర్త కాల మొగినూఱు కల్పము, లై కనం బడంగ యమ పురమున.

వ. అట్లు వేయిసంవత్సరంబులు కడచనిన యవల నీపక్షి జన్మంబునందితి నిందునకుం గారణంబుగల దెఱింగించెద. 139

క. ఉల్లమునఁ గోరిమునునేఁ, జెల్లెలికి నొసంగి లోభచిత్తుఁడనై యా
యిల్లునఁ గలకంగాళము, మెల్లన దొంగిలితి నిట్టిమేనికిఁ గాగన్. 140

వ. ఈ నాసతియుఁ బూర్వంబునం గాంస్యంబు నొంగిలించుటం జేసి యే యీజన్మం బందియున్న దిట్లు పూర్వజన్మ కర్మంబులం బుట్టిన మనము ముప్పూరము భవిష్య జన్మంబుల హంసలముఁగాఁ గామరూప దేశంబునం బొడమి సుఖంబుఁగానుండుదు మా యనంతరంబ. 141

తే. ఏముగో వృషభమ్ములమైమదమున, సంభవించి యనంతరజన్మమునను
మనుజులముఁగాఁగఁబుట్టియందనుభవింప, గలుగుకర్మానువృత్తులఁ గాంచఁగలము.

క. అని మఱియు వనచరంబున, కనుపిహగోత్తం సమిట్టుకలఖిల ప్రాణుల్
వినుమంత రాత్మయగుహరి, ఘనమాయా మోహమున స్వకర్మంబులచేన్. 143

వ. భవదుఃఖంబులనుభవింపుచు లోకంబునకు విధివిధించిన ధర్మాధర్మంబులంబనిగొని తత్కర్మ ఫలంబుల సుఖదుఃఖంబులంబొందుచుందు రెల్లవిధంబుల భగవంతుండు సర్వులకు సేవనీయుండు మఱియు. 144

తే. అమర రాక్షస నర క్రిమి వ్యాఘ్ర కీట, కాదిజంతూత్కరంబు జన్మైక దుఃఖ
కంట కాధ్వము దాఁటఁగాఁ గాకయున్న, విమల వేదాంత విద్యా ప్రవీణులైన.

క. యోగులుఁ దైర్థికు లుర్వివి, రాగులు నధ్యేతలైన క్రమయుక్తి మెయిన్
భోగంబు స్వకృత కర్మఫ, లాగమమునఁ బాయఁజాల రండ్రఖిల విదుల్. 146

వ. అట్లు సర్వులకుఁ దామొనరించిన పాపపుణ్యంబు లనుభవంబున సుఖదుఃఖాదులం దించు నింతయు సర్వేశ్వరుండగు భగవంతుని మాయఁగా నెఱింగి మహాత్ములైన సజ్జనులు సుఖదుఃఖ సంపద్దారిద్ర్య సంతోష మనోవ్యథాదుల సమంబులుంగాఁ జూతు రింతఁ గావున పూర్వకర్మంబులం గుడువక పోరాదు మున్ను నీవు సర్వవిధంబులందనరిన మహీశుండవై యుండి యిప్పుడిట్లు వానరంబవైతి విదియునుం దగినదేయని విచారంబుఁదక్కి యెవ్విధంబున సుఖంబుఁగలుగు నావిధంబునం గాలంబు బుచ్చుచు సమయంబున కెదురు సూచుచు నీయరణ్యంబున విహరింపుచుండు మేనును నిట్టి బంధనంబులం దవిలియు ధైర్యంబు సడలక నాసారసజన్మంబుఁ గడపెదననిన వెండియు వానరంబు సారసంబున కిట్లనియె. 147

ఉ. ఓ విమలాత్మ మున్నిను నయోదధిఁ బూజనఁ జేసితిప్పుడిం
కీవిధమంతయుం దెలిసియెంతయు సంస్తుతు లాచరించి త్వ
త్సేవ ఘటించితిం దరుణిరెంది సుఖస్థితి నుండు మేను ని
ట్లీ విపినంబునం గడపుదేకత కాలము తెల్వితోడుతన్. 148

క. అనివీడి చనియె వానర, మనఘాత్మక పక్షిచనియెసంగన తోడన్
మనమలర వింటినీపా, వనమగు కపిసారసములవాదము విప్రా. 149

వ. అట్లే నయ్యేటిదరినుండి విన్నయంతన నాకు విజ్ఞానంబుఁగలిగె దాన దుఃఖంబు నశించె వెండియుం గంగాజల ప్రభావంబుం గనుఁగొనిన వాఁడనై బ్రాహ్మణ శ్రేష్ఠుండవు భగవద్భక్తుండవునైన నిన్నుంజూచి నీకావడింగల తజ్జలంబుల నాశించితిని వినుము. 150

ఆ. వేదపారగుండు విమలుఁడు పారియా, త్రమునందు నొకఁడు ధరణిదివిజుఁ
డాతఁ డధ్వరమ్ము లన్నియుఁ గావించి, యవల పూర్వభవ మహాఘమునను. 151

వ. తద్దేహంబు వీడి బ్రహ్మరాక్షసుండయి వింధ్యాద్రియందు నన్నుం గూడి హాయ నాష్టకంబు కాలంబు గడపె నంత నతని తనూజుండు తదస్థిచయంబుం గొని గంగా నదియందు పాపనాశంబను ఘట్టంబునం గలుప నాక్షణంబ క్రూరంబగు రాక్షస త్వముం బాసి సుగతిం బడసె నట్లు గంగాజల ప్రభావంబు ప్రత్యక్షంబుగఁ జూచి న వాఁడనై నీకావడిం గల జలంబు మిక్కుటంబగు దాహంబున బాధపడు నేను తజ్జలంబున స్నానంబుఁ గావించు వానిం బోలె తృప్తుండనై చూచుచున్నవాఁడ నీజలంబు సర్వపాపంబులం దరిమి వైచి చిత్రంబుగా నన్నుఁ బవిత్రునిం జేయు నిందు లకై నిన్నుఁ బ్రార్థింతు మఱియు. 152

క. మున్నేను పుణ్యతీర్థము, లన్నిచట ధనముఁ గొనితలంగక తత్పా
పోన్నతికి బాయు సత్క్రియ, లెన్నక యిటులం బిశాచమే డ్తెఱనైతిన్. 153

క. అన్నోదకములఁ గానక, యెన్నశక్యంబులైన యీబాధలచేఁ
బన్నుగ ద్విసహస్రాబ్దము, లిన్నగమునఁ గడపితిన్ మహీసురతిలకా. 154

ఉ. ఏ నిటు నాదువార్తల నొకించుక విడ్వడకుండ జెప్పితిన్
బూనికఁ బ్రాహ్మణోత్తమ కనుంగొనినం గృపవోవనున్న యీ
మేనిన ప్రాణముల్ నిలుపుమీ సురనిమ్నగతోయమిచ్చి యే
హీనభవంబు నైనతనువింతయు బ్రోవక మేలె ప్రాణికిన్. 155

క. భూతలమునఁ బ్రాణులలో, రోతపిశాచంపు బ్రతుకు రయాధిఁగనాగా
కేతీరుపీడనగుతను, వాతురమతి కుష్టురోగులాదిగమనరే. 156

ఆ. అనుచుఁ దనుఁ బిశాచమట బతిమాలుచు, పలుకుమాటలకును బ్రాహ్మణుండు
విస్మయమ్ముదయయు వేడ్కయుఁ దనహృద, యమునఁ దోఁపనిట్టులాత్మఁ దలఁచె.

క. లోకింపఁ బుణ్యపాపా, నీకఫలంబులును జంతునివహమునందున్
లోకమునఁ గానుపించెడు, నీకరణిం గానసుకృతమెంచగవలదే. 158

వ. అది యెట్లంటేని సురాసుర మనుష్య పశు క్రిమికీటకాదులగు బహువిధ జంతు వులందు వివిధ వ్యాధి బాధలు గలిగియుండుటయు బాల్యంబునం గొన్నియు యౌవనంబునం గొన్నియు వార్థకంబునం గొన్నియుం జచ్చుచుండుటయు నందు నంధత్వ కాణత్వ పంగుత్వ కుబ్జత్వ మూకత్వ మూర్ఖత్వ బధిరత్వాదు లేర్పడు టయుం గలిమి లేములు జడత్వ విజ్ఞానత్వంబులుం గలుగుటయుఁ బ్రాణికోటియం దంతటం గలిగియుండు నివియన్నియు సుకృత దుష్కృత విశేషంబులం గాని మఱియొండుఁ గానేరదు కావున. 159

క. న్యాయార్జితమగు ధనమునఁ, బాయక యీకర్మభూమిఁ బదఁపడి దానం
జే యతఁడు సేయుఁ బాత్రుల, కాయనఘుండందు నిందునందు సుఖంబుల్. 160

క. భూమీ రత్నాష్టాపద, వామాశ్వగ్రామధేనువస్త్రాన్నల స
ద్ధామ రథ ధాన్యఫల ఛ, త్రామలమంత్రాసనాంఘ్రిరక్షాంబువులున్. 161

క. తములమతల్పము సంగీ, తము స్రక్చందనము లౌషధము లిన్నిటియం
దమరంగ నిష్టమగునది, విమలాత్మ తనీయనొప్పు వెండియు దాతల్. 162

క. ఏదియొనర్చినదివికిన్, మోదంబునఁ జేర్చుదాని ముఖ్యంబుఁగఁ దా
మాదటనిచ్చి తదీయ ఫ, లాదాయంబునను సౌఖ్యమందుదురందున్. 163

క. ఒకరికిఁ జేఁజాచినయది, యకలంకతఁ దానుఁగుడిచినట్టిదిగా కే
రికిచిక్కదకు సంపద, లోక రీతి నంటదురీ జనోక్తియు వినమే. 164

వ. అనియిట్లు తనంతనఁ దాననుకొనుచుండ. 165

చ. వినిముదమంది కార్పటికు విప్రపిశాచము వల్కె వెండి నీ
వనఘ గిరీశు పోలికదయామతివై యఖిలజ్ఞుఁడౌదు వి
ట్లొనరియుఁ జాతకంబునకునొక్కఁట వాఁదమట్లు జీవనం
బెనయఁగనీవదేల తగవే యసువుల్ జనుచుండ శీఘ్రమున్. 166

ఆ. అనిన తైర్థికుండు వినిన్యాయగర్భిత, ముగనని యెంబిశాచమునకు నాకు
వేచియున్న వారు భృగుకచ్ఛమున తలి, దండ్రులీజలంబుఁ ద్రావగోరి. 167

క. వారికిఁగానీవేణీ, వారిఁ జనుదెంచి కొంచువడినేగెద నీ
వారికినీవాశించితి, వేరికినిడువాఁడనంచు నెంచెద మదిలోన్. 168

క. చేయంగల చెయ్వులలో, పాయక ప్రబలాబలములఁ బాటించియుఁ దాఁ
జేయంగవలయు ప్రబలం, బై యుండినదాని పుణ్యమధికముగాగన్. 169

ఉ. ఏనుసమస్తశాస్త్రములనెంతయు వేదములందుఁజూచియున్
మానిజనంబుచే విబుధమండలిచే వినియున్ మహోత్తమం
బైనదిగా నెఱింగితి నిప్రాణిచయావనమున్ జగంబునన్
దీనికిసాటిరావు గణుతింప హయాధ్వరమాది మేధముల్. 170

వ. కావున. 171

క. ననుగన్నతల్లిదండ్రుల, కసమరలంబోయితెత్తునమరసరి జీ
వనముం బరోపకారం, బనుపమమగు సుకృతమిదియ యాప్రబలంబున్. 172

చ. అవని పరోపకారమునకధ్వరముల్ మఱినూఱుసాల వి
ప్రవిమలపుణ్యుఁ డుత్తముఁడు పాయక పూరుషులందు వీనికిన్
దివిజపదంబు నిత్యమగు తెల్లమియింతయుఁ దొల్లిఁదా దధీ
చివలికియున్న సూక్తులు విశేష జనశ్రుతముల్ గదా భువిన్. 173

—(*) కార్పటికుండు కేరళ పిచాచంబునకు గంగాజలంబిడి రక్షించుట. (*)—

క. ప్రీతిఁ బిశాచము యీగం, గాతోయము నిడి పరోపకార సుకృతమే
నీతఱిఁ గైకొనువాఁడ సు, ధీతతి నను మెచ్చుకొనును తృప్తి సనంగన్. 174

వ. అనిపలికి తనకావడింగల గంగాయమునాసంగమస్థలజలంబు మాహాత్మ్యముం
డును ధర్మాత్ముండునగు విప్రుండు తత్పిశాచప్రాణావనేచ్ఛాపరుండయి యొసంగిన
నతండు తజ్జలంబులం ద్రావి శిరంబునం జల్లుకొనుడు తత్క్షణంబ పిశాచాకృతిం బాసి
దివ్యదేహుండయి యాజలప్రభావంబున కద్భుతంబంది యిట్లనియె. 175

క. గంగాజలంబు లిటు నా, కుంగడు సాంరాజ్యమిచ్చెఁ గొబ్బన మఱి యీ
భంగి మహత్వముఁ గలవా, నిం గనలోకమున నింతకనిక్కం బహహా. 176

తే. శ్రీమహాదేవశీర్షసంస్థితిఁ దనర్చి, యమ్మహాత్ముని కృప భూప్రజావలికిని
పావనతఁగూర్పనరుదెంచి భవ్యమైన, మహితగంగాంబువిదియు సామాన్యమగునె.

చ. ఎలమి పయః పయోనిధివరిహిత్రమునం జనుచుండి తత్పయో
ర్మిలవము లొక్కపెట్టు ననుమేన వడం దిలకించుచుండియుం
గలయఁగ తద్ధ్వనుల్ వినుచుఁ గాంతు యొనర్చక భక్తినేనరుం
డిలతిల మాత్రమేనిఁ గొనకెంచెడు నీయమలాంబు వాతనున్. 178

క. సిద్ధామరాదులందుఁ బ్ర, సిద్ధుండగు నొకఁడుగాఁగఁ జెలువందెడుగా
కిధరణి పునర్జన్మం, బద్ధారిఁ కుఁ డందఁ డెన్నఁ డయహా ములకైనన్. 179

చ. అమరతరంగిణీ జలములందు నొకానొక వేళనైన భ
క్తిమునుఁగునే నరుండతని కిల్బిషముల్ సమయుంబు శాతశం
బమునరకంబు ఖండనము మానక యిన్నియునుం బరాభవం
బమరుపఁ జాల వెయ్యేడలఁ నాతఁడు స్వర్గసుఖంబులందెడున్. 180

ఉ. దానములం దపంబులను ధర్మములన్ వివిధాధ్వరంబులన్
మానుఁగ సద్వ్రతంబుల సమస్తజపంబులనుం దలంగఁగా
రాని పిశాచతంగడు త్వరంజగమద్భుతమందఁ బాయనె
ద్దాననుఁ గల్గెనట్టి విబుధాపగతోయము నన్నునింగినన్. 181

క. కైవల్యము ప్రాపించెడు, నావిమలున కింతసందియము లేద వనిన్
భావింప నెవనియందుల, నావిష్కృతినందె పాపమాతని కుర్విన్. 182

క. గంగాజలంబుచేఁ బా, యంగానగుఁ గాక పాపమంతయు మఱియే
భంగినిఁ బాయదు వేయే, లంగలుగున్ సుఖముదివి నిరలన్ సద్యశమున్. 183

వ. మఱియు నీగంగాజలంబున స్నానంబుఁ గావించినవారు స్వర్గంబున శాశ్వతం
బుఁగా నివసింతురవ్వారికి మోక్షంబునుఁ గరస్థంబై యుండు భూతరాక్షసాది
దుష్టజన్ములకైనను తజ్జన్మపాపవిముక్తిఁ గావించి దివ్యరూపం బొసంగు వెండియు
నీస్నాతలు విష్ణులోకంబగు వైకుంఠంబున నివసింతురిదియునుంగాక. 184

క. నరకమునన్నున్న స్వర్గం, బరుదుగ దివినున్న మోక్షమందఁగలారే
నరుఁడిలఁ బితృతర్పణమా, సురనదిఁ గావించు నాఁడె శుద్ధునిపూర్వుల్. 185

క. గంగాసదృశోత్తమమును, గంగాసదృశావ్యయంబు గత పావనమున్
మంగళము వెదకినం భూ, మింగలుగదు సర్వమునకుమించిన దగుటన్. 186

వ. అట్టిగంగోదకంబు కరుణామయుండగు నీచేబడసి పవిత్రుండనైతి నీవుదీర్ఘాయు
ష్కుండవు ధర్మాత్ముండవునై యుండుమని దీవించి సంస్తుతించి కేరళవిప్రుండా కా
ర్పటికుతోడ శలవంది దివంబునకరిగె నాతైర్థికుండును కేరళునకుఁ బిశాచత వాసి
నందునకు సంతసించి మరలఁ బ్రయాగకుంజని గంగాతోయముంగొని హరిసం
కీర్తనంబు సేయుచుఁ దన జననీజనకులున్న భృగుకచ్ఛముంగూర్చి చనియె నని
యిట్లు దేవద్యుతి పిశాచంబుఁ గానున్న చిత్రసేనునకుం జెప్పిన. 187

క. క్షితివర భూతము దేవ, ద్యుతి చెప్పఁ బ్రయాగ మహిమ మొగివినియు తదా
నతినంది మ్రొక్కి తా న, మ్మతిఁజనియె తదీయ మాఘ మజ్జనమునకున్. 188

క. అటునేగి తన్నిమజ్జన, మటవేడ్కం జేసి పాపమంతయు వాయన్
దటుకున దివ్యాకృతి న, చ్చటఁగనె హరిఁగొల్చి వీతశత్రుత్వమునన్. 189

వ. అట్లు చిత్రసేనుండు దివ్యవిగ్రహుండయి గంధర్వాది సుర జేగీయమానుండును
మణిమయ దివ్యవిమానుండునై దివంబునకుంజనియె నని చెప్పి రోమశుండు వెం
డియు వేదనిధి కిట్లనియె. 190

క. విని నంతనె పాపంబులఁ, గనికని పాతించు జ్ఞానకైవల్యము లి
మ్మునిచ్చు నదియునై బుధ, జననుతమై నిహృతపాపసముదాయంబై. 191

వ. ఒప్పునిప్పురాతనకథ నీ కెఱింగించితి నింకవినుము. 192

క. నీ కొమరుండును నీవును, నీకన్యక లేనుఁగూడి యిందఱు భక్తిన్
గైకొని యిప్డు ప్రయాగా, శ్రీకాండము లన్మునుంగ జెల్లును వింటే. 193

ఆ. అరయ దేవతాలికైననందఁగరా, నట్టియమ్మహోదకావగాహ
మునఁబరస్పరమ్ముఁగనియున్న శాపము, లను విముక్తులగుదురనఘ వీరు. 194

క. అని రోమశుండు చెప్పిన, వినిసంతోషాబ్ధిమునిఁగి వే సురమార్గం
బున దక్షిణాశఁ గైకొని, చనిరందఱు నాప్రయాగసన్నిధిఁ జేరన్. 195

—(*) రోమశుండు వేదనిధిం బిశాచంబులం దోడ్కొని ప్రయాగకుం జనుట. (*)—

ఉ. వారటుఁబోయి కాంచి రనివారిత తుంగ తరంగ సంఘ వి
స్ఫార జలాతి వేగము నవాంబురుహోత్పల షండసంచర
ద్భూరి మరాళ భృంగ రవపూరిత సర్వ హరిద్విభాగమున్
దీరగతోరు సాలవట తిందుక పూగము నా ప్రయాగమున్. 196

వ. అట్లంబరమధ్యంబున నిలిచి చూచి సంతసింప నయ్యెడంగల విశేషంబులఁ గ్రమం
బుగా నివ్విధంబున రోమశుండు వేదనిధియుం బిశాచంబులు వినఁ జెప్పం
దొడంగె. 197

ఆ. సర్వపుణ్యతీర్థసముదాయమున తీర్థ, రాజమనఁగ మిగుల రమణ కెక్కి
యున్నదీని భక్తి నొనరిన చూడ్కులఁ, జూచి వినుఁడు దీని చొప్పుఁ దెలియ. 198

ఆ. ఏనియందు తృప్తినెనయని యగ్నియె, ద్దానఁదృప్తి నందె తడయ కెపుడు
మందుచుండు మూఁడు కుండంబులం బ్రహ్మ, యాజమాన్య మొప్పనధికనిష్ఠ.

వ. అట్టి మాఘవేదిక యీయదిందుఁగరి తుండోపమానంబయి యాజ్యధార నిరంత
రంబుఁ బడుచుండ త్రయస్త్రింశదమరులు తృప్తులై సంతసించిరి మఱియు నీయెడ.

ఆ. అధిక రుచ్యమగుచుఽనంతికమైపదు, సోమధార వలనఽశూల టంక
ముల స్వయంభువత్వఽమునుఁదాల్చియున్న మ, హేశ్వరుంగనుండఽహీనమహిము.

శా. ఆపాతాళ జటోత్కరంబమర సేఽవ్యంబక్షయాభిఖ్యమై
దీపించున్ వటముంగనుండు హరిమూఽర్తిన్ యోగనిద్రారతుం
డాపాథోధిమునుంగ లోకము లయంఽబైమున్ మృకండ్వాత్మజుం
డీపద్మాక్షుఁ బ్రయాగమాధవుని హాఽయింజేరిమోదించెదాన్. 203

తే. శంభుసతిభగవతియు నీఽశ్వరిన తేష్పి, తార్థదాయిని సంసేవిఽతామరాంగ
నామణిప్రజయయ్యు జఽసంబుమాఘు, వేళదన్నాశ్రయింపఁదఽద్వ్రజినములను.

క. ఎడఁబాపి యంతికంబున, జడధికి నెక్కుడుఁగఁజూచిఁ సలుపఁగపూజల్
కడువేడ్కఁగొంచుఁదానీ, కడనొప్పదు నమరనిమ్నఽగంగనుఁడి దియా. 204

క. ఏనీరమున మునింగిన, మానవులయ్యహిమరుక్సఽమాన ప్రతిభన్
బూని వెలింగెదరాయము, నానదియిదియిందుఁ గలియుఽనవ్యస్ఫూర్తిన్. 205

వ. ఇట్లు పుణ్యానదీద్వయ సంగమంబై యొప్పు నీప్రయాగ ప్రభావంబు వినుండు
కాశియందు సుజ్ఞానులగు వారు మునింగి నరక విముక్తులగుదు రిందు సుజ్ఞానులు
నజ్ఞానులు నిఖిలప్రాణులు జననమరణాగ్ని సంతప్తులుఁగాక స్వర్గంబుఁజేరి సుఖిం
తురు వెండియు నీ స్థలంబునందు. 206

—(*) రోమశుండు వేదనిధికి ప్రయాగమహిమముం జూపి చెప్పుట. (*)—

ఆ. స్రష్టసృష్టిసేయఽసమకట్టియజ్ఞము, లిందొనర్చిసుహిమఽమెలమిఁగాంచి
సరవిసృష్టిసేయుఽసామర్థ్యముంగని, చేసెఁబిదప సర్వఽసృష్టిమున్న. 207

క. హరియీసి తాసితోదక, వరిమజ్జన మాచరించిఽవనితామణినిం
దిరఁగాంచెఁ బత్నిఁగాసా, గరమథనానంతరమునఁఽగరమనురక్తిన్. 208

ఆ. శర్వుఁడిందుఁగాశిఁఽవణ్ణాసములుమజ్జ, నంబొనర్చియొక్కఽనారసమునఁ
గూల్చెఁద్రిపురములనుఽఘోరాసురోపేత, ములనహీనమహిమఽవెలయువాని.

ఆ. శక్రశాపమునఽస్వర్గపదభ్రష్ట, యైనయూర్వశీసఽమాఖ్యదివిజ
నారితత్పదంబుఁఽగోరియిమజ్జన, మాచరించిమరలఽనరిగెదివికి. 210

క. పుత్రార్థినహుషుఁడీసు ప, వితాంబువు లందుమునిఁగిఽవిశ్రుతకీర్తిన్
గోత్రావనునియయాతినిఁ, బుత్రుంగాఁ బడసికడు ప్రఽమోదమునందెన్. 211

ఉ. మున్ను ధనార్థియైసుర విఽభుండిటమజ్జన మాచరించియున్
గ్రన్ననఁ గిన్నరేశ్వరునిఽకైవసమైన ధనంబునెల్ల ద
ర్పోన్నతి నాచెవెండియు నఽయోదధులాసన కాదియోగు లీ
సన్నుత తోయమజ్జన వఽశంబునఁగాంచిరి శ్రీహరిన్ వెసన్. 212

మ. నరనారాయణులైన ధర్మసుతులెన్నంగాని సత్త్వంబుచేఁ
బరమంబైన తపంబొనర్చి యయుతాబ్దంబుల్ జయేచ్ఛాపరి
స్ఫురదుద్యద్ధృదయాంబుజంబుల ఫలంబుం బొంది రద్దేవతా
తరుణీ వారమొనర్చు విఘ్నముల నింతంజిక్కకే సుస్థిరుల్. 213

తే. ఇందుకాశ్యపుఁ డనుఋషియెలమిమైద, శేంద్రియంబులబంధించియిందుఁజూటుఁ
గూర్చి యురుతపమొనరించికొనియెయోగ, సిద్ధినణిమాది కైశ్వర్యసిద్ధిమొగిని.

క. క్రమమున నీవేణితో, యములర్ స్నానంబొనర్చియమిసత్కములో
నమరెన్ సప్తమఋషియై, రమణభరద్వాజుఁడమరరాజనుతింపన్. 215

వ. మఱియు గంగా యమునా సంగమస్థలంబైన యిందు మాఘస్నానంబుసేయు మనుజులు వియత్పథంబున గళాసహితులై యమలులై యమితభోగంబుల స్వేచ్ఛావిహారంబుసేయుచు సుఖంబుండి మోక్షంబునందు వారు వెండియు నిందు యోగసాధకులకు తద్యోగంబు సిద్ధింబొందు మఱియు. 216

ఆ. ఇందుమున్నుఋచికుఁడిచ్చినశాపము, వలనఁగాకమైనవాఁడుస్నాన
మాచరించిపాసెనతివేడ్కగంధర్వుఁ, డొకఁడుస్వస్వరూపమొనరఁగలిగి. 217

క. అనిరోమశుండు నెయ్యం, బునను ప్రయాగామహాత్మ్యముంగ్రమయుక్తిన్
వినిపించి వెండివేదని, ధినిఁజూచి మహాదరంబుతేటపడంగన్. 218

వ. ఇట్లనియె. 219

తే. క్ష్మాసురోత్తమ పరమహంసస్వరూప, మైసితాసిత జీవనీయ ప్రపూత
మైన యీవేణిమజ్జనమాడిపూర్వ, కలుషపుంజంబు నకుఁబాసికడురహించి.

——(రోమశుండు పిశాచంబులఁ బ్రయాగస్నానంబున స్వస్వరూపులఁ జేయుట.)——

క. అన్యోన్య శాపములసా, జన్యంబేర్పడఁగఁబాసిసరగున తేజో
ధన్యత స్వాకృతులంబుధ, మాన్యవహింపంగలారుమఱివీరనినన్. 221

వ. అమ్మునీంద్రు సత్యసమంచితంబులుం బరమాద్భుతంబులు నలంఘ్యంబులు నగు వాక్యంబుల కలరి యట్లుఁగా కనుటయుం గుమారుండును గంధర్వ కన్యాపంచకంబును నహరహంబుం భక్తిమెయి నహర్ముఖంబున నిమజ్జనంబుఁ గావింపందొడంగి యట్లు పదునేనుదినంబులు సలుపుటయు. 222

చ. లలనలు విప్రసూనుఁడు చెలంగిరితొంటి శరీరసౌష్ఠవం,
బలరఁగ రోమశుండువిబుధాగ్రణివేద నిధిన్ముదంబు లి
మ్ములఁగని చూడఁదత్క్షణ మమున్నిటిశాప మహావ్యథాప్తిచేఁ
గలిగిన భూతతాకృత వికార తరాకృతులం దలంగుచున్. 223

ఆ. అంత వేదనిధి నిజాత్మజుగంధర్వ, కన్యకలనుఁజూచికడుముదంబు
నందిశాపవిధములంతయుఁబాయుట, కపుడురోమశునకునని యెఁబ్రీతి. 224

క. మునిసార్వభౌమమీదయ, మనఁగలిగిరి గాదెమాఘమజ్జనమాడం
గనితొంటి రూపములచే, తనువీరికి నింక నెవ్విధగుకార్యంబున్. 225

వ. ఇంతయు నీవ యెఱింగింపుమనుటయు రోమశుం డిట్లనియె. 226

చ. అధిగతవేదశాస్త్రచయుఁడై నియమంబున బ్రహ్మచర్యముం
బృథులయశంబుమై సలిపి పిన్నతనంబునఁ బాసె యావనో
న్మథిత తనూవిలాస సుషమాంచితు నీతనిఁ గోరియున్న యి
వ్విధుముఖులం గ్రమంబునను బెండ్లియొనర్పఁగ నొప్పుచెచ్చెరన్. 227

తే. అనిన తనగురునాజ్ఞఁ గా నాత్మఁ దలఁచి, వేదవిధి యగ్నిపునకును వేదవిహిత
ముగ వివాహముఁ గావింపఁ బూనె భువన, మాన్యులైనట్టి గంధర్వకన్యకలను.

—(*) గంధర్వకన్యల నగ్నిపునకు వివాహంబు గావించుట. (*)—

ఉ. పూని మహాత్ము మౌనిజనపుంగవు రోమశు స్వాశ్రమాంచిత
స్థానము సేరవచ్చుటకు సన్నుతులొక్కఁటఁ జేసి తెచ్చి స
మ్మానమొనర్చి వేదవిధి మానుగ నయ్యుపయామవస్తువుల్
జానుగఁ గూర్చి మౌనిజనసత్తముఁ డేర్పరుపన్ ముహూర్తమున్. 229

ఉ. మోదముతోడ రాఁ బనిచి మున్నుఁగఁ గన్యల తల్లిదండ్రులన్
గాదిలి బంధువర్గములు గారవమారఁగ సన్మునీంద్రులన్
ఖేదము సేయకెయ్యెడలఁ బెంపున నవ్వన పర్ణశాలలం
దాదర మొప్పఁగా విడుదలందఱకేర్పర చెందదర్హ్యముల్. 230

ఉ. ఆనతి నీయ సభ్యులు పయామ మహాక్రియకుం గుమారు స్వ
ర్మానినులన్ సుధాంశురుచిరాస్యలు స్వర్ణమయాంచితాసనా
సీనులఁ జేసి తామిడిరి చేకొని యైదువ లెల్లఁ బాడఁగాఁ
బూనిక నూనెలంటి వలపుం బసపుంచియు మేననల్గులున్. 231

ఉ. గోవజనాదిమేళనపు గొజ్జఁగినీటి పసిండిబిందెలన్
గేవల మాత్మ మెచ్చుచు మృగీదృశలందఱు వంపమజ్జనం
బావసుధామ రాత్మభవుఁ డాడెజిలుంగుల నొత్తెఁజమ్మ నీ
ర్బోవఁగ నూదఁ బెల్లగసపోవు దుకూలములంధరించెఁదాన్. 232

చ. తళుకుపసిండి పాగ సముదంచితవైఖరిఁ జుట్టిశీర్షమం
దెలమి మణీవిభూషలనహీనత బూనె సరోజరాగసం
కలిత వినూత్నకాంతి పథకామలమౌక్తికహారమత్తునం
దలవర చెన్ స్రగన్వితము నల్లనగస్తురిఁ దీర్చెఁ గోధిపైన్. 233

ఉ. అంతట సేరవచ్చెను పయామముహూర్తమటంచు నార్యుల
త్యంతము వేగిరింపఁగ వియచ్చరులింద్రుని వేడి తెచ్చి తా
మంత నలంకరించిన సితాభ్రగజంబున నుండఁజేసి సు
స్వాంతముతోడఁ దెచ్చిరనివారితతూర్యము లుప్పతిల్లఁగన్. 234

తే. అంతలోనింతు లత్యంతసంతసమునఁ, గంతుపట్టఁపు దంతులోయంతు కెక్కు
గొంతిబొమ్మలో యలరుచేమంతులో యనంగఁ బొల్పారు యువతులస్నానమార్చి.

బంగరు పూలపట్టువలువల్ కటిఁ దాల్చి గోధిఁ గుంకుమం
బుంగడు వేడ్కఁ బెట్టి మెయిఁ బూసి పటీరము దివ్యపుష్పముల్
ముంగర ముల్మణీవలయముద్రికలాది ధరింపఁ జేసి య
య్యంగన లేపురంబరిణయామలవేదికి సేర్చిరొయ్యనన్. 236

వ. అంత నిక్కడ. 237

ఉ. ఆకస మెల్లతూర్యనినదావృతమైతన రారఁగా ద్విజా
నీకపు రంధ్రికాతతులనేకముఁదో నడునన్ వివాహ సు
శ్రీకమ నీయగేహమును జేరిసురేభము డిగ్గి మ్రొక్క సు
శ్లోకులు రోమశాదిమునులున్ మొగిదీవన లియ్యనందియున్. 238

వ. అప్పుడు త్తుంగ రంభా స్తంభ సంభృతంబును విద్రుమాంచల్లతా నిబంధితంబును పద్మరాగ ప్రభావిడంబితా నూన కాంతి సుద్రసాల కిస లయ తోరణావేష్టితంబును నుత్తాల కేతన నిబద్ధ చిత్రాంబరాంచల మరుజ్జనిత మర్మర ధ్వని స్ఫుటితంబును నవమౌక్తికా రంగవల్లీ విరాజితంబును పరిణయోచిత వస్తు ప్రపూర్ణపాత్రాది కలితరం భాద్యమరాంభోరుహా ననాపాంగ వీక్షణోద్యత్కాంతి ప్రకాశితంబును నైన వైవాహిక మంటపంబునకు గంధర్వరాజ సచివుం డొక్కరుం డొసంగు కైదండ నండఁగొని యయ్యవనీసురాన్వయాంభోధి రాకాసుధాకరుం డరుగుచు నెడనెడం బుణ్యాంగనారచిత నీరాజనుండును గవాక్షాంతర్నిక్షిప్త మంగళకరముకురపూర్ణకలశాద్యవలోకనాత్త సన్నిమిత్తుండునునగుచుఁ బోయియుండు.

చ. అమలమణి ప్రభావలులనయ్యరుణాంశు వితానమాపు వి
ద్రుమచతు రంఘ్రికా ప్రచురరుక్మవినిర్మిత చారుపీఠికో
త్తమమటు మామలేవురు ముదంబున వైవఁగఁ బంపఁగాఁ బ్రయ
త్నమున భటుండు వైవ సముదంచితలీల వచించె దానిపైన్. 240

తే. అంత విధియుక్తి మామలయ్యవనిసురమృ,
గేంద్రమునకును మధుపర్కమెలమినిచ్చి
యలరువిల్కాని మైదమ్ములనఁగఁ బొల్చు
తనయ లేవురఁ బూజించి దానమిడిరి. 241

క. అంతట సమధికహృష్ట, స్వాంతతబంధువులు సేసబ్రాల్పాత్రలకుం
జంతన పట్టిన తెఱక, కంతు సమున్ వరునిఁ గన్యకలఁ జేర్చిరొగిన్. 242

మ. బలుతూర్యంబులు మ్రోయ వెల్లతెరవంపంగం గ్రమంబొప్పఁగా
ప్పాలుమోముల్ భుజముల్ ఘనస్తనయుగంబుల్ దోపఁగా నప్పుడీ
ములఁ గాంతల్ కలశార్ణవోర్మి జననంబుం బొంది యేతెంచు క
న్యలకో వీర లనంగఁ బొల్చిరి తదీయాంగ ప్రభాలక్ష్మితోన్. 243

చ. వడి తెర నట్లువంప నిజవల్లభుఁ డప్పుడు గానుపించినన్
బొడమిన లజ్జఁ దల్లడముఁ బొందులతాంగుల నేత్రముల్ దమున్

గదుఁద మిఁగేతన స్థితులఽగారవముంచిన మన్మథుఁడు చూ
ప్పడగ వయోబ్ధిసంభ్రమతఽభాసిలు మీనము లట్లుఁగన్పడెన్. 244

ఆ. వరుని వీక్షణములుఽపరవర్ణినుల పైనిఁ, గ్రమఁ బరవ నొప్పెఁఽగల్యకాల
సూర్యకిరణపంక్తిఽసారిది సరోజాత, ములను బడిన విధముఽవెలయఁగాను. 245

చ. తరుణులు నాథుశీర్షమునఁఽదామటు వోయఁగ సేసబ్రాలొగిన్
గరవలయారవంబు లురుఽగర్జలుఁగాఁ దనువల్లులుం దటి
ద్వరలతలుంగ నీక్షణ విఽతానము చంచల లుంగఁ గేశవి
స్ఫురణ వినీలిమాభ్ర చయఽముల్ గిరి గుర్సిన యట్లుఁ గన్పడెన్. 246

తే. రమణుఁడ ప్పాలఁ తులశిరోఽగ్రముల నంత
వరుసఁదలఁ బ్రాలుఁబోయఁ గఽన్పడె తదీయ
సంగమావసరముల నీఽసరణిఁ గబరి
కాప్రసూ నౌఘముల రాల్చుఁఽగాయ నంగ. 247

ఉ. మంగళ సూత్రముల్ ద్విజకుఽమారుఁడు గట్టెను శంఖసౌష్ఠవం
బుంగడు నిందసేయు విరిఽబోణుల కంఠములందు కోరకా
భంగుర రూపకాంతు లటుఁఽబాఱఁగ దోలు నఖాభముల్ తదీ
యాంగనలుంచియున్న వరఽహార మణీరుచులన్ హసింపఁగన్. 248

వ. అంతఁ బరిణయకార్య విదగ్ధలగు పురంధ్రీమణు లనలంబునిలిపి సమంచితాం
బరాచ్ఛాదితంబులుగా మణిపీఠంబులిడిన నందుఁ గ్రమంబుఁగా సతిపతులం
గూర్చుండఁజేసి వేదవిదులగు విప్రులు హరితవర్ణ శమీ శకలంబుల హుతవాహుం
బ్రజ్వలింపించి లాజాది హోమ ద్రవ్యంబుల వేల్పించి సనెకలుముట్టించిన
యనంతరంబ పేరటాండ్రయ్యంగనలకు నంగజసమానుండగు వరునకుం జేలాం
చల గ్రంథులిడ నగ్ని ప్రదక్షిణంబును ధ్రువదర్శనంబునుఁ బరిణయార్థాగత నిజేశ్వ
రాను వర్తినియై సాక్షాత్కరించియున్న యరుంధతీ నమస్కరణంబును గావించి
సర్వముని వృద్ధజనంబులకు వందనంబు లొనరించి తదీయ హస్తాభిమంత్రితాక్ష
తల శిరంబులం దాల్చి రయ్యెడ. 249

ఉ. ప్రేముఁడి బంధుసంతతులుఽపేర్చి మణీమయ హేమభూషణ
స్తోమములుం దుకూలవితఽతుల్ హరివాణములందుఁ గూర్చి తా
మాముని రాజసూతికి విఽయచ్చర కాంతలకుం గ్రమంబుఁగా
రోమశుఁడాది సంయమి వఽరుల్ జదువం జదివించి రెంతయున్. 250

మ. తగురత్నాభరణంబులున్ వివిధ వఽస్త్రాది లేపముల్ పాత్రలిం
పగు యానంబులు మున్నుఁగా నఖిల దిఽవ్యావాసవస్తూత్కరం
బొగి గంధర్వులు నిచ్చి రాత్మజలకఽయ్యుర్వీసురగ్రామణుం
డగుజామాతృన కంతరంగముల నాఽహ్లాదంబు సంధిల్లఁగన్. 251

తే. అధిక సంతోషమున వేదనిధియు తగిన, కానికల బంధుసుహృదాదికర్థి వరుల
కర్చనల నిచ్చిచేయఁ బ్రయాణమంద, రరిగి రాత్మీయ సదనంబులందుఁ జేర.
వ. అయ్యవసరంబున. 253
ఉ. పంచశరోప మానుఁడల బ్రాహ్మణ సూనుఁడుఁదాని జాత్మలం
దెంచిన యట్లు బ్రాణవిభుఁడేతెఱఁగాఁగడు సంత సంబులన్
మించిరి కన్యకామణులు మిత్రులు బాంధవు లెల్ల సమ్మదం
బంచిత లీలఁగాంచిరి ప్రియంబు వహించిరి రోమశాదులున్. 254
ఉ. అంతట రోమశుండు వినయంబున వారలు మ్రొక్క దీవనల్
స్వాంత మెలర్పఁగానిడి నిజాశ్రమ భూమికి నేగదేవతా
కాంతలుఁ బుత్రుఁడుం గొలువఁగైకొని సమ్మద మాత్మలోన న
త్యంతముఁదా నిజాశ్రమమునన్ వసించె మునీంద్రుఁ డిమ్ములన్. 255
తే. అంత నొక్కొక్క సుదివసమరసి బ్రాహ్మ
ణోత్తముండైన యగ్నిపాఖ్యుఁడు దినక్ర
మంబు లనువారి నేపురమన్మథాహ
వమునఁ గావించె తోషితస్వాంతులుఁగను. 256
క. అనుచు దిలీపక్షితి పున, కనువందఁగ మానిచంద్రుఁడైన వశిష్ఠుం
డనువారఁ జెప్పి మఱియను, జననాథుని తోడనధికసమ్మద మొనరన్. 257
చ. అవనిప! వింటె తీర్థములనన్నిఁట ధన్యతఁ గన్నయా ప్రయా
గవిమలతోయ మజ్జన సుకర్మ విశేషము నిట్టు లెందరో
తవిలి తదీయనీరములఁదామతి భక్తిని మాఘ మజ్జనం
బవురనఁ జేసి స్వర్గనిలయంబును చెందిన వారుమోక్షమున్. 258
వ. అని మఱియు నిట్లను నిట్టిపుణ్యకథల వెలయు నిమ్మాఘ పురాణ నామాంతరం
బునం బరగు మాఘమాహాత్మ్యంబు మాఘమాసంబునందు స్నానంబుఁగావించి
భక్తిమెయి జనులకువినిపించు బ్రాహ్మణుని నట్టినియతింగని మాసాంతంబున సద్బ్రా
హ్మణులం బూజింప నమిత ఫలంబుచేకూరు మఱియు నప్పౌరాణికుండును నట్టివా
రివలనం బూజితుండై తృప్త చిత్తంబున దీవింప వలయు వెండియు. 259
క. ఇమ్మాఘ పురాణంబును, సమ్మతి విననట్టి వారుసద్భక్తి మెయిన్
గొమ్మని వక్తకుఁ గనకంపు, సొమ్ములు రత్నాంబరములుసొలయని భక్తిన్. 260
వ. సమర్పించి యనంతరంబ వేదశాస్త్ర విదులగు భూసురోత్తములఁ గొందఱం
బూజింపనగు నిట్లుఁ గావించునది యుత్తమధర్మంబనియు నిందు సగంబు మధ్య
మంబనియుం జతుర్థాంశం బధమంబనియుఁ బెద్దలు వలుకుదు రిదియునుంగాక.

—(*) వశిష్ఠుండు దిలీపున కెఱింగించిన పురాణ ఫలశ్రుతి. (*)—

చ. వెలయఁ గనిప్పురాణమును వించు నిమజ్జన మాచరించు ని
ర్మల మతులాత్మ శక్తిని ధరామరులన్ వరభోజనాది తృ

పుల నొనరించి గంధహిమరత్నోయ సుమము
ముల ముల తోడఁ గాంస్యమును పుట్టమాదులఁ గప్పురంపు ద
... ములీయఁగ నొప్పు దానముల్. 262

చ. వినుము దిలీపభూమివర వెండియు మాఘమునం బురాణ మిం
పునవినఁ జెప్పినట్టి యురుపుణ్యుఁడు విష్ణుసమానుఁ డమ్మహా
త్మున కిడినట్టి దానము విశ్రుతధర్మపుం డెదఁదాఁగయి కొన్న వాని చా
ప్పునఁబరితోషమందును సదుంగడునిట్లగుటన్ మహీస్థలిన్. 263

వ. మాఘమాసంబునఁ బురాణంబు విన్నవారు తద్వక్తం బూజించి యథాశక్తిదానం బులొసంగ నొప్పు నట్లుఁ గావించినవారు విష్ణులోకంబునందు వసింతు రింతయగు టం జేసి పుణ్యాత్ములు మాఘమాసంబునం బుణ్యతీర్థంబులకుం జని స్నానంబు సేయు నంతటి సామర్థ్యంబు లేకున్న నట్టి పురాణికుం దత్పురాణశ్రవణతత్పరులగు సభ్యు ల సువర్ణభూషణాంబరాదులఁ బూజింపనగు నాఫలంబు ప్రయాగంబుపుల మాఘస్నానంబుఁ గావించినంతయగు వెండియు. 264

క. ఇమ్మాఘపురాణంబును, సమ్మతిఁ బొత్తమున వ్రాసి చక్కననిచ్చుఁ దా
నిమ్మహిఁ బండితులకు నెవ, డమ్మహితునిఁ గోరుస్వర్గమందూర్వశియున్. 265

ఆ. అనివశిష్ఠమౌని జననాథుఁ డగు దిలీ, పునకుఁ జెప్పెనను చుఘనుఁడు సూతుఁ
డనుపమిారశౌన కాదుల కెఱిఁగించి, యనియె మఱియు నిట్లు లలితముదమున. 266

ఉ. మౌనిజనంబు లారమునిమండనుఁడైన వశిష్ఠుతోడ న
మ్మానవ నాథుఁ డిమ్మహిత మాఘ మహాత్మ్యము తాసమాహితం
బైనమనంబునన్ వినితపోంతమునం గురు పూజసల్పి జాం
బూనద రత్న హారమణిభూషణముల్ వివిధాంబరంబులున్. 268

వ. మణిమయాంగుళీయక కటకాంగద కటిసూత్ర ముక్తాహారాదులుం ధనధాన్యం బులు భుజోపధాన రజతపీఠంబులు మృదులోపానహంబులు రత్నస్థాపితంబులై చిత్రవర్ణంబులగు పాదుకలు శిబికలు వాయువేగంబులయిన తురంగంబులు తాళ వృంతంబులు మఱియు నఖిలవస్తుజాతంబు లొసంగి చందనాక్షతతాంబూల స్రగ్వి తానంబులం బూజించి. 269

ఆ. అవ్వశిష్ఠమౌని కయ్యరుంధతికి మా, డ్కు లకును భక్తి సద్ధరాధి
నాథుఁ డొగిఁ బ్రదక్షిణనతులొనర్చితి, ద్హోమ ధేనువునకు నొనరమ్రొక్కె. 270

వ. అంత వశిష్ఠుం డతని దీవించి నిజస్థానంబునకుం జనియె నిట్లు సూర్యకుల సంభవుం డగు దిలీపక్షితీశ్వరుండు కొలంత వడక యుండ మాఘస్నాన వ్రతంబు సలిపిన విధంబుతోడ నిమ్మాఘపురాణంబు మీకు సవిస్తరంబుఁగా నెఱింగించితి నిట్లు మీకును మహాత్ముండగు వ్యాసభట్టారకునకును నమస్కరించితి ననిపలికి వెండి యు సూతుండు మునుల కిట్లనియె. 271

—(*) సూతుండు శౌనకాదుల కెఱింగించిన పురాణ ఫలశ్రుతి. (*)—

చ. అవని నెవండు మాఘమునఁ జెన్నుగ నతఁడు పూర్వ దిశాముఖంబునం
దవిరళ కాంతిఁ దోఁచు నెడఁ దనంచిత భక్తి నదీ నిమజ్జనం
బు విధిహితంబుఁ గా సలిపి భూమిసురాలికి గోపిచందనం
బవునన నిచ్చునాతనిఁ బ్రియంబు మెయిం దివిజాలయంబునన్. 271

తే. ఆతిలోత్తమ బర్హిర్ముఖాంగనావి, తానమనురులు నతనిం పరమానకయుగ
రగ్రహణ మొనరించి భార్యామణియయి, నిరుపమాధిక సౌఖ్యముల్ నవరుసనొసఁగు.

వ. మఱియు. 273

మ. పురి బాహ్యంబు నిమజ్జనంబు నియతిం బొల్పార నిత్యంబు ని
ద్దరమాఘోదయ వేళ సల్పుచు నితాంత ప్రీతినీ గ్రంథమే
నరులాలింతురొ వారుఁ గాంతురు కనన్నాళీక నేత్రుం జిరా
యురు పేతుల్ సుతసోదరాన్విత సుభాగ్యుల్ వారలామీఁదటన్. 274

క. అనియిట్లు సూతసంయమి, చనువున నెఱిఁగింపమాని సంహాతి యెల్లన్
వినిమాఘ మహత్వంబ, య్యనుపమ సుకృతోర్వినైమిశారణ్యమునన్. 275

వ. మహా ముదంబునంది కొందఱప్పౌరాణికోత్తముండగు సూతుఁ గుశవల్కలాం
బర పుష్ప ఫలాదులఁ బూజించి రింకం గొంద ఱతిశయానందభరితులై సపవిత్రాం
గుళీహస్తాంబుజంబుల కరంబులువట్టి యుత్సహించిరి మఱియుఁ గొంద ఱానంద
బాష్పపూరిత నయనులై యాలింగనం బొనర్చి రివ్విధంబున, 276

క. మునిజనముల సమ్మానం, బునుఁ బొందిన సూతమానిమోదమ్మున న
మ్మునులకు వెండినమస్కృతు, లొనరించి కరంబులెత్తి యురురావమునన్. 277

క. ఈవిప్రులకెల్లను, భావుకమగుఁ గాక నవ్యపద్మదళాక్షుం
డే వేళఁ బ్రోవనని స, ద్భావమునం బలికి మఱియుఁ దగనిట్లనియెన్. 278

క. ఏతచ్ఛ్రవణంబుననతి, పూతంబై పుణ్యతీర్థముం బోలియఘ
వ్రాతవినాశన కారణ, మైతగు నిప్పుణ్యకథఁ బ్రియంబగు భక్తిన్. 279

చ. అనిశము వీనులారవినునట్టి మహాత్ముకు లట్టివారికిన్
జనువునఁ జెప్పువారు సరసంబుగఁ దాఁ జదువంగలారలున్
గొనకొనివ్రాసినట్టి యనఘుల్ సకలేప్సితముల్ ముదంబునన్
గనికనువారు పుణ్యులకు గమ్యమునైన పదమ్మునిమ్ములన్. 280

మ. అపశబ్దంబులఁ బొల్చినం గవియెవండైనన్ రమావల్లభుం
డపవర్గప్రదుఁ డంతరాత్మ తనమాహాత్మ్య ప్రదీప్తిస్థితిన్
విపులంబైన సుధీజనాదృతము దానిం జేసి తద్గ్రంథముల్
గృపఁ జూచుం ధరకీర్తియుం దుదిని ముక్తింగూర్చుఁ దప్పింతికిన్. 281

వ. అనినసంతసించియమ్మునీంద్రులు దామొనర్చుచున్న సత్రయాగంబునం బ్రవర్తించిరి.

క. ఈమాఘ పురాణంబను, నామాంతర మునమగాం దఁనర్చినగ్రంధం
బోమైథిలీశ నీదయ, నామిహిరా బ్జోడులుండఁనంతకు నుండున్. 283

—(*) ఆశ్వాసాంతము. (*)—

చ. జనక సుతాకళత్ర జలఁజాత భవస్తుతి పాత్ర దైత్య భం
జనపటుకంక పత్రకలుఁషాంధ తమశ్చయ పద్మమిత్ర శో
భనఘన నీలగాత్ర రవిఁవంశ పవిత్ర దశాస్య దర్పకా
ననచటు లాగ్ని హోత్రఁకరుణా మయ పంక్తిరథాగ్ర పుత్రకా. 284

క. కమల ధరాభ శ్యామా, కమలధర ప్రణుతగుణని కాయోద్దామా
కమలధర వదనరామా, కమల ధరామరమునిఁప్ర కరనుతనామా. 285

తోదకము. దశగళ సంహారఁతాపసమిత్రా, పశుపతి సన్నుతఁపంకజ నేత్రా
శశివదనాఘనఁశాపనివారా, దశరథ నందనఁధర్మవిచారా. 286

—మంగళ మహా శ్రీవృత్తము.—

శారద తుషారహారఁశం బరజతో ర్వీధరఁచంద్రదివిజే భసితకీర్తి
స్ఫార! సుగుణా భరణఁసర్వధరణీ రమణఁశాశ్వత నిరస్త సుజనార్తీ
భూరి కరుణా సదనఁపూర్ణ హిమరుగ్వదనఁపుణ్య జనవంద్య హితవర్తీ
క్రూరసుర వైరి గణఁకోటిహాననైక చణఁక్షోణితనయేశ రఘుమూర్తీ. 286

గద్యము.

ఇది శ్రీరామచంద్ర కృపాకటాక్ష వీక్షణా వాప్తకవిత్వ విద్యాప్రాభవ పశు
పర్తి పిన శేషమరాజాగ్రతనూభవ సుధీజనవిధేయ సుబ్బరా
జాభిధేయ ప్రణీత శ్రీమన్మాఘపురాణంబునందు
సర్వ మష్టమాశ్వాసము సంపూర్ణము.

శ్రీరామచంద్రార్పణమస్తు.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ.





పసుపర్తి. సుబ్బరాజకవి ప్రణీతములగు

# గ్రంథముల ప్రకటనము.



| | | | | |
|---|---|---|---|---|
| శ్రీమదాంధ్ర మాఘపురాణము. | రూ. | 2 | 8 | 0 |
| లక్షణాపరిణయ నాటకము. | రూ. | 0 | 12 | 0 |

వలయువారు కడపజిల్లా, కమలాపురం తాలూకు, కొమ్మద్దిగ్రామం. రెడ్డిగారగు సర్వరాజుపేట, గజ్జల. వీరారెడ్డిగారి పేర వ్రాసి తపాలామూలమున తెప్పించుకొనవచ్చును. పోష్టు యెర్రగుంట్ల.